

# అభ్యుదయ

ఈ దశాబ్ది నవల
విశేష సంచిక

1980, జనవరి

# ఒక్క క్షణం

నవల మీద వివిధాభిప్రాయాలున్న రచయితలందర్నీ సమీకరించి చర్చలు నిర్వహించి అభిప్రాయ సేకరణ చేయడమే ఈ సదస్సు ఉద్దేశ్యం.

ఇందులో కొందరు రచయితలు వెలిబుచ్చిన కొన్ని అభిప్రాయాలతో అభ్యుదయ రచయితల సంఘం ఏకీభవించలేదని మనవి.

**వెల : రు 6/-**

ప్రతులకు :

**విశాలాంధ్ర ప్రచురణాలయం**

చంద్రం బిల్డింగ్స్, విజయవాడ-4.

విశాలాంధ్ర బుక్‌హౌస్ శాఖలన్నింటిలో

ఉన్నవ శతవార్షిక

సంవత్సరంలో






# తెలుగు నేలను ఏలుతున్న
# సాహిత్య ప్రక్రియ

నవల నిజంగా ఈనాడు తెలుగు నాడును ఏలుతోందంటే అతిశయోక్తికాదు. అలాటి ప్రాచుర్యాన్ని పొందిన ఈ ప్రక్రియ ఏ దిశలో నడుస్తున్నదో తెలుసుకోటం చాలా అవసరం. ముఖ్యంగా పాఠకులకన్నా రచయితలకు ఈ అవసరం చాలాఉంది.

గడచిన దశాబ్దాన్ని దృష్టిలో ఉంచుకొని నవలను వివిధ కోణాల్లో అధ్యయనం చేసి అంచనా వెయ్యటానికి ఒక ప్రయత్నంగా ఖమ్మంలో సదస్సును నిర్వహించాలని ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం భావించింది. ఆ మేరకు వెంటనే ఖమ్మంలో ఆహ్వాన సంఘం ఏర్పడి చాలా చురుగ్గా కదిలింది. అక్కడ చర్చించబోయే పత్రాలతో-అవీ ఆయా రంగాలలో కృషి చేస్తున్న ప్రముఖుల చేత రాయించినవి - ప్రత్యేక సంచికగా అభ్యుదయను తీసుకరావాలని భావించాం. అయితే ఎంత కృషిచేసినా పత్రాలన్నీ ముందుగానే సేకరించి ఒక క్రమంలో పెట్టటంలో మాత్రం సఫలీకృతులం కాలేకపోయాం,

ఏది ఏమైనా దీన్ని ఈరూపంలోనైనా తీసుకురావటంలో అనేక విధాలుగా సహాయం చేసిన రచయితలకూ - ఆహ్వాన సంఘానికీ - ప్రకటన కర్తలకూ - ప్రధానంగా సింగరేణి కార్మిక సంఘానికీ కృతజ్ఞతలు.

రాష్ట్ర అరసం నిర్వహించాలనుకున్న వివిధ సాహిత్య ప్రక్రియల మీది సదస్సులలో ఇది మొదటిది. క్రమంగా మిగిలినవి కూడా రాష్ట్ర వ్యాప్తంగా నిర్వహించగలమనీ, ఆ కర్తవ్య నిర్వహణలో ముందడుగు వేయగలమనీ హామీ ఇస్తున్నాం. —సంపాదకవర్గం

# విషయసూచిక

# తెలుగు నవల - పుట్టుక, పరిణామం

దాశరథి రంగాచార్య

ఉత్పత్తి సాధనాలు సమాజ గతిని ప్రగతిని నిర్దేశిస్తాయి. ఉత్పత్తిసాధనాల్లో వచ్చిన మార్పు జీవితంలోని అన్నిరంగాల్లోనూ కనిపిస్తుంది. సాహిత్యం జీవితంలోని ప్రధానాంగాల్లో ఒకటి కాబట్టి అది అలాంటి మార్పులకు దూరంగా ఉండడం అసంభవం, అసాధ్యం. ఒకసారి మనం సాహిత్య చరిత్రలను పరిశీలిస్తే ఈ విషయం స్పష్టంగా కనిపిస్తుంది. అయినా సాహిత్య ప్రక్రియల్లో నవలవలె అమాంతంగా దూసుకుని వచ్చి మహావృక్షంలా వ్యాపించిన ప్రక్రియ మరొకటి కనిపించదు. అయితే "నవల" అమాంతంగా దూసుకువచ్చిందా? ఆకాశం నుంచి దూకిందా? అని ఆలోచిస్తే నవల వంటి నేలనంటిన ప్రక్రియ మరొకటి లేదని కనిపిస్తుంది. ఎంచాతంటే అది నేలలో పుట్టి నేలను విడువని ప్రక్రియ. మనిషి జీవితానికి సామాజిక స్థితికి అతిచేరువలో ఉన్న ప్రక్రియ నవల మాత్రమే. అందువల్ల అతి కొద్దికాలంలో నవలకు కలిగినంత ప్రాచుర్యం మరేప్రక్రియకూ నేటి వరకు లేదు. నవలను మించిన మరొక ప్రక్రియ వచ్చేదాకా సాహిత్య సామ్రాజ్యాన్ని నవల మాత్రమే ఏలగలదు అనేది ఎవరూ కాదనలేని వాస్తవం.

నవలకు ఇంత ప్రభావ ప్రాచుర్యాలుండడానికి కారణం దాని ఆవిర్భావం ఒక విప్లవ పరిణామంలో జరగడమే. ఇంగ్లండులో కనుగొనబడిన యంత్రం పారిశ్రామిక విప్లవానికి నాందీవాచకం పలికింది. మానవుడు పుట్టిననాటి నుంచి ఎన్నడూ కనీవిని ఎరగనంత మార్పు జీవితంలో ప్రవేశపెట్టింది ఈ పారిశ్రా

మిక విప్లవం. ఉత్పత్తిసాధనాల్లో ఇంత గొప్పమార్పు అంతకుముందు ఎన్నడూ రాలేదు. పారిశ్రామిక విప్లవం జీవితంలో అన్ని రంగాల్లోనూ అనంతమైన మార్పులను తెచ్చింది అంతకుపూర్వపు జీవనవిధానాలనూ, విలువలనూ సమూలంగా మార్చి వేసింది. ఈ మార్పు మేధావులను దిగ్భ్రమ చెందించింది. పతనమై పోతున్న పాత విలువలను చూచి గోల్డ్‌స్మిత్ షెల్లీ, కీట్స్‌లను ఏడ్చేటట్లు చేసింది.

పారిశ్రామిక విప్లవం తనవెంట అనేక దౌర్భాగ్యాలను తెచ్చింది. నిరుద్యోగం, ఆకలి, అంటువ్యాధులలాంటి అనేక సమస్యలను ఇంగ్లండు ఎదుర్కోవలసి వచ్చింది. అంతే పారిశ్రామిక విప్లవం అన్నీ చెడులనే తనవెంట తేలేదు. అది తన వెంట తెచ్చిన మంచికూడా వుంది. రాజకీయ, ఆర్థిక రంగాల్లో అది మార్క్సిజం ప్రాభవానికి దారితీయగా, సాహిత్య రంగంలో నవలవంటి మహోన్నతం అయిన నవలా ప్రక్రియ ఆవిర్భావానికి కారణం అయింది.

పారిశ్రామిక విప్లవం మేధావులను ఆధ్యాత్మిక చింతన నుంచి లౌకిక చింతనకూ హేతువాద దృష్టికి మళ్ళించింది. ప్రజాస్వామ్యానికీ, ప్రజాస్వామిక ఆలోచనా విధానానికి అంకురార్పణ చేసింది. కొంతలోకొంత మానవులంతా సమానులేనన్న సిద్ధాంతాన్ని నమ్మేటట్లు చేసింది. అంతస్తులు అంతరించాలనే ఆలోచనా విధానానికి రూపకల్పన చేసింది.

పారిశ్రామిక విప్లవానికి పూర్వపు సాహిత్యం కొందరి కోసం రాయబడింది. రాజులకూ, రాణివాసాలకూ, కవిత్వానికీ నాటకాలకూ మాత్రం పరిమితం అయింది. సామాన్య మానవునికి అందులో స్థావరం లేదు. మానవులంతా సమానులేనన్న ఆలోచనా విధానంతో, అచ్చుయంత్రం కనుగొనబడడంతో సాహిత్యం సామాన్యుల దరికి చేరింది. చదివేవాడు సామాన్యుడు. ఆలోచించేవాడు సామాన్యుడు. రాసేవాడు సామాన్యుడు. కాబట్టి సామాన్యుని గురించి రాయాలనే తపన కొనసాగింది. ఈ తపనలోంచి ఆవిర్భవించిందే "నవల."

నవల ఆవిర్భావానికి సామాజిక పరిస్థితులే కారణం. అది సమాజంలోంచి పుట్టింది. సమాజాన్ని చిత్రించింది. సామాజికపరిణామాలను తనలో ఇముడ్చుకుంది. ఈ ప్రక్రియకు అద్భుతాలు గిట్టవు. మానవాతీతమైన కల్పనకు ఇందులో తావులేదు. ఇందులోని పాత్రలు మనవి, సంఘటనలు మనవి, కథ మనది, సుఖదుఃఖాలు మనవి. ఇది జీవితం. సిసలయిన జీవితం. జీవితాన్ని చిత్రించడం నవలాకారుని పని. తన జీవితాన్నే చదువుతాడు కాబట్టి పాఠకుడు మురిసిపోతాడు. అందువల్లనే నవలకు అంత ప్రాధాన్యం, అంత ప్రాచుర్యం.

ఇంగ్లీషులో తొలి నవల ఆవిష్కరణకు కారకుడైన డెఫో పండితుడూకాదు, ప్రవృత్తిరీత్యా రచయితా కాదని తెలుసుకున్నప్పుడు ఆశ్చర్యం కలుగుతుంది. అతడు వ్యాపారి. వర్తకం చేసేవాడు. కళ అంటే ఏమిటో అతనికి తెలియదు. అయితే ఆనాటి సామాజిక దుస్థితులకు స్పందించి "రాబిన్‌సన్ క్రూసో" అనే నవల రాశాడు. అది ప్రపంచ ప్రఖ్యాతం

అయింది. ఆనాటి సమాజాన్ని చూచి రాసిన రాబిన్‌సన్ క్రూసో ఆదిమ కాలపు జీవితాన్ని వరిస్తాడు. ఇదీ అందులోని ఇతివృత్తం. నవలాకారుడు పండిత ప్రకాండుడు కానక్కరలేదు. సామాజిక స్థితిగతులనుచూచి స్పందించగల హృదయం గలవాడు కావాలి. "Novel" అన్నది ఎవరో ఎంచి, తెచ్చి పెట్టిన పేరు కాదు. కొత్తగా కనిపిస్తే జనం దాన్ని "Novel" అన్నారు. పదబంధాలు, భాషా పాండిత్యాలు, సమాస శృంఖలాలు ఎరుగని ప్రక్రియ నవల. ఇది సామాన్యుని వలే నిరాడంబరం అయింది. జీవితం వలె సత్యమైంది, ప్రకృతి వలె సుందరం అయింది. ఆకాశంవలె విశాలం అయింది, సూర్యునివలె తేజోవంతం అయింది, వాయువువలె సర్వవ్యాప్తం అయింది.

ఇంగ్లండులో పారిశ్రామిక విప్లవం రాకుండా ఉండిఉంటే ఇంగ్లీషువాళ్ళు మన దేశానికి వచ్చిఉండేవారు కారు. వారు రాకుంటే మనసాహిత్యంలో నవల అవతరించి ఉండేది కాదు. మనం అమరకోశం చదివి అచ్చతెలుగు కావ్యాలురాసి అంకితాలుగా అమ్ముకోవలసి వచ్చేది.

ఇంగ్లీషువాళ్ళుమననుబానిసల్నిచేశారు. నిజం. కాని కొన్ని కాంతివంతం అయిన ఆలోచనలను మనలో ప్రవేశపెట్టారు. ఒక విషయం మనం గమనించాలి. భారతదేశంలో బ్రిటీష్ ప్రభుత్వం స్థిరపడేనాటికి ఇంగ్లండులో డెమోక్రసీ స్థిరపడింది. బానిసత్వంతోపాటు ఆంగ్లేయులు హేతువాదాన్ని కూడా తమతో తెచ్చారు. మనలో ప్రబలిఉన్న మూఢాచారాలను గుర్తించేటట్లు చేశారు. ఆ ఆలోచనా విధానమే సాహిత్యంలో ప్రవేశించి తెలుగులో నవలా ప్రక్రియకు నాంది పలికింది.

తెలుగులో, ఇంగ్లీషులోవలె నవల ఉబికిరాలేదు. తెలుగునవల ఒక ప్రణాళికాబద్ధంగా సాహిత్యంలో ప్రవేశించినట్లు కనిపిస్తుంది.

లార్డ్ మేయో బెంగాలీల ఆచార వ్యవహారాలు తెలిపే నవల రాయించాలనుకున్నారు. అలాంటి నవల రాసిన వారికి బహుమతి ప్రకటించారు. ఆ ప్రకటనను నరహరి గోపాలకృష్ణమ చెట్టిగారు చూచారు. వారుడిప్యూటికలెక్టరు. ఇంగ్లీషు సాహిత్యంలో పరిచయం ఉన్నా తెలుగు సాహిత్యంతో అంత దగ్గర సంబంధం లేనివాడు. ముఖ్యం అయింది అతడు విద్వాంసుడు, పండితుడు కాడు. అతడు "హిందువుల యాచారము తెలుపునట్టి నవీన ప్రబంధము" రచించడానికి పూనుకుని "సోనాబాయి పరిణయము" అనే ఉపనామంగల "శ్రీరంగరాజ చరిత్ర" రచించారు. "ఇయ్యది తెలుంగున తొల్లి నవల యగునా కాదా?" యను వివాదమును విమర్శకులకు వదిలివేతము. అది వదిలేస్తేనే కొన్ని విషయాలు స్పష్టం అవుతాయి.

ఇంగ్లీషులోవలె తొలి నవలా రచయిత తెలుగులోనూ పండితుడూ, కళాకారుడూ కాడు.

రెండవది సామాజిక స్థితిగతులను తెలియపరచాలనే ఆతురత ఇద్దరికీ ఉంది.

చెట్టిగారు వచనంలో రాశారు. అది నేటికి జటిలంగా కనిపించవచ్చు. అయినా ఆనాటి ఛాందస భాషను వదిలి రచన

చేయడంలో చెట్టిగారి ప్రగతిశీలత స్పష్టంగా కనిపిస్తుంది.

నాల్గవది చెట్టిగారు కథాకల్పనలో కులాలకు అతీతం అయిన కథను కల్పించారు. రాజకుమారుడు లంబాడీ కన్యను ప్రేమిస్తాడు.

అయిదవది ప్రేమను గురించిన ఒక అవగాహన కలిగి, అది కులాలకు అతీతం అయిందనే దృష్టి ఏర్పరచుకోవడం.

శ్రీరంగరాజు చరిత్ర 1872 వ సంవత్సరంలో ప్రచురించబడింది. అంటే గత దశాబ్దానికి మన నవల నూరేళ్ళ వయసు కలిగి ఇతర సాహిత్య ప్రక్రియల కంటె అతి చిన్నది.

శ్రీరంగరాజు చరిత్ర తరువాతవచ్చిన పరిపూర్ణమైన నవల "రాజశేఖర చరిత్ర" అనే "వివేకచంద్రిక". కందుకూరి వీరేశలింగం పంతులుగారు పండితులు, విద్వాంసులు, భాషాకోవిదులు, రచయిత. వారు తెలుగులో అనేక ఆధునిక ప్రక్రియలకు ఆద్యులు. "తెలుగులో వచన ప్రబంధమును నేనే చేసితిని. మొదటి నాటకమును నేనే తెనిగించితిని. మొదటి ప్రహసనమును నేనే వ్రాసితిని. మొదటి చరిత్రమును నేనే రచించితిని. స్త్రీలకై మొదటి వచన పుస్తకమును నేనే గావించితిని" అని చెప్పుకున్నారు పంతులుగారు.

అన్నింటినీమించిపంతులుగారు గొప్ప సంఘ సంస్కర్త. నాటి సమాజ స్వరూపాన్ని తలచుకుంటే వళ్ళు జలదరిస్తుంది. శాస్త్రంపేర జరిగినవన్నీ మోసాలే. కుట్రలు, కూహకాలకు అంతులేదు. బాల్య వివాహాలు, కన్యాశుల్కాలు, బాలవితంతువులు, స్వాముల పేర జరిగిన మోసాలు సమాజాన్ని కలుషితంచేసి మురికి గుంటగా తయారుచేశాయి.

ఆ సమాజాన్ని అందరూ చూచారు. పంతులుగారూచూచారు. స్పందించిందీ, కదిలిందీ కలంతో సమాజకాలుష్యాన్నిదూరం చేయ యత్నించినవారు పంతులుగారు. సంఘసంస్కరణకు సాహిత్యాన్ని ఆయుధంగా వాడిన ఆద్యులు పంతులుగారు. పంతులుగారు మహాపండితుడు. కవి. అష్టావధానం చేయగల దిట్ట. అయినా వారు సంఘసంస్కరణకుగాను వచన ప్రక్రియను మాత్రమే చేపట్టారు. వారికి నవలా ప్రక్రియఅందుకు అనువయిందిగా కనిపించింది. "ఈవరకు మనయాంధ్ర భాషలో జనుల యాచారవ్యవహారములను దెలుపుచు నీతి బోధకులుగానుండు వచనా ప్రబంధము లేవియు లేకపోవుట" వలన ఆ లోపాలను పూర్తి చేయడానికిపంతులుగారు "రాజశేఖర చరిత్ర" రచించారు.

అంతకుముందు జరిగిన రచనలన్నీ అంకితాల కోసం, మళ్ళ్యామాన్యాలు సంపాదించుకోడానికే జరిగాయి. కవితా కన్యను పడుపువృత్తి తార్చి పొట్టపోసుకోవడానికి జరిగాయి. కాని పంతులుగారు యశస్సు కోసం రచనలు చేయలేదు. మళ్ళ మాన్యాలు సంపాదించుకోవడానికి కలం పట్టలేదు. అనూచానంగా వస్తూ ఉండిన స్వార్థపరుల సంప్రదాయాలను ఛేదించడానికి కలాన్ని కత్తిగా పట్టుకొని కదనరంగానికి ఉరికిన విప్లవమూర్తి కందుకూరి వీరేశలింగం పంతులు.

రాజశేఖర చరిత్రలో కథ అంత ప్రధానం అయింది కాదు. వారు సమా

జాన్ని విమర్శించిన తీరు గొప్పది. నీలాటి రేవు దగ్గరి ఆడవాళ్ళ ముచ్చట్లనుంచి, శంకరాచార్యుల భిక్ష వరకుగల అంశాలను పంతులుగారు వివరించిన పద్ధతి వారి నిశిత పరిశీలనా దృష్టికి నిదర్శనాలు.

నవలా రచనను గురించి వివరిస్తూ పంతులుగారు "ఎవరు నమ్మినను నమ్మక పోయినను వాస్తవమును మరుగుపరచక చెప్పుట చరిత్రకారుని విధాయక కృత్యము. పురాణము లందువలె మనుషులు లేడి రూపము ధరించిరని గాని, పురుషులు కేవల స్త్రీలుగానే మారినారని గాని యసాధ్యమయిన సంగతి యుండేదియు దెలుపరాదు" అంటారు.

ముందు నవలను వచన ప్రబంధం అన్నారు. రాజశేఖర చరిత్ర ఒక వ్యక్తి జీవితం కాబట్టి దాన్ని చరిత్ర అన్నారు. అప్పటికి నవలను చరిత్ర అనేవారు. పంతులుగారి సందేశం నవలాకారులకే అనే విషయం గమనిస్తే నవలారచనకు వాస్తవం పట్టుగొమ్మ అనే విషయం అర్థం అవుతుంది.

ఈ ప్రక్రియకు "నవల" అన్న పేరును స్థిరపరచినవారు కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు. "నవాన్, విశేషాన్ లాతి గృహ్ణాతీతి నవలా" అన్నారు. అంటే కొత్త విశేషాలు గలదని అర్థం.

ఆ విధంగా మనకు సమగ్ర తెలుగు నవలను అవతరింపచేశారు కందుకూరి వారు. వారు ఆనాటి తెలుగువారి స్వరూప స్వభావాలను సజీవంగా చిత్రించారు.

సంఘం విరాట్ స్వరూపం గలది. అది అనేక శాఖోపశాఖలుగల మహా వృక్షం. సంఘాన్ని సమగ్రంగా పరిశీలించడం అసాధ్యం. సంఘపు మూల సూత్రాల ఆధారంగా ఒక ప్రాంతపు లేక ఒక వర్గపుజీవన విధానాన్ని చిత్రించడానికి నవలాకారుడు ప్రయత్నిస్తాడు. అయితే అతని ప్రతిభను బట్టి, అతను మలచిన పాత్రలు, చేసిన వ్యాఖ్యలు మొత్తం సంఘానికి సంబంధించినట్లుగా భ్రమింప జేస్తాయి. అది రచయిత ప్రతిభకు నిదర్శనం.

వీరేశలింగంగారు "రాజశేఖర చరిత్ర"లో గోదావరి ప్రాంతానికి చెందిన ఆనాటి బ్రాహ్మణ కుటుంబాల స్వరూప స్వభావాలను సమగ్రంగానూ, సమర్థవంతంగానూ చిత్రించారు.

తెలుగులో తొలి కావ్యం ఆంధ్ర మహాభారతం, తొలి సమగ్ర నవల రాజశేఖర చరిత్ర గోదావరీ తీరాన రాజమహేంద్రవరంలో అవతరించడం సకృద్విశేషం.

నవల సాంఘిక వాస్తవాలను వివరిస్తుంది. పాఠకులతో చదివిస్తుంది. వారితో ఆలోచింప చేస్తుంది. ఈ విషయాలను గ్రహించిన "చింతామణి" పత్రిక నవలా రచనను ప్రోత్సహించదలచింది. బహుమతులు ప్రకటించింది. నాటినుంచి నేటి వరకు నవలకు బహుమతుల ప్రోత్సాహం లభిస్తూనే ఉంది.

1894 లో చిలకమర్తివారి "రామచంద్ర విజయము" "చింతామణి" పత్రికవారి బహుమతి గెల్చుకుంది. ఇది కందుకూరివారి "రాజశేఖర చరిత్రము"ను ఆదర్శంగా గ్రహించిన నవల. ఇందులో కోనసీమ బ్రాహ్మణుల జీవితాలను చిత్రించడం జరిగింది. తరువాత 'గణపతి'

వంటి నవలలో సమాజాన్ని చక్కగా చిత్రించారు ఒ లకమ త్రివారు.

తల్లాప్రగడవారి "హే లా వ తి" వేంకట పార్వతీశుల "మాతృమందిరం" నవలల్లో హరిజన సమస్యను చర్చించడం ఆ రచయితల ప్రగతిశీల దృక్పథానికి నిదర్శనం. అప్పటికి ఇంకా గాంధీజీ హరిజనోద్యమం ప్రారంభం కాలేదని తెలుసుకుంటే ఆ రచయితలు ఎంత పురోగాములో అర్థం అవుతుంది.

జాతి జీవనంతోపాటు రచయిత తన ఆలోచనా విధానాన్ని మలచుకుంటాడు. 1910 లో ఆంధ్రోద్యమం తలెత్తింది. తెలుగు జాతి ఔన్నత్యాన్ని నవలలకు ఎక్కించి ప్రజల్లో జాతీయ భావం కలిగించాలనే ఆరాటం రచయితల్లో కలిగింది. భోగరాజువారి "ఆంధ్రరాష్ట్రం" తెలుగు జాతి ఔన్నత్యాన్ని చిత్రించింది. ఆంధ్రుల వైభవాన్ని నవలల్లో చిత్రించిన మహాశిల్పి అడవి బాపిరాజు. వారికి తెలుగు వైభవం అంటే ఆవేశం. వారి గోన గన్నారెడ్డి, నారాయణరావు, హిమబిందు యిందుకు నిదర్శనాలు. నోరి నరసింహశాస్త్రి తెలుగుల చరిత్రను నవలలకు ఎక్కించిన పరిశోధకులు

మహాత్ముడు భారతదేశంలో జాతీయోద్యమం ప్రారంభించారు. ఆ ఉద్యమ ప్రభావంతో ఆవిర్భవించిన నవల "మాలపల్లి" మహోన్నతం అయిన నవల. "మాలపల్లి" నవలా రచనలో ప్రజల భాషను ప్రవేశపెట్టిన ఘనత ఉన్నవ వారిదే. మాలపల్లి పరిధి విస్తృతం అయింది. విశాలం అయింది. ఉన్నవ వారు గుంటూరు ప్రాంత జీవితాన్నే చిత్రించినా సకలాంధ్రలోని ప్రజా ఉద్యమాలను నిష్పక్షపాతంగా వివరించారు. ఉన్నత ప్రగతిశీల క్రాంత దర్శి. ఒక హరిజనుని నాయకునిగాచేసి మహా కావ్య నిర్మాణం చేసిన మహాశిల్పి.

ఉన్నవవారి అడుగుజాడల్లో నడిచి తెలంగాణా ప్రజాజీవితాన్ని నవలలుగా రాసినవారు వట్టికోట ఆళ్వార్‌స్వామి. వారి "ప్రజల మనిషి" "గంగు" ప్రజా జీవిత చిత్రణలు. "బొల్లిముంత" వారి మృత్యుంజయులు "మహీధర" వారి "ఓనమాలు" "మృత్యువు నీడల్లో" లక్ష్మీకాంత మోహన్ "సింహగర్జనలు" తెలంగాణా ప్రజా పోరాటాన్ని చిత్రిస్తున్న నవలలు.

భారత స్వాతంత్ర్య సమరం ప్రజలను కదిలించింది. ఉరికించింది. విముక్తి కోసం ప్రజలు అర్రులు చాచారు. పోరాటాలు సాగించారు. ఆ పోరాటం మేధావుల్లో ఆలోచనను రేకెత్తించింది. స్వాతంత్ర్యాన్ని గురించి అనేక రకాలయిన ఆలోచనలు తలెత్తాయి. ప్రాచీనసంస్కృతి పునరావృతం అయితే తప్ప జాతికి విముక్తి లేదని నమ్మాడు విశ్వనాధ సత్యనారాయణ. విశ్వనాధ అసమాన ప్రతిభావంతుడు. తాను నమ్మిన సిద్ధాంతాన్ని ప్రచారం చేయడానికి నవలా రచనకు పూనుకున్నారు. "వేయిపడగలు" "చెలియలి కట్ట," వారి ప్రతిభా ప్రాభవాలకు నిదర్శనాలు.

చలం స్త్రీలకు స్వేచ్ఛ కావాలన్నాడు, స్వేచ్ఛా ప్రణయాన్ని ప్రతిపాదించాడు. అతని శైలి పదునైంది. అతను పట్టింది కలమా? కరవాలమా అవి

శంకింప చేసేంత సూటి శైలి అతనిది. ఆ శైలితో అతను తెలుగు దేశాన్నంతా కదిలించాడు. విశ్వనాథను తనకు ప్రత్యర్థిగా నిలిచేట్లు చేయగలిగిన ప్రతిభావంతుడు చలం.

ఈలోగా రష్యాలో శ్రామికవిప్లవానికి విజయం కలిగింది. శ్రామిక రాజ్యం ఏర్పడింది. అది ప్రపంచ మేధావులను కదిలించింది. వారు ఆర్థిక రాజకీయ సిద్ధాంతాల విషయంలో ఒక నిర్దిష్టమైన అభిప్రాయాలు ఏర్పరచుకున్నారు. సామ్రాజ్యవాదంఅంతరించి, సమాజవాదంఅవతరిస్తేనే పీడిత ప్రజానీకానికి విముక్తి కలుగుతుందని విశ్వసించారు. పెట్టుబడిదారీ విధానంలోని లోపాలను, ప్రజాస్వామ్య విధానంలోని మేలు వివరించేది జి.వి. కృష్ణారావుగారి "కీలు బొమ్మలు." గోపీచంద్ అసమర్థుని జీవ యాత్రలో మారుతున్న సమాజంలో సర్దుకోలేని సీతారామారావును చిత్రించారు. ఉదారవాది పరిణామవాది కావడాన్ని మహీధర రామమోహనరావు గారి "రథచక్రాలు" వివరిస్తుంది. వీరి "కొల్లాయి గట్టితేనేమి?" గాంధీజీ ఉద్యమాన్ని చిత్రించే నవల. ఉప్పల లక్ష్మణరావుగారు "అతడు-ఆమె" లోసంస్కార వాదాన్ని, సమాజ వాదాన్ని వివరించారు. వేలూరి శివరామశాస్త్రిగారి "ఓబయ్య" సనాతన అధునాతన వాదాల పోరాటాన్ని చిత్రించే నవల.

కొడవటి కుటుంబరావుగారు మధ్యతరగతి జీవితాలను అనేక కోణాలనుంచి పరిశీలించి నవలలు రాశారు. అతడు మానవతావాది, మంచిశిల్పి. వారు "చదువు" "అనుభవం" నవలల్లో 1930 నుంచి జరిగిన ఆర్థిక మానసిక సంక్షోభాన్ని చక్కగా చిత్రించారు. నవలా కారుల్లో మంచి శిల్పి బుచ్చిబాబు వారి "చివరకు మిగిలేది" ఇందుకు నిదర్శనం.

స్వాతంత్ర్య సమర కాలాన్ని జాగ్రత్తగా పరిశీలించినట్లయితే నవలా రంగంలో స్వర్ణయుగంగా కనిపిస్తుంది. ఆ కాలంలోని నవలాకారుల్లో స్వాతంత్ర్యాన్ని గురించిన తహతహ మాత్రమే కాక, స్వాతంత్ర్యం వచ్చిన తరువాత రావలసిన మార్పులను గురించి కూడా నిశితంగా పరిశీలించారు. నాటి నవలా కారులు సమాజాన్ని సంపూర్ణంగా పరిశీలించడానికి చేసిన ప్రయత్నం మనకు కనిపిస్తుంది.

మనకుస్వాతంత్ర్యంవచ్చిన తరువాత పరిస్థితి మారిపోయింది. మనస్వాతంత్రోద్యమం స్వాతంత్ర్యం రావడం వరకే చెప్పింది. ఆ తరువాతఏంచెయాలో చెప్పలేదు. అందువల్లస్వాతంత్ర్యంవచ్చినతరువాత మన ప్రయాణం దిక్కు లేకుండా సాగింది. అది తెగిన గాలిపటంఅయింది. దేశభక్తి సహితంగా అన్నీ వ్యాపారంగా మారాయి. మనిషికీ మనసుకూ విలువ చచ్చింది. విలువ పెరిగింది ఒకే ఒక వస్తువుకు. అది డబ్బు. దానికి గౌరవం హెచ్చింది. అదే రాజ్యం చేయ సాగింది. జనం డబ్బువెంట పరుగులు తీశారు. లక్ష్యాలూ, ఆదర్శాలూ, వమ్ము అయినాయి. చేతికి దొరికినంత ఆర్జించడం పరమ ఆదర్శం అయింది.

ఇది సమాజంలో వచ్చిన పతనం. ఈ పతనమే నవలా రచనలోనూ, ప్రచురణలోనూ కనిపిస్తుంది. 1950 తరువాత

వ్యాపార వర్గాల దృష్టి నవలమీదపడింది. పత్రికలుసీరియల్స్ ప్రచురించడం ప్రారంభించాయి. నవల పత్రికల అమ్మకాలకు ఉపయోగపడింది. దాంతోనవలకు గిరాకీ హెచ్చింది ప్రచురణ కార్యక్రమం పెరిగింది. ఉన్న నవలాకారులు చాల లేదు. కొత్తవారు కావలసి వచ్చారు. వచ్చిన వారికి సామాజిక స్థితి గతులను గురించి ఆలోచించే తీరికగాని స్తోమత గాని లేకుండా పోయింది. దాంతో నవల వ్యక్తిగత సమస్యలకూ, కుటుంబ విషయాలకు మాత్రమే పరిమితం అయింది. పెళ్ళికి ముందు, తరువాత తప్ప నవలకు అన్యవస్తువు కనిపించలేదు. అయితే రాసిలో ఈ కాలంలో చాలా నవలలు వచ్చాయి. ఈ కాలంలో జరిగిన మంచి ఒకటుంది. రచయిత్రులు అనేకమంది నవలా రచనకు పూనుకుని ప్రసిద్ధులయినారు. ఇదిమంచిపరిణామం. ఈ కాలంలో వచ్చిన రచయిత్రులలో లత పేరు చెప్పకోకుండా ఉండలేం. ఆమె కొంతకాలం తెలుగుదేశం మొత్తంలోనూ వ్యాపించింది. తరవాత సీరియల్స్ ద్వారాప్రఖ్యాతురాలయినరచయిత్రి కోడూరుకౌసల్యాదేవి.

1950 నుంచి 70 వరకు కాలాన్ని నవలా రచనకు సంబంధించినంత వరకు సుషుప్తిదశ అనవచ్చు. అంత మాత్రాన మంచి నవలలు రాలేదని చెప్పలేం. ఈ కాలంలో వచ్చిన ఒక గొప్ప రచయిత "శారద." అరవవాడయిన నటరాజన్ హోటల్లో సర్వరుగా పనిచేస్తూ "శారద" కలం పేరుతో గొప్ప నవలలు రాశాడు. అతని "అపస్వరాలు" "ఏదిసత్యం ?" మున్నగు నవలలు ఆణిముత్యాలు. అతనికి తెలుగుదేశాన్ని గురించి ఒక సమగ్ర అవగాహన ఉంది. ముప్పాళ రంగనాయకమ్మ ప్రగతిశీల దృక్పథంతో నవలా రచనకు పూనుకుంది. ఆమె "బలిపీఠం" తెలుగు పాఠకులను కదిలించింది. నవీన్ "అంపశయ్య" ద్వారా చైతన్య స్రవంతిని ప్రవేశపెట్టాడు. బలివాడ కాంతారావు "దగాపడిన తమ్ముడు", కొమ్మూరి వేణుగోపాలరావు "హౌస్‌సర్జన్", పోలాప్రగడవారి "నవోదయం" రావూరి భరద్వాజ "పాకుడు రాళ్ళు" పోరంకి దక్షిణామూర్తి "ముత్యాలపందిరి" పేర్కొనదగిన నవలలు. యద్దనపూడి సులోచనారాణి ఒక సున్నితమైన శైలితో మృదువైన కథాకథనంతో నవలా రచనలో ఒక ప్రత్యేక స్థానాన్ని ఏర్పరచుకున్నారు. వారి "సెక్రటరీ" ఈ కాలంలో వచ్చిన నవల.

ఈ శతాబ్దంలో ఏడవ దశకం ప్రధానం అయింది. ప్రభావాత్మకం అయింది. స్వాతంత్ర్యంవల్ల సామాన్యునికి ఏమీ జరగలేదనే అసంతృప్తి దేశంలో వ్యాపించింది. అంతేకాదు ఈ దశకాన్ని తిరుగుబాటు దశకం లేదా ఉద్యమాల దశకం అనవచ్చు. నక్సలైట్ ఉద్యమం ప్రారంభం అయి యువతరాన్ని కదిలించింది. విప్లవ రచయితలు విజృంభించినా ఆ ఉద్యమం ఒక్క మంచి నవలను సృష్టించలేకపోయింది. రెండు వేర్పాటు ఉద్యమాలు వచ్చాయి. ముప్పై సంవత్సరాలు ఏలిన కాంగ్రెస్ ప్రభుత్వాన్ని ప్రజలు గద్దె దించారు. మొత్తంమీద ఈ దశకాన్ని చైతన్య దశకం అనవచ్చు.

సమాజంలో వచ్చిన ఈ చైతన్యం నవలా రంగంలోనూ కనిపిస్తుంది. చైతన్యవంతం అయిన నవలలు, రచయితలు ఆవిర్భవించారు. వస్తురీత్యా నవలలో ప్రధానం అయిన మార్పు వచ్చింది. సమాజం నవలల్లో చోటు చేసుకుంది. ఉబుసుపోక నవలలు కోకొల్లలుగా వచ్చినా చెప్పుకోదగిన చైతన్య నవలలు ఈ దశకంలో వచ్చాయి.

ఈ దశకం ప్రారంభంలో వచ్చింది దాశరథి రంగాచార్య "చిల్లర దేవుళ్ళు." తెలంగాణా ప్రజాజీవితాన్ని నవలలుగా రాయాలని ఉద్యమించి "మోదుగుపూలు" "జనపదం" రాశారు. వాసిరెడ్డి సీతాదేవి రాజకీయాల్లో ఉన్న కుళ్ళును చిత్రిస్తూ "సమత" రాశారు. వారి "మట్టిమనిషి" ప్రజల భాషలో పటిష్టమైన కథా సంవిధానంతో సజీవ పాత్రచిత్రణతో వచ్చిన సజీవ నవల. వారి "మరీచిక" నక్సలైట్ ఉద్యమాన్ని చిత్రించే నవల. బీనాదేవి "హేంగ్ మీ క్విక్" సమాజాన్ని నగ్నంగా ప్రదర్శించి తెలుగువారిని ఆకట్టుకున్న నవల. రావిశాస్త్రి రాజు-మహిషి, గోవులొస్తున్నాయి, రత్తాలు రాంబాబు అధోలోకం వారిని విశిష్టం అయిన భాషాశైలితో వివరించిన నవలలు. నవీన్ "ముళ్ళపొదలు" వేర్పాటు ఉద్యమపు బండారాన్ని బయటపెట్టిన నవలకాగా "చీకటిరోజులు" ఎమర్జెన్సీ దురాగతాల్ని వివరించే నవల. పసుపులేటి మల్లికార్జునరావుగారు "పక్షులు" నవలలో తెలంగాణంలో మారుతున్న పరిస్థితుల్ని సజీవంగా చిత్రించారు. ఆలేటి నాగమణి "పుల్లి" అనే నవలలో మురికిపేటలను చక్కగా చిత్రించారు. వడ్డెర చండీదాసు "హిమజ్వాల" కళాత్మకంగా ఉన్నతమయిన నవల. "అంతరంగ తరంగాలు" పరిమళా సోమేశ్వర్ రచన.

ఈ దశకంలో నవల మీద సినీమాల ప్రభావం ఎక్కువగా కనిపించడం సహజం. సామాజికం అయినా కాకున్నా మంచి శైలితో విషయవైవిధ్యంతో, చాలమంది రచయితలు, రచయిత్రులు రాస్తున్నారు. వాటిలో కలకాలం నిలిచే నవలలు బహుకొద్ది. వాటిది తాత్కాలికమయిన జీవనం. అయినా పాఠకులను చదివించడానికి తద్వారా వారిలో ఆసక్తిని పెంచడానికి తోడ్పడ్డాయి.

మాదిరెడ్డి సులోచన ఈ దశకంలో రచయిత్రిగా స్థిరపడ్డారు. వారు చాలా నవలలు రాశారు. సి. ఆనందారామం, రామలక్ష్మి, విశాలాక్షి, ఆశాలత, చివుకుల పురుషోత్తం, మంధా వెంకటరమణ, రాజారామమోహనరాయ్ లాంటి అనేకులు రచనలు చేస్తున్నారు. రచయిత్రులు ఎక్కువగా రాస్తున్నందుకు బాధ పడాల్సిన అవసరంలేదు. గర్వించాలి. అక్షరాస్యత ఎక్కువ అయిన కొద్దీ నవలా పాఠకులు ఎక్కువవుతారు. పాఠకుల్లోంచే రచయితలు వస్తారు. రావాలి. ప్రతి రచయితా వాల్మీకి కాలేడు. వచ్చే అన్ని నవలలను దుయ్యబట్టడంకన్న వస్తువున్న మంచి నవలలను నవలాకారులను అభినందించి ప్రోత్సహించడం అలవరచుకోవాలి.

షరా :- ఇదివ్యాసం. కేటలాగుకాదు. కాబట్టి కొన్ని రచనలనూ, రచయితలనూ పేర్కొనకుంటే బుద్ధిపూర్వకంగా చేసిందని నిందించడానికి పూనుకోరాదు. □

# తెలుగు నవల- ఇతివృత్త పరిణామం

## ఉద్దేశం : పరిధి

ఏ రకమైన సృజనాత్మక కృషికయినా ముందు ముడిసరుకు సిద్ధంగా పెట్టుకోవాలి. దాన్ని ప్రాసెస్ చేసుకుని నగిషీలు దిద్దుకుంటే కాని మనకి కావలసిన స్వరూపం ఏర్పడదు. ఈముడిసరుకునే సాహిత్య పరిభాషలో 'వస్తువు' అంటున్నాం. దాన్నే 'ఇతివృత్తం' అని కూడా అంటుంటారు. నిజానికి, ఇంగ్లీషులో కథావస్తువును 'థీమ్'అనీ, నిర్మాణ ప్రణాళికని 'ప్లాట్' అనీ అంటున్నట్టుగా, తెలుగులో ఈ రెంటికీ ఉన్న భేదాన్ని గుర్తించడానికి ఒకటి వస్తువనీ మరొకటి ఇతివృత్తమనీ అంటే బాగుంటుందేమో! కాని ఈ రెండూ సమానార్థంలోనే వాడుకలో ఉంటున్నందువల్ల, ఈ ప్రసంగ వ్యాసానికి సంబంధించినంతవరకు ఇతివృత్తమంటే కథావస్తువే.

ఈ దశాబ్దిలో వెలువడ్డ తెలుగు నవలల్లో ఇతివృత్తాల పోకడలు ఏయే తీరులుగా ఉన్నాయో స్థూలంగా వింగడించడమే దీని ఉద్దేశం. గమనించిన ఇతివృత్తాలకే దీని పరిధి పరిమితం.

## ఇతివృత్తాలు : తీరుతెన్నులు

పుస్తక రూపంలోనయితేనేం, పత్రికా పుత్రికల రూపంలో నయితేనేం, ధారావాహిక ప్రచురణల్లో నయితేనేం, వెలువడ్డ నవలల్లో మనకు కనిపించే ఇతివృత్తాల్ని స్థూలంగా తొమ్మిది వర్గాలుగా వింగడించవచ్చు.

# పోరంకి దక్షిణామూర్తి

## 1) దౌర్జన్య నిరసన :

"మనిషి నకిలీ డబ్బు తయారు చేస్తాడు, డబ్బు నకిలీ మనిషిని తయారు చేస్తుంది" (Man makes counterfeit money and money makes counterfeit man) అన్నాడో పెద్దమనిషి. డబ్బుకు తోబుట్టువే అధికారం కాబట్టి, ఆ రెండూ చెట్టాపట్టాలు వేసుకుని అలంగం తొక్కడంలో ఆశ్చర్యమయితే లేదు కానీ, వాటి ఆగడాలు ఎక్కువయినప్పుడు జనం అట్టుడికిపోక మానరు.

ఆ సిరీ అధికారాన్నీ పోతపోస్తే తయారయిన విగ్రహాలు పల్లెల్లో పెత్తందార్లూ, భూస్వాములూ. బొమ్మని తిమ్మి చేసినా తిమ్మిని బొమ్మ చేసినా – వాళ్ళు ఆడింది ఆట, పాడింది పాట. "మగువకు మాంగల్యమే యవ్వనమనీ, మగవాడికి డబ్బే యవ్వనమనీ అన్నాట్ట వెనకటి కొకాయన సంస్కృతంలో. ఇంతకన్న అన్యాయం మరొకటిలేదని మనం టొకాయించినా, కళ్ళకక్కనిపిస్తున్న దాన్ని కాదనీ అనలేం. ఆ లెక్కన ఓ నాలుగయిదు పుంజీల కుటుంబాల్ని మినహాయిస్తే, మన దేశంలో అంతా, అటు పసివాళ్ళయినా అనుకోవాలి, నేరుగా ముసలితనంలో పడ్డ వాళ్ళయినా అనుకోవాలి. లేకపోతే ఈపాటికి బాగామరమ్మత్తు జరిగి ఉండేదే మరి.

మొత్తం మీద ఈ పరిస్థితిని ఓర్చుకోలేమన్న సంగతి తెలుగు రచయితలు నిరూపించారు. ఈ పెత్తందార్లు, ఈ భూకామందులూ ప్రదర్శించే ఔద్ధత్యానికి ఎన్ని బతుకులు బుగ్గి అవుతున్నాయో, ఎంతటి హాలాహలం దిగమింగవలసి వస్తోందో కళ్ళకిక్కట్టించడానికి ప్రయత్నం చేశారు. అందరూ పచ్చగా బతికితే బలే బాగుంటుం

దని అందరూ అనేదే (సర్వే జనాః సుఖినోభవంతు). దుఃఖపడేవాడు ఎక్కడా ఏ ఒక్కడూ ఉండగూడదన్నది మెచ్చుకోదగ్గ ఆదర్శమే మరి (మా కశ్చిత్ దుఃఖ భాగ్ భవేత్). అయినా ఎవడికొక్కావాలివి? ఎంతమందికొక్కావాలి? లంచేత కావలసిన గూటికి చేరుకోడానికి కాడిని ఎన్ని వంకర్లయినా తిప్పుతారు.

ఈ మాదిరి ఇతివృత్తాలతో రాసిన నవలలు ఈ దశాబ్ది ఆరంభం నుంచీ వసు న్నాయి. మంథా వెంకటరమణరావు రాసిన 'కొలువు, ఆస్తి, సూర్యుడా!....' ఈ కోవలోవి. "దేవుళ్ళారా మీ పేరేమిటి?" శ్రీకాంత్ రాసింది. "చీకటోళ్ళు" అర్నాద్ నవల. పైర్ల కాలంలో పొలాల్లో పనిచేసే కూలీల పరిస్థితుల్ని చిత్రించేది "బాకీ బతుకులు"— కె. కె. మీనన్ రాసింది. "బలిపశువు" జాతశ్రీది. పోలా ప్రగడ సత్యనారాయణమూర్తి "నవోదయం," వాసిరెడ్డి సీతాదేవి నవల "రాబందులూ రామచిలకలూ," నంది "నైమిశారణ్యం"లో హరిజనుల స్థితిగతుల్లో వాళ్ళు పైకి రావడానికి పడే ఆరాటం కూడా ప్రతిబింబిస్తుంది.

జరుగుతున్న దౌర్జన్యాల్ని కళ్ళకట్టించడంవల్ల ఆశించిన ప్రయోజనం పరోక్షంగా నెరవేరితే, వాటి పరిష్కారానికి చేసే ప్రయత్నాలు ప్రత్యక్షంగా ఫలితాలు చూపిస్తాయి. దాశరథి రంగాచార్య "జనపదం, మోదుగపూలు," అల్లం రాజయ్య "కొలిమంటుకుంది", జ్వాలాముఖి "వేలాడే మందారం" వంటి నవలలు దౌర్జన్య నిరసనతోనే సరిపెట్టుకోక, దౌర్జన్య ప్రతిఘటనను కూడా నిరూపిస్తాయి.

## 2) అధికార యంత్రాంగం : సమాజంలో ఇబ్బందులు

అధికారంలో ఉన్నవాళ్ళు సమాజం పట్ల తమకున్న బాధ్యతల్ని విస్మరించి నప్పుడూ, స్వార్థం ఎగదన్నినప్పుడూ, ఉదాసీనత ప్రబలినప్పుడూ, పాలుమాలిక ఏర్పడ్డప్పుడూ ప్రభుత్వ యంత్రాంగంలో లోపాలు పెరుగుతాయన్న సంగతి మనకు తెలుసు. ఈ లోపాలవల్ల సమాజం ఇక్కట్ల పాలవుతుందని నిరూపిస్తూ తెలుగు రచయితలు నవలలు రాశారు.

పాలగుమ్మి పద్మరాజు "రెండవ అశోకుడి మూణ్ణాళ్ళ పాలన," "నల్లరేగడి" రాశారు. వాసిరెడ్డి సీతాదేవి "రాబందులూ రామచిలకలూ" మాదిరెడ్డి సులోచన "న్యాయం నిదురపోయింది, ఇది నా దేశం" మొదలైనవి ఈ తీరు ఇతివృత్తాల్లో నడిచినవి.

## 3) స్త్రీల స్వయం వ్యక్తిత్వ నిరూపణ :

సమాజంలో వచ్చిన వివిధ పరిణామాలకు తోడుగా స్త్రీ జనాభ్యుదయంపట శ్రద్ధాసక్తులు ప్రబలడం గమనిస్తూనే ఉన్నాం; హర్షిస్తూనే ఉన్నాం. కానీ, సమిష్టిలో అంగీకార యోగ్యమైనది వ్యష్టిగా నిరసనకు గురయ్యే సందర్భాలు కోకొల్లలు. విద్యా వైజ్ఞానిక రంగాల్లో, వృత్తి విద్యారంగాల్లో, ప్రభుత్వపాలన రంగంలో మహిళ లెంతో ముందుకు వస్తున్నమాట నిజమే. కానీ తమకున్న అవకాశాల్ని

వినియోగించుకోడానికయినా, లేని వాటిని కల్పించుకోడానికయినా ఇంటా బయటా కొంత ఘర్షణకు గురికాక తప్పడంలేదు. స్వయం వ్యక్తిత్వాన్ని నిరూపించుకోక తప్పడంలేదు. ఈ పరిస్థితి మనిషిలో మార్పు తెచ్చింది. తనను తాను "ఎసర్ట్" చేసుకుంటే తప్ప మనుగడ సాగించలేమన్న అభిప్రాయం ప్రబలింది.

ఇటీవల తెలుగు నవలలకిది కథావస్తువయింది. జ్యోతి (సెప్టెంబరు) పత్రికలో విద్యేశ్వరి రాసిన "జీవనయాత్రలో స్త్రీ" యువ (సెప్టెంబరు) పత్రికలో కనకదుర్గ రాసినది ఈ కోవలోవి. బెహరా సాహితి "వసంతరాగం", డా॥ ఆలూరి విజయలక్ష్మి "సజీవ స్వప్నాలు", ఆనందారామం "తుపాను" కూడా ఈ మాదిరివే.

## 4) ఆడవాళ్ళ రచనలకూ, మహిళా విముక్తి ఉద్యమం పోకడలకూ ప్రతిస్పందన

సాహిత్య రంగాన్ని మగవాళ్ళొక్కళ్ళే గుత్తకు తీసుకోలేదన్న సంగతి ఏనాడో రుజువయింది. కవయిత్రులూ, కథయిత్రులూ అక్కడక్కడ అవుపిస్తూనే వచ్చారు. కాని దాదాపు రెండు దశాబ్దాలుగా నవలా రచనలో, సాహిత్య వ్యాపారంలో వాళ్ళదే పై చెయ్యి అవుతూ వచ్చింది. అందుకు తోడ్పడ్డ పరిస్థితులు మన కిక్కడ అనవసరం. జరిగింది ఒకరకంగా మేలే. పాఠకుల సంఖ్యా. రచయిత్రుల సంఖ్యా ఇబ్బడి ముబ్బడిగా పెరిగింది. తీరుబాటుగా చదువుకునేవాళ్ళకి తీరుబాటు సాహిత్యం లేకపోతే ఎలా? రాశిలో నెల్లూ ఉంటుంది, పొల్లూ ఉంటుంది. అందులో లింగభేదము చూసించనక్కరలేదు. అయితే పరిమిత పరిధి దాటలేనివాళ్ళూ, పరిసర పరిశీలన కొరవడ్డవాళ్ళూ, అనుభవాన్ని ఆర్జించుకోనివాళ్ళూ రచనకు పూనుకున్నప్పుడు వాళ్ళ పోకడలన్నీ హర్షించడం కష్టంగానే ఉంటుంది. వాటిమీద రియాక్షన్స్ రాకమానవు.

అలాగే మహిళా విముక్తి ఉద్యమం పేరిట సాగే ఆలోచనలు కొన్ని వెర్రి తలలు వేసినప్పుడు వాటికి ప్రత్యక్షంగానో పరోక్షంగానో ఖండనమండనలు ఎదురవుతుంటాయి. వీటిని దృష్టిలో పెట్టుకుని కథావస్తువులు మలుచుకొన్న రచయితలు కూడా ఉన్నారు. చివుకుల పురుషోత్తం "సావిత్రి."

ఇక్కడొక్క విషయం. ఈ మాదిరి ఇతివృత్తాన్ని ఎన్నుకున్నవాళ్లు ఆడవాళ్ల రచనలు చెయ్యడానికి కాని, మహిళా విముక్తి ఉద్యమానికి బద్ధవిరోధులని అనుకోవలసిన అవసరం, అవకాశం ఎంత మాత్రం లేవు. ఆలోచనా సరళి సజావుగా సాగాలన్నదే వాళ్ళ ధ్యేయం.

## 5. నగరీకరణం

కడుపులో చల్ల కదలకుండా ఉన్న పల్లెటూళ్ళకు పుట్టకీళ్ళు కదలబారే పరిస్థితి రావడంతో పట్నాలకు వలస పోవడం ఎక్కువయింది. డబ్బూ దస్కం ఉన్నవాళ్ళూ, ఆస్తిపాస్తులు పెంచుకున్నవాళ్ళూ పల్లెల్ని వదిలిపెట్టి రాకపోయినా నగరీకరణ ప్రభా

వానికి గురికాక తప్పలేదు. వాళ్ళలో కొందరికి ఒక కాలు పల్లెలో ఉంటుంది, మరో కాలు పట్నంలో ఉంటుంది.

పల్లెలో పట్టుమని పదివీధులు కూడా కనిపించని వాళ్ళకి పట్నం మహాప్రపంచంలా కనిపించడంలో ఆశ్చర్యంలేదు. జానెడు పొట్టకోసం వచ్చేవాళ్ళు కొందరు; చదువులకోసం వచ్చేవాళ్ళు కొందరు; వ్యాపారం కోసమో, విలాసాల కోసమో వచ్చేవాళ్ళు కొందరు. పట్నంలో మెరిసే మాయ జల్తారుకు జిగేలుమంటాయి కొన్ని కళ్ళు. ఈ రకమైన ప్రలోభాలకు తట్టుకోడం సులువేమీకాదు. వాటికి లోబడ్డ బతుకులు ఎన్ని రకాలుగా మారతాయో చెప్పలేం.

ఈ మాదిరి ఇతివృత్తాలతో రాసిన నవల్లో చెప్పుకోదగ్గది వాసిరెడ్డి సీతాదేవి గారి 'మట్టి మనిషి.'

## 6. వేర్పాటు ఉద్యమాలు

ఆంధ్రప్రదేశ్ ఏర్పడ్డ పదమూడేళ్ళకి ఇటు ఒక ఉద్యమం, మరో మూడు నాలుగేళ్ళకి అటు మరో ఉద్యమం రావటం మనకు తెలుసు. కలిగిన కష్టంలో, జరిగిన నష్టంలో అంతరాలు ఏవయినా, ఈ రెండూ వేర్పాటు ఉద్యమాలే. వీటి ప్రభావాల్ని చిత్రించిన నవలలు కూడా తెలుగులో వచ్చాయి— నవీన్ 'ముళ్ళపొదలు', మాదిరెడ్డి సులోచన 'సంధ్యారాగం.'

## 7. అస్తిత్వవాదం

మన రచయితల్లో వివిధ సాహిత్య వాదాలతో, మనో వైజ్ఞానిక సిద్ధాంతాలతో సన్నిహిత పరిచయమున్నవాళ్ళూ గాఢమైన అభినివేశం కలవాళ్ళూ కూడా కొందరున్నారు. గతానుగతికమైన ఇతివృత్తాలు తీసుకుని, అలవాటయిన పద్ధతిలో రాసేసి చేతులు కడుక్కోడం వాళ్ళకి ఇష్టం ఉండదు. ఒక్క రచన రాయడానికి ఎన్నో పుస్తకాలు చదువుతారు ఎంతో తర్జనభర్జన చేస్తారు. ఒక్కొక్కప్పుడు ఒక్క నవల రాయడానికి కొన్నేళ్ళపాటు ప్రయాస పడతారు. ఇంత ప్రయాసపడ్డా రచన ఎలా తేలింది, పాఠకలోకం ఎలా ఆదరించింది అన్నవి వేరే విషయాలు.

ఒక ప్రయోగం పదిమందినీ ఆకట్టుకోవాలంటే సిద్ధాంతబలం చూసుకుంటే చాలదు. సామాన్య పాఠకుడికి కావలసింది కథ. అందులో పాత్రలూ, పరిస్థితులూ, సంవాదాలూ ఏమాత్రం ఎబ్బెట్టుగావున్నా అతను భరించలేడు. పైగా సిద్ధాంత ప్రాతిపదికమీద రాసిన నవలల్లో సృజనాత్మక రచయితకన్న సాహిత్య విమర్శకుడే కొట్టొచ్చినట్టు కనిపిస్తూ ఉంటాడు. అంచేత పాఠకుడు పెదవి విరిచే ప్రమాదం ఎప్పుడూ ఉంటుంది.

సరే - దేని సాధక బాధకాలు దానివి. రచయిత తన ప్రయోగాలు మానుకోడు. ఈ దశాబ్దిలో వెలువడ్డ నవలల్లో అస్తిత్వవాదాన్ని ఆశ్రయించుకొన్నవికూడా

ఉన్నాయి. మనిషి మనుగడ వాటికి కేంద్ర బిందువు. ఇందుకు ఉదాహరణలు వడ్డెర చండీదాస్ 'హిమజ్వాల', ఆర్. ఎస్. సుదర్శనం 'సంసారవృక్షం.'

## 8. మానసిక సంకుచితత్వాల విచ్ఛేదన

పరిణామమన్నది సాహిత్యంలోనూ, సిద్ధాంత వాదాల్లోనూ వచ్చినంత తొందరగా సమాజంలో రాదు; సమాజ సమష్టిలో కనిపించేటంత తొందరగా వ్యక్తి జీవనంలోనూ రాకపోవచ్చు. పరిణామాన్ని అపలేమని తెలిసికూడా పాతకాలపు ఆలోచనల్నీ ఆచారాల్నీ పట్టుకు పాకులాడేవాళ్ళు ఉంటూనే ఉంటారు. అలాటి వాళ్ళలో పరివర్తన రావడానికి అనుభవమే గుణపాఠం నేర్పాలి తప్ప లెక్చర్లు పనిచెయ్యవు.

ఇటీవల వచ్చిన 'యాత్ర' నవలలో చాగంటి తులసి తీసుకున్న ఇతివృత్తం ఈ మాదిరిది: ఒరిస్సాలో ఉంటున్న ఒక తెలుగు కుటుంబం దీనికి కేంద్రం. అందులోనూ ఒక ముసలమ్మగారు ప్రధాన కేంద్రం. ఆవిడ, మనిషి ముసలిదే కాని ఆలోచనల్లో, అవగాహనలో ముసలికంపు లేదు. ఉద్యోగాలు చేసుకుంటున్న కొడుకూ కోడలితో, మనమలూ మనమరాళ్ళతో హాయిగా ఉండడమేకాదు; అందరూ హాయిగా ఉండాలని చూస్తుంటుంది. ఆవిడ స్నేహితురాలు మరో ముసలమ్మగారు, ఇంట్లో కొడుకుమీదా, కోడలిమీదా అలిగి కలకత్తా నించి చెప్పా పెట్టకుండా వచ్చిపడుతుంది. బొందిలో ప్రాణముండగా రాజీ పడనని భీష్మించుకున్న ఆ స్నేహితురాల్ని బహు నేర్పుగా, ఓర్పుగా, మార్చిన ముసలమ్మగార్ని అభినందించకుండా ఉండలేం; రచయిత్రి సామర్థ్యాన్ని ప్రశంసించకుండా ఉండలేం.

## 9. పారమార్థిక దృష్టి

జానెడు పొట్టకోసమో, మోపెడు డబ్బు కోసమో, మరోదాని కోసమో ఆరాటం ఎప్పుడూ ఉండనే ఉంది. వీటన్నిటికీ ఆవల ఒకానొక ప్రశాంతి, ఒకానొక తేజస్సు జీవితానికి పరమార్థం తెలుపుతున్నట్టుగా ప్రేమైక దృష్టి ప్రసరిస్తున్నట్టుగా అనుభూతి పొందే రచయితలున్నారు. దాని సంస్పందనకు అద్దంపట్టే రచనలుకూడా ఈ దశాబ్దిలో వచ్చాయి. చివుకుల పురుషోత్తం రాసిన 'ఏదిపాపం' 'సావిత్రి నవలలు ఇందుకు ఉదాహరణలు.

## ముగింపు

ఈ మాదిరిగా, ఈ దశాబిలో వెలువడ్డ నవలల ఇతివృత్తాల్లో వైవిధ్యముంది. సమాజంలో పెరుగుతున్న వేగం నవలల్లోకూడా కనిపిస్తోంది. నవలల పరిమాణం తగ్గుతూ వచ్చింది. సామాజిక పరిణామాలపట్ల స్పృహ ఎక్కువవుతూ వచ్చింది. ఇది హర్షించదగ్గ విషయం. □

# నవల –
# శిల్ప పరిణామం

## నవీన్

ఈ దశాబ్దిలో — అనగా 1970 నుండి 1980 వరకు తెలుగులో వెలువడిన నవలా సాహిత్యాన్నంతా నేను చదువలేదు. అందువల్ల ఈ దశాబ్దిలో నవలలు రాసి ప్రచురించిన తెలుగు నవలాకారులందరూ శిల్పం విషయంలో తమనవలల్లో కనబరచిన వైవిధ్యాన్ని వివరంగా, సూక్ష్మంగా విశ్లేషించే ప్రయత్నం ఈ వ్యాసం ద్వారా నేను చెయ్యటం లేదని పాఠకులు గమనించాలి. అయినా ఈనాటి నవలా సాహిత్యంతో నాకున్న పరిచయాన్ని పురస్కరించుకొని తెలుగు నవల ప్రారంభంనుండి ఈ దశాబ్ది వరకు శిల్పరీత్యా పొందిన పరిణామాన్నిగూర్చి స్థూలంగా ఒక పరిశీలన చెయ్యటానికి ప్రయత్నిస్తాను.

రచయిత తను చెప్పదల్చుకున్న విషయాన్ని ఒకప్రత్యేకమైన పద్ధతిలో చెప్పటాన్నే శిల్పం అంటాం. చెప్పదల్చుకున్న విషయాన్ని అందంగా, శక్తివంతంగా, స్పష్టంగా, ఉత్కంఠను రేకెత్తించే విధంగా చెప్పటంలోనే ఒక రచయిత ప్రతిభ ద్యోతకమౌతుంది. విషయం ఎంత గొప్పదైనా ఆ విషయానికి అక్షర రూపం ఇచ్చిన పద్ధతి పేలవంగా ఉంటే ఆ రచన విఫలమైపోతుంది. అందుకే ఏం చెబుతున్నాం అన్నదే కాకుండా ఎలా చెబుతున్నాం అన్న అంశం పట్ల రచయిత తగినంత శ్రద్ధ తీసుకోవాలి.

కొందరు అభ్యుదయ రచయితలు శిల్పం అన్నది అంతముఖ్యం కాదన్న,

వస్తువులోని నవ్యతను, గొప్పదనాన్ని బట్టే ఆ రచన ప్రమాణాన్ని నిర్ణయించాలని, శిల్పం వస్తువులోని అంతర్భాగమే కాని ప్రత్యేకమైంది కాదని వాదిస్తుంటారు. ఈ వాదనను బలపరచే కారణాలు కొన్ని లేకపోలేదు- కొందరు రచయితలు తమ వస్తు దారిద్ర్యాన్ని శిల్పం అన్న ముసుగులో దాచే ప్రయత్నం చేస్తారు- అందుకే చలం-

"తను చెప్పదలచుకున్న సంగతి తనకే స్పష్టంగా తెలీనప్పుడు తన చాతగాని తనాన్ని అర్ధ అస్పష్టతనీ ఛందస్సు చీరెల వెనుకా, అలంకారాల మధ్యాకఠిన పదాల బురాఖాలోను దాచి మోసగించాలని చూస్తాడు కవి" అన్నాడు.

లాక్షణికుల పుణ్యమా అన్నట్లు మన సాంప్రదాయ సాహిత్యంలో శిల్పానికి మితిమీరిన ప్రాధాన్యం ఇవ్వటం వల్ల శిల్పం పేరుతో రచయితలు సర్కస్ ఫీట్లు చెయ్యటం మొదలెట్టారు. అందువల్లనే అభ్యుదయ రచయితలకు శిల్పం అన్నమాట వింటేనే ఒక రకమైన యేవగింపు కల్గుతోంది. అయితే శిల్పం శిల్పం కోసమే కాదని, రచయిత తను చెప్పదల్చుకున్న విషయాన్ని పాఠకుల హృదయాల్లో శక్తివంతంగా ఆవిష్కరించే ప్రయోజనాన్ని సాధించటానికే శిల్పమన్న విషయం గుర్తుంచుకోవాలి. శిల్పాన్ని నిర్లక్ష్యం చేస్తే రచన నిర్జీవంగా తయారై పాఠకులకు దూరమై పోవటంవల్ల ఆ రచనవల్ల మనం ఆశించిన ప్రయోజనం నెరవేరదని అభ్యుదయ రచయిత మరచిపోకూడదు - వస్తువుకే అగ్రతాంబూలం ఇచ్చినప్పటికి శిల్పాన్ని నిర్లక్ష్యం చెయ్యకూడదు. ప్రతిభ ఉన్న రచయితల్లో వస్తువు, శిల్పం— ఈ రెండూ పసుగు పేకల్లా పెనవేసుకుపోతాయి.

పాశ్చాత్య సాహిత్య పరిచయంవల్ల మన సాహిత్యంలో నవల ఆవిర్భవించింది. ఇతర సాహితీ ప్రక్రియలకూ నవలకూ ఉన్న ప్రధానమైన తారతమ్యాన్ని మనం గమనించాలి. నవలకు "వాస్తవికత" అన్నది అత్యంత ప్రధానమైనది. స్థూలంగా నవలను "వాస్తవ జీవితాన్ని పోలిఉండే ఒక దీర్ఘమైన వచన రూపంలో సాగే కథ" అని నిర్వచించవచ్చు. ఈ నిర్వచనంలో "వాస్తవ జీవితాన్ని పోలి ఉండే" అన్నమాట చాలా ముఖ్యమైంది. పూర్వపు పురాణాల్లోను, ఇతిహాసాల్లోను, నాటకాల్లోను కనిపించే అభూత కల్పనలకు నవలలో చోటులేదు. నవలను చదువుతున్నంతసేపు పాఠకులు ఆ నవలలోని పాత్రలు, సంఘటనలు, సంభాషణలు, వాతావరణం—అన్నీ తాము తమ నిత్య జీవితంలో చూస్తున్నట్టుగానే ఉండాలి. ఇలా వాస్తవికత ఉట్టిపడే విధంగా రచయిత తన నవలకు రూపకల్పన చెయ్యాలి. నవలకు ఎలాంటి ఇతివృత్తాన్ని తీసుకున్నప్పటికి ఆ ఇతివృత్తాన్ని నవలగా మలచినప్పుడు పాఠకులకు 'ఇదంతా నిజంగానే జరుగుతోంది' అన్న భ్రమను కల్పించలేకపోతే ఆ నవల విఫలమై పోతుంది. ఇది జరగాలంటే నవలలోని శైలి, పాత్రలు, సంఘటనలు. సంభాషణలు మొదలైనవన్నీ అత్యంత సహజంగా, మన చుట్టూ వుండే సాంఘిక వాతావరణాన్ని ప్రతిబింబించేలా ఉండాలి.

ఇలా వాస్తవికతను పోషించటం అన్నది నవలా శిల్పానికి ప్రాణప్రదమైంది.

ఇక్కడే మనం మరొక అంశాన్ని కూడా గుర్తించాలి. మిగతా ప్రక్రియల పరిధికంటె నవల పరిధి చాలా విస్తృత మైనది. కవిత్వం, నాటకం, వ్యాసం మొదలైన సాహితీ ప్రక్రియల శిల్పాన్ని నవలా శిల్పంతో సమ్మేళనం చేసుకోవ టానికి అవకాశం ఉంది. సందర్భోచిత మైన వర్ణనలు, సంభాషణలు, వివరణలు నాటకీయత, పాత్రచిత్రణ మొదలైన వన్ని నవలల్లో ఉంటాయి. అందుకే ఒక గొప్ప నవల చదివినప్పుడు గొప్ప కవిత్వాన్ని, గొప్ప నాటకాన్ని చదివిన అనుభూతి కలుగుతుంది. ఇలా ఇతర సాహితీ ప్రక్రియల్లోని శిల్పసంపదను తనలో మేళవించుకోవటం వల్లనే ఆధు నిక యుగంలో నవలకు మిగతా ప్రక్రి యలకు లభించని అత్యధిక ప్రజాదరణ లభిస్తోంది. అందుకే సమకాలీన సాంఘిక జీవితాన్ని ఎంతో లోతుగా, ఎంతో విస్తృతంగా చిత్రించటానికి నవల కున్నంత అవకాశం మరే ఇతర సాహితీ ప్రక్రియకు లేకపోవటంలో ఆశ్చర్యం లేదు

నవలా శిల్పానికిముఖ్యమైనఅంశాలు: కథాకథన పద్ధతి, శైలి, సంభాషణలు, పాత్రచిత్రణ, నాటకీయత మొదలైనవి. వీటి విషయంలో తెలుగు నవలా సాహిత్యపు ప్రారంభదశలో వెలువడిన నవలలకు, ఈ దశాబ్దిలో వెలువడిన నవ లలకు మధ్య తారతమ్యాలను విశ్లేషిస్తే ఆ నాటికి ఈ నాటికి శిల్పరీత్యా మన నవల పొందిన పరిణామం అర్థ మౌతుంది.

ప్రారంభదశలో వచ్చిన నవలల్లో కథాకథన పద్ధతి ఐతిహాసిక పద్ధతిలో జరి గేది. ఈ పద్ధతిలో రచయితే రచనలో సర్వత్రా వ్యాపించి పాత్రల్ని పరిచయం చేస్తూ, ఆ పాత్రల మంచి చెడ్డల్నిగూర్చి కూడా తనే చెబుతూ కథ నడిపిస్తాడు. శైలి విషయంలో ఆనాటి నవలలు సుదీర్ఘ మైన వాక్యాలతో, కఠిన పదాలతో చాలా బరువుగా వుండేవి. సంభాషణలు, వర్ణ నలు కూడా చాలా దీర్ఘంగా సాగేవి. ఆ నాటి మన నవలాకారులు నవలకు వచన ప్రబంధమని పేరుపెట్టారు. అందుకే ఆనాటి నవలలు వచనరూపంలో ఉన్న ప్రబంధాలలాగే నిర్మించబడ్డాయి.

తెలుగులో తొలినవల అని చెప్ప బడుతున్న "రాజశేఖర చరిత్ర"కు ఆ నవలా రచయిత కందుకూరి వీరేశలింగంగారు రాసిన పీఠికలో ఇలా అన్నారు :

"ఈ వరకు మన యాంధ్ర భాషలో జనుల యాచార వ్యవహారములను దెలు పుచు నీతి బోధకములుగా నుండు వచన ప్రబంధము లేవియు లేకపోవుట యెల్ల వారికి విశదముయే యున్నది కదా! అయినను దేశభాషలలో నెల్లనూ మధుర మైనదని పేర్కొనబడిన మన తెలుగు భాషకటువంటి లోపమును తొలగింప వలయునని కొంతకాలము క్రిందట నేనీ గ్రంథమును వ్రాసి శ్రీ వివేకవర్ధనీ పత్రికాముఖమున ప్రకటించితిని."

నవల జనుల ఆచార వ్యవహారాలను తెలియజేయాలని, నీతి బోధకముగా ఉండాలని వీరేశలింగంగారు అర్థం చేసు

కొని ప్రబంధ పద్ధతిలో తన రాజశేఖర చరిత్రను రూపొందించాడు.

'రాజశేఖర చరిత్ర' ఈ క్రింది విధంగా ప్రారంభమౌతుంది:

"శ్రీ నాసికాంత్ర్యంబకముకడ కడు దూరమున నెక్కడనో పశ్చిమమున నొక్క యున్నత గోత్రమున జనన మొంది ఊర్మికా కంకణాదులమె ఱుంగులు తుఱుంగలింపఁ దనజననమునకుస్థానమైన భూభృద్వర పురోభాగముననే పల్లము లంబడి జారుచు లేచుచు గొంతకాల ముండి.... .... ...."

ఈ వాక్యం ఇలా ఒక పేజీన్నర వరకు సాగి సాగి "యాంధ్రదేశమున కలంకార భూతమైన రాజమహేంద్ర వరపుర సమీపమున మిక్కిలి వన్నె కెక్కి యుండెను" అని అంతమౌతుంది.

రాజమహేంద్రం పక్కన గోదావరి నది ప్రవహిస్తున్నదని చెప్పటానికి రచయిత ఇంత సుదీర్ఘమైన వర్ణనతో కూడిఉన్న వాక్యరచన చేశాడు. ఆనాటి నవలల్లో ఇలాంటి వర్ణనలు సర్వసామాన్యమే – ఇలాగే ఆనాటి నవలల్లో ప్రతీదీ రచయితే చెప్పటం వల్ల పాఠకుల ఆలోచనకేమీ మిగిలేది కాదు. నవలద్వారా తను ఇవ్వదల్చుకున్న సందేశాన్నికూడా రచయిత మరీ వాచ్యంగా చెబుతూ ఉండేవాడు. నవలలోని సంభాషణలు కూడా మొత్తం నవలలోని సహజమైన అంతర్భాగాలుగా కాకుండా వాటికవే ప్రత్యేకంగా ఉన్నట్టుగా సుదీర్ఘంగా సాగేవి నాటకీయత, పాత్ర చిత్రణ మొదలైనవి కూడా చాలా ఎబ్బెట్టుగా ఉంటుండేవి.

ఈనాటి నవలల్లో కథా కథన పద్ధతి చాలావరకు పూర్వపు ఐతిహాసిక పద్ధతిలోనే సాగుతున్నప్పటికి రచయితే ప్రతి విషయాన్ని తను చెబుతున్నట్టుగా కాకుండా పాత్రల ఆలోచనలద్వారా, సంభాషణల ద్వారా చెప్పించి పాఠకుడి ఆలోచనకు పదును పెటడం జరుగుతోంది. క్లుప్తమైనవర్ణనలు, సంభాషణలు ఈనాటి నవలల్లో చూస్తున్నాము. పాత్ర చిత్రణ విషయంలో కూడా ఈ నాటి నవలాకారుడు పూర్వంలా పాత్రల మంచి చెడ్డల్ని తనే చెప్పెయ్యటం కాకుండా ఆ పాత్రల ఆలోచనల ద్వారా, చేతల ద్వారా, మాటలద్వారా ఆ పాత్ర స్వభావాన్ని గూర్చి పాఠకుడే ఒక నిర్ణయాన్ని తీసుకునేలా చేస్తాడు. నవలద్వారా తను చెప్పదల్చుకున్న విషయాన్ని – దీన్నే పూర్వపు రచయితలు నీతి అనో సందేశమనో అన్నారు ఎక్కడా వాచ్యంగా చెప్పకుండా నవలంతా చదివాక పాఠకుడే ఆలోచించుకొని ఈ నవల ద్వారా ఈ రచయిత సమాజానికి ఇవ్వదల్చుకున్న సందేశమిది అని తెలుసుకునేలా చేస్తాడు ఇలా పాత్రలకు పాఠకులకు మధ్య రచయిత పదేపదే అగుపడకుండా సాధ్యమైనంత వరకు అదృశ్యమైపోవటం ఈనాటి నవలా శిల్పంలో కనిపించే ఒక ముఖ్యమైన లక్షణం – ఈ విధంగా ప్రారంభదశలో వచ్చిన నవలలలో ఈనాటి నవలలకు శిల్పరీత్యా ఒక క్రమ పరిణామం కనిపిస్తుంది.

ప్రారంభ నవలా శిల్పానికి ఈనాటి ఆధునిక నవలా శిల్పానికి మధ్య వారధిని నిర్మించిన నవలాకారులు చలం కొడవటిగంటి కుటుంబరావు, గోపీచంద్, బుచ్చి

బాబు మొదలైన వాళ్ళు. ఈ నవలా కారుల నవలల్లోనే తెలుగునవల పూర్వపు బరువైన శిల్పలక్షణాలను విడనాడి నేటి సహజమైన, సరళమైన ఆధునిక శిల్ప లక్షణాలను సంతరించుకుంది. ప్రారంభ దశలో యేర్పడిన లక్షణాలను పరిహరించుకొని నవల చాలా సహజంగా, సరళంగా మారటం వల్లనే మామూలు పాఠకులక్కూడా చాలా దగ్గరైంది. స్వాతంత్ర్యం తర్వాత దేశంలో చదువుకున్నవాళ్ళ సంఖ్య పత్రికల సంఖ్య పెరగటంతో నవలకు విశేషమైన ప్రజాదరణ లభించింది.

ఈనాటి నవలల్లోని భాష, వర్ణనలు, సంభాషణ ఎంత సహజంగా, సరళంగా ఉన్నాయో చెప్పటానికొక ఉదాహరణ :

వాసిరెడ్డి సీతాదేవి రచించిన 'మట్టి మనిషి' నవల ప్రారంభమైన ఈ తీరును గమనించండి:

"చుక్కలు వెలవెల బోతున్నాయి. తొలివెలుగులు మంచు తెరల్ని తోసుకుంటూ వస్తున్నాయి.

"ఏమోయ్ బూ ! ఎల్లమందా ! ఇంకా దిక్కులుచూస్తారేంరా?వూ:కానియ్యండి."

"అయ్యగారిదే ఆలస్యం"

"కూలీలంతా తలగుడ్డలు బిగించికుప్ప చుట్టూ కమ్మారు. సాంబయ్య పైపంచ నడుం చుట్టూ కట్టుకొని వరికుప్ప చుట్టూ మూడుసార్లు ప్రదక్షిణంచేసి కుప్పమీదకు ఎగబాకి నడికొప్పు పగలదీశాడు.

"కూలీలంతా తలా వో మోపు అందుకున్నారు.

"సాంబయ్య వరిమోపు వాటేసుకొని కుప్పమీదనుంచి దూకాడు.

"తొలివన అయ్యగారు నూరిస్తే ఈ ఏడు బంగారం రాల్తుంది" అన్నాడు ఎల్లమంద."

పైన నేను స్థూలంగా పేర్కొన్న లక్షణాలే కాకుండా నవలా శిల్పంలో ఇటీవలి కాలంలో సంభవించిన కొన్ని ప్రత్యేక లక్షణాల్ని ఇప్పుడు చూద్దాం.

కథాకథన పద్ధతి దృష్ట్యా నవలల్ని ఈ కింది విధంగా విభజించవచ్చు:

1. రచయితే కథ చెప్పే పద్ధతి: దీనినే ఐతిహాసిక పద్ధతి అంటున్నాము – ప్రారంభదశనుండీ ఈ దశాబ్ది వరకు వెలువడిన చాలా నవలల్లో పైన నేను వివరించిన మార్పులు కలిగినప్పటికి స్థూలంగా ఈ పద్ధతినే ఈనాటివరకు చాలామంది నవలాకారులు అనుసరిస్తున్నారు.

2. రచయితే కాకుండా నవలలోని యేదైనా ఒక పాత్రచేత కథ చెప్పించే పద్ధతి – దీనినే ఉత్తమ పురుషలో కథ చెప్పే పద్ధతి అంటున్నాము. ప్రారంభ నవలల్లో ఈ పద్ధతి ఎక్కువగా కనిపించకపోయినా ఈ దశాబ్దిలో వెలువడిన నవలల్లో ఈ పద్ధతి ఎక్కువగానే కనిపిస్తున్నది. ఈ పద్ధతిలో రాయబడిన నవల చదువుతున్న పాఠకులకు ~ నవలంతా ఆ కథ చెబుతున్న ప్రధాన పాత్ర యొక్క స్వీయచరిత్రలా కనిపించి ఇదంతా నిజమేనన్న భ్రాంతి కలిగే అవకాశం ఎక్కువగా ఉంటుంది – అందుకే చాలామంది ఆధునిక నవలాకారులు ఈ పద్ధతిని అనుసరిస్తున్నారు. చలం రచించిన 'మైదానం' నవలలో ఆ నవలలోని ప్రధానపాత్ర రాజేశ్వరి

కథంతా తనే చెప్పటంతో ఆ నవలను పాఠకులు రాజేశ్వరి స్వీయచరిత్ర అనుకున్నారు.

3. లేఖాపద్ధతిలో నడిచే నవలలు : నవలంతా ఆ నవలలోని ఇద్దరు ప్రధాన పాత్రల మధ్య నడిచిన లేఖల రూపంలో నడిపించవచ్చు - పూర్వంగాని ఇప్పుడు గాని ఈ పద్ధతిలో వెలువడిన నవలలు చాలా తక్కువే ననుకుంటాను - రంగనాయకమ్మ రచించిన 'కృష్ణవేణి' నవలను ఇందుకు ఉదాహరణగా చెప్పవచ్చు.

4. డైరీ రూపంలో నడిచే నవలలు : నవలలోని ఒక ముఖ్యపాత్ర రోజూ రాసుకున్న డైరీ రూపంలో కూడా నవలను నడిపించవచ్చు : ఈ తరహా నవలల్లో కూడా ఇదంతా నిజంగా జరిగిందేనన్న భ్రమను పాఠకుల్లో కల్పించటంలో రచయిత ఎక్కువ కృత కృత్యుడు కావటానికి అవకాశం ఉంది - పూర్వం ఉప్పల లక్ష్మణరావు రాసిన 'అతడు - ఆమె,' ఈ మధ్యనే వెలువడిన నేను రాసిన 'చీకటి రోజులు' ఇందుకు ఉదాహరిస్తున్నాను.

5. చైతన్య స్రవంతి పద్ధతిలో నడిచే నవలలు : మొత్తం నవలంతా ప్రధాన పాత్రల అంతరంగ చిత్రణగా - ఆ పాత్ర చైతన్యంలో, సుప్త చైతన్యంలో తలెత్తుతున్న అనేక జ్ఞాపకాల, ఆలోచనల, సంఘర్షణల పరం పరను చిత్రించే ప్రయత్నం ఈ తరహా నవలల్లో జరుగుతుంది. పాత్రల్ని బాహ్యంగా మాత్రమే కాకుండా ఆ పాత్రల అంతరంగంలో యేం జరుగుతుందో తెలుసుకోవటానికి ఈ తరహా నవలల్లో అవకాశం ఉంటుంది.

సాంప్రదాయ పద్ధతులతో విసుగెత్తిన నవలాకారులు ఈ పద్ధతిలో నవలల్ని రాయటానికి ప్రయత్నించారు- ఈ దశాబ్ది ప్రారంభంలో వెలువడిన 'అంపశయ్య' ఇందుకొక ఉదాహరణ.

స్థూలంగా పైన వివరించిన ఐదు రూపాల్లో నవలల్ని రచించటానికి అవకాశం ఉన్నప్పటికీ ఈనాటి చాలా మంది నవలాకారులు మొదటి రెండు రూపాలనే ఎక్కువగా ఆశ్రయిస్తున్నారు పూర్వం సామర్సెట్ మామ్ అన్నట్టు మంచి నవలలకొక ప్రారంభం, మధ్యమం, అంతం ఉండాలన్న సాంప్రదాయ సూత్రాన్నే మన నవలాకారులు పాటిస్తున్నారు.

ఈనాడు నవలలు రాస్తున్న నవలాకారుల్లో చాలామందికి అలా తప్ప మరొక విధంగా నవల రాయొచ్చునన్న అవగాహన ఉన్నట్టు కనిపించదు. అందుకే ఈ దశాబ్దిలో వచ్చిన నవలల్లో శిల్ప వైవిధ్యం అంతగా కనిపించదు. చదువుతున్న పాఠకులు కూడా నవలను ఒక మంచి కథను చెప్పే ప్రక్రియగానే చూస్తున్నారు తప్ప ఇతర అంశాలను అంతగా పట్టించుకోవటం లేదు. నవలల్ని ప్రచురిస్తున్న పత్రికల వాళ్ళుకూడా ఇలాంటి సగటు పాఠకుల్ని దృష్టిలో పెట్టుకునే వాళ్ళకు నచ్చుతాయనుకున్న నవలల్నే ప్రచురిస్తున్నారు. అందువల్ల సాంప్రదాయకమైన పద్ధతిలో కాకుండా కొత్తగా, ప్రయోగాత్మకంగా నవలల్ని

రచించే నవలాకారుల సంఖ్య రోజు రోజుకూ తగ్గిపోతోంది.

స్థూలంగా ఐతిహాసిక పద్ధతినే అనుసరించినప్పటికి ఈ దశాబ్దంలోని ప్రముఖ నవలాకారుడైన రా.వి. శాస్త్రిలో ఒక ప్రత్యేకమైన శిల్పం కనిపిస్తుంది. ఆయన తన నవలను సుదీర్ఘమైన సంభాషణలతో, అసంఖ్యాకమైన పాత్రలతో నింపేసాడు—ఈ కారణం చేతనే ఆయన నవలల్లో సంభాషణలు, పాత్రలే తప్ప Plot ముందుకుసాగదు—"రాజు—మహిషి" "రత్తాలు—రాంబాబు"— ఈ రెండు నవలల్లోను ఇదే లక్షణం కనిపిస్తుంది. అందువల్ల ఈ రెండు నవలలు కూడా అసంపూర్ణంగా నిలిచిపోవడంలో ఆశ్చర్యం లేదు.

ఈదశాబ్దంలోనే వెలువడిన శిల్పరీత్యా వైవిధ్యమున్న నవలల్లో పేర్కొనదగింది వడ్డెర చండీదాసుగారి "హిమజ్వాల." పాత్రల మనో ప్రపంచానికి అద్భుతమైన అక్షరరూపం ఇస్తాడు ఈ నవలా రచయిత.

ఈ వ్యాసాన్ని ముగించే ముందు భాషాపరంగా మన నవలల్లో కొందరు రచయితలు చేస్తున్న ప్రయోగాల్ని గూర్చి రెండు మాటలు— ఈనాడు వెలువస్తున్న నవలలన్నింటిలోను మన వార్తాపత్రికల్లో రాయబడే వ్యావహారిక భాషనే ఉపయోగిస్తున్నారు. అలా కాకుండా తెలుగు దేశంలోని కొన్ని ప్రాంతాల్లో ప్రజలు ఒక ప్రత్యేకమైన యాసతో, ఆ ప్రాంతానికే పరిమితమైన కొన్ని పలుకుబళ్ళతో మాట్లాడే మాండలిక భాషలో నవలలు రాయాలన్న ఉబలాటం కొందరు రచయితల్లో కనిపిస్తున్నది. ఇంతకు ముందు నవలల్లో ప్రాంతీయ భాష లేదనికాదు. ఉదాహరణకు రా. వి. శాస్త్రి నవలల్లో విశాఖపట్నం జిల్లాలో మాట్లాడే భాష' దాశరధి రంగాచార్య నవలల్లో తెలంగాణా జిల్లాలలో మాట్లాడబడే భాష పుష్కలంగా కనిపిస్తుంది. కాని ఈ మాండలికాలు కేవలం పాత్రల సంభాషణల్లో మాత్రమే కనిపించేవి. కాని ఇటీవల కొందరు రచయితలు మొత్తం నవలంతా మాండలికంలో రాసే ప్రయత్నం చేస్తున్నారు. పోరంకిదక్షిణామూర్తిగారు ఈ తరహా నవలలకు ఆద్యుడనుకుంటాను. ఇటీవలనే అల్లం రాజయ్య రచించిన "కొలిమంటుకున్నాది" నవల మొత్తం తెలంగాణా మాండలికంలో రచించబడింది— తెలుగు నవలల్ని చదివే పాఠకులు మొత్తం తెలుగు దేశమంతా వ్యాపించి ఉంటారన్న సంగతి మనం మరచిపోకూడదు. ఒక ప్రాంతానికే పరిమితమైన భాషలో మొత్తం నవలంతా రాసేస్తే వేరే ప్రాంతాల్లో ఉన్న పాఠకులకు ఆ నవలను చదవటం చాలా ఇబ్బందిగా ఉంటుంది — కాబట్టి మాండలికాలను ఆయా పాత్రల్ని, ఆ పాత్రలు నివసిస్తున్న ప్రాంతాల్ని బట్టి సంభాషణల్లో మాత్రమే ఉపయోగించటం సముచితంగా ఉంటుందని ఈ వ్యాసకర్త దృఢమైన అభిప్రాయం.

□

---

"పెన్ను, కాగితం, యింకు, కాస్త తీరికా వుంటే ఎవరైనా నవల రాసెయ్యొచ్చు."

—డబ్ల్యు. హెచ్. హడ్సన్

# నవల పరిణామ క్రమంలో పాత్రోన్మీలనం

నవలారచనలో పాత్రల ప్రాముఖ్యం ఎటువంటిది, నవలా రచయితకు, పాత్రకు గల సంబంధం ఏమిటి? అనే ప్రశ్నకు ఎలిజబెత్ బొవెన్ ఇలా సమాధానం చెప్తోంది. "రచయిత పాత్రలను సృష్టించడు. వాటిని వెదికి పట్టుకుంటాడు. ఒక రకంగా చూస్తే అవి పరిసరాల ప్రభావంతో రచయిత మనస్సులో రూపు దిద్దుకుంటాయి. అవి మసక వెలుతురులో ఎదుటి బెంచీమీద కూర్చొని తమను గురించి తాము రచయితకు చెప్పుకునే సహప్రయాణీకులవంటివి.[1]"

తెలుగు నవల జన్మించిన తొలి రోజులలో, ఆనాటి పరిస్థితులననుసరించి సంఘసంస్కరణ ప్రధానోద్దేశం కావటంచేత ఒక లక్ష్యంతో, ఒక మార్గాన్ననుసరించి కథ సాగితే పాత్రలుకూడా ఆ లక్ష్యానికనువుగానే రూపుదిద్దుకున్నాయి. రచయిత దృష్టి పీడితవర్గ సముద్ధరణ. అనేక కారణాలవలన సమాజంలో బలహీనులుగా, తరతరాల దాస్యానికి గురియైన వ్యక్తుల జీవిత చిత్రణ సహజత్వానికి అద్దమే అయినా, అన్ని కథలలోని ముగింపు ఒకే లక్ష్యంపై కేంద్రీకృతమై వుండటం కన్పిస్తుంది. ఇది కువిమర్శ గాని, రంధ్రాన్వేషణగాని కాదు. ఆనాటి పరిస్థితులు, లక్ష్యసాధన అటువంటివి. అక్కడ పాత్రోన్మీలన కన్నా సాంఘిక ప్రయోజనం ప్రధానం. వీరేశలింగంపంతులుగారి సంఘసంస్కరణకు గాని, విశ్వనాథ సత్యనారాయణగారి సంప్రదాయరక్షణ దీక్షకుగాని, చలం విప్లవ భావ ప్రకటనకు, స్వేచ్ఛావాదానికి గాని బహుళ జనాదరణ పొందిన నవల ముఖ్యసాధనం అయింది వీరి నవలల్లో పాత్రలులక్ష్యసాధనకు ఆలవాలాలు ఒక్క చలం తప్ప మిగిలినవారి పాత్రలు సహజత్వానికి ప్రతీకలైనప్పటికి, అవి ఒక ఆదర్శానికి చిహ్నాలుగానే తప్ప ప్రత్యేక వ్యక్తిత్వం గలవి అని చెప్పటానికి అవకాశం తక్కువ. పాత్ర సృష్టి అనే అంశాన్ని ప్రత్యేకంగా భావించి, ఆ వ్యక్తిత్వ చిత్రణలో ఒక సామూహికత్వాన్ని ప్రప్రథమంగా తెలుగు నవలలో చూపినది శ్రీ కొడవటిగంటి కుటుంబరావు. అంతకుపూర్వం సమాజగతమైన మార్పు అవసరమని భావించి రచనలు వెలువడితే, సమాజంలో మార్పుతోపాటు వ్యక్తిలో పరిస్థితులు, పరిసరాలకు అనుగుణంగా రావలసిన మార్పుయొక్క అవసరాన్ని మొట్టమొదట ప్రత్యేకంగా చూపినది కొడవటిగంటి. వీరి నవలల్లోను సంఘర్షణ వుంది, మారీ మారని సమాజం వుంది,

డి. విద్యేశ్వరి

పైకి ఒకే రకంగా కన్పించే సమస్యలూ ఉన్నాయి. వీటిని ఎదుర్కొనటంలో ఎవరి మార్గం వారికి ప్రత్యేకంగా ఉండాలి అంటూ ఏకత్వంలో భిన్నత్వాన్ని చూపి, పాత్ర అనేది రచయిత సృష్టిగా కాకుండా రచయిత వెంట తిరిగే సహ ప్రయాణికుడి వలె నిలిపి, ఆ పాత్ర పాఠకులను వెన్నంటి ఆలోచింపజేసేదిగా మలచినది కొడవటిగంటి. కొత్తకోడలులో సరోజిని, ప్రేమించిన మనిషిలో పద్మ, గోపాలం, అనుభవంలో పార్వతి, చదువులో సుందరం, పంచకల్యాణిలో అయిదురుగు యువతులు— ఈ పాత్రలన్నీ సమకాలీన సాంఘిక జీవన విధానానికి ప్రతినిధులుగా ఉంటూనే వాటి ప్రత్యేకతను నిలుపుకుంటాయి. సన్నివేశాలు, సంఘటనలు, సమస్యలు, ఆయా పాత్రల బాహ్యజీవితంలో మార్పుని తేవటమేకాక, పాత్ర మనోన్మీలనను స్పష్టంగా వ్యక్తంచేస్తుంటాయి. అనేక సంఘటనల ప్రభావంచేత సహజ ప్రకృతికి ఒక స్థిరమైన రూపాన్ని దిద్దుకుంటూ ఒక ప్రత్యేకతతో నిలిచిపోవటమే పాత్రోన్మీలనం (Development of charactor) అని నిర్వచిస్తే ఇది తెలుగు నవలాసాహిత్యంలో కొడవటిగంటితోనే ప్రారంభమయిందని చెప్పాలి.

అటుతరువాత వెలువడిన నవలల్లో తాత్విక, మనస్తత్వశాస్త్ర ప్రభావము, రాజకీయ సమస్యా చిత్రణలు ప్రధానాంశాలైనప్పటికి, పాత్రచిత్రణ విషయంలో రచయితలుకొడవటిగంటి చూపినమార్గాన్ని మరింత విశాలంగా తీర్చిదిద్దారు. దాని ఫలితమే రాచకొండ - సుబ్బయ్య (అల్పజీవి); గోపీచంద్ - సీతారామశాస్త్రి (అసమర్థుని జీవయాత్ర) బుచ్చిబాబు దయానిధి (చివరకు మిగిలేది); దాశరధి-చిల్లరదేవుళ్ళులో దొర, కరణం మొదలయినవారు; ముప్పాళ- చదువుకున్న కమల- మొదలైన పాత్రల సృష్టి. వీరందరు ఒక్కొక్క రకం సంఘర్షణకు గురై, కథను నడిపిన వారయినప్పటికీ, ఆ సమస్యా పరిష్కారంతో, సంఘర్షణానంతరం పాఠకుని దృష్టినుండి జారిపోయే వారుకాదు. సంఘర్షణ లేదా సమస్య, పాత్ర రెండూ ఒకదానితో ఒకటి పెనవేసుకొని పాఠకుని మనోవీధిలో విహరిస్తాయి.

అయితే ఈ పాత్ర చిత్రణ, పాత్రోన్మీలన అనేవి కథాగమనానికన్నా ముఖ్యస్థానంవహిస్తాయా అనే ప్రశ్న రావచ్చును. అసలు కథంటే ఏమిటి? "తరువాత ఏం జరిగింది?" అనే ప్రశ్నకు సమాధానమే కథ అన్నారు విమర్శకులు. మరి పాత్రలంటే ఏమిటంటే, "ఎవరికి అలా జరిగింది?" అనే ప్రశ్నకు సమాధానం అని చెప్పాలి. అంటే ఆ "ఎవరు" లేనిదే "ఏం జరిగింది?" అనే ప్రశ్న లేదు- ఎవరయినా వున్నా ఏమీ జరగకపోతే చెప్పుకోవలసిన అవసరమే ఉండదు. ఈ పాత్ర-కథ అనే రెండు ముఖ్యాంశాలకు గల సంబంధాన్ని సుప్రసిద్ధ నవలా రచయిత Henry James ఇలా నిర్వచించాడు.

"what is a charactor, but the determination of incident,

what is incident but the illustration of charactor."[2]

క్రమంగా సాహిత్య చరిత్రలో ఒక శతాబ్దాన్ని చూసిన తెలుగు నవల రకరకాల పోకడలను సంతరించుకుంటూ వచ్చింది. ప్రస్తుతం ఈ విస్తృతపరిధిని కుంచించి ఒక దశాబ్దంలోని నవలల్లో పాత్రోన్మీలన అనే అంశాన్ని పరిశీలిద్దాం. ఈ దశాబ్దంలో వెలువడిన నవలలు సంఖ్యలో చూస్తే గర్వించ దగినవిగానే ఉన్నాయి. ప్రస్తుతాంశానికి అనువుగా విభజించి చూస్తే వెలువడుతున్న నవలల్లో వైవిధ్యం ఎంతవరకు ఉన్నదన్న ఆలోచన కలుగక మానదు. హెన్రీ జేమ్స్ ఉత్తమ నవలను నిర్వచించిన విధం పరిశీలిస్తే ఈనాటి నవలలు ఎన్ని విమర్శకు నిలువగలవన్నది సందేహం.

ముందుగా నవలల్లోని వైవిధ్యాన్ని పరిశీలించితే ఈ దశాబ్దంలోని నవలలను మూడు రకాలుగా విభజింపగలమని తోస్తోంది.

మొదటి రకం - శాస్త్రీయ సిద్ధాంతాల దృక్పథంతో సాగిన నవలలు ఉదా: *సంసార వృక్షం, హిమజ్వాల, అంపశయ్య* వంటివి. ఈ నవలల్లో సిద్ధాంత దృష్ట్యా తప్ప దైనందిన జీవితానికిగాని, నిత్య సంఘర్షణకుగాని ప్రతిబింబాలుగా గ్రహించి, సార్వజనీనమైన సమస్యలకు తద్వారా సంభవించు పాత్రోన్మీలనాన్ని విమర్శించగల అవకాశం కొంత తక్కువగా వుంటుంది. ఒక సిద్ధాంతాన్ని దృష్టిలో పెట్టుకునిగాని లేదా అదే మూలాధారంగా భావించి చెప్పాలనేదిగాని రచయిత ముఖ్యోద్దేశం కాకపోవచ్చును. కాని అతని అంతరాంతరాలలో నిక్షిప్తమై యున్న జిజ్ఞాస, నవల రూపంలో వెలువడ్డాక, దాని స్వరూపంలో కొంత మార్పు పొందుతుంది. అనేకరకాల కాంప్లెక్స్‌లతో నిండిన వ్యక్తి అంతరంగ పోకడలు పాత్ర వికాసానికి ఆధారాలై వుంటాయి. సిద్ధాంత పరంగా విశ్లేషించడానికి అనువైన ఈ నవలల్లోని పాత్రలు కంటికి కనిపించే భౌతిక రూపాలు గల వ్యక్తులుగాకన్న, ఆయా సందర్భానుసారం మార్పుచెందు మనోగతికి రూపకల్పనలుగా నిలుస్తాయి. ఇవి సాధారణ పాఠకులను ఆకర్షించి ఆకట్టుకునే నవలలు, పాత్రలుకావు. ఈ రకం నవలలు విమర్శనాత్మక దృష్టిని, సాహిత్య విలువలను విస్తృతం చేస్తాయి.

ఇక రెండవ రకానికి చెందిన నవలలు – ఇవి ఒక రకంగా చెప్పాలంటే తెలుగు నవల తొలిదశలో పుట్టిన నవలల వంటివి కాని, లక్ష్యసాధనలో వాటికి వీటికి చాలా భేదం వుంది. ఆనాడు సంఘ సంస్కరణ ప్రధానలక్ష్యం గనుక నవలల్లో సమస్య, దాని కనువైన కథ, ఆ కథకు ఆధారమైన పాత్రలు, చివరకు పరిష్కారం అతి సహజంగా వర్ణింపబడేవి. ఈనాటి ఈ రకం నవలల్లో అటువంటి లక్ష్యం ఏదైనా వున్నట్టుగా స్పష్టాస్పష్టంగా తోచినప్పటికి, ఊహ, ఆదర్శం పేరుతో ఆ లక్ష్యం అనేది పూర్తిగా మరుగున పడిపోతున్నది. సమాజంలోని అస్తవ్యస్తతను, కుళ్ళును

బయట పెట్టాలని, ఆదర్శవంతమైన జీవితాన్ని సృష్టించాలనే దృష్టితో ప్రారంభమయ్యే ఈ నవలల్లో సామాన్యంగా ఆకలి, దారిద్ర్యం, అధికార దౌష్ట్యం విషాదాంత నవలలకు ఆధారాలైతే, ప్రేమ, పెళ్ళి, వ్యభిచార సమస్య, వర్ణాంతర వివాహాలు, ఇవి అధికభాగం సుఖాంతాలకు, అక్కడక్కడ విషాదాంతాలకు మూలాలవుతున్నవి. వీటితోపాటు నల్లబజారు, దొంగ వ్యాపారాలుకూడా కథా వస్తువులౌతున్నాయి. ఈ నవలల్లో కథలో అనేక మలుపులు, సంభాషణలోచమత్కారాలు, ఒక్కొక్కసారి చమత్కారం అని భ్రమపడే అనౌచిత్యాలు ముఖ్యాంశాలు. ఈ నవలల్లో ఏదో ఒక సమస్య సూచింపబడినప్పటికీ, పరిష్కారం వంటిది ముగింపులో రచయితచూపినప్పటికి, అనేక సందర్భాలలో అది సరియైనది, సహజమైనది అవునా కాదా అనే సందేహం వస్తుంటుంది. కొన్ని వేళల ఏ పరిష్కార సూచన లేకుండా కేవలం సమస్యా చిత్రణ మాత్రమే ఉండే సందర్భాలు ఉన్నాయి. ఈ రకం నవలల్లో పాత్రలు సజీవ వ్యక్తులుగా కాక రచయిత చేతులో మైనపు ముద్దలవలె, ఒకే మూసలోని ముద్రలవలె వుంటాయి. ఆ పాత్రలలోనే మరికొన్ని విప్లవాత్మక పాత్రలుగా భ్రమపడదగిన పాత్రల రూపంలో అక్కడక్కడ దర్శన మిస్తుంటాయి. ఆ విప్లవధోరణిలో తొందరపాటు తప్ప, వివేకం. వివేచన కన్పించదు. అంతిమ విజయం విప్లవానిదా, కాదా అనే విషయం రచయిత ఇష్టా ఇష్టాలపైన ఆధారపడినట్లుగా కన్పిస్తుందీ రకం నవలల్లో. వీనిలో పాత్రోన్మీలనం గురించి చెప్పుకునేది ఏమీ ఉండదు. ఆ పాత్రల సంపూర్ణ వ్యక్తిత్వ చిత్రణ కాక, తాత్కాలికమైన ప్రకృతి ప్రేరేపణలు, ఆవేశాలు మాత్రమే ద్యోతకమౌతాయి. ఈ దశాబ్దంలో ఈ రకం నవలలు అధిక సంఖ్యలో వెలువడుతన్నాయనటంలోనుఅధిక జనామోదాన్ని పొందుతున్నాయనటంలో ఏ మాత్రం సందేహం లేదు. దీనికి కారణం నవల సాహిత్య ప్రక్రియగా కన్న సినిమా, నాటకం వంటి కాలక్షేపం కావటమే ననిపిస్తోంది.

ఇక మూడవ రకం నవలలు సమకాలీన సమాజాన్ని, సమస్యలను, సంఘర్షణలను చిత్రిస్తూనే పాత్ర వికాసాన్ని ప్రధానంగా గమనిస్తూ పరిష్కారాన్ని కూడా సూచించేవి. ప్రస్తుత చర్చనీయాంశానికి సరియైన ఉదాహరణ లని చెప్పదగినవి. ఇటువంటి నవలలు కొంతవరకు సంతృప్తికరమైన సంఖ్యలో వెలువడుతున్నవని చెప్పగలగటంఆనందకరమైన విషయమే అయినా స్థలాభావం వలన ప్రస్తుతం 3,4 నవలలనుమాత్రమే ఉదాహరణలుగా గ్రహించటం జరిగింది. ఈ రకం నవలలు తెలుగు నవల పురోగమనానికి, ప్రయోజనానికి సాక్ష్యాలని చెప్పదగినవి.

డా॥ కొమ్మూరి వేణుగోపాలరావు

సూర్యుడు దిగిపోయాడులో, ఒకే తరానికి చెందినప్పటికి, ఇంగువ కట్టిన గుడ్డలా ఉపయోగం, విలువా లేకుండా మిగిలిపోయిన రాఘవ. మారుతున్న జీవనవిధానంలో మనిషి మారటం అనేది గు ర్తించిన మూ ర్తి- ఈ రెండు పాత్రలు ఉ త్తమ పాత్ర చిత్రణకు, వికాసానికి మంచి ఉదాహరణలు. మూ ర్తిలోని ధైర్యం విప్లవం కాదు- రాఘవలోని అధీరత్వం మంచితనం కాదు. మూ ర్తి లక్షణం చైతన్యం అయితే, రాఘవ నైజం పిరికితనం. ఈ రెండు పాత్రల పరిపూర్ణ వికాసం కథాగమనానికి మరింత బలాన్నిచ్చింది.

వీరిదే మరొక నవల ఈ దేశంలో ఒక భాగమిది పాత్రోన్మీలనకు మరొక ఉదాహరణ. భిన్నవ్య క్తిత్వాలకు ప్రతిరూపాలైన పాత్రలు ఈ నవలలో దర్శనమిస్తాయి. ఈనాటి అనేక సమస్య లకు మూలమై సమైక్యతకు అవరోధంగా వుండే లోపం ఈ సమాజవ్యవస్థలోనే ఉన్నదని సన్నితంగా చూపిన ఈ నవ లలో, డాక్టరు రంగారావు, కొడుకులు, కోడళ్లు అంతా మంచివారే. అయితే కాలానుగుణంగావచ్చే వ్య క్తిత్వ విలువల కాంక్ష వాళ్ళమంచితనాన్ని విపరీతపు ఆవేశానికి ఎలా లోబరుస్తాయో ప్రతి పాత్రలోను స్పష్టంగా కన్పిస్తుంది.

మల్లాది వెంకటకృష్ణమూ ర్తి రచించిన రేపటి కొడుకు పాత్ర వికాసానికి, పరిపూర్ణ చిత్రణకు మరొక మంచి ఉదాహరణ. మామూలు వ్య క్తులైన మనుష్యులు అతి సాధారణమైన జీవితం గడుపుతుంటే, ఆ నిశ్చలమైన సరస్సులో ఒకరాయి పడుతుంది. ఒక పరిష్కారం తోచని అయోమయ మనిపించే సమస్య తలెత్తుతుంది. తనవలన ఒకసంసారంలో కలతలు రేగరాదని భావించి ఛాయ రహస్యాన్ని తనతో మట్టిలో కలిపేస్తే, ఒక వ్య క్తి అమాయకపు పట్టుదలకు, పరొకవ్య క్తి స్వార్థానికి, మొండితనానికి ఒక పసివాడు అనాథకాకూడదనే దృఢ సంకల్పంతో సమస్యను ఎదుర్కొని ఒక పరిష్కారాన్ని అన్వేషించి, ఫలితానికి వేచిచూడగల నిబ్బరం చూపింది శాంత. ఆ ఇంటి కోడలు. మానవ సహజమైన ఆవేశాలు, బలహీనతలు ఎన్నిఉన్నా సాంఘిక కట్టుబాట్లకు లోబడివుండి, సమస్యను ఎదుర్కొని, పరిష్కారాన్ని అన్వేషించగల ధైర్యం ఈ అ స్తవ్య స్త స్థితిలో ఎంతో అవసరమన్న విషయం శాంత పాత్ర వలన స్పష్టమౌతుంది. శాంత, శాంత మామగారు ఈ రెండు పాత్రలలో ఎవరికి మహోన్నతమైన ఆశయాలుగాని, ఆదర్శాలుగాని లేక పోయినప్పటికి వివేకంతో ఆలోచించగల శ క్తి, ఎదుటివారిలో సంక్షోభాన్ని సహృదయతతో అర్థం చేసుకోగల నేర్పు వున్నాయి. మొదట్లో సూచనగా కన్పించిన ఈ లక్షణాలు క్రమంగా పాత్ర పోషణలో వికసించి చివరకు వచ్చేవరకు ఆ పాత్రల వ్య క్తిత్వాన్ని స్పష్టంగా చూపిస్తాయి. అదే విధంగా మిగిలిన పాత్రలలో బలహీనతలు కూడా స్పష్టంగా కన్పిస్తా యీ నవలలో.

ఈ పాత్రోన్మీలనం అనేది కేవలం మంచితనం, సమస్యా పరిష్కారం వైపే కాక, మానవ సహజమైన బలహీనతలలో

కూడా ఏ విధంగా పరిపక్వతను పొందుతుందోనన్నది పరిశీలించడానికి కవనశర్మ రచించిన తల్లిచాటుబిడ్డ మంచి ఉదాహరణ. ప్రస్తుత సామాజిక, ఆర్థిక పరిస్థితులనుబట్టి కుటుంబ సంబంధమైన పరిధులు కొన్ని బాహ్యంగా సంకుచితమౌతున్నప్పటికీ, మానసికంగా ఆ పరిధిని విశాలం చేసుకోకపోతే వచ్చే పరిణామాలు అనూహ్యం. ఒకరకం స్వార్థంతో అన్నపూర్ణమ్మ కొడుకును బంధిస్తే, ఆ బంధాలను అతడు తనకు కావాలనుకున్న మార్గంలో వినియోగించుకుంటాడు. తల్లి నేర్పిన పాఠాన్ని తల్లికే తిప్పి చెప్పిన ఘనుడు. అదే వాతావరణంలో పుట్టి పెరిగినా సత్సాంగత్యం వలన లక్ష్మి జీవితానికి, ఆత్మీయతకు అర్థం తెలుసుకుని ఒక అనాథను తల్లిగా ఆదరించి తన పరిధిని విశాలం చేసుకుంటుంది. ప్రతిపాత్ర ప్రత్యేకతనిలుపుకోగలిగినట్లు రూపొందింపబడిన నవల ఇది.

సంఘర్షణ ఫలితంగా పాత్ర చిత్రణలో వికాసాన్ని, పురోగమన మార్గంలో ముగింపును చూపిన మరొక నవల వాసిరెడ్డి సీతాదేవి *ఉరిత్రాడు*. ప్రధానపాత్ర కరుణ, ఆమె వదిన శారద, ఈ రెండు పాత్రల క్రమవికాసం ఈ నవలలో అతిసహజంగా చిత్రించబడింది. ఈ నవలలో సమస్య, పరిష్కారం, పాత్ర చిత్రణ సమానమైన ప్రాధాన్యతతో సాగిపోతాయి.

ఇలా పరిశీలిస్తూపోతే పాత్రోన్మీలనపై శ్రద్ధ చూపిన నవలలు కన్పిస్తున్నా అక్కడక్కడ కొంత నిరుత్సాహం ఎదురుకాక తప్పటంలేదు. చక్కని పాత్రపోషణతో, బలమైన కథతో నవల ప్రారంభమై కొన్నిచోట్ల ఏకారణం వల్లనో కొన్ని సెంటిమెంట్స్‌కు లోనుకావటం కూడా ఈ నవలల్లో కన్పిస్తోంది. ఇటువంటి నవలల వలన సామాజిక ప్రయోజనంగాని, సాహిత్య గౌరవంగాని లభిస్తాయని చెప్పటం కొంచెం కష్టం. ప్రారంభంలో కన్పించిన ఉత్సాహం ఆద్యంతంసాగితే ఈ కాస్త నిరుత్సాహం కూడా తొలగిపోతుంది. ఉత్తమ నవలలని చెప్పదగిన వాని సంఖ్య వృద్ధి పొందుతుంది.

పాత్రపోషణ లేకుండా కథ నడవదనే విషయం అందరికీ తెలిసినా పాత్రోన్మీలనం లేదా వికాసం మరింత శ్రద్ధ వహించవలసిన అంశమని నవలా విమర్శకులందరు ఏకగ్రీవంగా అంగీకరించారు.

అందువలననే "The story teller is no painter, but he must leave images in the reader's mind.[3] అని తీర్మానించారు.

---

1. A STUDENTS GUIDE TO 50 EUROPEAN NOVELS Ed. Abraham H. hass and Brooks wright.Newyork.(Introduction - How to read a novel P XIV).
2. THE FUTURE OF THE NOVEL - Henry James. Newyork (P. 15)
3. అధోజ్ఞాపిక 1. పుట 17.

□

# తెలుగు నవల-
# మనోవిశ్లేషణ

ప్రపంచ సాహిత్య చరిత్రలో ఇరవయ్యవ శతాబ్దానికి ఒక ప్రత్యేకమైన స్థానమున్నది. సాహిత్యరంగంలో ఈ శతాబ్దంలో జరిగినన్ని ప్రయోగాలు మున్నెన్నడూ జరగలేదంటే అతిశయోక్తి కాదు. ఈ ప్రయోగాలలో ఒక భాగమే మనోవైజ్ఞానిక నవల ఆవిర్భావం. ఈ తరహా నవలలు ఆవిర్భవించడానికి ప్రధానమైన కారణం ఫ్రాయిడ్, అడ్లర్, యూంగ్ మొదలయిన మనస్తత్వశాస్త్ర వేత్తల సిద్ధాంతాల ప్రభావం. ఫ్రాయిడ్ ప్రతిపాదించిన 'సైకో ఎనాలిసిస్' సిద్ధాంతంలోని ఈడిపస్‌కాంప్లెక్స్, కేస్ట్రేషన్ కాంప్లెక్స్ సిద్ధాంతాలు, "లిబిడో" సిద్ధాంతం- "యిడ్" "యిగో"ల మధ్య జరిగే సంఘర్షణ వివరణ-మనిషిలో అతనికి తెలియకుండానే అణచివేయబడివుండే శృంగారాది భావాల గురించి ఆశ్చర్యదాయకమైన వివరాలను బయటపెట్టాయి. "అచేతన" స్వరూపాన్ని అర్థం చేసుకొనేందుకు అవకాశాన్ని కల్పించాయి. యిదేవిధంగా అడ్లర్ ప్రతిపాదించిన "యిండివిడ్యువల్ సైకాలజీ" లోని ఆత్మ న్యూనతాభావం- యూంగ్ ప్రతిపాదించిన "ఎనలిటికల్ సైకాలజీ" లోని "కలెక్టివ్ అన్‌కాన్షస్" సిద్ధాంతం కూడా మానవుడి చిత్రవిచిత్ర ప్రవర్తనలపై కాంతికిరణాల్ని ప్రసరింపచేశాయి. వీటన్నింటి ప్రభావమూ మనోవైజ్ఞానిక నవలలపై వుంది. "సైకో ఎనలిటికల్" సిద్ధాంతాల ప్రేరణ జేమ్స్ జాయిస్, వర్జీనియా వుల్ఫ్‌లవంటి నవలాకారులచేత "చైతన్య స్రవంతి" (Stream of consciousness) అనే కొంగ్రొత్త నవలాశిల్పాన్ని ఆవిష్కరింపచేస్తే, డి. హెచ్. లారెన్స్ వంటి నవలాకారులు పాత్రల అంతరంగ సంక్షోభాలకు సంప్రదాయ శిల్పంలో అద్భుతమైన రీతిలో అద్దం పట్టారు.

మొదటి ప్రపంచ యుద్ధం తర్వాత నవలల ఇతివృత్తాలలోను, శిల్పంలోనూ, సాహిత్య ప్రపంచంలో వచ్చిన మార్పులు, రెండో ప్రపంచయుద్ధం ముగిసేనాటికి క్రమక్రమంగా తెలుగు నవలా సాహిత్యాన్ని పలకరించడం ప్రారంభించాయి. అయితే-ఆంగ్ల సాహిత్యంలో వెలువడినట్టుగా తెలుగులో అధికసంఖ్యలో మనోవైజ్ఞానిక నవలలు వెలువడలేదు. అచ్చంగా మనోవైజ్ఞానిక నవలలు అని చెప్పుకో

కోడూరి శ్రీరామమూర్తి
(లెక్చరర్, రాజాస్ కాలేజి బొబ్బిలి)

దగ్గవి అప్పటికీ, యిప్పటికీ బహుస్వల్పమే! తెలుగు నవల వెలువడిన తొలిరోజుల కాలంనుండీ మన నవలాకారులకు సామాజిక దృష్టి అధికంగా వుండడం యిందుకు కారణం అనుకుంటాను. ఈ కార్యకారణ సంబంధం మాట ఎలా వున్నా, ఒక విషయం మాత్రం నిజం-పాశ్చాత్య ప్రపంచంలో ప్రభంజనాల్ని రేపిన మనో వైజ్ఞానిక సిద్ధాంతాలు ప్రత్యక్షంగా కాకపోయినా పరోక్షంగానయినా తెలుగు నవలాకారులపై ప్రభావాన్ని చూపాయి. అచేతనలో వుండిపోయిన భావాలపట్ల అవగాహన ఏర్పడ్డంతో పాత్ర చిత్రణ విషయంలో రచయితలు క్రొత్త పుంతలు తొక్కేందుకు అవకాశం ఏర్పడింది. కొద్ది సంఖ్యలో అయినా తెలుగువారు సగర్వంగా చెప్పుకోదగ్గ మనోవైజ్ఞానిక నవలలు వెలువడినాయి.

అయితే, యిక్కడ ఒక విషయాన్ని గురించి చెప్పాలి. మన సత్వశాస్త్ర పరంగా సిద్ధాంతాలు ఎలావున్నప్పటికీ - వాటిని ఎవరు రూపొందించినప్పటికీ- మానవ ప్రవర్తన ఎప్పుడూ ఒక్కటే! ఆ ప్రవర్తనలోని వైచిత్రి మేధావంతులయిన నవలాకారులను ఎప్పుడూ ఆకర్షిస్తూనే వుంటుంది. దీనికి సిద్ధాంతాలతో సంబంధం లేదు. ఛార్లెస్‌డికెన్స్ ప్రసిద్ధ నవల "ఎ టేల్ ఆఫ్ టూ సిటీస్" 1859లో ప్రచురణ పొందేనాటికి ఫ్రాయిడ్ మూడు సంవత్సరాల బాలుడు. కాని ఆ నవలను యిప్పుడు చదివితే అందులోని కొన్ని ప్రధాన పాత్రల అంతరంగ ప్రవర్తనలో ఫ్రాయిడ్ సిద్ధాంతాలలో చెప్పబడిన incest feelings ద్యోతకం అవుతాయి. యిటువంటి ఉదాహరణలను తెలుగు సాహిత్యంతోసహా ప్రపంచ సాహిత్యం అంతటినుంచీ చూపవచ్చు.

తెలుగు నవలా సాహిత్యంలో మనోవైజ్ఞానిక నవలలుగా పేర్కొనదగ్గవి 1946 ప్రాంతాలకుగానీ వెలువడలేదు. అయితే ముందే చెప్పినట్లుగా ఉన్నవవారి "మాలపల్లి" మొదలుకొని, విశ్వనాధవారి "ఏకవీర" "తెఱచి రాజు", చలం "అమీనా", సుబ్రహ్మణ్యశాస్త్రి "ఆత్మబలి" మొదలయిన వాటన్నింటిలో పాత్రల విభిన్న ప్రవృత్తుల మధ్యజరిగే సంఘర్షణ అద్భుతంగా చిత్రించబడినప్పటికీ వాటిని మనోవైజ్ఞానిక నవలలుగా పేర్కొనే అవకాశంలేదు. ఆ నవలలను ఆయా రచయితలు వేర్వేరు ప్రయోజనాలకోసం రాశారు. బుచ్చిబాబుగారి "చివరకు మిగిలేది", గోపీచంద్‌గారి "అసమర్థుని జీవయాత్ర" నవలల ప్రచురణతో తెలుగులో మనోవైజ్ఞానిక నవలలకు సంబంధించి ఒక క్రొత్తయుగం ప్రారంభమయిందని చెప్పవచ్చు. "చివరకు మిగిలేది" నవల ఫ్రాయిడ్ సిద్ధాంతంలో ముఖ్యమైన "ఈడిపస్ కాంప్లెక్సు"ను ప్రాతిపదికగా చేసుకొని mother fixation కు లోనయిన ఒక యువకుడి అంతరంగ సంక్షోభానికి అద్భుతంగా అద్దం పట్టింది. అటు తర్వాత కొద్ది కాలానికి ప్రచురింపబడిన గోపీచంద్‌గారి "అసమర్థుని జీవయాత్ర" మన సత్వశాస్త్రవేత్త ఆడ్లర్ రూపొందించిన ఆత్మన్యూనతా భావానికి ఒక కళాత్మక రూపంగా నిలచింది. అయితే "అసమర్థుని జీవయాత్ర"కు ఒక మనోవైజ్ఞానిక నవలకు మించిన

పరిధివుంది. ఒక తాత్త్విక సందేశాన్ని ఒక మనోవైజ్ఞానిక నవల రూపంలో మనకు యిందులో అందిసాడు గోపీచంద్.

అయితే, తెలుగు నవలాకారులను సీతారామారావు ఆత్మన్యూనతా భ్రాంతి బాగా ఆకట్టుకుంది. ఆ దోవలో మరికొన్ని మంచి నవలలు వెలువడేందుకు యిది అవకాశాన్ని కల్పించింది. ఒక వైపునుండి మనల్ని గిలిగింతలు పెడుతూనే, మరొక వైపునుండి మన సత్త్వపు అగాధాలలోని అసలు కారణాలవైపు మనల్ని ఆలోచింప చేసిన రా.వి. శాస్త్రి నంగిరి పింగిరి సుబ్బయ్యానూ, వేణుగోపాలరావు మృత్యుంజయరావునూ, ఈ సందర్భంలో మనం మరోసారి జ్ఞాపకం చేసుకోవాలి.

—ఇదంత 1970కి ముందు కథే! 1970 తర్వాత తెలుగులో మనోవైజ్ఞానిక నవలలు చెప్పుకోదగ్గ సంఖ్యలో రాలేదు. అంటే, యిదివరకున్నపాటి సంఖ్యలో కూడా రాలేదని అర్థం. అంతకుముందు కాలంలో వెలువడిన రచనలనే నమూనాలుగా భావించుకోవాల్సిన పరిస్థితి కూడా ఏర్పడింది. ఇందుకు కారణాలు కూడా లేకపోలేదు. మనిషి తన కనీస కోర్కెలను కూడా తీర్చుకోలేక అటమటిసున్న రోజులలో, ఆ పరిస్థితికి కారణాలు తెలిసికూడా వాటిని పరిష్కరించుకోలేక పోతున్న రోజులలో, తనకు తెలియకుండా 'అచేతన'లో దాగివున్న సమస్యల గురించి బుర్రలు బద్దలు కొట్టుకుని ఆలోచిసూ, చీకట్లో చిందులాడుతూ మనోవైజ్ఞానిక నవలలు రాయవలసిన అవసరం ఏముందని రచయితలు భావిసూ వుండవచ్చు. సరే, కారణాలు ఏమైనా ఉన్నంతలో ఈ తరహా సాహిత్య ప్రగతిని సమీక్షిద్దాం.

1970కి ముందే– అంటే 1969లో శ్రీ నవీన్ 'అంపశయ్య' నవలను ప్రకటించాడు. ఈ నవలలో జాయిస్, వుల్ఫ్, ఇత్యాదులు ఉపయోగించిన 'చైతన్య స్రవంతి' శిల్పం వుంది. ఒకప్పుడు కోనేటిరావు కథల్లోనూ, "అమీనా" "తుఫాన్" "అల్పజీవి" వంటి నవలల్లోనూ, తెలుగు పాఠకుల్ని పలకరించిన 'చైతన్య స్రవంతి' శిల్పం 'అంపశయ్య' ద్వారా తెలుగువారికి మరోసారి సన్నిహితమైంది. ఈ తరహా విధానంలో వెలుగునీడల్లో, సభ్య అసభ్య భావాలతో సహా పాత్రల అంతరంగం పాఠకులకు కనబడుతుంది. పాత్రల 'అచేతన'లో అణచివేయబడిన శృంగారాది భావాలు 'చేతన' లోనికి ఎలా తొంగిచూసుంటాయో – ఫ్రాయిడ్ చెప్పినట్లుగా "యిడ్" "యిగో" "సూపర్ యిగో"ల మధ్య సంఘర్షణ అంతరంగంలో ఎలా జరుగుతూ వుంటుందో– యథాతథంగా చూపించడమే ఈ శిల్పం లక్ష్యం. యిందులో 'సబ్‌కాన్షస్' స్థాయిలో పాత్రల ఆలోచనల్ని చూస్తాం మనం.

తెలుగు నవలల్లో 'చైతన్య స్రవంతి' విధానాన్ని రెండురకాలుగా ఉపయోగించుకోవడం జరిగింది. మొదటిది జేమ్స్ జాయిస్ వగయిరాల ధోరణిలో కథకు ప్రాధాన్యతను ఇవ్వకుండా, కొద్దిగంటలకాల వ్యవధిలో పాత్రల ఆలోచనల రికార్డును అందివ్వడం; యిక, రెండవది– మామూలు సంప్రదాయ ధోరణిలోనే కథను

నడుపుతూ పాత్రల అంతఃకరణను తెలపడానికి అక్కడక్కడ చైతన్య స్రవంతి విధానాన్ని ఉపయోగించడం,- తెలుగులో మనోవైజ్ఞానిక నవలల సంఖ్య బహు తక్కువ కనుక, పాత్రల మనోవిశ్లేషణకు రెండవతరహా ధోరణిని అవసరాను గుణంగా అవలంబించారు నవలాకారులు. ముందు పేర్కొన్న "అమీనా" "అల్పజీవి" "తుఫాన్" నవలల్లో కనబడేది ఈ తరహా ధోరణే!

ఇటీవలి కాలపు తెలుగు నవలాకారుల్లో శ్రీ నవీన్‌కు 'చైతన్య స్రవంతి' విధానంపట్ల కొంచెం ఎక్కువ ఆసక్తి ఉన్నది. వీరి "అంపశయ్య" "ముళ్ళపొదలు" మొదలయిన నవలల్లో కాస్తంత మెరుగయిన ధోరణిలో చైతన్య స్రవంతి నవలా శిల్పం కనబడుతుంది. పరిమళా సోమేశ్వర్ "అంతరంగ తరంగాలు", మాదిరెడ్డి సులోచన "తరంగాలు" మొదలయిన నవలల్లో కూడా ఈ తరహా ప్రయత్నం కనబడుతుంది.

ఇక- చండీదాస్ గారి "హిమజ్వాల"లో సబ్‌కాన్షస్ స్వగతాలు చాలా కనబడతాయి. 'గీత' పాత్ర అంతరంగంలో చెలరేగిన సంక్షోభాలను వ్యక్తీకరించడానికి రచయితకు ఈ విధానం బాగా ఉపయోగపడింది. నాగరాజుగారి "ఊబిలో దున్న", "త్రాగుబోతు" నవలల్లో కూడా ఈ తరహా స్వగతాలు వున్నాయి. "ఊబిలో దున్న"లోని దున్నపోతు దున్నపోతూ కాదు. రాఘవులు రాఘవులూ కాదు- ఈ రెండు పాత్రలూ చైతన్యానికి, చైతన్యరాహిత్యానికి,మధ్యజరిగే సంఘర్షణలో రెండు విభిన్న భావాలకు ప్రతీకలు- సామాజికపరమైన ఈ సంఘర్షణలో అక్కడక్కడా చైతన్య స్రవంతి ధోరణిలో రాఘవులి తెగిపడ్డ ఆలోచనల్ని పరిచయంచేస్తాడు రచయిత. వీటి నన్నింటినీ ఏరుకొంటూ కథను తెలుసుకోవాలి మనం-"Life is not a series of gig lamps symmetrically arranged, but a luminous halo, a semi transperant envelope surrounding us from the beginning of the consciousness to the end" అని కదా సిద్ధాంతకర్తల అభిప్రాయం!

*నవలాశిల్పం ఏదయినప్పటికీ, మనిషి కదే నవలలకు ముడిపదార్థం* కాబట్టి, మానవుడి 'అచేతన'లో చోటుచేసుకొని అతగాడి జీవితాన్ని అల్లకల్లోలం చేసే Incest feelingsను ఫ్రాయిడియన్ దృక్పథంతో చూడగలిగితే మంచి ఇతివృత్తాలనే సమకూర్చుకోవచ్చును. ఒకప్పుడు "చివరకు మిగిలేది", ఆ తర్వాత అంతటివారి "భావం" ఆ పైన సుదర్శనంగారి "మళ్ళీ వసంతం" మొదలయిన నవలల ఇతివృత్తాలలో కనబడిన ఈ తరహా ధోరణి- యిటీవల వచ్చిన నందిగారి "దృష్టి" నవలలో ఉన్నది. ఈ నవలలోని ప్రధాన పాత్ర 'బోస్'కు తన చెల్లెలు లావణ్యపైన విపరీతమైన ప్రేమ వుంటుంది. అయితే- ఇది సాధారణమైన ప్రేమ కాదు. ఒక విధమైన Incest feeling. అచేతనలోని ఈ విచిత్ర భావమే అతడిని సుమిత్రవైపు తరుముతుంది. చివరకు ఆ ప్రయత్నంలోనే అతడు హంతకుడుగా కూడా మారతాడు. అచేతనలోని Incest feelings వలన ఎలాంటి ప్రమాదకరమైన

పరిణామాలు సంభవిస్తాయనేది ఈ నవలలో by productగా మనకు లభించే సందేశం!- అయితే, ఇక్కడ ఒక విషయం చెప్పాలి. రచయితకు మనోవైజ్ఞానిక దృక్పథం ఉండడం మంచిదే. అంతమాత్రాన, కథను మధ్యలో ఆపేసి మనస్తత్వశాస్త్రం గురించి చెబుతాను కూర్చోండి అంటూ పేజీల తరబడి ఈ విషయాన్ని వాచ్యం చెయ్యనవసరంలేదు. అందులోని విషయాన్ని మేధావంతుడయిన పాఠకుడు ఎలాగూ గ్రహిస్తాడు. అందుకు రచయిత 'మేడ్ ఈజీ' విధానాన్ని అవలంబించవలసిన అవసరం లేదు. ఇదే పొరపాటు ఇదివరలో వెలువడిన సుదర్శనంగారి "మళ్ళీ వసంతం"లో కూడా జరిగిందని నా అభిప్రాయం.

పాత్ర చిత్రణ విషయంలో మనోవైజ్ఞానిక దృక్పథం ఉన్న రచయితకు మిగతావారికంటే కొంత సదుపాయం ఉందేమాట నిజం అయితే కావచ్చు. ఎందుకంటే- అతను మనిషి మనస్తత్వం గురించి గాలికబుర్లు రాయడు. మనిషి మనస్తత్వానికి సంబంధించిన Conflicts కథలో అధికంగా చోటుచేసుకున్నప్పుడు ఈ తరహా సైంటిఫిక్ దృక్పథం మరింతగా అవశ్యకం అవుతుంది. ఈ విధమైన లోటు ఉన్నట్టుగా చెరుకూరి రమాదేవిగారి "ఆటబొమ్మలు", వేదుల శకుంతలగారి "దీప్తి" నవలలు చదువుతున్నప్పుడు నా కనిపించింది. కాస్త శ్రద్ధ తీసుకుంటే ఇవి మనోవైజ్ఞానిక నవలలు అయివుండేవి అనిపించింది.

తెలుగు నవలల్లో మనో విశ్లేషణ గురించి చెప్పేటప్పుడు మరొక విషయం గురించి కూడా చెప్పాలి. *సగటున తెలుగు నవలాకారులకు సాంఘికపరమైన మంచి చెడులమధ్య సంఘర్షణను చూపించడం ప్రీతిపాత్రమైన విషయంలా కనబడుతుంది. ఈ సంఘర్షణ ప్రధానంగానూ, ప్రధాన కథకు అనుబంధంగానూ వున్న రచనలు తెలుగులో అనేకం కనబడతాయి.* ఆనాటి "ఏకవీర" నుండి యీనాటి "అభిశాపం" వరకూ యిదే ధోరణి.

సంఘర్షణల స్వరూపం ఏదయితేనేం,- వాటివలన జరిగే సంక్షోభం మాత్రం ఒక్కటే: యిట్లాంటి సంక్షోభం వ్యక్తిలోని Split personality ఫలితంగా ఎలా ఉత్పన్నమవుతుందో కొందరు నవలాకారులు ఇటీవలి కాలంలో తమ నవలల్లోచిత్రించారు. యండమూరి వీరేంద్రనాథ్‌గారి "ఋషి" నవలలో వ్యక్తిలోని జెకిల్, హైడ్,లు చేసే పోరాటం హృదయానికి హత్తుకొనే రీతిలో కనబడుతుంది. తనలోని "హైడ్"ని చంపుకోడానికి నానా అవస్థా పడుతూండే ప్రకాశం అనే కథానాయకుణ్ణి- బ్రతుకుపందెంలో నిలువలేక, ఆశయాల్ని చంపుకొని ఆశలు తీర్చుకోడానికి "జెకిల్"ను చంపుకొని "హైడ్"ను బ్రతికించుకున్న సగటు మనిషి మాణిక్యాలరావునూ, ఈ నవలలో రచయిత 'సైకో ఎనలిటికల్' దృక్పథంతో Expose

చేస్తారు. ద్వంద్వ ప్రవృత్తిని అధిగమించగలిగినవాడే ఋషి; యీ నవలలో రచయిత ప్రకాశాన్ని ఋషిగా చేయడానికి ప్రయత్నించినా దానిని పాఠకులు నమ్మడం కష్టం.

- ఇటాంటి సంఘర్షణే మరో తరహాలో మధురాంతకం రాజారాంగారి "త్రిశంకుడి స్వర్గం"లో కనబడుతుంది. రాజారాంగారి నవల్లో మతిభ్రమణపు అంచుల్లో నిలబడిన కోదండం అనే వ్యక్తిలో- "కోదండం", "డాక్టర్ విజయరత్నం" అనే రెండు వ్యక్తిత్వాలున్నాయి. కోదండం గంగిగోవు అయితే, విజయరత్నం ఖడ్గమృగం. అయితే- పరిస్థితుల ప్రభావం వలన యీ ఇద్దరు వ్యక్తులూ కోదండంలో చోటుచేసుకున్నారు. దీనిఫలితంగా చెలరేగిన సంఘర్షణలో తనను తాను హింసించుకున్న 'న్యూరోటిక్' కథను చక్కగా మనముందు వుంచుతారు, యీ నవలలో రాజారాంగారు.

మానవుని జీవితంలో ఇంతకు మించిన సంక్షోభాన్ని తీసుకువచ్చి అతడి బ్రతుకును దయనీయమైన స్థితికి దిగజార్చే మరొక విచిత్రమైన ప్రవృత్తి Inferiority complex - నిజానికి, Inferiority complexకు. Superiority complexకు, చెప్పుకోదగిన తేడాలేదు యివి ఒక నాణానికి గల బొమ్మా బొరుసులని మన సత్వ శాస్త్రవేత్తలు అంటూవుంటారు. వీటి ఫలితంగా మానవుడు తనకు తానే సృష్టించుకునే సంఘర్షణలను నవలాకారులు తమ రచనలకు ముడిపదార్థాలుగా వాడుకోవచ్చును. సాంసారిక జీవిత సమస్యల్ని ఇతివృత్తాలుగా స్వీకరించి నవలలు రాసిన రచయిత, రచయిత్రుల నవలల్లో కూడా ఈ ప్రాతిపదికపైన ఏర్పడిన Conflicts కనబడతాయి. హరిజన యువకుణ్ని పరిస్థితుల ప్రభావంగా పెళ్ళి చేసుకున్న బ్రాహ్మణ యువతిలోని Inferiority, Superiority complex ల సమ్మేళనం ఆమెను ఎలా బలిపీఠానికి ఎక్కించిందో గడిచిన దశాబ్దంలో ఒక రచయిత్రి నవలలో చెబితే,- ఈ దశాబ్దంలో కూడా మరికొంతమంది రచయిత్రులు ఆత్మ ఆధిక్యతా భ్రాంతితో తమ సంసారాల్ని కాల్చుకుని, తమను తాము హింసించుకున్న మరికొంతమంది ఇల్లాళ్ళ కథ వినిపించారు. అయితే, యీ తరహా భ్రాంతిని కలుగజేసిన కారణాలు మాత్రం వేర్వేరు; అదిన్నీగాక, యీ రచనల్లో మనోవైజ్ఞానిక దృక్పథంకన్నా, 'సంసారపు గొడవ' చెబుదామన్న తాపత్రయమే ఎక్కువ.

*తీసుకున్నది సాంసారిక జీవితానికి సంబంధించిన యితివృత్తమే అయినా, దానిని కాస్తంత మనో వైజ్ఞానిక దృక్పథంతో పరిశీలించి - ఆత్మన్యూనతా భ్రాంతి చెలరేపే అలజడికి చక్కగా అద్దం పట్టిన నవల కొలిపాక రమామణిగారి "వెన్నెలలో పిల్లనగ్రోవి" - ఈ నవలలో సుందరి పాత్రను చిత్రించడంలోను, ఆమెలో చిననాడు అంకురించిన ఆత్మన్యూనతాభావం వయస్సుతో*

బాటు పెరిగి పెద్దదై ఆమెను హింసించిన తీరును నవలీకరించడంలోను, రచయిత్రి చెప్పకోదగ్గ విజయాన్నే సాధించారు. అయితే - మరికొంచం శ్రద్ధ తీసుకునివుంటే మనకు మరొక మంచి మనోవైజ్ఞానిక నవల లభించి వుండేది.

మనిషి మన స్తత్వాన్ని నవలాకారులు పరికించిన తీరును గురించి చెప్పే టప్పుడు అస్తిత్వవాద ధోరణిగల నవలల గురించి కూడా చెప్పాలి. రెండో ప్రపంచ యుద్ధం తర్వాత, తెలుగు నవలా సాహిత్యంపైబడిన ముఖ్యమైన ప్రభావాల్లో అస్తిత్వవాద సిద్ధాంత ప్రభావం ఒకటి. సాంఘిక కట్టుబాట్లతోను, వ్యవస్థతోనూ, అడుగడుగునా రాజీపడుతూ బ్రతికే సాదా మన స్తత్వం అస్తిత్వ వాదులలో వుండదు. సంఘం సృష్టించిన నియమాలు అవి ఎంత గొప్పవైనా సరే, వాటితో పోరాడి, తమ వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకోగల గొప్పదనం వీరిలో వుంటుంది. కష్టాలను, కన్నీళ్ళను, పట్టించుకోకుండా తమను తాము వెదుక్కుంటూ, అటు సంఘంతోను - యిటు తమ లోని విరుద్ధ ప్రవృత్తులతోనూ పోరాడుతూ వారు కొనసాగించే జీవిత యాత్రలో ఒక "విచిత్ర మన స్తత్వం" బయటపడుతుంది. తర్కాన్ని, హేతువాదాన్ని, పట్టించుకోకుండా తమ చిత్తం వచ్చిన రీతిలో ప్రవర్తించే పాత్రల మనోగతాన్ని చిత్రించడం అంత సులభ సాధ్యంకాదు - ఒకనాటి "మెరుపుల మరకలు" "గడియ పడని తలుపులు" "వెల్లువలో పూచిక పుల్లలు"వంటి నవలల్లో కనబడిన ఈ ప్రయత్నమే యిటీవలి కాలంలో చండీదాస్‌గారి "హిమజ్వాల", సుదర్శనంగారి "సంసార వృక్షం", శీలా వీర్రాజుగారి "మైనా", జి ఆర్. కృష్ణ "జీవితయాత్ర" మొదలయిన నవలల్లో కనబడుతుంది.

ఈ వ్యాసపు పరిశీలనలోని కాలపరిమితిని బట్టి చూస్తే, - ఈ దృక్పథంలో వెలువడిన నవలల్లో ఈ దశాబ్దపు గొప్ప నవలగా "హిమజ్వాల"ను పేర్కొంటాను నేను. తనకుతానే చిక్కుప్రశ్నగా మిగిలిపోయిన 'గీత' అనే అందమైన అమ్మాయి, చిక్కుప్రశ్నల ముడిని విప్పుకుంటూ తనెవరో తాను తెలుసుకో గలిగిన కొద్ది కాలానికి తాను ఎవరికీ మిగలకుండా పోతుంది. అస్తిత్వవాదపు దృక్పథంవున్న తెలుగు నవలల్లోవుండే "ఫిజిసిక్ ఎగ్జిస్టెన్షియలిస్టిక్" వైఖరి యిందులో లేకపోయి నందున - ఈ నవల తనకు తానుగా ఒక ప్రత్యేకతను పొందగలిగింది. స్వామీజీలను ఆశ్రయించకుండా పొందిన ఆత్మజ్ఞానం 'గీత' పాత్రది.

ఇక - "సంసారవృక్షం" నవలలోని న్యాయవాదిగూడా తననుతాను అన్వేషించుకున్నవాడే ; - అయితే, ఆత్మజ్ఞానం హేతువాదం వలన సమకూరదనీ, హేతువాదానికి పరిమితులుంటాయనీ, తెలుసుకుంటేనేగాని యిది సాధ్యమైంది కాదు.ఇందుకు స్వామీజీ ఆశ్రయమూ తప్పిందికాదు. తను ఆశించిన ప్రశాంతిని సాధించేందుకు ఒక అస్తిత్వవాది లోనయిన సంక్షోభం అంతా ఈ నవలలో వుంది. అయితే, అంత

మాత్రాన యిది మనోవైజ్ఞానిక నవల అనికాదు అర్థం. మన స్తత్వ శాస్త్రంలోని Structuralism కు సన్నిహిత సంబంధంగల Existentialistic psychology యిందులో కనబడుతున్నదని మాత్రమే నేను చెప్పేది. సుదర్శనంగారి నవలలో మన స్తత్వ శాస్త్రవేత్త యూంగ్ చెప్పే archetype ప్రతీకలు పుష్కలంగా వున్నాయి. సంప్రదాయ వాదులయిన రచయితలందరూ ఈ తరహా ప్రతీకలను సందర్భోచితంగా వాడుతూనే వుంటారు. నాటి విశ్వనాథవారి నవలలు మొదలుకొని— నేటి సుదర్శనం చివుకుల పురుషోత్తంగార్ల నవలల వరకూ యితివృత్తానికీ, పాత్ర చిత్రణకూ, నేపథ్యంలో కనబడే ఈ archetype ప్రతీకలను ఓపికగా వెదుకుకోవచ్చు.

— సరే, యింతవరకూ చెప్పాక, – 'వ్యక్తి' తనను తాను వెదుక్కోవడంలో సంఘానికి ఒరిగేదేముందన్న ప్రశ్నకు సమాధానం మిగిలిపోతుంది. ఆ విధంగా ప్రశ్నించుకున్నప్పుడు మానవ మన స్తత్వాన్ని తరచి చూడడం వృధాప్రయాస అనే భావం కలగవచ్చును. మనోవైజ్ఞానిక నవలలు నిష్ప్రయోజనమనే తొందరపాటు నిర్ణయానికి కూడా అది దారితీయవచ్చును. – నిజానికి, – మనోవైజ్ఞానిక నవలలను 'ప్రయోజనపు' కొలతబద్దతో కొలవలేము.సంఘంలోని ప్రజల సామూహిక సమస్యలు ఎంత ముఖ్యమైనవో, ఆ సంఘంలో ఒక భాగమైన వ్యక్తి అంతరంగ సమస్యలు గూడా అంత ముఖ్యమైనవే :– కాకుంటే, ఏవి తక్షణం పరిష్కారం కావలసిన సమస్యలు అనే విషయంలో భేదాభిప్రాయాలు వుండవచ్చును.

అదిన్నీగాక, – మనోవైజ్ఞానిక దృక్పథంవున్న నవలల్లో 'వ్యక్తి'కి ప్రాధాన్యత లభించినంత మాత్రాన, – సంఘం ఎదుర్కొంటున్న సమస్యలు వీటిలో నిర్లక్ష్యం చెయ్యబడతాయని అనుకోవలసిన అవసరంలేదు. వర్గ పోరాటంలో చిక్కుపడిన ఒక వ్యక్తి అంతరంగ సంక్షోభాన్ని మనోవైజ్ఞానిక నవలలో ఆవిష్కరిస్తే, దానివలన సామాజిక ప్రయోజనం కూడా నెరవేరేందుకు అవకాశం వుంది. అయితే, నేడు తెలుగులో వెలువడుతున్న మనోవైజ్ఞానిక నవలలు కేవలం ప్రేమసమస్యల గురించి మాత్రమే పట్టించుకుంటున్నందునా, సాంఘిక సమస్యలతో సంబంధంలేని వ్యక్తిగత సమస్యలు వీటిల్లో అధికంగా చోటుచేసుకుంటున్నందునా ఈవిధమైన విమర్శకు చోటు దొరుకుతున్నదేమో అనిపిస్తుంది.

వ్యక్తి ఆంతరంగిక సంక్షోభానికి, – సామాజిక సంక్షోభానికీ, – మధ్యగల సంబంధాన్ని చెప్పే ఈ సందర్భంలో ఎరిక్ ఎరిక్‌సన్ అనే మన స్తత్వ శాస్త్రవేత్త ప్రతిపాదించిన Identity Crisis గురించి చెప్పాలి.యౌవనావిర్భావప్రాయంలోవున్న వ్యక్తులకు Negative Identity ఏర్పడి.– సరిఅయిన జీవితధ్యేయాన్ని ఎంచుకోలేకపోయిన ఫలితంగా సంక్షోభం ఎలా ఏర్పడుతుందో అద్భుతంగా వివరిస్తా

డాయన. మానవుని జీవిత చక్రం (Life Cycle)లోని వివిధ దశలను వరిస్తూ ఈ తరహా సంక్షోభం ఏర్పడ్డానికి గల కారణాలను ఆయన చెబుతాడు. ఈ విషయాన్ని ప్రాతిపదికగా చేసుకుని యువకుల అంతరంగ సంక్షోభాలకు అద్దంపట్టే అద్భుతమైన నవలలను రూపొందించవచ్చు.

ఎరిక్‌సన్ సిద్ధాంతాలకు నవలా రూపం అని చెప్పలేము గానీ, – యిటీవల వాసిరెడ్డి సీతాదేవి రచించిన "మరీచిక" నవలలో ఈ తరహా ప్రయత్నం కొంత వరకూ కనబడుతుంది. అదేవిధంగా 'హితశ్రీ' రచించిన "అంతర్వాహిని" నవలలో కూడా Guiding fiction కు సంబంధించిన సందిగ్ధస్థితిని చూపించడం జరిగింది.

— యిలా చెప్పుకుంటూ పోతే పెద్దలిస్టే అవుతుంది. యిటీవలి కాలంలో ముఖ్యంగా ఈ దశాబ్దంలో ప్రత్యేకించి మనోవైజ్ఞానిక నవలలుగా చెప్పదగినవి అత్యంత స్వల్ప సంఖ్యలో వెలువడినప్పటికీ, – తెలుగు నవలల్లో మనోవిశ్లేషణ మాత్రం కొరవడలేదు. అయినప్పటికీ, తెలుగువారు సగర్వంగా చెప్పుకోదగిన మనోవైజ్ఞానిక నవలలు మరికొన్ని వెలువడవలసి వుంది. ఈపని జరగాలంటే మనోవైజ్ఞానిక నవలలు "బూర్జువా" నవలలు అనే దురభిప్రాయం తొలగిపోవాలంటాను.

ఏది ఏమైనా, ఒక్క విషయం మాత్రం సత్యం. సాహిత్యం సమకాలీన సమాజానికి అద్దం, దీపం కావాలంటారు విమర్శకులు. మనోవైజ్ఞానిక నవల ఈ రెండు పనుల్లో దేనిని చెయ్యకుండానే రెండింటినీ చేస్తుంది. ఈ నవలలు తమ పాత్రల్లో కనబడే వ్యక్తికి ఒక శక్తివంతమైన దీపాన్ని యిస్తాయి. నిన్ను నువ్వు చూచుకోమంటాయి. ఆ అద్దంలో 'దీపం' కనబడుతున్నదో, లేదో, వ్యక్తి ఆత్మ పరిశీలనతో తేల్చుకోవలసి వుంది. ఆత్మ పరిశీలన అభ్యుదయానికి మొదటిమెట్టు అనడానికి ఏవిధమైన సందేహాలు వుండవలసిన అవసరంలేదు। □

---

సాహిత్యం అచ్చం జీవితంలాగే వుండాలనుకోవటం కూడా తీవ్రమైన పొరపాటే. జీవితాన్ని అర్థం చేసుకోడానికి మానవుడు చేసే ప్రయత్నంలో ఒక భాగమే సాహిత్యం (మరొక భాగం సైన్సు) ఒకదాన్ని అర్థం చేసుకోవటమంటేనే దానిలోని కార్య కారణ సంబంధాన్ని తెలుసుకోవటం, దానిలోని హేతు బద్ధతను గ్రహించటం. కనుక జీవితం మానవునికి యే మేరకు అర్థమైనట్లు భాసిస్తుందో, ఆ మేరకే జీవిత సాహిత్యంలో ప్రతిఫలిస్తుంది. అనగా హేతు బద్ధమైన జీవితమే సాహిత్యంలోకి యెక్కుతుంది.

—రాచమల్లు రామచంద్రారెడ్డి

---

# నేటి తెలుగు నవల్లో జీవితం

డా॥ కేతు విశ్వనాథరెడ్డి

ఉత్తమ నవల్ని రాయడానికి నవలా రచయితలకు గాఢమైన విస్తార జీవితానుభవాలు, సామాజిక దృష్టి, చిత్తశుద్ధి, శిల్ప పరిజ్ఞానం కావాలి. జీవితానుభవాలు యెంత గాఢంగా వుంటే రచయితలు చిత్రించే జీవితం అంత గాఢంగా పాఠకుల్లో వొక సజీవమైన అనుభవాన్ని కలిగిస్తుంది. ఆ సజీవమైనఅనుభవం పాఠకుల సంస్కార స్థాయిని, భౌతిక పరిస్థితుల్లోంచీ పుట్టే మంచిమార్పులకు దోహదకరంగా పెంచుతుంది. జీవితానుభవాలు యెంత విస్తారంగా వుంటే రచయితలు చిత్రించే జీవితం అంత వైవిధ్యంతో కూడుకొని వుంటుంది. అలాగే జీవితానుభవాలకు, వాటితో సంబంధం వుండే సమాజ స్వరూపానికీ, స్వభావానికీ గల సంబంధమేదో నవలా రచయితలకు తెలిసివుండాలి. ఈ తెలివే రచయిత జీవిత వ్యాఖ్యాన దృష్టినీ, చిత్తశుద్ధినీ, శిల్ప పరిజ్ఞానాన్నీ రూపొందిస్తుంది.

## జీవితానుభవాలు: సమాజం

తెలుగుదేశంలో, కొన్ని వేల గ్రామాలు ఒకటి రెండు వందల పట్టణాలు, రెండు నగరాలు వున్నాయి. గత పదేళ్ళుగా పట్టణాల సంఖ్య పెరిగిందికూడా. గ్రామాల్లో నానాటికీ పేద, మధ్యతరగతి రైతుల సంఖ్య పెరుగుతోంది.అంతకంటే వేగంగా భూమిలేని వాళ్ళసంఖ్య యెక్కుతోంది. వ్యవసాయ పనులకు తమ కాయకష్టంతో పాటు పలువురు కూలీల్ని పిలుచుకునే అవసరం, శక్తీ పేద రైతులకుంటే వుండవచ్చు. కానీ జీవన ప్రమాణంలో, ఆదాయంలో పేదరైతుకు, భూమిలేని వ్యవసాయ కూలీలకు తేడాలేదు. అలాగే పేద, మధ్యతరగతి రైతులు సృష్టించే సంపద కూడా చచ్చిచెడి బతికించేదేతప్ప అదనపు సంపద కాదు. తగిన వనరులు లేకపోవడం అటుంచి ప్రధానంగా ప్రకృతిని నమ్ముకుంటూ వ్యవసాయం చేసే వీళ్ళ జీవితాల్లో ఘర్షణ మాట చెప్పనక్కరలేదు. గ్రామీణ ప్రాంతాల్లోని వ్యవసాయ కూలీల జీవితం మరింత దుర్భరమైంది. చాలామందికి చేతినిండుకు లేనిపని. కొంతమందికి పని వున్నా కడుపునిండుకు లేని కూలి. మరోవైపు చాలా తక్కువ సంఖ్యలోని పెద్ద రైతుల చేతుల్లో తగిన భూమి వుంది. దీనివల్ల

రాజకీయంగా వాళ్ళ ప్రాబల్యమూ, పరిమితంగానైనా పట్టణాల్లో వాళ్ళ వాణిజ్య సంబంధాలు పెరిగాయి. వీళ్ళు యే కులానికి సంబంధిస్తే ఆ కులం రాజకీయ శక్తిగా బలపడుతోంది.

పట్టణాలు, నగరాల్లో మరొక రూపంలో ఇదే స్థితి. కార్మికులు,సర్వీసులోని చిన్నా పెద్దా మధ్య తరగతి వాళ్ళ సంఖ్య పెరుగుతోంది. నానాటికీ బలపడుతున్న దళారీవ్యాపారులు,వాణిజ్యవేత్తలు, చిన్నా పెద్ద తరహా పారిశ్రామిక వేత్తలు పట్టణ నగర జీవితంలో "గాలిలో కనరాని గడుసు దయ్యాలు!" కార్మికులు, సర్వీసుల మధ్యతరగతి వాళ్ళ జీవనప్రమాణం పల్లెల్లోని కూలీలు పేద, మధ్యతరగతి కంటే యెక్కువే. కానీ యీ దయ్యాల దెబ్బలకు వీళ్ళ మొత్తం జీవితం నానాటికీ ఘోరమైపోతోంది.

గ్రామీణ ప్రాంతాల్లో కడుపుకట్టుకొని నానాగడ్డీ కరచి పై అంతస్తులోని వాళ్ళ కిందపడి వుంటూ, పైపైకి వెళుతున్న కొద్దిపాటి పేద, మధ్యతరగతి రైతులు కన్పిస్తారు. పటణాల్లో ఇటువంటి వాళ్ళ సంఖ్య పల్లెల్లో కంటే యెక్కువవుతోందని చెప్పవచ్చు. లండన్ శ్రామికులు సర్వీస లోని అవినీతిపరులు గణనీయంగా పెరుగుతున్నారు.

ఈ స్థితిగతుల మధ్య సవాలక్ష వైరుధ్యాలు,ఘర్షణ! వీటి పర్యవసానమే నేటి సాంఘిక చైతన్యం. ఆర్థిక సంక్షోభం, అధికార రాజకీయ కశ్మలం, కుల మత భాషా ప్రాంతీయాది భేదాల ద్వారా విచ్ఛిన్నమవుతూ అశాంతిని పెంచే, సాంఘిక సాంస్కృతిక పరిస్థితులు, చుట్టూ జీవితంతో పొంతనలేనివిద్య యీ చైతన్యంలో ప్రధానం. దీంతో వ్యక్తులు సమాజం మధ్య పరాయితనం(Alienation పెద్దగా యేర్పడుతూ పోతోంది.

యీ పరాయితనం నుంచీ యేర్పడినవే అచ్చమైన జీవితానుభవాలు. వీటిని గుర్తించటం, పరిశీలించటం యీ ఆధునిక ప్రక్రియను చేపట్టిన సగటు రచయితల కనీస మానవత్వం. ఆక్షేపించటం ప్రజాతంత్ర రచయితల(Democrates) ధర్మం. యీ పరాయితనం వల్ల మనుషులు కోల్పోయిన మానవత్వాన్ని తిరిగి రాబట్టుకొనే మంచికాలం కోసం తపించే వుద్యమాలను ఆహ్వానించే స్థితికి, ఆదరించే యెత్తుకు సమిష్టిగా యెదగడం మొత్తంగా చేయాల్సిన పని. యీ పను లేవో జరగని స్థితి వుంది కాబట్టే అధిక సంఖ్యాకులు చిత్రించే జీవిత ధోరణులు, ప్రధాన సమస్యలు పాత్రలద్వారా చూపే పరిష్కారాలు కృత్రిమంగానూ, అన్యాయంగానూ వున్నాయి.

ఈ దశాబ్దికాలంలో కనీసం రెండువేల వరకు నవలలు, నవలికలు వచ్చాయి. వొక వుద్యమ స్వభావమూ, వొక తాత్త్వక ప్రాతిపదికా యేదో వున్న అల్ప సంఖ్యలోని నవలల్లో తప్పితే మిగతా నవలల్లోని జీవితం వ్యాపారంనుండీ, వ్యాపారంకోసం, వ్యాపార రచయితల చేత అచ్చు గుద్దింది. యీ అచ్చుగుద్దుడు సాహిత్యమేదో రచయిత్రుల సృష్టే అన్నంతగా వచ్చింది. రచయిత్రులు రచనా రంగంలో ప్రవేశించాక వొక విడ్డూరమైన స్థితి మాత్రం తెలుగు

కల్పనా సాహిత్య లోకంలో యేర్పడింది. సినిమాల్లో ఆడతనం గిరాకీలాగా, సాహిత్యంలో, సినిమాల్లో ఆడరచన బాణీ గిరాకీ ప్రవేశంతో రచయితలు చాలా మంది రచయిత్రుల వేషంలో రాసే పరిస్థితి యేర్పడింది. ఈ దుస్థితివల్ల అసలు జీవితం తప్పి, సినిమా జీవితమే నవలా జీవితమైంది. నవలా జీవితమే సినిమా జీవితమైంది. దీన్ని విమర్శించే వాళ్ళకు రెండు చేతులా రాస్తున్న నవలా రచయిత, కథకుడు 'వసుంధర' (ఈ పేరుతోనే భార్యా భర్తలిద్దరూ కథలు రాస్తారట!) 'ప్లాస్టిక్' అన్నకథలో ఇచ్చిన విడ్డూరమైన సమాధానం చూడండి:

"గాజు వస్తువులు అందంగా వుంటాయి. కాని పగిలిపోతాయి. ఎన్నో శతాబ్దాల తర్వాత మనిషి ప్లాస్టిక్ కనిపెట్టాడు. అదిప్పుడు నిత్యావసర వస్తువు మామిడాకుల తోరణాలు, ఫ్లవర్ వాజుల్లో పువ్వులు, చెంబులు, గాసులు, పళ్ళాలు – వగైరాలు ఎన్నో సామాన్యుడికి అందుబాటైన, సరసమైన ధరల్లో ప్లాస్టిక్ వస్తువులుగా వస్తున్నాయి. ఆ వస్తువుల్లో ఎంతో పనితనముంది. వాడకానికీ అలంకరణకు కూడా ఆ వస్తువులు ఎక్కువ కాలం మన్నుతాయి. ఇప్పుడు ప్లాస్టిక్ సామాన్యుల పాలిటి వరం.

"కానీ దానికి విలువలేదు. గాజు వస్తువులకున్న గౌరవంలేదు. మన్నిక లేకపోయినా ఖరీదు ఎక్కువయినా గాజు వస్తువులను గౌరవించునట్లు ప్లాస్టిక్ వస్తువుల నెవ్వరూ గౌరవించరు. అందుక్కారణం అవి అధిక సంఖ్యాకుల అవసరాన్ని తీరుస్తూండడమేనా? అధిక సంఖ్యాకుల అవసరాన్ని తీరుస్తుండడము వల్లనే మహిళల రచనలను మంచి సాహిత్యంగా కవిమాన్యులు గుర్తించడం లేదా?" (జ్యోతి, దీపావళి సంచిక 1979, పుట 140)

ఈ మాట పైకి బాగానే కన్పిస్తుంది. దీనికి విద్యావంతుల అభిరుచి, సాహిత్యపు అవసరం ముసుగు వున్నాయి. ప్రేక్షకులు యిలాటి సినిమాలు కోరుతున్నారు మేము తీస్తున్నాం, ప్రేక్షకులు యిలాటి నటన కోరుతున్నారు మేం నటిస్తున్నాం అనే సిగ్గులేని వ్యాపార దృష్టికి దీనికి భేదమేముంది?

పైగా యీ పోలికలే విడ్డూరంగా వున్నాయి. మంచి సాహిత్యంగా దేన్నైనా గుర్తించే వాళ్ళు యే విలువలకోసం ఆరాట పడుతున్నారనే దానికి సమాధానం మాత్రం రచయిత యీ కథలో వివరించడు. ఆ విలువలకు అధిక సంఖ్యాకులను ఆయత్తం చేసే ప్రయత్నం విశేషించడు. అచ్చుగుద్దుకు సాహిత్య సమాధుల్లోకి నెట్టడం తప్ప!

అందువల్లనే యీ సాహిత్యంలో నమూనా జీవిత చిత్రణ నానాటికీ పెరిగిపోతోంది. కాకపోతే యేటేటా వస్తున్న రెండు వందలదాకా నవలల్లో తొంభయి శాతం ప్రణయ సమస్యలు, కుటుంబ సమస్యలు, విధి ఆధీన సమస్యల వలయంలోనే వుండడ మెందుకు? 'గందరగోళం' లాంటి మంచినవలను రాసిన చేత్తోనే 'కలువ కొలను సదానంద' వంటి ప్రజాతంత్ర రచయితలు బంగారు

మామ వంటి చెత్త నవలల్ని యెందుకు రాస్తున్నారు?

రచన కేవలం సరుకుగా మారితే రచనలోని జీవితం కావలసిన ప్లాస్టిక్ మౌల్డులోకి మారకుండా వుంటుందా? యీ స్థితినైనా క్షమించవచ్చునేమో! యీ రచయితల్లో చాలామంది మేధావులు కాదు, యింతకంటే ఘనులు, జీవితాన్ని వక్రీకరించి, మత దృష్టివంటి వ్యక్తిగత విశ్వాసాలు సమాజ విశ్వాసంగా రుద్దాలనుకునేవాళ్ళు.

*ఏదిపాపం?*

ప్రఖ్యాత రచయిత్రులు 'వేగంగా చదివించే గుణం' వున్న చివుకుల పురుషోత్తం ఏది పాపం అనే నవల్లో నారాయణస్వామి, మహాసిద్దిని చిత్రించాడు. స్వాములకు యిహలోక సమస్యలతో పనేముంది? ఆస్ట్రిక్ప్లేన్స్ తప్ప!

*కులరక్ గానం!*

లత తన రచనా వృద్ధాప్యంలో మన కులవ్యవస్థ భ్రష్టు పట్టిపోయిందని భావించి నట్లుంది. 'మిస్ కోకిల' అనే నవలికలో అదే పేరుగల కథానాయిక వొక హరిజన యువకుని యేవో పుద్యమోద్రేకాల్లో పెళ్ళి చేసుకొని కడకు తన రక్తానిః బ్రాహ్మణ రక్తమే సన్నిహితమైందిగా భావిస్తుంది. విశ్వనాథ సత్యనారాయణ పూనకం, ఆమె గత సాహిత్య చరిత్రకు, సాహిత్యారోగ్యానికి మంచిదకాదు. వర్ణాంతర వివాహాల్లో, సంస్కరణల్లో, వుద్యమాల్లో వుండే లోపాలను యెత్తి చూపటం తప్పుకాదు. యే జీవితసత్యం చెప్పటానికి? అని ప్రశ్నించుకోవాలి రచయిత.

డా॥ కేశవరెడ్డి యిటీవల రాసిన ఇన్ క్రెడిబిల్ గాడెస్‌లోని విశ్వసనీయమైన రామచంద్రుడి పాత్రద్వారా తెలిసే హరిజనుల పీడన సాహిత్యంద్వారా నయినా లత తెలుసుకొని వుంటే యీ నవల రాసివుండేది కాదు.

## దేశభక్తే ఉంటే

'జాతీయ దృక్పధం గల భావుకుని అనుభూతియే' 'ఆశ్రమకథలకు' 'కేంద్ర బిందువు'అనీ, 'దేశభక్తి సాహిత్యాన్ని వెల్లువలా సృష్టించి జాతిని ప్రభావితం చేయాలనీ' ప్రకటించిన డా॥ ముదిగొండ శివప్రసాద్ ప్రక్రియగా కవిత్వంకంటే, నవలకు విస్తృత ప్రచారం వుందని 'ఆవాహన' 'అనుభవ మండపం' 'అనుపమ కథ'అనే మూడు వచన పురాణాలు రాశాడు. 'విజయ'లో జనవరి, ఫిబ్రవరి నెలల్లో వెలువడిన అనుపమ కథలో ఆయన చిత్రించిన జీవితం పాశ్చాత్య బాణీ పారాసైకాలజికల్ హారర్ మాయలు,మంత్రాలతో నిండింది.నిజంగా భారతీయ సగటు జీవితం అనుపమ కథలో మాదిరి వుందని యే బుద్ధి వున్నవాడు అనుకోడు. ఆయనకు దేశభక్తే వుంటే "మూఢ నమ్మకాలు, ఆకలి, నిరుద్యోగం' వంటి Socio-Economic (ఆర్థిక. సాంఘిక) సమస్యల్ని గురించి రాసేవాడు. 'వాటిని పరిష్కరించా'లని ప్రకటిస్తూ (జాగృతి ప్రత్యేక సంచిక 1979, పు. 39) పునర్జన్మలు, మంత్ర శాస్త్ర పాండిత్యం, స్మశాన ఆవాహన మీదనే భయంకరమైన కథలు నవలలుగా అల్లేవాడు కాదు.వాటిని వ్యక్తిగత నమ్మకాలుగానే పెట్టుకొని వుండేవాడు.

## వేర్లు పుచ్చిన 'సంసార వృక్షం'

ప్రఖ్యాత రచయిత ఆర్. యస్. సుదర్శనం రాసిన నవలలో మానవ జీవితం అర్థరహితమైందన్నట్లు చిత్రించబడింది. (చూ వల్లంపాటి వ్యాసం అభ్యుదయ పుట 30-38) ఆయన దృష్టిలో నేటి సమాజంలోని మనిషి ధ్యానంలో కాంతి వలయాలు, కాంతి మండలాలు, తాదాత్మ్యం శాంతులో లయించే మేధావి. విచిత్రమేమంటే సంతానాన్ని సృష్టించే జీవకణాలు నవలానాయకునికి వీర్యంలో లేవని తెలిసిన తర్వాత భార్య గర్భవతి అయినపుడు మిత్రుడైన డాక్టరును అనుమానిస్తాడు. అశాంతిలో కొట్టుకలాడి, దేశ సంచారం చేసి బాబా ఆజ్ఞతో మళ్ళీ తాను వీర్య పరీక్ష చేసుకొని, భార్యకు తనే మొగుణ్ణని నిరూపించుకొని దాన్ని మనసుయొక్క ప్రతిబింబంగా, సమదర్శ సాధనగా అభిప్రాయపడతాడు. శంకరుడు పారలౌకిక సత్తాలో మాయావాదం ప్రవచించి, అస్తిత్వవాదాన్ని నమ్మినట్లు లౌకిక సత్తాలో బౌద్ధుల్ని చెండాడినట్లు సంసార వృక్షంలోని నాయకుడు, లాయరు విశ్వనాథం, మిధ్యనూ, భక్తినీ నమ్మి సకల సమిష్టి శ్రేయోభావాల్ని చెండాడతాడు- కాకపోతే శంకరుడికంటే మరింత నాగరికంగా.

యీ రకం నవలల్లో జీవితం, సమస్యలు, పాత్రలు, పరిష్కార మార్గాలు యేవో బలంగా వున్నట్లు కన్పిస్తాయి. ఆ యెత్తు మన జీవితాల్లోదేనా అని అనుమానం.

చారిత్రక పరిణామ క్రమంలో వచ్చిన మన జీవితం తాలూకు వ్యక్తిగతమైన భ్రాంతుల్లో యీ రకమైన జీవితాన్ని రచయితలు సృష్టిస్తున్నారని మనం సరిపెట్టుకోవచ్చు. కానీ భ్రాంతులకు మూలమైన సామాజిక కారణాల్ని బట్టి జీవితాన్ని విశ్లేషించక పోవడంవల్ల రచయిత ప్రమాద మత ప్రచారకుడుగా మిగిలిపోయాడు.

## బూర్జువా నవలలు : శ్రామిక వర్గ నవలలు

నమూనా కల్పనా సాహిత్యానికి అయోమయ రచనలకు భిన్నంగా విద్యాధిక పట్టణసంస్కారం నుంచీ అచ్చంగా యూరోపియన్ సాహిత్య ప్రేరణనుంచీ పుట్టిన మనోవైజ్ఞ నవలే హిమజ్వాల. దీని తాత్త్విక ప్రాతిపదిక చారిత్రక క్రమంలో క్రమంగా పెరుగుతున్న బూర్జువా వ్యక్తి వాదం. "మనకు మనకు మీడియోకర్ నవలలేకాని బూర్జువా నవలలు కూడా లేవు. బూర్జువా నవలలు యేర్పడకుండా శ్రామిక వర్గ సాహిత్యం హఠాత్తుగా ఏర్పడడానికి అవకాశంలేదు" అని యీ నవలకు ముందు మాటలో శ్రీ పురాణం సుబ్రహ్మణ్య శర్మగారన్నారు. హిమజ్వాల వంటి నవలల ప్రయోజనం అంతవరకే. అయితే యిక్కడ శ్రామిక వర్గ సాహిత్యమే రాలేదా అన్న ప్రశ్న పరిశీలించవలసి వుంటుంది.

అరసం,విరసం జనసాహితీ సమాఖ్యలకు చెందిన లేదా ఆ వుద్యమాలతో ప్రత్యక్షపరోక్ష సంబంధమున్న ప్రఖ్యాత, వర్ధమాన రచయితలు సృష్టించిన నవలా

సాహిత్యం మాటేమిటి? ఆ సాహిత్యం వాళ్లు చిత్రించిన జీవితం, సమస్యలు పరిష్కార మార్గాల మాటేమిటి అన్న ప్రశ్నను వెంటనే యెవరైనా వేస్తారు.

నిజానికి యీ వుద్యమ రచయితలు యేడెనిమిదిమంది నుండి గట్టిగా యిరవై ముప్ఫయి నవలలైనా యీ పదేళ్ళలో వెలువడలేదు. వేలకొద్దీ పేజీల కవిత్వం వచ్చింది. కవిత్వంకంటే నవలా రచన బాధ్యతాయుతమైన లోక పరిజ్ఞానంతో కూడుకొన్న సృజనాత్మక చర్య కాబట్టి రచయితలు నవలల జోలికి వెళ్ళలేదా? కవిత్వంలోని పరిష్కారమార్గాల విషయంలో జీవిత చిత్రణా బాధ్యత తక్కువనా? (శిల్ప పరిమితుల్ని బట్టి). మౌలికంగానే కల్పనా సాహిత్యం మీద దృష్టి మనకు లేదా? ఆలోచించాలి. ఉప్పల లక్ష్మణరావు, కొడవటిగంటి, మహీధర రామ్మోహనరావు, వట్టికోట ఆళ్వారుస్వామి-ఈ రచయితలు గతంలో రాసిన నవలల్లోని జీవితమంత విశ్వసనీయంగా ఇప్పటి నవలల్లో జీవితం వుందా? జీవితం, పాత్రలు కూడా జీవితంలోని అభ్యుదయ విప్లవ పరిస్థితులకు అనుగుణంగా, అకృత్రిమంగా, ఎంతవరకు వున్నాయనేది కూడా చర్చించవలసి వుంది.

ఒకటి మాత్రం స్పష్టం. తెలుగు సగటు నవల, మధ్యతరగతి జీవితాన్ని ఎక్కువ ప్రతిబింబిస్తుంది. అయితే ఆ జీవితంలోని సర్వపార్శ్వాలు మాత్రం కన్పించవు - చాలామంది తెలుగు రచయితలు ఆ వర్గం నుంచే వచ్చారు కాబట్టి. వాళ్ళదృష్టినిఆకర్షిస్తున్న ప్రధాన సమస్య వివిధ జీవిత రంగాల్లోని పరాయితనం కాదు, వాళ్లు చూపే పరిష్కార మార్గాలు ఆదర్శవంతంగా, ధీరోద్ధతంగా వుంటే వుండవచ్చునే మోకాని సజీవమైన అనుభవాలుగా మాత్రం లేవు.

నెలనెలా, వారం వారం వస్తున్న నవలల్లోని జీవితమేదో వృత్తికి ఆరవేస్తే ఈ స్థితిలో మార్పు వస్తుంది. రచయితలు చాలా దగ్గరగా పొందిన జీవితానుభవాల నుంచి రాస్తే ఆ మార్పు వేగవంతమవుతుంది. వ్యాపార, కీర్తి చాపాల్యాలను మించిన స్థిరచిత్తం, చిత్తశుద్ధి అలవర్చుకుంటే ఆ మార్పు మరింత ముందుకు పోతుంది. దీన్ని అచ్చంగా పాఠకులు, పత్రికలు తిరస్కరిస్తారనుకోవడం ఆత్మవంచనే అవుతుంది. □

---

"నవల జీవితానికి ప్రతిబింబం. మిగిలిన అన్ని సాహిత్య ప్రక్రియలకన్న దీని పరిధి విస్తృతమయినది...నవలను మనం చాలా విధాలుగా చూడవచ్చు. కేవలం ఒక కథను చెప్పడం, కొన్ని ఆచార వ్యవహారాలను విదితం చేయడం, పాత్రల వ్యక్తిత్వాలనుచిత్రించడం, జీవితంపై ఒక దృక్పథాన్ని ప్రేరేపించడం-ఇవి అన్నీ నవల ఒక్కసారిగా గాని, వేరువేరుగా గాని చేస్తుంది."

—జె బి. ప్రీస్ట్లీ

---

# వ్యాపార నవల - ఒక పరిశీలన

ఈనాటి పరిస్థితులలో వ్యాపారనవల సాహిత్య సమస్య మాత్రమే కాదు - సామాజిక సమస్యగూడా. వ్యాపార నవల సృష్టించిన, సృష్టించుతున్న సమస్యలు సమాజంలో తీవ్ర పరిణామాలకు కారణభూతమౌతున్నాయి. అందుచేత వ్యాపార నవల పుట్టుపూర్వోత్తరాలను శాస్త్రీయంగా పరిశీలన చేసి, అవి సామాజిక చరిత్రతో ఎలా ముడిపడి ఉన్నాయో తెలుసుకోవలసిన అవసరం ఉన్నది.

ఫ్యూడల్ నాగరికతకు అద్దం పట్టిన మహాకావ్యం (epic) మీద తిరుగుబాటుగా బూర్జువా నాగరికత సృష్టించిన సాహిత్య ప్రక్రియ నవల. బూర్జువా నాగరికతను సృష్టించిన సామాన్య మానవునికి నవల సాహిత్య గౌరవాన్నిచ్చింది. బూర్జువా నాగరికతలో నుంచి పెట్టుబడిదారీ వ్యాపార నాగరికత ఉద్భవిస్తున్నకాలంలో వ్యాపార నవల కూడా ఉద్భవించింది. ఈ పరిణామం ఇంగ్లండువంటి దేశాలలో పందొమ్మిదవ శతాబ్దాంతానికి స్పష్టంగా రూపొందింది. పెట్టుబడిదారీ సమాజం సృష్టించుతున్న పొగ గొట్టపు ఘూంకార ధ్వనులకు దూరంగా ప్రకృతిలోకి ఆంగ్లేయ రొమాంటిక్ కవులు పారిపోతే, డికెన్స్ వంటి నవలా కారులు ఆ వ్యవస్థలోని అమానుషత్వాన్ని చిత్రించారు. పెట్టుబడిదారీ నాగరికత ఇరవయ్యో శతాబ్దంలో సృష్టించిన కళారూపం చలనచిత్రం. వ్యాపార నవల, ముఖ్యంగా తెలుగులో, బూర్జువా నాగరికత సృష్టించిన నవలకు, పెట్టుబడిదారీ వ్యవస్థ సృష్టించిన చలన చిత్రానికి పుట్టిన విష పుత్రిక. అందుచేత యిందులో యీ రెండు వ్యవస్థలలోని వికృత లక్షణాలూ ఉన్నాయి. అందుచేతనే మన వ్యాపార నవలకు ఉద్దీపన జీవితం కాదు - వెండితెర! ఈ రెండు కళారూపాలూ ఒకదాన్ని మరొకటి అనుసరిస్తూ, అనుకరిస్తూ దిగజారిపోవటంలో ఒకదానితో మరొకటి పోటీపడుతున్నాయి. కానీ నవలను చలనచిత్రాన్ని వాటిని సృష్టించిన నాగరికతల పొట్టవిప్పి అందులోని పురుగుల్ని చూపటానికి ఆయుధాలుగా వాడుతున్నారు కొందరు నిజమైన కళాకారులు.

సాహిత్య గౌరవం ఉన్న నవలకు, వ్యాపార నవలకు మధ్య ఉన్న అంతరం పెట్టుబడిదారీ వ్యవస్థతో బాటు పెరుగుతూ ఉండటం గమనార్హం. ఫీల్డింగ్, స్కాట్, జేన్ ఆస్టిన్, డికెన్స్‌ల కాలంలో ఆంగ్లంలోనూ, చిలకమర్తి, ఉన్నవ, బాపిరాజు, విశ్వనాథ ("తెరచిరాజు" వరకు)ల కాలంలో తెలుగులోనూ పై రెండు నవలా మార్గాలమధ్య నేడున్నంత అంతరం ఉండేది కాదు. చదివే అలవాటును పెంచటానికి ఎంతగానో సహాయపడిన ఆనాటి

వల్లంపాటి వెంకటసుబ్బయ్య

వ్యాపార నవలకు ఆనాటి పాఠకులు సాహిత్య గౌరవాన్ని యివ్వలేదు, పత్రికలు కీర్తి కిరీటాలు పెట్టలేదు, విశ్వ విద్యాలయాలు వాటిపై పరిశోధనలు చేయించలేదు.

ఈ అంతరం యింతగా పెరిగిపోవటానికీ, వ్యాపార నవలకు యింతకు ముందెన్నడూలేని ఆదరణ లభించడానికీ ఉన్న కారణాలు కూడా సామాజికమైనవే. వ్యాపారనవలకు ప్రధాన పాఠకులు మధ్యతరగతి ప్రజలు, ఒక వర్గం విద్యార్థులు. మధ్యతరగతి ప్రజల జీవితం నానాటికీ నరకంగా తయారౌతున్నది. ఈ వర్గానికి పై తరగతి జీవితాన్ని తప్ప, క్రింది తరగతి జీవితాన్ని చూడటం నచ్చదు. వారి ఆశలకు, అవకాశాలకు మధ్య పెరిగిపోతున్న అగాధాన్ని వారు పూడ్చలేరు. నిజ జీవితంలోని ఘర్షణలకు మధ్యతరగతి కనిపెట్టిన పరిష్కారం కమ్మని కలల లోకంలోకి పారిపోవటం. ఈ కలలకు ఆలంబన వ్యాపార నవల, అందులో చిత్రించబడుతున్న ఆవాస్తవ జీవితం. ఈ విషయంలో మధ్యతరగతికీ, నేటి యువతరానికీ పెద్ద తేడా లేదు. యువతరంలో, ముఖ్యంగా విద్యార్థి లోకంలో యీనాడున్నంత స్వార్థం ఏనాడూ లేదు. వీరిలో హెడోనిస్టు (hedonist) ధోరణులు మితిమీరి పోతున్నాయి. సమాజాన్ని గురించి, సాహిత్యాన్ని గురించి మౌలికంగా ఆలోచిస్తున్న విద్యార్థుల సంఖ్య క్రమంగా తగ్గిపోతున్నది. వీరు కూడా మధ్యతరగతి ప్రజలలాగే వాస్తవ జీవితం నుండి కలలలోకం లోనికి పారిపోవటానికి వ్యాపార చలనచిత్రంతోబాటు వ్యాపార నవలనుకూడా సాధనంగా భావిస్తున్నారు.

వ్యాపార నవల ప్రధాన లక్షణాలు ఏమిటి అన్నది తరువాత ప్రశ్న.

దీని మొదటి లక్షణం యిది సామాజిక నవల కాకపోవటం. ఇందులోని హీరోలు సూట్లు వేసుకుంటారు కాబట్టి, హీరోయిన్లు సినిమాలు చూస్తారు కాబట్టి, యిద్దరూ కలిసి అప్పుడప్పుడూ ఇంగ్లీషు వచ్చినట్టు నటిస్తారు కాబట్టి యిది సామాజిక నవల అనటానికి వీలులేదు. అందుకు కారణం యిందులో సమాజం లేకపోవటమే. ఇందులోని పాత్రలు సమాజంలోని మనుషులు కారు. ఒక మహా సముద్రంలో ఒకదానితో మరొకటికి సంబంధం లేకుండా తిరుగుతున్న పడవలు. వ్యాపార నవలలో సమాజం ఒక పాత్రగా, కనీసం దుష్ట పాత్రగానైనా కనిపించదు. మంచి నవల పాఠకునిలో జీవితంపట అవగాహనను పెంచుతుంది. ఎంతోకాలంగా అతడు వెదుకుతున్న ప్రశ్నలను, వీలుంటే సమాధానాలను సూచిస్తుంది. వ్యాపార నవల సాంఘిక నవలకాదు కాబట్టి ఈ కర్తవ్యాన్ని నిర్వర్తించలేదు.

మంచి నవల మానవ ప్రవర్తనను చిత్రించటమేకాక వ్యాఖ్యానిస్తుంది. పాత్రల ఆకార వికారాలను, ఆహార విహారాలను ఎంత వివరంగా వర్ణించినా పాత్రకు ఆవిష్కరణ జరగదు. తన సమకాలికులైన నవలాకారులు కొందరు జీవితపు పైపై మెరుగుల్ని మాత్రమే చిత్రిస్తున్నారని విమర్శిస్తూ వర్జీనియా ఊల్ఫ్ యిలా అన్నది:

"Life is not a series of jig-lamps symmetrically arranged. Life is a luminous halo, a semi-transperant envelop surrounding us from the beginning of consciousness to the end."

ఆమెదృష్టిలో రచయిత కర్తవ్యం ఆ Semi-transperant haloను చిత్రించటం. తెలుగులో వ్యాపార నవల నిత్యజీవితాన్నేకాదు మానవ ప్రవర్తనను కూడా చిత్రించటంలేదు. తాను చిత్రిస్తున్న పాత్రలకు అవ్యక్త చేతన ఉండవచ్చునన్న పరిజ్ఞానంతో పాత్రపోషణ చేయగలిగిన శక్తి యీ నవలా కారులకులేదు. ఈ విధంగా వ్యాపార నవల సమాజాన్ని, సమాజం నిర్ణయించే మానవ ప్రవర్తనను చిత్రించటంలో విఫలమౌతున్నది. తెలుగులో గత యిరవై సంవత్సరాలలో అనన్య ప్రచారం పొందిన నవలల్లో తొంభైపాళ్ళు సామాజిక నవలలు కావు. అధికార్లు. సూట్లు, సినిమాలు వున్న జానపద కథలు (folk tales). వాటిలోని పాత్రలు ఈ లోకానికి అమడ ఎత్తులో వున్న గంధర్వులు.

మంచి నవలకూ, వ్యాపార నవలకూ మరొక ముఖ్యమైన తేడా ఉన్నది. మంచి నవలలో కథ, కథావస్తువు రెండూ ఉంటాయి. కానీ వ్యాపార నవలలో కథ మాత్రమే ఉంటుంది. కథావస్తువు ఉండదు. అంటే నవల ఉద్దేశం కథ చెప్పటం మాత్రమే. కథను ఆధారంగా చేసుకొని జీవిత సత్యాన్ని ఆవిష్కరించటం కాదు. కధావస్తువు లేకందుచేత వ్యాపార నవలలో దృష్టికోణం (point of view), కథా వస్తువుపట్ల రచయిత దృక్పథాన్ని వ్యక్తంచేసే tone వుండవు. ఇవి రెండూలేని నవలకు సాహిత్య గౌరవాన్నిపొందే అర్హత లేదు.

మంచి నవల మానవ జీవితంలోని రాజకీయ, సామాజిక మనో వైజ్ఞానిక మొదలైన రంగాలలో ఒకదాన్నయినా చిత్రిస్తుంది. జీవితం యిలా ఉన్నది లేదా యిలా ఉండటానికి వీలున్నది అని సూచిస్తుంది. విశ్వ సాహిత్యంలో ఏ గొప్ప నవలను పరిశీలించినా అందులోని కథ, పాత్రలు దేశకాలాలను (time and space) కచ్చితంగా సూచిస్తాయి. వాటిని చిత్రించటంలో రచయిత చూపిన నిజాయితీవల్ల ఆ దేశ కాలాలను అధిగమించి ఆ నవల విశ్వసాహిత్యంలో చోటు చేసుకుంటుంది. తెలుగు దేశంలో ఒక ప్రాంతంనుండి మరొక ప్రాంతానికి వెళ్ళినప్పుడు భాషలో, జీవనవిధానంలో, పరిసరాలలో (topography) చెప్పుకోదగ్గ మార్పులు కనిపిస్తాయి కానీ తెలుగు వ్యాపార నవలలో యివి కనిపించవు. పాత్రలు ఏమాత్రమూ నుడికారపు సొంపులేని వారాపత్రికల భాషను మాట్లాడుతాయి. లేదా భావవ్యక్తీకరణలో దుర్భరమైన కృత్రిమత్వాన్ని ప్రదర్శిస్తాయి. సామాన్యంగా కథ జమీందారుల మేడలలో, సౌధాలలో, రహదారి బంగళాలలో, కాలేజీ వరండాలలో సాగిపోవటం చేత తెలుగు దేశపు ప్రకృతితో యీ నవలాకారులకు అవసరంలేదు

ఇందుకు ముఖ్య కారణాలు రెండు. జీవితంతోనూ, జీవిత సమస్యలతోనూ వ్యాపారనవలా కారులకు సంబంధం లేకపోవటం; జీవితాన్ని వ్యాఖ్యానించటానికి

ప్రయత్నించిన ఆధ్యాత్మిక వాదం (Spritualism) మార్క్సిజం, ఫినామినాలజీ మొదలైన దర్శనాలను గురించి వీరికి తెలియక పోవటం. అందుచేతనే వీరి సమకాలీన జీవితంలోని ప్రధాన సమస్యలపట్ల అవగాహన కరువై అపార్థాలు, అనుమానాలు మొదలైన అప్రధాన సమస్యలకు ప్రాధాన్యత నిస్తున్నారు. ఈ నవలలలో ఎక్కువ భాగం అసహజమైన రొమాంటిక్ ప్రేమ, కృత్రిమమైన కరుణ రసాలమీద ఆధార పడి ఉన్నాయి. తెలుగు వ్యాపార నవల జీవితంపట్ల విచక్షణా రహితమైనఆరాధనా దృష్టికి అంకితమై పోయింది. వీటన్నిటి వల్లా పాత్రలలో క్రమోన్మీలన కరువై ఈ నవలలు సంఘటనా ప్రధానంగా తయారయ్యాయి. ఇలా తెలుగు వ్యాపార నవల విషయం (content)లోనూ,పద్ధతి (form) లోనూ చవకబారు తనానికి (triviality) మారుపేరుగా ఉన్నది.

ఇంతవరకూ పేర్కొన్నవి వ్యాపార నవల ప్రధాన లక్షణాలలో కొన్ని మాత్రమే. వ్యాపార నవల మన భాషలోనే కాదు- అన్ని భాషలలోనూ ఉన్నది. ఉదాహరణకు ఆంగ్లంలో బార్బరా కార్ట్ లాండ్, డెనిస్ రాబిన్స్, మిల్స్ అండ్ బూన్, గ్రేస్ మెటాలియస్ మొదలైన నవలాకారులకు గొప్ప ప్రచారం ఉన్నది. వారి నవలలు మిలియన్ల ప్రతులు ఖర్చవుతున్నాయి. కానీ విమర్శకులు, సాహిత్యాభిమానులు వారికి సాహిత్య గౌరవాన్ని యివ్వటం లేదు. చివరకు మేరీ కొరెలి వంటి రచయిత్రికి కూడా సాహిత్య గౌరవం దక్క లేదు. ఆవిడకు ఎందులోనూ సాటిరాని తెలుగు వ్యాపార నవలాకారులకు అది దక్కటంలో అర్థంలేదు.

మన పత్రికలలో కొంతమంది విమర్శకులు శిల్ప విషయాలను మాత్రమే దృష్టిలో ఉంచుకొని వ్యాపార నవలల మీద సమీక్షలు రాస్తున్నారు.శిల్పం బాగా ఉండటం, ఉండకపోవటం అన్నది యీ నవలల విషయంలో ప్రధాన సమస్య కాదు. శ్రీమతి క్యు. డి. లీవిస్ అన్న మాటలు యీ సందర్భంలో జ్ఞాపకం చేసుకోవటం మంచిది.

"A great technical accomplishment can co-exist with an inferior mind............A bad novel is ultimately seen to fail not because of its method,but owing to a fatal inferiority of its author's make-up."

మన సమాజంయీనాడున్న పరిస్థితిలో వ్యాపార నవల ప్రమాదకరమైన పరిణామాలను సృష్టిస్తున్నది. దీపంగా ఉండవలసిన సాహిత్యం వ్యాపార నవలాకారుల చేతిలో మత్తు మందుగా తయారయింది. ప్రజల లో చైతన్యాన్ని పెంచవలసిన నవల కలల లోకాల్లోకి పారి పోవటానికి సాధనంగా ఉపయోగపడుతున్నది. ఈ నాటి సమాజం కలలలోకి పారిపోవటాన్ని మించిన దుష్పరిణామం మరొకటి లేదు. అందుచేతనే మరొకసారి అంటున్నాను "వ్యాపార నవల సాహిత్య సమస్య మాత్రమేకాదు, సామాజిక సమస్య కూడా."

□

# తెలుగు నవల - సోషలిస్ట్ వాస్తవికత

ఆధునిక సాహిత్య ప్రక్రియలో పేర్కొనదగినది నవల. నేడు నవలకున్న ప్రజాదరణ మరే యితర ప్రక్రియకూ లేదు. 1867 నాటికి తెలుగులో నవలరాసే ప్రయత్నం ప్రారంభమైందని చెప్పవచ్చునేమో కానీ, ఆనాటికి తొలి తెలుగు నవల ఆవిర్భవించిందని చెప్పలేము. ఆ ఆవిర్భావం 1872 లో జరిగింది.

కాలం మారుతున్న కొద్దీ ప్రజల అభిరుచుల కనుగుణంగా నవలా రచనా స్వరూపం కూడా మారిపోతుంది. జాతీయంగా అంతర్జాతీయంగా వస్తూన్న మార్పుల ప్రభావం నవలాసాహిత్యంపై కూడా ఉంది.

సాహిత్యంపై మార్క్సిజం ప్రభావం పెరగడంతో రచయితల దృక్పథాల్లో మార్పు స్పష్టంగా కనపడసాగింది. యిలాంటి మార్పుకు ప్రధాన కారకులు రష్యన్ రచయితలు - ముఖ్యంగా మాక్సింగోర్కి. తెలుగు నవలా రచయితలపై కూడా ఈ ప్రభావం స్పష్టంగా కనపడి భౌతికవాద దృక్పథంతో మానవ సమాజ పరిణామానికి మూల సూత్రాలను తెలుసుకుని, ఆ అనుభవంతో తెలుగు నవలా రచయితలు సాహితీ సృజనచేశారు. అట్టి భౌతికవాద దృక్పథం కలిగిన తెలుగు రచయితలు కాల్పనిక సిద్ధాంతానికి పూర్తి విరుద్ధమైన "రియలిజం" (వాస్తవికత) అనే సాహితీ పద్ధతిలో రచనలు చేశారు. 1850-1880ల మధ్య ఈ వాదం బహుళ ప్రచారంలోకి వచ్చింది.

వాస్తవికత కూడా సమాజంతోపాటే క్రమంగా పెంపొందుతూ వచ్చింది. అలాంటివాటిలో వ్యంగ్యకారులు ఉన్నత వర్గాల వారిని హేళనచేయడానికి ఈ ప్రక్రియను వాడి, దానికి "ప్రోగ్రెసివ్ రియలిజం" అంటే "అభ్యుదయ వాస్తవికత" అని పేరు పెట్టుకున్నారు. బాల్జాక్ డికెన్స్ మొదలైన వారు దీనికి ప్రతినిధులు; మరికొందరు మధ్యమవర్గీయులు సమాజాన్ని నిరాశా దృక్పథంతో చూసి రచనలు సాగించారు. ఇందులో గుస్టావ్ ఫ్లాబర్ట్, థామస్ హార్డీలు ముఖ్యులు. వీరి పద్ధతికి "పెసిమిస్టిక్ రియలిజం" అంటే నిరాశా వాస్తవికత అని పేరు. సమాజ పరిణామాన్ని సమగ్రంగా సాహితీ బద్ధం చేసిన తొల్‌స్తోయ్‌లాంటి రచయితలు "హిరోయిక్ రియలిస్ట్"లుగా పేరుపొందారు. అంటే వీరి రచనలను 'వాస్తవిక మహాకావ్యాలు' అని పిలువవచ్చు. కేవలం కార్మికుల జీవితాలను చిత్రించే రచనలకు "ప్రొలిటేరియన్ రియలిజం" అని పేరు వచ్చింది. ఆ తర్వాత "క్రిటికల్ రియలిజం" అంటే సవిమర్శక వాస్తవికత పుట్టింది.

ఇంతవరకూ ఈ రూపాలన్నీ పెట్టు

బడిదారీ విధాన ప్రాదుర్భావమూ, దాని పెరుగుదలతోపాటు అవతరించాయి. కార్మికవర్గం సంఘటితమైన ఒక నిర్దిష్టమైన ప్రపంచ దృక్పథాన్ని సంపాదించుకుంది. అసమానతకు ఆలవాలమైన పెట్టుబడిదారీ వర్గ సమాజం స్థానే వర్గరహిత సోషలిస్టు సమాజస్థాపన ధ్యేయంగా పోరాటాలు సాగించడంతో సోషలిస్టు వాస్తవికత సాహిత్యరంగంలో అవతరించింది.

సోవియట్ రాజ్యం నెలకొన్న తర్వాత 1934లో సోవియట్ రచయితల మహాసభ జరిగింది. ఆ మహాసభలో ప్రసంగిస్తూ, గోర్కీ "ఇప్పుడు మన రచనలకు నాయకుడు- కార్మికుడు" అన్నారు. "కార్మికుడంటే, శ్రమద్వారా సువ్యవస్థితుడైన మనిషి. శ్రమ సృజనాత్మక శక్తి అనే విషయాన్ని మనం ఎప్పుడూ జ్ఞాపకం ఉంచుకోవాలి" అన్నాడాయన. ఇలా జ్ఞాపకం చేసుకు చేసే రచనలకు ఆయన సోషలిస్టు వాస్తవికత అని పేరు పెట్టారు.

## నిబద్ధత- నిమగ్నత- సాక్షికత:-

సోషలిస్టు వాస్తవికత కలిగిన రచనలను 'కమిటెడ్ రచనలు' అంటాము. పెట్టుబడిదారీ, భూస్వామ్య వ్యవస్థను నిలిపి సమసమాజ స్థాపనకై నేడు ప్రపంచ వ్యాపిత పోరాటాలు జరుగుతున్నాయి. ఇది కేవలం ఒక రాజకీయ సమస్య కాదు. చారిత్రక పరిణామంలోని దశ. సైద్ధాంతిక, తాత్విక ప్రాతిపదికలు కలిగిన ఒక మహా సామాజిక విప్లవం: పీడిత ప్రజలు, కార్మిక, రైతు, మధ్య తరగతి, మేధావివర్గాలందరూ యీ మహా విప్లవంలో వస్తురీత్యా భాగస్వాములు. భౌతికంగా వారి ప్రయోజనాలు ఈ విప్లవంలో యిమిడివున్నాయి. అందువలన వారి జీవితాన్ని, పోరాట క్రమాన్ని చిత్రించే నేటి రచయితకు సాక్షికత- పార్టిజాన్‌షిప్-అవసరం. తాత్విక దృష్టి కలిగిన విప్లవ పోరాట సిద్ధాంతాలు ఒక లాంగ్ టెర్మ్ ఆబ్జెక్టివ్‌ను సాధించడానికి అవసరం. అలాంటి తాత్విక దృష్టి కలిగిన సిద్ధాంతాలు రాజకీయమూ కావచ్చు సామాజికమూ కావచ్చు; ఆర్థిక, కళా సాహిత్యాల గురించీ కావచ్చు. సాహిత్యరంగం ద్వారా తలపెట్టిన సాంస్కృతిక విప్లవానికి సంబంధించిన తాత్విక నిబద్ధత (ఐడియలాజికల్ కమిట్‌మెంట్) రచయితకు అవసరం. ఈ సిద్ధాంత నిబద్ధత రాజకీయ, ఆర్థిక, విప్లవ సిద్ధాంతాలకు పునాదిగా వుంటుంది. రచయిత- తాత్విక సైద్ధాంతిక నిబద్ధత కలిగియుండి శ్రామిక జన పక్షపాతాన్ని కలిగివుండి, శ్రమజీవులు నూతన వ్యవస్థా నిర్మాణంకోసం జరిపే పోరాట క్రమంలో నిమగ్నత కలిగియుండాలి. ఖర్మవీరులు- కర్మ వీరులుగా వుండి జరుపుతున్న పోరా

క్రమంలో రచయితఅగ్ర భాగాననిలవాలి. ఈ విధంగా సోషలిస్టు వాస్తవికతా రచయిత నిబద్ధత, నిమగ్నత, పాక్షికత అనే సిద్ధాంతాలకు అనుబంధం కలిగివుండాలి. సమాజంలోని వైరుధ్యాలను రచయిత సరిగా అవగాహన చేసుకోవాలి. శ్రామిక జన పక్షపాతాన్ని మినహాయిస్తే సోషలిస్టు వాస్తవికత లేదు. ఈ వైఖరి అన్ని కళారీతుల్లో అభివృద్ధి చెందనిచో వాస్తవికత, ఫోక్ కేరెక్టర్ వాటియొక్క చారిత్రక, సామాజిక స్వరూపాన్ని కోల్పోతాయని 'DEZSO TOTH' అనే హంగేరియన్ విమర్శకుడు అభిప్రాయపడెను. 'పరిణతిని సాధించిన వర్గపోరాటానికి శ్రామికజన పక్షపాతం తప్పనిసరిగా వుండవలసిన లక్షణం' అని లెనిన్ చెప్పాడు.

## రచయిత - సిద్ధాంత అవగాహన:

నేటి తెలుగు నవలా రచయితలు సమాజంలోవివిధ రంగాలలోమార్పులనూ ప్రత్యేకించి సాహితీరంగంలో వస్తున్న మార్పులను, స్పష్టంగా పరిశీలించి - అట్టి మార్పులయొక్క పరిణామ క్రమమును గురించి ఒక స్పష్టమైన అవగాహనను ఏర్పరచుకోవాలి. నేటి సాహిత్యంపైన మార్క్సిజం ప్రభావం ప్రధాన అంశం కనుక, రచయితలు మార్క్సిజం దృక్పథంతో - అంటే చారిత్రక, భౌతిక వాద దృక్పథంతో - సాహితీ పరిణామ చరిత్రను, సాహిత్యానికి అవసరమయిన ముడి పదార్థంగా సంఘటనాత్మక, సామాజిక జీవిత క్రమాన్ని అధ్యయనం చేయాల్సిన అవసరం వుంది. మార్క్స్ - "క్రిటిక్ ఆఫ్ పొలిటికల్ ఎకానమీ". అనే గ్రంథంలో ప్రతిపాదించిన చారిత్రక భౌతిక వాద మూల సూత్రాలు - 1. నిర్దిష్టదశలోనే ఉత్పత్తి శక్తులకు అనుగుణ్యంగా ఉత్పత్తి సంబంధాలు వుంటాయి. 2. మానవుల భౌతిక వాస్తవికత వాళ్ళ చైతన్యాన్ని నిర్ణయిస్తుంది. 3. ఆర్థిక వ్యవస్థ ఉపరితల నిర్మాణాన్ని నిర్ణయిస్తుంది. నియతం చేస్తుంది. ఈ చారిత్రక భౌతిక వాద మూల సూత్రాల నాధారంగా నేటి సామాజిక జీవన విశ్లేషణ రచయిత చేయాలి; సాహిత్యం ద్వారా సాంస్కృతిక రంగంలో విప్లవం వస్తుంది. యీ విప్లవం దానంతటదే రాకుండా కొన్ని విప్లవ రాజకీయ చర్య కారణంగా వస్తుంది. విప్లవానికి ఆర్థికం పునాది. సాహితీ కళారంగాలు ఉపరితలం. అందుకనే రచయిత మార్క్సిజాన్ని సామాజిక విప్లవ సిద్ధాంతంగా అవగాహన చేసుకొని, సాహిత్యం స్వతంత్ర ప్రతిపత్తిగల రంగంగా క్రియాపడక, సమాజంయొక్క ఉత్పత్తి సంబంధాలలో అంతర్భాగమని గ్రహించి రచనను చేయాలి. సాహిత్య నిబద్ధత రాజకీయ సైద్ధాంతిక నిబద్ధత నుండి విడిగాలేదని గ్రహించాలి. ప్రజల విప్లవ కార్యాచరణలో భాగంగానే సాహిత్యరంగంలో వర్గపోరాటం చేయడం సాహిత్యంలో నిబద్ధత. సమాజంలో ఇతరులకు భిన్నంగా ఒక వ్యక్తికి, రచయితకైనా సరే నిర్దిష్టమైన ప్రతిపత్తిని మార్క్సిజం అంగీకరించదు. వ్యక్తి అనే ఏకాకిని గురించి ఆలోచించడమే గతితర్క విరుద్ధం; సమాజం అంటే కేవలం వ్యక్తుల సముదాయం కాదు. ఉత్పత్తి క్రమంలో వ్యక్తులయొక్క అన్యోన్య

సంబంధాల సమాహారమే సమాజము: మనిషి బాహ్య ప్రపంచాన్ని జడాత్మకంగా ప్రతిబింబించుకోడు. క్రియాశీలంగా వ్యవహరిస్తాడు. గతితార్కిక భౌతిక వాదం వాస్తవికతను ఒక క్రమంగా, ఒక చలనంగా, మార్పుగా వివరిస్తుంది. మానవ చరిత్రను మానవులే నిర్మిస్తారు. మనిషిని - మనిషిగా చేసేది శ్రమ; చైతన్యం, చైతన్యవంతమైన కార్యాచరణ. సాహిత్య చరిత్రమీద తప్పుడు చైతన్యంతో కూడిన భావవాద దృక్పథం, విమర్శనాత్మక వాస్తవికత, సంస్కరణ వాద దృక్పథం, - వర్గ సమాజ క్రమ ఫలితం. యీ తప్పుడు చైతన్యాన్ని, వర్గ సమాజాన్ని నిర్మూలించినప్పుడే దీన్నికూడా నిర్మూలించగలం: ఈ మౌలిక సిద్ధాంతాలను నేటి నవలాకారులు అవగాహన చేసుకోవాల్సిన అవసరం వుంది. ఈ సిద్ధాంతాలను ఆధారంగా చేసుకొని సాహిత్య ప్రయోజనాలు ఏమిటి? సాహిత్యం ఎవరికొరకు? రచయితలు ఎవరిపక్షం? అనే విషయాలు కూడా నేటి రచయితలు తెలుసుకోవాలి: సాహిత్యం ప్రజలకు ఉపయోగపడాలి. "కళ ప్రజలది దాని వేళ్ళు ప్రజానీకం లోనికి లోతుగా చొచ్చుకుపోవాలి" అని లెనిన్ అన్నాడు. చైతన్యవంతమైన మానవుని విజయాలన్నీ ఎవరో మైనారిటీ వర్గమందు వున్న కొద్దిమంది ధన స్వామ్యానికి కాక కోట్లాది శ్రామిక జనానికి ఉపయోగపడాలి." అని లెనిన్ అభిప్రాయ పడ్డాడు. ఇక్కడ సాహిత్యం ప్రజలకు ప్రయోజనాత్మకంగా వుండాలి- అనడంలో.... కళాత్మక విలువలను దిగజార్చడం అను భావనకు చోటు లేదు కళ ప్రజలకు సంబంధించినది. అంటే - ఆ ప్రజలు ఎవరు? అనే సందేహం కలగవచ్చు: "నూతన వ్యవస్థా నిర్మాణ పోరాట క్రమంలో భావరూపేణాగాని, ఆలోచనాత్మకంగా గానీ, చైతన్య వంతమైన క్రియాశీల పాత్రని నిర్వహిస్తూ విప్లవ పోరాటాన్ని విజయవంతం చేసే క్రమంలోని భాగస్వాములే 'ప్రజలు' - అని భావించుకోవాలి:

## తెలుగు నవలపై సోషలిస్టు వాస్తవికతా ప్రభావం:

ఆధునిక తెలుగు నవలా రచయితపై మార్క్సిజం ప్రభావం ఏ మేరకు ఉన్నదో పరిశీలించాల్సిన అవసరం వుంది. ఈ క్రమంలో తొలుత మాలపల్లి రచయిత అయిన శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణను పేర్కొనాలి. ఈయనపై మార్క్సిజం ప్రభావం సిద్ధాంతపరంగా స్పష్టంగా ఉన్నదీ, లేనిదీ చెప్పలేక పోవచ్చుగాని, ఆనాడు ప్రపంచంలో వస్తున్న మార్పుల ప్రభావం మాత్రం వుందనడానికి సందేహం లేదు. ఆయన 1922లో మాలపల్లి రాసేనాటికి 5 సం॥ల ముందు మాత్రమే 1917లో రష్యాలో సోషలిస్టు విప్లవం వచ్చింది. సోవియట్ దేశంలో వచ్చిన బోల్షివిక్ ఉద్యమాన్ని గూర్చిన ప్రస్తావన మాలపల్లిలో ఉన్నది.

నవలలో భూసమస్యను తీసుకోవడం జరిగింది. రామదాసు కొడుకులయిన సంగదాసు, వెంకటదాసు రెండు విభిన్న మార్గాలలో పరోక్షప్రపంచ నిర్మాణానికి పూనుకొన్నారు సంగదాసుది గాంధీ మార్గం. వెంకటదాసుది హింసా మార్గం. వెంకటదాసు పద్ధతి సామ్యవాద పద్ధతి. వెంకటదాసు చనిపోతూ చెప్పిన మాటలు- "అందరూ పనిచెయ్యాలె. అందరికీ

ఒకటే భోజనం ఒకటే మోసరు గుడ్డలు. రేపనే దిగులులేదు. పోటీలులేవు. అదుర్దా లేదు" అనేమాటల్లో హింసామార్గంద్వారా సామ్యవాద సిద్ధాంతాన్ని సాధించాలి— అనే చారిత్రక ఆశావాదం ఉన్నట్లు కని పిస్తున్నది. ఆనాటి భారతీయ సమాజంలో కూడా వర్గవిభజన, భూస్వామ్య దోపిడి, అంటరానితనమూ ఉండటంవల్ల ఆ భూస్వామ్య వ్యవస్థమీద రచయిత తన కున్న ప్రగతి భావాలను ఆయా పాత్రల ద్వారా వెల్లడిచేస్తాడు. వ్యవస్థకు వ్యతిరే కంగా పోరాడిన ఆనాటి సమాజంయావతూ భూస్వాములు కాలేదు గనుక నాటి పోరా టాలు వైయక్తికంగా నిలిచిపోయాయి. కాని సామూహిక తత్వానికి ప్రతీకలని మాత్రమే అనుకోవాలి. అందువలన మాలపల్లిలో సోషలిస్టు వాస్తవికతా ధోరణి ప్రతిబింబించలేదుగాని, ఆనాటి చారిత్రక పరిస్థితుల్నిబట్టి పునాదులువేసిం దని చెప్పవచ్చు.

మాలపల్లి తరవాత నవలాసాహిత్యంలో రాజకీయ ఉద్యమాల ప్రభావం ఫలితంగా వచ్చిన నవలల్లో శ్రీ వట్టికోట ఆళ్వారు స్వామి వ్రాసిన 'ప్రజలమనిషి' చెప్పుకో దగింది. దీని రచనా కాలం 1952–55. 1946లో నిజాంకు వ్యతిరేకంగా వచ్చిన ప్రజా ఉద్యమంలో ప్రత్యక్షంగా తను పాత్రవహించి ఆ సంఘటనలను తన నవలలో ప్రతిబింబించాడు. ఉద్యమ ఫలి తంగా ఆళ్వారుస్వామి మరింత చైతన్య దీప్తుడై ప్రజలమనిషిగా మారి 'ప్రజల మనిషి' నవలలో కంఠీరవం పాత్రను ప్రజలమనిషిగా రూపొందించాడు. 1938 నాటి తెలంగాణాప్రాంత ప్రజలు వెట్టిచాకి రికి గురై అణగారినజీవితాన్ని గడిపారు.

ఈ నవలలోని ప్రధానపాత్ర కంఠీరవం చైతన్యంతో సామాజిక స్పృహ కలిగి వుండి ఆవ్యవస్థమీద తిరుగుబాటుచేసింది. విప్లవ కార్యక్రమాలలో నిమగ్నుడై, ఇల్లువదిలిపోతే, దుఃఖిస్తున్న తల్లితో ఇలా అంటాడు. "ఇది చదువుకంటే తక్కువేమీ కాదమ్మా! ....రాంభూపాల్ రావు, వెంకటాచార్యులు, హైదరాలీలు మన వూరిలోనేకాదు. ప్రతిచోటాఉన్నా రమ్మా. వాళ్ళెక్కడ ఉన్నా నాకీ చదు వులు తప్పవు" అని విప్లవ కార్యాచర ణలో నిమగ్నుడు కావడం ఆ పాత్రలో కనిపిస్తుంది. దిమ్మగూడెం గ్రామంలోని చెరువు లోతట్టుభూమి ప్రజలకు తెలియ కుండా రామభూపాల్‌రావు హరాజ్ పెట్టించినపుడు అక్కడి ప్రజల తరఫున పరంధామయ్య, కొమరయ్య, హర్రాజులు, సంబంధించిన చట్టపరమైన ప్రశ్నలెన్నో వేసి పోలీసులను ఈవిధంగాఅడుగుతారు.

"దొరకింద నలిగి నలిగి విసిగి వేసాం ఎండుగడ్డివలె ఉన్నారు ప్రజలు. వాళ్ళపై మీరు తుపాకులు కాలుస్తారా? ప్రజలపై అన్యాయాలుచేసి జైళ్ళకు పంపి, కాల్చి చంపి గుట్టలనో,రాళ్ళనోపరిపాలిస్తారా?" అని నిలదీసి అడిగారు. ఈ ఏకమైన అణచివేత, చైతన్యానికి దోహదం చేసి ఉద్యమానికి మార్గం ఏర్పరచింది. ఈ నవలలో ప్రధానమైన సమస్య భూమి. భూ సమస్య ప్రజాచైతన్యానికి ఇరుసుగా ఉండి అణగారిన ప్రజల్లో విప్లవజ్వాలల్ని రగిలించి నూతన వ్యవస్థ నిర్మాణానికి క్రియాశీల పాత్రధారులుగా ప్రజలు ముందుకు రావడం గమనించవచ్చు. ప్రజలే చరిత్ర నిర్మాతలని రుజువుపరిచి సోషలిస్టు వాస్తవికతని కాకపోయినా వర్గ

పోరాట దృక్పథాన్ని మాత్రం ప్రతిబింబించిన నవల యిది.

ఈ క్రమంలో ఆ తర్వాత వెలువడిన అనేక తెలుగు నవలల్లో చెప్పుకోదగినవి గానీ, ఆధునిక చైతన్యంతో రాయబడినవి గానీ దాదాపుగా లేవు. అయితే యీ సంవత్సరమే అచ్చయిన అల్లం రాజయ్యగారి 'కొలిమంటుకొన్నాది' అను నవల పరిశీలనకు అర్హమయినది.

ఈ నవల అచ్చయిన కరీంనగర్, ఆదిలాబాద్ జిల్లాల మాండలీకంలో రాయబడింది. ప్రజావెల్లువ, చైతన్యం కళ్ళకు కట్టినట్లు చిత్రించే పోరాట జీవిత చిత్రణ యీ నవల. మాండలికం పాఠకుల సౌలభ్యం కోసం ఏర్పరచుకొన్న రచనా భాష అవునా, కాదా అనే విషయాన్ని వదిలేసి యితివృత్తం పాత్ర పోషణ, పోరాట కార్యాచరణ అను విషయాలను పరిశీలించినట్లయితే యీ దశాబ్దంలో వెలువడిన ఆధునిక చైతన్యంతో కూడిన నవలల్లో దీనిని ప్రధానంగా చెప్పుకోవచ్చు. ప్రధాన యితివృత్తం - భూ పోరాటం. భూమి సమస్య- వ్యక్తి చైతన్యం- పదార్థ మూలకం.ఈ భూమి సమస్యలోనే శ్రమజీవులచైతన్యం వికసిసుంది అనడానికి- నవలలోని ప్రధాన పాత్ర-నరసింహం- ప్రతీక। ఆ వ్యక్తి చైతన్యం వర్గ చైతన్యంగా రూపొంది సమిష్టి కార్యాచరణ, అనివార్య వర్గ సంఘర్షణ, రచయిత సమర్థవంతంగా చిత్రించాడీ నవలలో. "కూసుబెట్టినా, కూలగొట్టినా బూ దేవతే' అని ఆ నవలలోని మరో పాత్ర సాంబయ్య అంటాడు."పండించేది మనం....తినేదియింకోల్లు" అని గ్రహించిన యువతరం ప్రతినిధి సెంద్రయ్య "మొదగాల బతుకేర్పడితే ఏపని జేసుడో తేలది. నేను పొకలకోసం పన్జెయ్య.... నా కోసరం పనిజేసుకొనేదమక గిట్లనే తిరుగుత. సత్తె కొట్లాడుకుంటనే సత్త" అని అంటాడు. "పగదీసుకోటంగాదు. మనగ్గావాలె బూములు. మనల్ని సంపకుంట తన్నకుంట దొర బుద్ది కలిగున్నా మన కట్టం దీరది-మన ఎట్టి తప్పది. మన కట్టాలు తీరాలంటే మనకు బూమి కావాలె....దానికోసరం మనండ్ల ఎందరం సెల్లిపోయినా పర్వాలేదు" అని పోరాట లక్ష్యాన్ని గూర్చి చెపుతాడు- నరసింహం. "ఎవడుకొంద్రవేసి దున్నితేఅనిదే బూమి ....ఎవడు పాలెబడితే ఆనిదే అరక. ఎవడు మేపి, సాది, సవరచ్చని జేత్తడో అనియే ఎడ్లు, యిన్నారా? నేనేడాదికింద బూమునోప్పిన్నే .... యియ్యాల్ల రెండు లెక్కలే మిగిలినయ్. ఏడబోయింది నా బూమి?"అని అంటూ ఈ వ్యవస్థలో ఉన్నటువంటి చెడును ప్రశ్నిస్తాడు.

ఈ నవలలో నరసింహం, గుడ్డి గట్టయ్య, సెంద్రయ్య, సాంబయ్య లాంటి పాత్రలు ఒక లక్ష్యాన్ని ఆశించి క్రియాశీలతతో పోరాడిన కాన్సస్ ప్రొలిటేరియన్ రివల్యూషనరీ హీరోస్ —— పాజిటివ్ హీరోస్.నేటిరచయితలు,ఇలాటి నెత్తురు మాంసాలు కలిగిన సజీవ పాత్రల్ని సృష్టించి, ప్రజా చైతన్యాన్ని వికసింపజేయాల్సిన బాధ్యత తీసుకోవాలి.

ఇక్కడ సందర్భం కాసిస్తోంది గనుక ప్రక్రియలో అసంగతమైనదైనా విషయంలో ఉచితంగా వున్నది గనుక మరో మాట చెప్పాలి. పై నుదహరించిన నవలలే గాక, సాహితీ విమర్శ పేరుతో పాఠకులపై రుదుతున్న మరోరకం "సూడో రియలిస్ట్" సాహిత్యాన్ని

గూర్చి కొంత జాగ్రత్త పడవలసిన అవసరం వున్నది. శ్రీ సోదుం రామ్మోహన్‌గారి 'సాహిత్యావలోకనం' అనే సాహితీ విమర్శనా గ్రంథంలో 'క్షమిస్తే రెండు మాటలు' అన్న ముందుమాటలో యీ విధంగా రాశారు. "ఈనాడు రాస్తున్న ఎక్కువ మంది రచయితలు మధ్యతరగతి కుటుంబాల నుంచి వచ్చిన వాళ్ళే కాబట్టి, యీనాటి తెలుగు (లేదా భారత) కార్మికుల్లో అత్యధికులు విద్యావంతులు కాదు. అంతో యింతో విద్య వున్నా మీ రాతలు చదివేందుకు వాళ్ళకు అవకాశాలు లేవు కాబట్టి మధ్యతరగతి జనం గురించి రాయడమే సహేతుకంగా వుంటుందనుకొంటా" (పే. 12) అని పాము చావక, బడితె విరగని రీతిలో చెప్పారు. తర్వాత అదే గ్రంథంలో "కార్మికవర్గ పక్షపాతాన్ని ప్రదర్శించేందుకు రచయిత తప్పనిసరిగా శ్రమజీవులున్న కథనో, నవలో ఎన్నుకోవాల్సిన పనిలేదు. యీనాటి మన రచయితలు అత్యధిక సంఖ్యాకులు మధ్యతరగతి కుటుంబాలకు చెందినవాళ్ళే కాబట్టి వారికి శ్రమజీవుల జీవనపరిస్థితుల గురించిగానీ, అలవాట్ల గురించిగానీ అంతగా తెలిసి వుండకపోవచ్చు. అలాంటి వారినిగూర్చి రాయడానికి ప్రయత్నిస్తే అభాసుపాలయ్యే ప్రమాదం వుంది. అంచేత, అలాంటిరచయితలు మధ్యతరగతి పాత్రలతో కూడిన కథలూ, నవలలూ రాయొచ్చు." (పే. 19) అన్నారు.

రచయిత మధ్యతరగతి కుటుంబాలకు చెందిన వారు కావడం, వారికి శ్రమజీవుల పరిస్థితులగూర్చి తెలియక పోవడం, కనీసం తెలుసుకోడానికి ప్రయత్నించక పోవడం వారి తప్పుగా కాకుండా శ్రమజీవుల, పాఠకుల తప్పుగా భావిస్తున్నట్టున్నారు వీరు. రచయిత తన అమాయకత్వాన్ని కప్పిపుచ్చుకోడానికి, తెలిసికోవాలని ప్రయత్నం చేయ సమర్థతలేనితనాన్ని కప్పి పుచ్చుకోడానికి, బూర్జువా సాహిత్యాన్ని సృష్టించడానికి ప్రయత్నించమనివారు సలహాఇవ్వడం, సమాజం మార్పుపట్ల వారి అభిప్రాయమేమిటో స్పష్టంగా తెలుస్తుంది. కార్మికవర్గ పక్షపాతం అనే విషయం కూడా సిద్ధాంత పరంగా అధ్యయనం చేయడంలో వారికున్న అవగాహన ఎంతో తెలుస్తుంది. ఇలాంటి తప్పుడు బూర్జువా భావవాద సాహిత్య దోరణులు కలిగిన యధాతధ వాస్తవికతా విమర్శలు కూడా సోషలిస్టు రియాలిజంకు ప్రతిబంధకాలని నేటి పాఠకలు శాస్త్రీయ సైద్ధాంతిక అవగాహనతో చూడగలిగి తిరస్కరించ గలగాలి.

ఈనాడు వస్తున్న పుస్తకాలయొక్క భవిష్యత్తు పాఠకుడు వాటిని ఎలా స్వీకరిస్తాడో అనే దానిమీద కాక, పాఠకుల యొక్క భవిష్యత్ పుస్తకాలు ఎలా నిర్ణయిస్తాయి అనే విధానం గమనించవలసి వుంది. రోమన్‌రచయిత టెరిన్స్ చెప్పినట్లు "పుస్తకాలను పాఠకులు ఎలా గ్రహిస్తారు అనే దానిమీద వాటి బతుకు (ఫేట్) ఆధారపడి ఉంటుంది" అని కాకుండా, నేటి సమాజంలో సాహిత్యం ప్రముఖ పాత్రను పోషిస్తోంది కనుక ఈనాడు "పాఠకుల బతుకు (ఫేట్) వారు చదివే పుస్తకాల ననుసరించి రూపొందుతుంది" అని గుర్తించి, నిజమైన సోషలిస్టు వాస్తవికతా సాహిత్య సృజనకోసం, శ్రామిక జన పక్షపాత వైఖరితో, సామాజిక బాధ్యతతో రచయితలు కలం పట్టాలి. ❑

# తెలుగు భాషలో రాజకీయ నవల

మహీధర రామమోహనరావు

ప్రారంభదినాలలో తెలుగునవలలలో సామాజిక, చారిత్రక విభాగాలు మాత్రమే కనిపించేయి. తరవాత వైజ్ఞానిక (విహంగ యానము) నవలపేరు వినబడింది. మనో వైజ్ఞానిక నవల వచ్చింది. రాజకీయ నవల వ్రాస్తున్నాననే పరిజ్ఞానంగాని, అటువంటిది వ్రాయాలనే సంకల్పంగాని లేకుండానే నేను వ్రాసిన రథచక్రాలు మొదలైనవి రాజకీయ నవలలుగా ప్రసిద్ధి పొందాయి. రాజకీయ నవలలు వ్రాసే వాడుగా నాకు పేరు పడి పోయింది. ఇప్పుడీ నాడు తెలుగులో రాజకీయ నవలను గురించి ఈ గోష్ఠిలో సమర్పించేందుకై వ్యాసం వ్రాయవలసిందిగా కోరేరంటే అదే కారణం. నిజం చెప్పాలంటే రాజకీయ నవల అంటే ఏమిటి? అదెల్లా వుండాలనే ఆలోచన నేనెప్పుడూ చెయ్యలేదు. నువ్వు రాజకీయ నవలలు వ్రాస్తున్నావని అందరూ అంటూంటే కాబోలుననుకున్నాను. అల్లా అనుకున్నందుకు ఈవేళ దానిని గురించిఆలోచించడం అవసరమవుతూంది.

రాజ్యాలు, రాజులు మధ్య స్నేహాలు, శత్రుత్వాలను చిత్రించే నవలలను రాజకీయాలు అనవచ్చునైతే చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి అహల్యాబాయి, భోగరాజు నారాయణమూర్తిగారి అల్లాహెూ అక్బర్ వంటివి రాజకీయ నవలలే అయేవి. కాని, వాటిని మనం చారిత్రక నవలలనే అంటున్నాం.

మతతాత్విక ధోరణుల సంఘర్షణలను సుదీర్ఘంగా చర్చించినా మాలపల్లిని రాజకీయ నవల అంటున్నాం. సామాజిక సమస్యల సంఘర్షణలు ప్రధానంగా కనిపిస్తున్నా *కొల్లాయి గట్టితేనేమి?*ని రాజకీయ నవల అంటున్నాం. కౌటుంబిక సమస్య ప్రధానంగా చిత్రించిన అడవి బాపిరాజుగారి నారాయణరావు ను, భార్యాభర్తల ఆంతరంగిక సంఘర్షణ చిత్రణ ప్రధానంగావున్నావుప్పల లక్ష్మణరావుగారి అతడు—ఆమెను రాజకీయ నవలలు అనే అనుకుంటున్నాం.

అంటే ఏమిటి? జాతీయ విముక్తికై జరుగుతున్న పోరాటాలను చిత్రించేవి, సామాజిక వ్యవస్థలో మార్పును, మార్పుకై జరుగుతున్న సంఘర్షణలను చిత్రిస్తున్న వానిని, రాజకీయాధికారం కోసంవర్గాలమధ్యసాగుతున్నపోరాటాల్ని చిత్రిస్తున్న వానినీ - ఒక విధంగా వర్తమాన కాలపు రాజకీయ సంఘర్షణలను చిత్రిస్తున్నవానిని రాజకీయ నవలలుగా

పిలుస్తున్నామనుకోవాలి. ఏమంటే వర్తమాన ప్రపంచ రాజకీయాలలో ప్రధానాంశం వ్యవస్థమార్పు. దేశంలోనూ అదే స్థితి. అక్బరు ప్రతాపసింహుల మధ్య, ఔరంగజేబు శివాజీల మధ్య సాగిన పోరాటాలు చిత్రించిన నవలలు చారిత్రక నవలలే అవుతాయి. జనసంఘ్, కాంగ్రెస్, కమ్యూనిస్టు వుద్యమాల సంఘర్షణలను చిత్రించేవి రాజకీయం అనిపించుకుంటాయి.

ఇటీవల వర్గ సంఘర్షణలనూ పోరాటాల్ని చిత్రిస్తూ చాలా నవలలు వస్తున్నాయి. విశాలాంధ్ర పోటీలలో వచ్చిన *కోటి కుటుంబాల ఘోష*, *సంకెళ్ళు తెగుతాయి*వంటి వానిని ఆ సందర్భంగా పేర్కొనవచ్చు. భూస్వాముల అన్యాయాలకూ, దోపిడీకీ గురవుతున్న వ్యవసాయ కూలీలవి, భూస్వామ్య వ్యవస్థ క్రింద నలిగిపోతున్న రైతుల దురవస్థలు వర్ణించేవి అసంఖ్యాకంగా వస్తున్నాయి. వీనిలో అత్యధిక భాగం ఆర్థిక, సామాజిక పీడనల స్వరూపస్వభావాల్ని చిత్రిస్తున్నాయి. శ్రీకాంత్‌గారి *దేవుళ్ళారా మీ పేరేమిటి?* వాసిరెడ్డి సీతాదేవిగారి *రాబందులూ-రామచిలకలూ*, జాతశ్రీగారి *బలిపశువూ*. అర్నాద్‌గారి *చీకట్లోళ్ళు* కె. కె. మీనన్‌గారి *బాకీ బతుకులూ* - ఒకటేమిటి - ఈనాటి పత్రికలలో వస్తున్న నవలా సాహిత్యంలో పెద్ద భాగం ఇటువంటివే. వీటికి రాజకీయాలతో సంబంధం లేదనగలమా? సోషలిస్టు భావ ప్రేరితులైన పాత్రలు ఈ పోరాటాలకు నాయకత్వం వహిస్తూ కనిపిస్తున్నారు. రెండోది ఆర్థిక సమస్యల పోరాటానికి వెనక వత్తాసుగా ప్రత్యక్షంగానో పరోక్షంగానో ప్రభుత్వము, దాని పాలనా నిర్వహణశాఖ, కోర్టులు, చట్టాలు వుంటానేవుంటాయి. అయినా సమాజ అభివృద్ధి క్రమంలో ఆర్థిక సమస్యలు వేరుగా, రాజకీయ సమస్యలు వేరుగా పరిణామం పొందాయి. మన సౌలభ్యం కోసం కూడా వానిని ఆవిధంగానే వ్యవహరించడం ఉచితం.

ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక కళాది రంగాలన్నీ సమాజ వ్యవస్థకు సంబంధించినవీ, దానిలో అంతర్భాగాలూనే. అయితే సమాజాభివృద్ధి క్రమంలో ఇవన్నీ ప్రతి ఒక్కటి ఒక్కొక్క ప్రత్యేక శాఖగా విస్తరించడమే కాదు. ప్రతి శాఖ అనేకానేక విభాగాలుగా ప్రసరిస్తూందికూడా. సాహిత్యరంగంలో కూడా మన అవగాహన కోసమైనా ఈ వివేచన అవసరమవుతూంది.

రాజకీయ పరిస్థితుల ప్రభావం సమాజ గతి మీదా, సమాజ ప్రగతి ప్రభావం రాజకీయ పరిస్థితుల మీదా ఈ రెంటి ప్రభావం మనిషి జీవితం, భావాలమీదా పరస్పర ప్రభావం కలిగిస్తున్న విధానాన్ని చిత్రించే నవలను రాజకీయ నవల అనవచ్చునని తలుస్తున్నాను; అయితే ఈ చిత్రణ జరిగినట్లు నేను భావిస్తున్న నవలా రచయిత లందరూ సవిమర్శకంగా ఆ పంథాను అనుసరించారని చెప్పను. చెప్పలేను. అయితే సమాజ ప్రగతి క్రమంలోనూ, ఘటనాక్రమంలోనూ పరస్పర సంబద్ధత అనుస్యూ

తంగా వున్న సూత్రం. దానిని అర్థం చేసుకోకపోయినా వాస్తవికతను సాధ్యమైనంతవరకూ పాటించగలిగినప్పుడు ఆ సంబద్ధతను మనం రచనలో చూడగలుగుతాం, కనీసం కొంతవరకైనా.

రాజకీయ నవలను వేర్పరించేటప్పుడు మనం ఈ విషయాలను ఆలోచించుకోవలసి వుంటుంది.

మన తెలుగు నవలను తొలిసారిగా రాజకీయరంగంలోకి ప్రవేశపెట్టిన ఘనత శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారి మాలపల్లిది. ఇది ముఖ్యంగా బ్రిటిష్ పరిపాలనా కాలపు తెలుగు దేశ గ్రామీణ జీవితాన్ని, అందులోనూ దళిత ప్రజాజీవితాన్ని చిత్రిస్తున్నా జీవిత గతిక్రమంలో తప్పనిసరిగా ఎదురవక తప్పని ప్రజా ప్రతిఘటనను ముందుకుతెస్తూంది. తమ జిల్లాలోనే తాముకూడా పాల్గొని నడిపిన పుల్లరి సత్యాగ్రహమూ, పన్నుల నిరాకరణోద్యమమూ, తమ భాషా ప్రాంతంలోనే ప్రారంభమైన అల్లూరి సీతారామరాజు సాయుధ తిరుగుబాటూ, తాము అత్యంత శ్రద్ధాసక్తులతో అనుసరిస్తున్న గాంధీజీ సిద్ధాంత, పోరాట పద్ధతులూ ఆ నవలలో మెప్పైన చోటుచేసుకున్నాయి.

చారిత్రక నవలల మాదిరి గాకుండా ఘటనలూ, పోరాటాలూ, వచ్చి ఆరకముందే గ్రంథస్థంఅయి ఆనాటి రాజకీయ వుద్యమాలకీ, పోరాటాలకీ వత్తాసుగా నిలబడడం ఈ రాజకీయ నవలల విశిష్టత. మాలపల్లి ప్రాముఖ్యం అక్కడే వుంది. అటు తర్వాత కూడా రాజకీయ నవలలుఆ మాదిరి చారిత్రక ఘట్టాలలోనే అవతరించాయి. అవి నిర్వహించిన కర్తవ్యాలు కూడా అటివే.

తరవాత వచ్చిన చెప్పదగిన రాజకీయ నవల అడవి బాపిరాజుగారి నారాయణరావు. రాజకీయసిద్ధాంతాలచర్చసాగించినా ఆ రచయితదే కోనంగి నవల రాజకీయ నవలకాదు. రాజకీయంగా దేశంలో వస్తున్నపరిణామాలనుఖండించడంఉద్దేశం అయినా శ్రీ విశ్వనాధ సత్యనారాయణగారి *వేయిపడగలు* రాజకీయ నవల అనిపించుకోలేదు. జమీందారీ కుటుంబాల దురహంకారాలూ, అహంభావాలకూ, కొత్త కొత్తగా తల ఎత్తుతున్న ధనిక భూస్వామి కుటుంబాల ఆత్మ విశ్వాసానికీ మధ్య నడుస్తున్న సంఘర్షణలను చిత్రిస్తున్నా దేశంలో సాగుతున్న జాతీయోద్యమ ప్రగతితో ముడిపడివున్న నారాయణరావు రాజకీయ నవలగానే ప్రఖ్యాతి పొందింది

## తెలంగాణా పోరాట నవలలు

1946-47 లలో తెలంగాణా మండలంలో సాగిన రైతాంగపు తిరుగుబాటు ఆనాటినుంచి నేటివరకూ అనేకమంది రచయితలచే కలాలుపట్టించేయి.ఆతిరుగుబాటు కథావస్తువుగా ఎన్నో నవలలు వచ్చేయి.

ఆ పోరాటాలు సాగుతున్న దశలోనే శ్రీ బొల్లిముంత శివరామకృష్ణగారి మృత్యుంజయులు, పి. లక్ష్మీకాంత మోహన్‌గారి సింహగర్జన వచ్చేయి. మరో పదేళ్ళకు మహీధర రామమోహనరావుగారు తలపెట్టిన త్రయాలజీలో

మొదటి రెండు పుస్తకాలూ వచ్చేయి. వానిపేర్లు వరసగా ఓ న మా లు, మృత్యువు నీడల్లో.

ఈ నవలలు వచ్చిన పది సంవత్సరాలకు 1968 లో శ్రీ గొల్లపూడి నారాయణగారి 'తెలుగుగడ్డ' నవల వచ్చింది. వీరివే 1960-1965 మధ్యకాలంలో తెలంగాణా ప్రజా జీవితంలో వస్తున్న మార్పులు, సంఘర్షణలను చిత్రిస్తున్న కొత్తరోజులు, పాతరోజులు నవలలు వచ్చేయి. తెలంగాణా ప్రజా జీవితంలో పోలీసు ఏక్షన్ (1948) కి పూర్వం నాటి స్థితినీ, తరువాతి మార్పులనూ చిత్రిస్తూన్న యీ నవలలు స్థూలంగా సామాజిక నవలల స్వరూపాన్ని కనబరుస్తూన్నా స్వభావంచేత వానిని రాజకీయ నవలలే అనవచ్చునని నా అభిప్రాయం.

మరో అయిదేళ్ళకి-అంటే 1971 లో ఆనాటి పోరాటాల్నే చిత్రిస్తూ శ్రీదాశరధి రంగాచార్యులుగారు వ్రాసిన మోదుగపూలు, జనపదం అనే బృహత్తరమైన నవలా వచ్చేయి. ఆ పోరాటాలు జరిగి 30 ఏళ్ళు గడిచిపోయినా వాని ప్రభావం రచయితలను చుట్టువారుకొనే వుంది. మహీధర రామమోహనరావు తమ ట్రయాలజీ మూడవ పుస్తకాన్ని ఎత్తుకున్నారు. శ్రీమతి వాసిరెడ్డి సీతాదేవి, శ్రీ టి. సీతారామాంజనేయులు గారు ఆనాటి ఘట్టాల్ని చిత్రించ బూనుకున్నట్లు వింటున్నాను.

ప్రసంగ వశాత్తూ మనం 1972 వరకూ పరిక్రమించినా తెలుగులో రాజకీయ నవల గతిక్రమాన్ని అర్థం చేసుకోడానికి మనం 1950 వ దశాబ్ది ఆరంభానికి మళ్ళవలసి వుంది.

1948-1950 సంవత్సరాల మధ్య దేశవ్యాప్తంగానూ, ప్రత్యేకించి ఆంధ్ర మండలంలోనూ ప్రభుత్వం సాగించిన తీవ్ర దమనకాండ వివిధ దృక్కోణాల నుంచి పలు నవలలు రావడానికి దారి తీసింది. శ్రీ జి. వి. కృష్ణారావుగారు వ్రాసిన కీలుబొమ్మలు, శ్రీ కొనరాజు శేషయ్యగారి తారుమారు, సారాబట్టీ, ఆత్మవంచన మొదలైనవి, శ్రీ పి. లక్ష్మీకాంత మోహన్‌గారి రామరాజ్యం, శ్రీ కె. చిరంజీవిగారి ఎక్కడికీ ప్రస్థానం ఇటువంటివే. కమ్యూనిస్టు వ్యతిరేకత మాటున ఆంధ్ర గ్రామీణ ప్రాంతాలలో భూస్వాములు తమ పెత్తనాన్ని దృఢపరుచుకొనేందుకు సాగిస్తున్న దురంత చర్యలు, శత్రు నిగ్రహణకు, ప్రజలలో తమ అస్తిత్వ రక్షణకు ప్రాణాలొడ్డి నిలబడ్డ కమ్యూనిస్టు పార్టీ అనుసరించిన పద్ధతులూ కూడ ఈ నవలలలో కథావస్తువు లయాయి.

ఈ దశాబ్దిలోనే వెలువడిన రెండు, మూడు నవలలను ప్రత్యేకంగా పేర్కొనవలసివుంది. వానిలో ఒకటి వట్టికోట ఆళ్వారుస్వామిగారి ప్రజలమనిషి. 1936 నుంచి నిజాం ప్రభుత్వాధికారంలోని తెలంగాణా భూ భాగంలో తల ఎత్తి విస్తరించిన ప్రజా విమోచనోద్యమాన్ని చిత్రిస్తున్నదీ నవల. ఈ రచయితదే గంగు 1942 క్విట్ ఇండియా వుద్యమాన్ని చిత్రిస్తూంది.

వేరొకటి మహీధర రామమోహనరావుగారు వ్రాసిన రథచక్రాలు. 1946-

47ల నాటి కమ్యూనిస్టు వుద్యమం దృష్టి లోంచి తెలుగుదేశపు రాజకీయ పరిస్థితులను పర్యాలోచిస్తున్న నవల.

అటువంటిదే ఉప్పల లక్ష్మణరావుగారి అతడు-ఆమె. భార్యా భర్తల ప్రేమ జీవితపు పాటు పోటుల వర్ణనగాకనిపిస్తున్నా స్వాతంత్ర్యానంతరం కేంద్రంలోనూ, రాష్ట్రాలలోనూ గద్దెలెక్కిన దేశ నాయకుల సాంఘిక ప్రాతిపదికలను చిత్రిస్తున్న అద్భుత కళాఖండం యిది.

1960 వ పసి ఉత్తర భాగంనుంచి తెలుగుదేశం విచ్ఛిన్నకర వుద్యమాలకు ఆలవాలం అయింది. ప్రభుత్వ యంత్రాంగం విశీర్ణమై అవ్యవస్థిత మయింది. తెలంగాణా విభజనోద్యమం, అటు తరవాత ఆంధ్ర విభజనోద్యమం అట్టుడికించేయి. దోపిడి, లంచగొండితనం, అధికార దుర్వినియోగం institutionalise అయిపోయాయి. ప్రజా జీవితమే భగ్నం అయింది. ఈ సంక్షోభాన్ని చిత్రిస్తూ తెలుగులో రాజకీయ నవల పలుముఖాల విస్తరించింది.

లజ్జాహీనంగా ప్రభుత్వ యంత్రాంగంలో విస్తరించిన లంచగొండితనం శ్రీమతి వాసిరెడ్డి సీతాదేవి సమత నవలకు కథావస్తువయింది.

ఆమెదే వేరొక నవల మరీచిక యువతలో వ్యాపిస్తున్న క్షీణవాద, అతివాద ధోరణులను చిత్రిస్తూంది.

ప్రజావుద్యమాల క్షైణ్యాన్నీ, దానికిగల రాజకీయ కారణాలూ, బాధ్యతలూ చర్చిస్తూ శ్రీ మహీధర ఈ దారి ఎక్కడికి? వ్రాశారు.

తెలంగాణా, ఆంధ్ర విభజనోద్యమాలు అసలు సమస్యలనెల్లా పక్కదారికి పట్టిస్తున్నాయో చిత్రిస్తూ శ్రీమతి మాదిరెడ్డి సులోచన 'సంధ్యారాగం' నవలను వ్రాసారు. అదే సమస్యను భిన్నదృక్కోణాలనుంచి సమాలోచన చేస్తూ శ్రీ నవీన్ "ముళ్ళపొదలు" నవల వ్రాసేరు. ఆయనే అత్యవసర పరిస్థితి (1976) సృష్టించిన అరాజకాన్ని చిత్రిస్తూ చీకటి రోజులు నవల వ్రాసేరు.

ప్రజలలో పెరుగుతున్న ప్రతిఘటన తీవ్రతను తెలుపుతూంది శ్రీ రాచకొండ విశ్వనాధశాస్త్రిగారి "గోవులొస్తున్నాయి"

ఆ ప్రతిఘటనను, వర్గ పోరాటాలను, చిత్రిస్తూ భూస్వాములు, వడ్డీ వ్యాపారుల దురంత దోపిడీ చర్యలు, రైతులు వ్యవసాయ కూలీల ప్రతిఘటనలు, వ్యక్తి హత్యా పర్యవసితాలనుగా చిత్రిస్తూ ఈ దశాబ్దిలో అనేక నవలలు వస్తున్నాయి. ఇటువంటి వానిలో అత్యధికాధిక భాగాన్ని ఆర్థిక పోరాటపు నవలలుగా పేర్కొనవచ్చునని నా అభిప్రాయం. వీనిలోని పాత్రలకు ఆర్థిక సమస్యలను మించిన రాజకీయ పరిజ్ఞానం, ఎలిమెంటల్ ఆవేశాల్ని మించిన పోరాట నిగ్రహమూ వుండదు. పోలీసు జోక్యమూ, దమనకాండను మించిన ప్రభుత్వ ప్రమేయాలురావు అయితే వీనిలో కొన్నిటిని రాజకీయ నవలలనుగాపేర్కొనవలసి వుంది. వానిలో ఒకటి శ్రీ భూషణంగారి కొండ గాలి. శ్రీ చెరబండ

రాజు వ్రాసిన 'మా పల్లె' కూడ అటు వంటిదే.

ఈ పది పదిహేనేళ్ళలో తత్కాలీన రాజకీయోద్యమాలను చిత్రిస్తున్న నవలలతోపాటు సమకాలీన రాజకీయోద్యమాలను 40-50 ఏళ్ళ చరిత్ర అనుభవంతో బేరీజు వేస్తూ వ్రాసిన నవలలు చాల ముఖ్యమైనవి వచ్చాయి.

మహీధర రామమోహనరావుగారి కొల్లాయి *గట్టితేనేమి?* నవల 1920నాటి సహాయనిరాకరణోద్యమ ప్రభావం తెలుగు దేశం మీదా, తెలుగు ప్రజల మీదా ఎల్లా వుందో చిత్రిస్తూంది.

వారిదే *ఈదారి ఎక్కడికి?* నవల, ప్రజావుద్యమాల శైథిల్యాన్నీ, ఆ విషయమై విప్లవకర పార్టీల బాహ్యతలనూ, వైఫల్యాన్నీ చిత్రిస్తున్నదీ నవల.

శ్రీపాలగుమ్మి పద్మరాజుగారు తమరామరాజ్యానికి రహదారిలో 1930 సత్యాగ్రహోద్యమగతినీ, తెలుగు ప్రజలలో దాని పర్యాప్తినీ, ప్రభావాన్నీ చిత్రిస్తూంది.

అలాగే చాపరి దుర్గాప్రసాద్‌గారి అలకాపురి. ఇదొక ఉటోపియా అనలేని ఉటోపియా. ఒక ఉన్నత కులీనుడూ, వ్యవసాయదారూ, చేతి పనివాడూ ఒక నిర్జన ప్రదేశంలో గ్రామం నిర్మించుకుంటారు. వారున్న పరిస్థితి, దాని క్రమ పరిణామమూ సామాజిక దశా లక్షణాలను ఏ విధంగా సృష్టిస్తున్నాయో ఈ నవల చెప్తూంది. దీనిలో కనిపించేదిఒక్క సామాజిక ప్రగతి మాత్రమే. అయినామార్క్సిజం అవగాహనతో చిత్రించిన చిత్రం అది.

ఇవిగాక ఇంకా ఎన్నో రాజకీయనవలలు వచ్చి వుండవచ్చు. కాని, నాకు తెలియకపోవచ్చు. మరిచీ వుండొచ్చు. ఆ అజ్ఞతకూ, అవజ్ఞతకూ తెలుగు రచయితలు మన్నించాలి.

□

---

జీవితంపై ఏదో ఒక దృక్పథం కలుగజేయాలన్న ఉద్దేశంతో రచన సాగుతుంది. ఆర్థిక, సాంఘిక, చారిత్రక వ్యత్యాసాల కతీతమై మనిషిని మనిషి స్నేహపాశంతో బంధించి వేసే మానవత్వం యొక్క శక్తుల్ని రచచి చూచినప్పుడు ఆ దృశ్యాన్ని తన్మయతలో అనుభవించగలం. కాని ఆ అనుభవాన్ని మాటల్లో చెప్పలేం. దాన్ని తెలుసుకోడానికి మానవుడు చేసే యత్నాన్ని అందమయిన మాటల్లో చెప్పగలగటమే-గొప్ప నవలకు లక్షణం.

—బుచ్చిబాబు

---

# తెలుగు నవలలో చైతన్య స్రవంతి, అస్తిత్వవాద భావ ధోరణులు

జీవితం యొక్క అన్ని కోణాలను సమగ్రంగా చిత్రించగలిగే సామర్థ్యంగల సాహిత్య ప్రక్రియ నవల. బహుముఖీనమైన జీవన సత్యాలను ఒక తాత్త్వికమైన అవగాహనతో నవలా రూపంలో వెలువరించిన ప్రతిభావంతులైన నవలా రచయితలు ఇతర దేశాలలో వలె, ఇతర భాషలలోవలె తెలుగు భాషలోకూడా తక్కువగా ఏమీలేరు. తొలినాళ్ళలో తెలుగు నవల వ్యక్తికి - వ్యవస్థకి మధ్య సంఘర్షణను భూమికగా చేసుకొని ప్రస్థానించింది. ఈ ప్రస్థానంలోనే తెలుగు నవల సంఘ సంస్కరణవాదం, సామ్యవాదం, వ్యక్తివాదం ఇత్యాదులుగా అనేక భావ సిద్ధాంతాల సంఘర్షణలతో అనేక మలుపులు తిరిగింది. ఈ మలుపులలో రచనారీతిలో, అభివ్యక్తీకరణ విధానంలో చెప్పుకోదగ్గ మౌలికమైన మార్పులేమీ రాలేదు. ఇతివృత్తం, దానికి అనువైన పాత్రలు, సంఘానికి, వ్యక్తులకూ మధ్యనున్న సంబంధాలు సూటిగా స్పష్టంగా చిత్రించడం ఆనాటి నవల ధ్యేయం. వ్యక్తి యొక్క బహిర్ సంఘర్షణే ప్రధానమైంది గాని ఆంతరంగిక జగత్తులో ఆనాటి నవలకు పెద్దగా సంబంధంలేదు. తెలుగు నవలపై చైతన్య స్రవంతి, అస్తిత్వవాదాల ప్రభావం ఫ్రాయిడ్, అడ్లర్, యూంగ్ మొదలైన మనస్తత్వ శాస్త్రవేత్తల సిద్ధాంతాలు, ఆ ప్రభావంతో నవలలు రాసిన జాయిస్, ఊల్ఫ్ మొదలైన రచయితల సంవిధానం సార్త్రె తాత్విక సిద్ధాంతాలలో ఉంది.

మనిషి అంతరంగ ప్రవృత్తి బాహ్యప్రవృత్తిని నడిపిస్తుంది అని మనస్తత్వ శాస్త్రం చెబుతోంది. పూర్వ నవలలన్నీ మనిషి బాహ్య ప్రవృత్తినే చిత్రిస్తే - మానసిక విశ్లేషణ సిద్ధాంతాలను పునాదిగా చేసుకొని వచ్చిన నవలలన్నీ అంతరంగ ప్రవృత్తిని వెలుపలకు తెచ్చాయి. మనస్తత్వ విశ్లేషణకు సంబంధించిన నవలా సంవిధానాల్లో చైతన్య స్రవంతి ముఖ్యమైంది. ఈ పద్ధతిలో ఒక క్రమం, నిశ్చితమైన ఆలోచనా విధానం, నిర్దిష్టమైన ప్రారంభ ఉపసంహారాలు ఇట్లాంటివి ఉండవు. గత వర్తమానకాల సంయోజనం కూడా ఈ పద్ధతిలో మనకు పరిచితమైనట్లుగా ఉండదు. William James తన Principles of psychology అనే గ్రంథంలో

టి. యల్. కాంతారావు

The stream of thought అనే Chapter ని రాశాడు. మొట్టమొదటిసారిగా Dorothy Richardson 'Pointed Roofs' అనే నవల్లో మిరియమ్ హెన్డర్సన్ ఆలోచనా విధానానికి ఈ పద్ధతిని ఉపయోగించింది. జేమ్సు జాయిస్, వర్జీనియా ఊల్ఫ్ మొదలైనవారు ఈ పద్ధతిని అనుసరించి నవలయొక్క స్వరూపాన్ని, స్వభావాన్ని పూర్తిగా మార్చివేసిన వాళ్ళు. ఒకసారి ఒక వస్తువును చూసినప్పుడు మేధస్సులో మెదిలే భావాలకు తిరిగి మరొకసారి అదే వస్తువును చూసినప్పుడు మెదిలే భావాలకు చాలా భేదం ఉంటుందని, వస్తువు ఒకటే అయినప్పటికీ అనుభూతులు వ్యత్యాసంగా ఉంటాయని, వస్తువు స్థిరమైనదని, అంతరంగం స్థిరమైనది కాదని కాలవ్యవధికి ఆలోచనా ప్రవాహమునకు సంబంధంలేదని ఆలోచనలను chain తోను train తోను పోల్చకూడదని, అది ఒక ప్రవాహమని చెబుతూ ఈ ఆలోచనా ప్రవాహానికే stream of thought అని పేరు పెట్టాడు William James. ఈ పద్ధతి నవలలో ఇతివృత్త క్రమాన్ని గురించి Virgina Woolf ఈ విధంగా చెబుతుంది: "Life is not a series of gig lamps symmetrically arranged, but a luminous halo, a semi transperant envelope surrounding us from the beginning of the consciousness to the end." పోగా సంప్రదాయిక నవలల్లో కనిపించే స్వగతాలకు చైతన్య స్రవంతి నవలలో కనిపించే స్వగతాలకు చాలా తేడా ఉంది. ఈ స్వగతాలకు internal monologue అని నామకరణం చేశారు. దీంట్లో కాలనియమం కాని, క్రమ పద్ధతితోకూడిన ఆలోచనా సరళిగాని, ఉండక ఏరూపంలో ఆలోచనలు వస్తే ఆ రూపంలోనే, ఆ వరుసలోనే పేర్చడం జరుగుతుంది. ఐవర్ ఇవాన్సు Virgina Woolf టెక్నిక్కును గురించి ఇలా చెబుతాడు: "Her method was usally to accept which had a simple out line, but to exploit it with an impressionism which seized upon every detail, however minute and to order these details not in a rational arrangement but as they stream through the mind of one of her characters."

తెలుగు సాహిత్యంలో ఈ పద్ధతికి నాంది పలికినవారు బుచ్చిబాబు, శ్రీ శ్రీ. బుచ్చిబాబు 'చైతన్య స్రవంతి' అనే కథలోను, శ్రీశ్రీ 'కోనేటిరావు కల' అనే కథలోనూ ఈ పద్ధతిని చిత్రించారు. కోనేటిరావు అస్తవ్యస్త జీవితంవలె అతని అస్తవ్యస్తమైన ఆలోచనలను శ్రీశ్రీ చైతన్య స్రవంతిమార్గంలో వివరించారు. ఉద్యోగాన్వేషణకు బయల్దేరిన యువకుడు అందమైన అమ్మాయి కనబడినప్పుడు ఏ విధంగా ఆలోచిస్తాడో చెప్పడానికి బుచ్చిబాబు ఇదే విధానాన్ని అనుసరించాడు. ఈ మధ్యనే తారీఖు సమంగా గుర్తులేదు -ఆంధ్రజ్యోతి వారపత్రికలో 'మెర్క్యూరీ' అనేకథకుడు 'ప్రస్థానం' అనేపేరుతో ఈ నాటి సామాజిక సంక్షోభాన్ని తీవ్రాతితీవ్రంగా వ్యక్తం చెయ్యడానికి ఈ పద్ధతిలో కథ రాశాడు.

తెలుగు నవలలో చైతన్య స్రవంతి పద్ధతిని రెండు విధాలుగా నవలాకారులు ఉపయోగించారు. ఒక పద్ధతి నవల సంపూర్ణంగా చైతన్య స్రవంతి సంవిధానాన్ని అనుసరించింది. రెండవ పద్ధతిలో ఆ నవలాకారులు పాత్రల యొక్క అంతరంగాన్ని బహిర్గతం చేసేందుకు అక్కడక్కడా వారి నవలల్లో ఈ పద్ధతిని ఉపయోగించుకున్నాడు. నవలల్లో నవీన్ 'అంపశయ్య' వినుకొండ నాగరాజు 'ఊబిలో దున్న' త్రాగుబోతు మొదలైనవి చైతన్య స్రవంతి సంవిధానంలో రాసినవి.

ఒక హాస్టల్ స్టూడెంటు తెల్లవారుఝామున నిద్రలేచింది మొదలు అతని ఆలోచనా విధానం, అతని స్నేహితులతో సంభాషణలు, వారి మానసికావస్థలు, అతని గత స్మృతులు, రాత్రి పడుకునేదాకా జరిగిన సంఘటనల రూపకల్పన ఈ అంపశయ్య నవల. నవలలో ప్రధానమైన పాత్ర రవి. రవి కలలోంచి మేల్కొనడంతో నవల ప్రారంభమవుతుంది. కలలోంచి అమ్మ స్మృతితో నిద్రలేస్తాడు. మళ్ళీ పడుకునేటప్పుడు అమ్మ స్మృతిలోనే పడుకుంటాడు. నిద్రలేచేటప్పుడు తను ఒంటరి వ్యక్తి. పడుకునేటప్పుడు అతను ఒక సంఘం. వ్యక్తి ఏకాకితనంలో ప్రారంభమైన ఈ నవల వ్యక్తి సంఘంగా రూపొందడంతో అంతమవుతుంది ఈ మధ్యలో జరిగిన పరిణామాలన్నీ అతని జీవితంలో కొన్ని గంటలలో మాత్రమే జరిగాయి.

రవి గొప్ప భావుకత కలవాడు. ప్రతి సంఘటనను విశ్లేషించి ఆలోచించగలవాడు. అతని ఆలోచనావేగాన్ని బట్టి stream of thought కూడా మారుతుంది. stream of thought కి అనుకూలంగా శైలిలో మార్పు వస్తుంది. శైలి విషయంలో రచయిత చాలా జాగ్రత్త వహించాడు. కిరణ్మయిపాత్ర రవిని కదిలించిన పాత్ర ఆమె ఆలోచనలు వచ్చినప్పుడల్లా రవి చైతన్య స్రవంతి ప్రవాహంలోకి వెళ్ళిపోతాడు. అక్కడ ఉపయోగించే భాష అనేకమంది కవుల, రచయితల భాష. అది చదివే పాఠకుడు గ్రహించడం చాలా కష్టం: తాళం తీస్తున్నాడు వేస్తున్నాడు తీస్తున్నాడు వేస్తున్నాడు. తీస్తున్నాడు. అనడంలో అతని అచేతనలోని లైంగికభావం వ్యక్తం అవుతుంది. ఈ చైతన్య స్రవంతి పద్ధతిలోనే ఈ నాటి సమాజపు స్థితిని ధ్వనింపచేశాడు. ఈనాటి యువతరం, విశ్వవిద్యాలయాలస్థితి, రాజకీయపు ఎత్తుగడలు, విద్యార్థులలో స్వైరవిహారం చేస్తున్న సెక్సు, మతాతత్వాలు, ప్రాంతీయ భేదాలు ఇత్యాదులన్నీ నవలలో చర్చించబడ్డాయి. ముఖ్యంగా విద్యార్థుల మానసిక స్థితి, అధ్యాపకుల మానసిక స్థాయికి అంపశయ్య దర్పణం లాంటిది

వినుకొండ నాగరాజుగారి "ఊబిలో దున్న" జడ సమాజాన్ని జాగృతం చెయ్యడానికి ఒక సంస్కర్త పడే వేదన దాని తాలూకూ సుఖదుఃఖాలకు ప్రతీక. ఊబిలో కూరుకుపోయిన దున్నను వెలుపలకు లాగడానికి రాఘవులు చేసిన ప్రయత్నాలు, ఆ ప్రయత్నాలలో అతని Internal monologues, భూత భవిష్యద్వర్తమానాల స్మృతుల, ప్రణాళికల, ఆలోచనల సవ్యక్తస్వరూపంగా చైతన్య స్రవంతి

సంవిధానలో ఈ నవల సాగింది. ఊబిలో కూరుకున్న దున్న కేంద్రంగా రాఘవుల ఆలోచనలు సాగుతాయి. అట్లాగే త్రాగుబోతు రంగడి ఆలోచనలు, వాడిజీవితవిధానం "త్రాగుబోతు" నవలలో కనబడుతుంది. ఈ నవల లన్నింటికీ కథాకాలం కొన్నిగంటలు మాత్రమేనని మనం గుర్తుంచుకోవాలి.

ఇహ రావిశాస్త్రి "అల్పజీవి"లోను, బుచ్చిబాబు "చివరకుమిగిలేది"లోను, గోపిచంద్ "అసమర్థుని జీవయాత్ర"లోను చలం అనేక నవలల్లోనూ ఈ పద్ధతి అక్కడక్కడా ఉపయోగించడం జరిగింది. పాత్ర అంతరంగ జగత్తును వెలుపలకు చూపించవలసి వచ్చినపుడు ఆయా రచయితలు ఈ సంవిధానాన్ని బాగా ఉపయోగించుకున్నారు. ఉదాహరణకు బావమరిది వొత్తిడివల్ల లంచం పుచ్చుకున్న సుబ్బయ్య ఆలోచనను రావిశాస్త్రిగారు చిత్రీకరించిన పద్ధతి చూడవచ్చు:

"లంచం ! నేరం ! శిక్ష – జెయిల్—
సుబ్బయ్య కళ్ళు తెరిచాడు.
దేవా! నాకు భయంగా ఉంది.
నాకు మతిపోతోంది దేవ దేవా !

లేడిపిల్లలు లేటుగా యింటికి వెడుతున్నాయి
పరమేశ్వరా! నా కెందుకీ భయం
సొట్టకాలువాడు ఆలస్యంగా బజారుకు వస్తున్నాడు
సర్వేశ్వరా! నేనే విధమైన నేరమూ చెయ్యలేదే!—
పయ్యారి భామ కొబ్బరికాయల తట్ట ఖాళీ చేసుకొని పోతోంది
భగవాన్! ఏ పాపమూ ఎరగన్నేను
సిల్కు జాకెట్టు పిల్ల లైట్ హవుస్ నుంచి వచ్చేసిందే!—
ఈశ్వరా ! సర్వేశ్వరా !—"

ఇలా చేతన, అచేతనలోని భావాల గజిబిజి. చేతనలోని భావాలలో వ్యక్తికీ – వ్యవస్థకీ ఘర్షణ అచేతనంలోని భావాలలో వ్యక్తికీ తనలోని వ్యక్తికీ సంఘర్షణ ఈ ద్వివిధమైన సంఘర్షణలను చిత్రించడానికి చైతన్య స్రవంతి సంవిధానాన్ని నవలాకారులు ఉపయోగించుకున్నారు. "To day the movemet towards greater inwardness in fiction has gone to extreme limits; but there has always been a progression in this direction since the earliest days of the novel.... The technical devices of modern f ction, the changes of convention, the close approximation of the symbols of Communication to the process

they symbolize, the reduction in importance of plot rhere are secondary derivatives of the the primary quality of in Wardness' అని Time and moveలో Hindilao అంటాడు. మనిషి అంతర్ముఖుడవటం వలన మనిషిలోని మనిషిని దర్శించేందుకు మన తత్వ సిద్ధాంతాల పునాదిగా, చైతన్య స్రవంతి సంవిధానంతో కొత్త నవల ఉద్భవించడం జరిగింది.

తెలుగు నవలలో అస్తిత్వవాద దోరణులు ఇటీవలి కాలంలో కొద్దిమంది రచయితలలో సంపూర్ణంగాను, మరికొంతమంది రచయితలలో ఛాయా మాత్రంగాను ద్యోతకం అవుతున్నాయి. అస్తిత్వవాదంలో ప్రధానాంశం Free will. ఇది మనిషి తనలోనికి తను చూసుకుంటూ యధేచ్ఛగా తనకు కావలసిన దానికోసం అన్వేషణ ప్రారంభిస్తాడు. ఈ అన్వేషణలో సంప్రదాయాలు, వ్యవస్థాగత ధర్మాలు, నియమాలు పటాపంచలవుతాయి. వ్యవస్థాధర్మం కంటె వ్యక్తి ధర్మం అస్తిత్వవాదంలో ప్రధానమైన విషయం. సంఘస్థాయిని మించిన మనిషిని వ్యవస్థా ధర్మం బంధించ లేదు. వ్యక్తి ధర్మానికి, వ్యవస్థా ధర్మానికి మధ్య సంఘర్షణే అస్తిత్వవాదం. సూక్ష్మంశాల్లో తేడా ఉన్న వ్యక్తివాద ఫలితమే అస్తిత్వవాదంగా చెప్పవచ్చు, సార్త్రే చెప్పిన సిద్ధాంత భావాల ఫలితమే అస్తిత్వవాదం. అస్తిత్వవాదం సిద్ధాంతాలకు, నమ్మకాలకు అతీతమైన జీవితం యొక్క స్వచ్ఛమైన అనుభూతిని పొందడానికి చేసే ప్రయత్నమే అస్తిత్వవాద దృక్పథం."

"Existentialism reduces life from what we would like it to be, to what it is, and the instrument employed is not this or that method, but luridity. The winter who refuses to allow a faith, a hope or a theory to interfere with his work, who has the courage to confront exestence it self, is also a meta physician because Existence is reality and not merely its out ward form" అని ఆర్. ఎస్. సుదర్శనంగారు Literature becomes philosophy అనే గ్రంథంలోంచి వారి వ్యాసంలో ఉదహరించారు.

Existential Psychology వ్యక్తి స్వేచ్ఛకు పట్టం కట్టింది. తెలుగు నవలా రచయితలు వ్యవస్థా ధర్మానికి, వ్యక్తిధర్మానికిమధ్య సాగే సంఘర్షణలో వ్యక్తి ధర్మాన్ని సమర్థించినవాళ్ళు ఉన్నారు; వ్యవస్థా ధర్మాన్ని సమర్థించినవాళ్ళ

ఉన్నారు. గోపీచంద్ "మెరుపుల మరకలు" నవలలో ఉషారాణి పాత్ర ద్వారా వ్యవస్థా ధర్మానికి అతీతమైన వ్యక్తి ధర్మానికి పట్టాభిషేకం చేశాడు. "గడియపడని తలుపులు" నవలలో కోటేశ్వరమ్మ పాత్ర ద్వారా వ్యవస్థాధర్మాన్ని గోపీచంద్ సమర్థించాడు. ఉషారాణి, కోటేశ్వరమ్మ రెండు పాత్రలూ అస్తిత్వవాద ధోరణికి సంబంధించినవే. అయితే ఉషారాణి నవలలో కాముకిగా కనిపించినప్పటికీ ఆమె జీవితాన్వేషణలో తనకు కావలసిన దాన్ని అందుకోగలిగింది. కోటేశ్వరమ్మ ఏ బంధాలనైతే త్రెంచుకుని వైయక్తికాన్వేషణలో పడిందో చివరకు మళ్ళీ ఆ బంధాలలోకే తిరిగి వచ్చింది. బుచ్చిబాబు "చివరకు మిగిలేది" నవలలో దయానిధి అస్తిత్వవాది. అతను న్యూరోటిక్ అయినప్పటికీ, అతనిలో ఈడిపస్ కాంప్లెక్స్ టీ ఉన్నప్పటికీ అతను ప్రధానంగా అస్తిత్వవాది. "జీవితంపై ఒక దృక్పథాన్ని కలగ జెయ్యాలన్న ఉద్దేశంతోనే ఈ రచన సాగింది. ఈ జీవిత రహస్యం, దానిని కనుగొనడానికి మానవుడు చేసే ప్రయత్నం— ఏ గొప్ప గ్రంథానికైనా యిదే పునాది — ఈ నవలకీ అదే పునాది" అని బుచ్చిబాబుగారు నవలను గురించి ముందు మాటలో రాసుకున్నారు. నవల ముగింపులో దయానిధి తన జీవితంలో కష్టాలు, సుఖాలు అతను పొందిన జయాలు, అపజయాలు, ప్రేమలు, తిరస్కారాలు అన్నింటిని అంచనా వేసుకుంటూ వచ్చిన నిర్ణయం కూడా అస్తిత్వవాదానికి సంబంధించినదే. "చివరకు మిగిలిందేమిటి?" అని ప్రశ్నించుకున్నపుడు అతని కొచ్చిన సమాధానం "తనలో తను సమాధానపడటమేనని." "తన జీవితం పాడుచేసుకొన్న వ్యక్తి ఇతరులనైనా బాగుచేదామని సంకల్పిస్తే అన్నీ పేచీలే. తన జీవితం బాగు చేసుకున్న వ్యక్తికి, యితరుల జీవితం అక్కర్లేదు." "సంఘాన్ని మార్చలేడు, మనుష్యుల్ని మార్చలేడు. మారిస్తే బాధ, పగ, యుద్ధం "తనలోతాను సమాధానపడాలి. అది ఈనాటికిసాధించాడు.ఒకప్రశాంతత పవిత్రమైనమహత్తర ఆనందం.... అదిబాహ్య ప్రపంచంలోలేదు.... పిచ్చిప్రపంచాన్ని దయతో దూరంగా ఉంచే ఔదార్యం మతాన్ని, దైవాన్ని, మనుషుల్ని తోసేసి సంతృప్తి చెందే ఆధ్యాత్మిక దృష్టి తనలో కడసారి యధార్థం" అనే ఈ పంక్తుల్లో వ్యవస్థా ధర్మానికి అతీతమైన అస్తిత్వవాది మనస్తత్వం స్పష్టమవుతోంది.

చలం అస్తిత్వవాది కాకపోయినప్పటికీ అతని నవలల్లోని అనేక పాత్రలు పరాజయం పొందినా అస్తిత్వవాదానికి దగ్గరగా ఉంటాయి. శ్రీ వడ్డెర చండీదాసు

హిమజ్వాల, శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం సంసార వృక్షం, భాస్కరపట్ల వెల్లువలో పూచిక పుల్లలు మొదలైన నవలలు ఈ అస్తిత్వవాద ధోరణికి సంబంధించినవే.

ఆధార గ్రంథాలు

1) The stream of conciousness in the English novel; Dr. D. K. Lal

2) Aspects of novel; E. M Forster

3) Being and nothingness; Jean-Paul Sartre

4) తెలుగు నవలా సాహిత్యంలో మనోవిశ్లేషణ: కోడూరు శ్రీరామమూర్తి

5) సాహిత్యంలో దృక్పథాలు | R. S. సుదర్శనం
6) సమాజము - సాహిత్యము |

7) కళాసాగర్ సప్తమ వార్షికోత్సవ సంచిక;

8) A Dictionaty at Psychology; James - Drever Revised by Harvey Wallerstein.

9) ఈ వ్యాసంలో పేర్కొనిన తెలుగు నవలలు.

□

---

"ఆధునిక బూర్జువా నవలలోని పాత్రలు మానవ గాఢ కాంక్షల సముదాయంకాదు. అందులో కన్పించేవి కుతూహలం కల్గించుతాయి. అసద్దైన తత్వాన్ని ప్రదర్శించుతాయి. అవి మైనపు బొమ్మశాలలో వుండవలసినవి. హోమో సెక్సువలిష్టునీ, తన బిడ్డను ప్రేమించలేక కుంటించుక పోయిన స్త్రీనీ, ఏ కారణం లేకుండానే ఆత్మహత్య చేసుకొనే వ్యక్తినీ ఈ నవలలు చిత్రించుతున్నాయి."

—ఇల్యా ఎహ్రెన్ బర్గ్

---

# సైన్స్ ఫిక్షన్

రావూరి భరద్వాజ

ఋగ్వేదం ఏ కాలంనాటిదో మనకు ఖచ్చితంగా తెలీదు. పదివేల సంవత్సరాల కిందటిదని తిలక్ మహాశయుడన్నాడు. కాదు– రెండువేల సంవత్సరాల కిందటిదే నని మాక్సుముల్లర్ అన్నాడు. సత్యం ఈ రెండింటిమధ్యా ఎక్కడో ఉంటుందని, మనం సరిపెట్టుకుందాం!

ఋగ్వేదంలోని మొదటి ఋక్కు–

"అగ్నిమీళే పురోహితం

హోతారం రత్నధాతమం

అస్య యజ్ఞస్య సుక్రతుం"– అన్నది.

ఈ ఋక్కు కర్త మధుచ్ఛందుడు. ఇతను ఆంధ్రుడు.

ఋగ్వేదావిర్భావానికి చాలా ముందుగానే నిప్పుచేయడం భారతీయులకు తెలుసు. అలా తొలిసారిగా తెలుసుకున్నవాడు ప్రమంథుడు. ఇతను "అంగిర" తెగకు చెందినవాడు.

కారుమబ్బులు గగనమంతా కమ్ముకొని, ఉరుములతో, మెరుపులతో వర్షం కురుస్తున్నప్పుడు, పిడుగులు పడడం సహజం. ఆ పిడుగు ఏ చెట్టుమీదనో పడి, నిప్పురవ్వలు అన్ని దిశలకూ ఎగసినప్పుడు– ఆ నిప్పును "వైద్యుతాగ్ని" అనేవారు.

అలా 'అగ్ని'ని సృష్టించడం సుసాధ్యం చేసినవాడే ప్రమంథుడు. ఇతను 'మథనం' ద్వారా 'అగ్ని'ని ఆవిష్కరించాడు. యీ 'అగ్ని' చుట్టూ ఆ తరువాత చాలా కథలు అల్లబడ్డాయి' మథనం ద్వారా 'అగ్ని' ఆవిష్కరింపబడటం శాస్త్రీయమైన సత్యం. యీ సత్యాన్ని ఆధారభూతం చేసుకుని వచ్చిన కథలన్నీ కల్పితం.

కథా సరిత్సాగరంలో ఓ చిత్రమైన కథవుంది. ఒక భార్య, భర్తతోబాటుగా, ఆ భర్త మిత్రుడు కూడా కలిసి ప్రయాణం చేస్తూవుంటారు అడవిలోంచి. ఒక చోటి కొచ్చేసరికి చిన్న గుట్ట, ఆ గుట్ట మీద ఒక దేవాలయం కనిపించింది. 'ఇప్పుడే వస్తా' అని ఆ భర్త గుటమీది దేవాలయం ప్రవేశించి, అక్కడి శాసనాన్ని చదివాడు. ఆ శాసనం ప్రకారం ఆ దేవతముందు తల నరుక్కున్నవాడు వచ్చే జన్మలో మహారాజుగా పుడతాడు. రాజరికంమీది లోభంకొద్దీ అతగాడు తన శిరస్సును ఖండించుకున్నాడు. భర్త ఎంతసేపటికీ రానందువల్ల ఆ భార్యకు భయంవేసింది. తనభర్త మిత్రుడిని పంపించింది. ఈ మిత్రుడు వెళ్ళేసరికి తల, మొండెం వేరువేరుగా పడివున్నాయి. ఇతను ఆశ్చర్యపోయాడు. ఈ సంగతి ఆమెతో ఎలా చెప్పడం? చెప్పినా నమ్ముతుందా? తనే యీ హత్యకు కారకుడన్న

అనుమానం ఆమెకు రాదా? అదీగాక– ప్రాణసమానుడయిన మిత్రుడిన్ని కోలుపోయాక, తనుమాత్రం ప్రాణాలతో ఉండటం ఏం భావ్యం కనుక? అందుకని అతనుకూడా తన శిరస్సును ఖండించుకొన్నాడు.

వెళ్ళిన ఇద్దరూ రాకపోయేసరికి. ఆ ఇల్లాలు మరింత భయపడింది. అలా భయపడుతూనే దేవాలయంలోకి ప్రవేశించి చూసింది. రెండు మొండాలు, రెండు తలలు– రక్తపు మడుగులో పడివున్నాయి.

ఆమె గొల్లుమని ఏడుస్తూ దేవతను ప్రార్థించింది. దేవత ప్రత్యక్షమయ్యాక, వారిద్దర్నీ బ్రతికించమన్నది. మొండాలకు తలల్ని అతికించి, కళ్ళు మూసుకోమన్నది దేవత. కళ్ళు తెరిచేసరికి వారిద్దరూ నవ్వుతూ నిలబడివున్నారు.

సంతోషమేగాని, ఈ హడావిడిలో ఆ ఇల్లాలొక పొరపాటు చేసింది. భర్త శరీరానికి మిత్రుని శిరస్సునూ, మిత్రుని శరీరానికి భర్త తలనూ అతికించింది. ఇప్పుడామె భర్త ఎవరు? భర్త తల మిత్రుని శరీరంతో ఉన్నవాడా? మిత్రుని తల, భర్త శరీరంతో ఉన్నవాడా?

ఈ కథను ఆధారం చేసుకుని, 'థామస్ మాన్' అన్నరచయిత, ఓ అద్భుతమైన నవలికను రాశాడు, ఈనవలికఆధారంగా డాక్టర్ జి. వి. కృష్ణారావు తెలుగులో 'జఘన సుందరి' అన్నచిన్న నవలను చాలా కాలం క్రిందటే ప్రకటించారు. ఈ పాత్రలను ఆలంబనంచేసుకొని, డాక్టర్ జి. వి. కృష్ణారావుగారు ఆ నవలలో ఆస కికరమైనమన స్తత్వాంశాలనెన్నింటినో విశ్లేషించారు.

ఇదిలా ఉండనివ్వండి!

'మనుచరిత్ర' మనందరకూతెలిసిందే. అందులోని ప్రవరాఖ్యుడూ మనకు పరిచయమున్నవాడే. ఆ ప్రవరాఖ్యుని ఇంటికొకసారి ఓ పరదేశి వచ్చాడు. తను నానారాజ్యాలూ తిరిగి వస్తున్నానన్నాడు. యీ మాటలు– ప్రవరాఖ్యుడు నమ్మలేదు.

అయ్యా!

"ఎంవక మీ కొన్ని దునొక విన్నప
మిట్టి వి యెల్ల జూచిరా
నెరకలు గట్టుకొన్న మరి యేండ్లను
బూంట్లను బట్టి బ్రాయపుం
జిరుతతనంబు, మీ మొగము సెప్పక
చెప్పెడు, నదిరయ్యమా
కెరుగదరంబె, మీ మహిమలీర
యెరుంగుదురేమి చెప్పుదున్"

అన్నాడు.

దాని కాయతి–

"....సందియము దెలియనడుగుట
తప్పా?
వినవయ్యా, జరయు, రుజయును,
జెనకంగా వెరచునమ్మ సిదుల
మగుటన్"

మ: పవమంబైన రహస్యమూ,–
నయిన డాపన్ చెప్పెదన్ భూమి
నిరర వంశోత్తమ, పాదలేపమను
పేరన్గలు దివ్యౌషధంపురసంబీశ్వర
సత్కృపన్ గలిగె ; దద్భూరి ప్రభా
వంబునన్
జరియింతున్, పవమాన, మానస
తిరస్కారిత్వరాహంకృతిన్.

అని సమాధానం చెప్పాడు. చెప్పడమే కాదు - ఆపాద లేపనం ప్రవరునికూడా ఇచ్చాడు. అతగాడా పాదలేపనంతో హిమాలయాలకెళ్ళి, అక్కడి మంచుకా పాదలేపనం కరిగిపోవడంతో, బెంబేలెత్తి పోవడం, ఆదశలోనే మగువ పొలుపు దెలుపు నొక్కమారుతం వీచడం, వరూధినీ సందర్శనం.... సరే - ఇదీ మనకు తెలిసిందే!

ఓ చిన్న మనవి -

మథనంద్వారా, ప్రసుంధుకు ఆవిష్కరించిన 'అగ్ని' కాంతుల్లో మెరిసిన కథలుగాని, కథా సరిత్సాగరంలో గుణాఢ్యుడు చిత్రించిన - తలలు, మొండాలు వేరువేరుగా పడివున్న కథగాని, మన మిప్పుడనుకొంటున్న సైన్స్‌ఫిక్షన్ పరిధిలోకి రావు. ప్రవరుని పాదలేపనం కథ కూడా ఈ కోవలోకి రాదు.

కానీ -

మానవుని ఊహలు, ఎలా సాగారుతాయో ఎంతలేసి దూరాలు వెడతాయో అసంభవాలను సంభవాలుగా చేసేందుకు, మానవుడెలాంటి ప్రయత్నాలు చేస్తాడో మనకీ మూడు అంశాలు తెలియచేస్తున్నాయనుకొంటాను.

'ఎరకలు గట్టుకొన్న మరియేంగ్లను పూంగ్లను పట్టు' నన్నాడు ప్రవరుడు. రెక్కలు కట్టుకుని గగన విహారం చేయాలన్న అంతర్వాంఛకిదో చిన్న ఉదాహరణ. ఇలాంటి ఉదాహరణలు మనదేశ సాహిత్యంలోనే కాదు - అన్ని దేశాల సాహిత్యాలలోనూకోకొల్లలుగాలభిస్తాయి.

అప్సరాంగనలు దేవతాశ్వాలూ,పుష్పక విమానాలు, ఆగ్నేయ, వారుణాస్త్రాలూ, మొదలైన కల్పనలూ, వీటితోనే నిండి వున్న కాల్పనిక సాహిత్యమూ, మనకు పుష్కలం. ఈ సమృద్ధత, ప్రాచీన సాహిత్యానికే పరిమితం కాదు. అర్వాచీన సాహిత్యంలో కూడా మనమీ స్థాయిని నిలబెట్టుకున్నాం, నిలబెట్టుకుంటూఉన్నాం.

సాంఘిక, ఆర్థిక, రాజకీయ, మానసిక మైన కారణాలేమిటో నాకు తెలీవుగాని, మనకు ప్రణయ సాహిత్యమంటేనే ఇష్టం. ఈ ఇష్టం అన్నది - రాసే వాళ్ళకే పరిమితం కాదు. రాసేవాళ్ళకూ, రాయించేవాళ్ళకూ, ఇష్టం. చదివేవాళ్ళకు మరింత ఇష్టం. కనుకనే మును పెన్నడూ లేనంతగా ఇప్పుడు ప్రేమ సాహిత్యం, మార్కెట్టనిండా పేరుకుపోతూ ఉంది. అందులోనూ, మగవాడు రాసిన ప్రేమ సాహిత్యంకన్నా, స్త్రీల పేరుతో వస్తున్న ప్రేమ సాహిత్యం తొందరగా అమ్ముడవుతున్నది.

దాదాపుగా మూడు దశాబ్దాల కిందట 'రాగిణి' అన్న ఓ కథల సంపుటానికి పరిచయం రాస్తూ చలంగారిలా అంటారు.

"శృంగారం రాసే కథకుల్లో, కవుల్లో కూడా తాము రాసేదాన్ని చూసి, గర్వ పడేవారు తక్కువ ఎక్కువమంది వాటికి మార్కెట్ చెల్లుబడివుంది గనక రాస్తారు."

చెప్పవచ్చిందేమిటంటే - ఏ కారణాలవల్ల, మనిమింకా ప్రణయ సాహిత్యాన్నే ఉత్పత్తిచేస్తున్నామో దాదాపుగా ఆ కారణాల వల్లనే సైన్స్‌ఫిక్షన్ మనకు లేకుండాపోతున్నదీ అని! అంటే - అసలేమీ లేదనిగాని, రావడం లేదనిగాని నా ఉద్దేశంకాదు. అడపాదడపా అక్క-

డొకరూ, ఇక్కడొకరూ, పిట్ట చెదిరినట్లు రాసినవారున్నారు. ఇందువల్ల పెద్దగా పొరిగిందేమీలేదు.

కథ, నవల,వంటి సాహిత్య ప్రక్రియలు, మనకూ, పూర్వంనించీ ఉన్నాయనే వారున్నారు. ఒకవేళ ఉన్నాయేమో కూడా! మాటవరసకు ఉన్నాయనీ ఒప్పుకుందాం. కాని, అవేవీ, ఇప్పుడు మనం అనుకుంటున్న రూపాలలో మాత్రంలేవు. ఈనాటి చిన్నకథ, నవల, మనకు ఆంగ్ల సాహిత్యం ద్వారానే పరిచయమయ్యాయి. ఆంగ్లభాషా పరిచయంతో, ఈ రెండు సాహిత్య ప్రక్రియలూ, బాగా రాటు తేలాయి.

సన్నివేశాలను ఎన్నుకోవడం, వాటిని సంపుటీకరించడం, పాత్రల బాహిర, ఆంతరిక జీవితాలను చిత్రించడం ప్రతీకలను సమర్థవంతంగా వినియోగించుకోవడం, మనో విశ్లేషణ, శైలి, సంవిధానం వంటి వాటిని, మనం పాశ్చాత్య రచయితల నుండి తెలుసుకున్నాం. తప్పులేదు. అయితే ఇవన్నీ రచనా విధానానికీ శిల్పానికీ సంబంధించిన అంశాలు. 'విషయం' దగ్గర కొచ్చేసరికి, మన దేశవాళీ తనాన్ని యధాతథంగానే ఉంచుకున్నాం తప్ప, వైవిధ్యం వేపుకు దృష్టిని మరల్చలేకపోతున్నాం. ఇతర దేశాల్లోని పరిస్థితులు, మరీ ఇంత అధ్వాన్నంగా లేవు. వివిధ శాఖలకుచెందిన శాస్త్రవేత్తలు సాంకేతికులు, ఆవిష్కరించిన నూతనాంశాలను ఆధారం చేసుకుని, కథలు, నవలలు, నాటికలూ వచ్చాయి.వస్తున్నాయి కూడా. కాని, మిగిలిన సాహిత్య రాశితో పోల్చిచూస్తే, అక్కడా సైన్స్‌ఫిక్షన్ శాతం తక్కువగా ఉంది. అక్కడ తక్కువగా వుందంటున్నామంటే - వారి మిగిలిన సాహిత్యంతో పోల్చి చూసినప్పుడు మాత్రమే తక్కువ. మనకన్నా ఎక్కువ - నిజానికి - చాలా ఎక్కువ.

వైజ్ఞానిక దృష్టిగలమహా రచయితలు, కల్పనా కథలను రాసుకుంటూపోతే, ఆ కథల్లో, అప్పటికి అభూతకల్పనలుగా వున్న చాలా వాటిని, ఆ తరువాతి కాలంలోని శాస్త్రవేత్తలు నిజం చేశారు.

పాశ్చాత్యదేశాలలో నయినా మనమిప్పుడు సైన్సు ఫిక్షన్ అనుకుంటున్న సాహిత్యాన్ని పోలిన సాహిత్యం మూడు వందల సంవత్సరాలకు పూర్వం ఉన్నట్లు కనిపించదు. 1657వసంవత్సరంలోఅంతరిక్ష యానం కథాంశం గల మొదటినవల వచ్చింది. ఇందులో రాకెట్లను గురించిన ప్రస్తావన వుంది. ఎడ్గార్ ఎల్లెన్‌పో డిటెక్టివ్ కథలతో బాటు సైన్సు ఫిక్షన్ కూడా రాశాడు. 1835 లో ఆయన ప్రకటించిన "The unparalleled adventures of one hans penal" అన్న కథ, బెలూన్ మీద, చంద్ర మండలానికి ప్రయాణం చేయడాన్ని చిత్రిస్తుంది. 1838 లోని "Narrative of arthur gordon pym" అన్న రచనలో, కొత్తగా మానవ నివాసాలను, 'పి' దర్శించినట్లుగా 'పో' రాశాడు. ఈ నివాస ప్రాంతాలు, ప్రపంచ పటంలో ఎక్కడా కన్పించవు మళ్ళీ. మంచుకన్నా తెల్లగా మెరిసిపోయే ఆజానుబాహులైన మనిషిని గురించి 'పో' ప్రస్తావించారు.

పో రచనలిచ్చిన ప్రోత్సాహంతో, పరమాద్భుతమైన సాహిత్యాన్ని

సృష్టించిన వాడు జూల్స్‌వెర్న్, 1870 వ సంవత్సరంలో, జూల్స్‌వెర్న్ రాసిన 2 Twenty thousand leagues under the sea" అన్న నవల, దాదాపుగా ప్రపంచ భాషలన్నింటిలోకి అనువాదమయింది. అప్పటికింకా జలాంతర్గాములు రాలేదు. అయినా– బోలెడన్ని వివరాలతో, ఆయన తన కల్పిత జలాంతర్గామిని వర్ణించాడు. సాగర శాస్త్రవేత్తలూ, జలాంతర్గామి నిర్మాతలూ, ఆ పుస్తకాన్ని వందల సార్లు చదివి, జూల్స్‌వెర్న్ రాసిన వివరాలన్నింటినీ నమోదుచేసుకున్నారు. చిత్రమేమిటంటే– ఏ పద్ధతి మీద, వెర్న్ తన జలాంతర్గామి పనిచేస్తుందని రాశాడో, ఆ పద్ధతుల మీదనే తొలి జలాంతర్గామిని నిర్మించడం. వెర్న్ మీది గౌరవం కొద్దీ అతని నవలలోని కల్పిత జలాంతర్గామి 'నాటిలస్' పేరును ఆమధ్య అమెరికా ప్రభుత్వం తన అణుచోదిత జలాంతర్గామికి పెట్టుకున్నది. "From the earth to the moon" అన్న మరో నవల అంతరిక్ష యాత్రీకులకూ, రాకెట్ నిర్మాతలకూ ఎంతో ఉపయోగపడింది.

సైన్సుఫిక్షన్ రాయడంలో, మరో ప్రపంచ ప్రసిద్ధ రచయిత హెచ్. జి. వెల్స్. ఇలా జరిగితే, అదలా జరిగితే, అప్పుడలా సంభవిస్తే, ఇప్పుడిలా అయితే – ఏమవుతుందన్న ప్రశ్నలకు జవాబులుగా అతని నవలలుంటాయి.

1. The time me machine
2. The war of the worlds
3. The sea lady
4. The wonderful visit
5. in the days of the comet
6. The sieePer awakes
7. The food of the gods
8. The war in the air
9. The first men in the moon

అన్న రచనలు, విశ్వవిఖ్యాతమైనవి. ఇవి అనేక భాషల్లోకి అనువాదం కావడం ఇందుకొక సాక్ష్యం. "వార్ ఆఫ్ది వరల్డ్స్" ను రేడియో రూపకంగా మలిచి 'బి బి సి' వారు ప్రసారం చేసినప్పుడు, ఇంగ్లండు దేశం యావత్తూ భయభ్రాంతులతో కకావికలై పోయింది. లండన్ ప్రజలు – ఇతర గ్రహవాసులు, భూమండలం మీద దాడి చేస్తున్నారనుకుని, హాహాకారాలతో, వీధుల్లోకి పరుగెత్తు కొచ్చారట.

వెల్స్ రచనలంతగా ప్రసిద్ధిలోకి రాకపోయినా–చాలా నవలలు, కథలు, పాశ్చాత్య రచయితలు ఇప్పటికీ రాస్తూనే ఉన్నారు. అవి – అమ్ముడవుతూనే ఉన్నాయి.

తెలుగుకు సంబంధించినంతవరకూ, సుగమ విజ్ఞాన శాస్త్ర సాహిత్యం తక్కువ. ఇక విజ్ఞాన శాస్త్రం ఆధారంగా వచ్చిన కల్పనాసాహిత్యం మరీతక్కువ. ఎందుకని? నాకేమనిపిస్తున్నదంటే –

మనకేమో, శాస్త్రీయ పరిశోధనలు తక్కువ. ఈ పరిశోధనల ద్వారా మనం కనుక్కొంటున్నవీ తక్కువే. విజ్ఞాన శాస్త్రానికి సంబంధించిన మన జ్ఞానమంతా, ఇతర దేశీయుల పుస్తకాలనుండి మనం నేర్చుకున్నదే. తెలుగులో వచ్చిన సుగమ విజ్ఞాన శాస్త్ర గ్రంథాలన్నీ– ఇంగ్లీషు భాషలోని ఆ తరహా గ్రంథాలకు అనువాదాలో, అనుకరణలో, అనుసర

ఐలో, తప్ప-స్వతంత్రమయినవి కావు. సైన్స్ గ్రంథాలనుఅనువదించుకున్నట్లుగా సైన్స్ ఫిక్షన్‌ను కూడా మనం అనువదించుకోవచ్చు. కాని అలా జరగవలసినంతగా జరగడం లేదు.

రచయితల నడిగితే, "ప్రచురించే వారు ముందుకు రావడంలే"దంటున్నారు. ప్రచురణ కర్తలనడిగితే 'ఈబాపతు పుస్తకాలను జనం కొనరండీ' అంటున్నారు. కొనని పుస్తకాలను అచ్చువేయవలసిన అవసరం వారికి మాత్రం ఏముందీ? అప్పటికీ విషయం మీది అభిమానం వల్లనో, రచయితతో వున్న ముఖమాటం వల్లో, కొన్ని పుస్తకాలు-సైన్స్‌ఫిక్షన్ కోవల్లోకి చేరే పుస్తకాలు-తెలుగులోనూ వచ్చాయి.

సుమారుగా 40 సంవత్సరాల కిందట 'విహంగయానం' అన్న ఒక పేరుతో నవలను చేకుమళ్ళ రాజగోపాలరావుగారు ప్రకటించారు. ఆ రోజుల్లో దీన్ని ఇంటర్మీడియెట్ పరీక్షకు ఉపవాచకంగాఎంపిక చేశారు. కొడవటిగంటి కుటుంబరావుగారు సైన్స్ విషయాలను ఆధారం చేసుకుని కొన్ని కథలేవో రాసినట్లు గుర్తు. అలాగే వసంతరావు, వెంటకరావుగారు కూడా. 1952-53 సంవత్సరాలలో "చిత్ర గ్రహం"అన్న ఓ నవలిక-సైన్స్‌ఫిక్షన్-ఓ వారపత్రికలో అచ్చయి, తరువాత పుస్తకంగా కూడా వచ్చింది. అంతరిక్ష యానంపట్ల ఆసక్తిగల ముగ్గురు వ్యక్తులు సొంతంగా ఒక అంతరిక్ష నౌకను తయారుచేసుకుని, చంద్రమండలానికి ప్రయాణమవుతారు.ఫ్లయింగ్ సాసర్స్‌లో కొత్తమనుషులెవరో వచ్చి. ఆ నౌకను మరో నూతన గ్రహానికి తీసుకువెళతారు. ఆ గ్రహాన్ని అంతకుముందు ఏ ఖగోళ శాస్త్రజ్ఞుడూ, అక్కడున్నట్లు గుర్తించలేదు. ఆ గ్రహం పేరు 'శశూన్' అది-చంద్రునికి అవతలి దిక్కుగా వుండటం వల్ల ఎవరికంటా పడలేదు. అక్కడి మనుషులు వైజ్ఞానికంగా బాగా అభివృద్ధి చెందిన వారు. ఆ సమాజంలో దోచుకునేవాడూ, దోపిడీ చేయబడేవాడూ వుండరు. 'యుద్ధం-అశాంతి-పేదరికం, అన్న మాటలు వారి నిఘంటువుల్లోనే తప్ప, వాడుకలో లేవు. ఎవరికి చేతనయిన పనిని వారు చేస్తారు. ఎవరికి కావలసింది వారు అనుభవిస్తారు. ఈ ముగ్గురు శాస్త్రజ్ఞులోనూ ఒకతను-ఈ భూమండలం మీది కుళ్ళు వ్యవస్థను భరించలేక అక్కడే వుండిపోతాడు.మిగిలిన ఇద్దరూ అలాంటి సమతా వ్యవస్థను, ఇక్కడ కూడా నెలకొల్పడం కోసం, భూమండలానికి తిరుగుముఖం పట్టడంతో నవల ముగిసిపోతుంది.

చంద్రుడు భూమికి ఉపగ్రహం.ఇది ఒక నిర్దిష్టమయిన దూరంలోనే ఉండి, భూమి చుట్టూ పరిభ్రమిస్తూ ఉంటుంది. అలా కాకుండా-చంద్రుడు, భూమికి మరి కొంత దగ్గరగా వస్తే ఏమవుతుంది? భూ చంద్రులకు మధ్యగా, ఒక సరిహద్దు రేఖను, రోషే అన్న శాస్త్రజ్ఞుడు కల్పించాడు. దీన్ని రోషే సర్కిల్ అంటారు. ఈ సర్కిల్‌ను చంద్రుడు దాటితే అది ముక్కలుముక్కలయిపోతుందని,ఆముక్కలన్నీ చిన్న చిన్న గుంపులుగా భూమి చుట్టూవలయాలుగా తిరుగుతాయని రోషే

అంటాడు. ఈ అంశం మీద 'జల ప్రళయం' అన్న సైన్స్ ఫిక్షన్ 'కృష్ణాపత్రిక' లో అచ్చయింది. తరవాత పుస్తకంగా కూడా వచ్చింది. చంద్రుడు భూగ్రహం వేపుగా కదిలివస్తున్నప్పుడు, భూమిమీద జరిగే విపరీతాలకు 'నీవు కారణ' మంటే 'నీవు కారణ'మని రష్యా, అమెరికాలు ఐక్యరాజ్యసమితిలో ఘోరంగా దెబ్బలాడుకోవడం, బడుగుదేశాలు "దీనికి కారణం అగ్రదేశాలే" ననడం-ఇలా అనడం వెనక గల రాజకీయాలు నిందారోపణలు, ప్రత్యారోపణలు, అనేక శాస్త్రీయాంశాలూ, ఈ నవలలోఉన్నాయి. చంద్రుడు రోషే సర్కిల్‌లోకి వచ్చి, బద్దలయి, ఆ ముక్కలన్నీ భూమిచుట్టూ వలయాలుగా మారిపోవడంతో నవల సమాప్తమవుతుంది.

అలాగే 'మంచుమనిషి' మీదకూడా ఒక నవల వచ్చింది. అయితే ఇది అపరాధ పరిశోధక నవల. అపరాధ పరిశోధక నవలల్లో – సైన్స్ విషయాలను కూడా చొప్పించిన వారున్నారు. కాని అవేవీ సైన్స్ ఫిక్షన్ అనిపించుకోవు. చిన్న కథలు, నవలల కన్నా కొంచెం ఎక్కువగా వచ్చాయి. 'వైశంపాయన' గుప్త నామంతో కథలు రాసిన అబ్బరాజు నాగభూషణంగారు 'కళ్ళు' అన్న పేరుతో ఓ మంచి కథ ప్రచురించారు.

హత్యానేరం మోపబడిన ఒక వ్యక్తిని రేపు ఉరి తీస్తారనగా అతని కళ్ళను దానం చేయమని జైలు అధికారులు అడుగుతారు. హంతకుడు అందుకు ఒప్పుకోడు. దానిక్కారణం కూడా చెబుతాడు. అతనొకప్పుడు చాలా మంచివాడు వారిది అనుకూలమయిన దాంపత్యం. ఏదో ప్రమాదంలో అతని కళ్ళుపోతాయి. సిద్ధంగా వున్న ఇంకెవరి కళ్ళో తెచ్చి, అతనికి అమర్చారు. కళ్ళు బాగయిన తర్వాత, అతని ప్రవర్తనలో మార్పులొచ్చాయి. భార్య శీలాన్ని అనుమానించాడు. ఆమెనుహత్యచేశాడు. ఆ నేరానికే రేపు ఉరికంబానికి ఎక్కబోతున్నాడు.

"నా భార్య ఉత్తమురాలు. సుశీల ఈ దిక్కుమాలిన కళ్ళకు ఆవిడ పతితురాలుగా కనబడి హత్య చేశాను. ఇవే కళ్ళను మరొకరికమర్చి, ఇంకో హంతకుడిని తయారుచేయకండి" అంటాడతను. కొడవంటి కృష్ణమూర్తిగారు "ఎక్కడనుంచి ఎక్కడకు?" అన్న పేరుతో ఒక పుస్తకం ప్రచురించినట్లు తెలుస్తున్నది.

తాళ్ళూరి నాగేశ్వరరావు 'గుండె' మార్పిడిమీద మంచి కథ రాశాడు. కె. చిరంజీవి 'ఆకలిమందు' అన్న కథ కూడా సైన్స్ ఫిక్షనే. ఆకలివేయకుండా ఓచిన్న మాత్రవేసుకుంటే సరిపోతుందనుకోండి. అప్పుడు మన ఆర్థిక వ్యవస్థ ఏమవుతుంది? మన రాజకీయాలెలావుంటాయి? ఇది నాటికగా కూడా ప్రసారమయింది. ఇలాంటిదే మరో నాటిక 'వంశాంకురం' ఒక గొడ్రాలిని పిల్లల తల్లిని చేయడం ఇందులో ప్రధాన ఇతివృత్తం.

చాలా సంవత్సరాల క్రిందట మద్రాసు రేడియో నుండి శ్రీశ్రీ ఒక నాటికను ప్రసారం చేశారు. గతంలోని వారి మాటలను రికార్డు చేసిన ఒక వైజ్ఞానికునిచుట్టూ ఈ నాటిక అల్లబడింది. కాంతివేగాన్ని మించిన మనోవేగా నిమె ఆ శాస్త్రవేత్త సాధించాడు. ఇలాంటిదే

మరో నాటిక 'విజయవాడ' ఆకాశవాణి వారు 1950 ప్రాంతాలలో ప్రసారం చేశారు.

సైన్స్‌ఫిక్షన్ రాయడానికి అపారమయిన అవకాశం వున్నది. ఏ చిన్న అంశం మీదనైనా అద్భుతంగా రాయవచ్చు. అంతే, శాస్త్ర విషయాలతో మంచి పరిచయం ఉండాలి. ఒక విషయంలో గతంలో ఏమి జరిగిందీ, ప్రస్తుతం ఏం జరుగుతున్నదీ, బాగా తెలిస్తే, భవిష్యత్తులో ఏం జరగవచ్చో ఊహించడం అసాధ్యం కాదు.

ఉదాహరణకు—

'మృత్యువు'ను జయించడం కోసం మానవుడు తీవ్రంగా ప్రయత్నిస్తున్నాడు. ఈ ప్రయత్నాలు ఫలించి మానవునికి మరణమే లేకపోతే ఏమవుతుంది?

భూమి మీది వనరులన్నీ తరిగిపోతున్నాయి. అందుకని—ఇక్కడి పరిశ్రమలన్నీ మూలపడతాయా? ఇక్కడివారి అవసరాలు మారిపోతాయా? ఈ వనరుల కోసం మానవుడు చేసే ప్రయత్నాలేమిటి! ఇతర గ్రహాలనుండి ముడి సరుకుల్ని ఇక్కడికి దిగుమతి చేసుకొంటాడా? లేకపోతే పరిశ్రమల్నే అక్కడికే మారుస్తాడా?

సూర్యరశ్మిని నేరుగా ఆహారంగానూ, విద్యుత్తుగనూ, శక్తిగానూ, మార్చుకోవడం మనిషికి సాధ్యమయినప్పుడు మన సామాజిక విధానం ఎలా వుంటుంది? బంగారానికీ, పాదరసానికీ గల సామ్యం చాలా ఎక్కువ. పాదరసంలోకి ఒక అణువును ప్రవేశపెట్టి, దాన్ని బంగారంగా మార్చవచ్చు. ఇది శాస్త్రీయమయిన సత్యం. ఈ అణు ప్రవేశాన్ని మనం సాధించినప్పుడేం జరుగుతుంది?

ఇలాంటి విషయాలనెన్నింటినో మనం కథావస్తువులుగా తీసుకోవచ్చు. క్రీస్తు శకం '2002' నాటికి, పరిస్థితులెలా వుంటాయో, ఊహించుకొని ఒక నవల రాయడానికి కావలసిన విషయాన్ని సేకరిస్తున్నాను; అప్పటికి సూర్య కుటుంబంలోని గ్రహాలన్నీ మనకు ఇరుగు పొరుగువయి పోతాయి. అప్పటికింకా బడుగుదేశాలు, అభివృద్ధిచెందిన దేశాలూ అటూ వుండవు. మనుషులు, ఇచ్ఛామాత్రులై సంచరిస్తూంటారు. కావలసిన చోటుకు, తమ శరీరాలను, భార రాహిత్యం చేసుకుని, ఎవరికి వారే, ఎగిరిపోతూ వుంటారు. 'ఆకలి' వారికి ఉండదు. శక్తి తరిగినట్లు మీటర్ తెలియచేసినప్పుడు సూర్యకాంతిని శక్తి కిందగా మార్చుకుంటారు వారు. అప్పుడు చదువులెలా వుంటాయి? మనుషుల మధ్య గల సంబంధాలెలా వుంటాయి? ఇళ్ళ నిర్మాణం ఎలా వుంటుంది? వాతావరణం, కాలుష్యం కాకుండా ఏం చేస్తారు?

వీటికి శాస్త్రీయమయిన సమాధానాలు చెప్పేందుకు, చిత్తశుద్ధితో కృషి చేయవలసి వుంటుంది. గతంతో పోలిస్తే, ఈనాడు విజ్ఞానశాస్త్రం మరింతగా విస్తరించి వుంది. అందరికీ అందుబాటులో కూడా ఉంది. ఈ శాస్త్రం ఆధారంగా— యువ రచయితలు, సైన్స్ ఫిక్షన్‌ను రాయవచ్చు. వారీ పనిని ప్రారంభించగలరని ఆశిద్దాం!

□

# ఈ దశాబ్దితో అధిక ప్రాచుర్యం పొందిన సాంఘిక - కాలక్షేపం నవల

సాహిత్యంలో యీ దశాబ్దంలో విస్తృతంగా ప్రచారమయి పలువురి పాఠకులకు ఉత్తేజంగా, ఆసక్తిగా వుండే ప్రక్రియ నవల. యీ మధ్య కాలంలో పాఠకులకు కథలుకానీ, కవిత్వంకానీ నవల తర్వాతనే చదువుటకు ఉత్సాహం కలిగించుతోంది. సీరియల్ నవలలు లేక నేరుగా ప్రచురణ పొందిన నవలలు. ఇంత ఎక్కువ ప్రాబల్యం సంపాదించుకోవటం చూస్తే మనకే ఆశ్చర్యం కలుగుతుంది. అందుకనే అభ్యుదయ రచయితల సంఘంవారు నవలా సదస్సును నిర్వహిస్తున్నారు. ముఖ్యంగా ఈ నవలలు ఇంత విస్తృతంగా ప్రచారాన్ని అభిమానాన్ని ఎల్లా పొందగలాయి! కేవలం ఈనవలలు కాలక్షేపం కలిగించడంవల్లనే రైలు ప్రయాణాలు, దీర్ఘ బస్సు ప్రయాణాలు చేయాలంటే చేతిలో రెండుమూడు పాకెట్ సైజ్ నవలలు వుండాల్సిందే. ఈ బహుళ ప్రజాదరణ పొందిన సాహిత్య ప్రక్రియ నవలలో ముఖ్యసూత్రం పాఠకులకు కాలక్షేపం కలిగించడం. ఈ కాలక్షేపం నవలల్లో శిల్పం ఎంతవరకు వుందోంది? అసలు శిల్పం అంటే ఏమిటి! అందమైన వర్ణనలా! వర్ణించటమే శిల్పం అయితే, పాత్రయొక్క మనస్తత్వ ప్రదర్శనకు అంతో ఇంతో వర్ణించటం ఈ నవలల్లో జరుగుతోంది. సంఘటనల వైచిత్రి శిల్పం అయితే, ఈ నవలల్లో ఉన్నన్ని సంఘటనలు మరింకే యితరనవలల్లోనూ ఉండవు. చదివించే నేర్పు శిల్పం అనుకుందామా? అది ఈ నవలలకు ఎంతవుందో అసంఖ్యాక పాఠకులకు ముఖ్యంగా తెలుసును. ఇంత జనాదరణ పొందిన నవలా ప్రక్రియలో శిల్పం లేదనటానికి సాహసించగలమా? ముఖ్యంగా ఈ నవలల్లో సంభాషణలతోనే కథ ఎక్కువగా నడుస్తుంది. నాయికా నాయకులు ప్రేమావరోధాల్ని దాటి ఒకటి అవటమే యీ నవలల్లో ముఖ్యసమస్య. ఎన్నెన్నో చిక్కుముడులు అపార్థాలు, అనుమానాలు అవి ఎంత జిగిగా అల్లుతారో ఆ ముడులన్నీ పది పదిహేను ప్రకరణాల తర్వాత ఒక్కటి ఒక్కటిగా విప్పుతారు. ఒక్కొక్క కష్టమే హీరో హీరోయిన్‌లు దాటుకుంటూ వస్తూంటే పాఠకులకు క్రికెట్ ఆట చూస్తున్నంత సరదాగా ఉంటుంది. పూర్వం కావ్య నాయికలకు ఇప్పటి

ఐ. వి. ఎస్. అచ్యుతవల్లి

సాంఘిక నవలా మణులకు అట్టే భేదం
వుండదు. వాళ్ళ కళ్ళు కలువ రేకులుగా
సంపెంగ నాసికగా, దొండపండు పెదవు
లుగా వుండేవారు. ఇప్పుడు కూడా చారె
డేసి కళ్ళు వాల్చటం, అమితంగా సిగ్గుల
పడిపోవడం, లేత పసుపురంగు జార్జెట్
చీరలు, అదే రంగు బ్లౌజులు, అదేరంగు
గాజులు వేసుకోవటం, ఇత్యాది. వ్యక్తి
గత వర్ణనలతో వుంటారు. ఇంచుమించుగా
మునపట్లాగే చంద్రకాంతి భరించలేక
పోవటం పిల్లగాలిని విసుగుకోవటం,
ఇవన్నీ విరహలక్షణాలుగా కూడా
వుంటాయి. కాలం మార్పుతో మేఘాల
సూర్యచంద్రుల చిలక హంసల సందే
శాలు వుండవు కాని. ప్రాణం పెట్టే ఇష్ట
సఖులు వుంటారు. వాళ్ళూ, వాళ్ళ
భర్తలూ, ఇంకా ఇతర కుటుంబసభ్యులు
హీరోయిన్‌కి ఎన్నో విధాల సహాయ
పడుతూ వుంటారు. హీరోయిన్
అందరివల్ల అన్ని సహాయ సహకారాలు
పొందుతూ, ఆత్మాభిమానం, వ్యక్తిత్వం
కాపాడుకోవటం,(అసలు ఆత్మాభిమానం,
వ్యక్తిత్వం అంటే ఏమిటో!) చివరికి,
హీరోని అందరి బలవంతంవల్లా ఒప్పు
కొని, అతని విశాల హృదయంలో తల
దాల్చుకుని సుఖంగా వుండటం—అప్పటితో
పాఠకుడి కష్టంకూడా గట్టెక్కుతుంది.

సుమారు రెండు వందల పేజీలు సాగ
దీసే ఈ నవలల్లో ప్రధాన ఇతివృత్తం
ప్రేమించుకోవడం, అనుక్షణం, ఆ ప్రేమ
ఎక్కడ పెడదారి పట్టుతుందో అని
ఉభయులూ వేయి కన్నులతో ఎదురు
చూడటం. వాళ్ళకేవీ వేరే సమస్యలు
వుండవు. పూర్వ కావ్యాలలో లాగే
వీళ్ళకీ విధి, మనుష్యులూ కూడా
ఎడబాట్లు చేస్తూ వుంటారు. ఎన్నెన్నో
చిక్కుముడులతో మధ్యమధ్య
దేవతల జోక్యం (నాగదేవతలూ
వగైరా)తో నడిచే ఈ నవలలు పూర్వం
కావ్యాలకన్నా ఏవిధంగానూ, నూతన
దోరణిలో వుండవు. ఇంక పగటి కలలు,
జానపద ఛాయలు, అభూత కల్పనలు—
అవి లేనిదే ఈ కాలక్షేప నవలల్లో రెండు
వందల పేజీలు ఇంకేమి విషయాలు
వ్రాస్తారు : డజను ఫోనులూ, డజను
కారులూ వున్న పెద్దపెద్ద కంపెనీల
జనరల్ మానేజర్‌లు నవలా నాయకులు
అలాంటి కంపెనీలు ఎన్ని వున్నాయి
మన దేశం మొత్తంమీద! పెద్దపెద్ద
భవనాలు, వంటకోనాయిర్, అతనికో సహా
యకుడు పిల్లవాడు. ఇంకా ఒక తోట
మాలి, పనిచేసే మనిషి, హీరోకి దుస్తులు
అవీ అందించేందుకు ఇంకొక అంగ
రక్షకుడు వీళ్ళందర్నీ అతన్ని అమితంగా
ద్వేషించే అమ్మాయి కంట్రోలులో పెడు
తుంది. అంతద్వేషంవున్నా పాపం
తప్పనిసరి పరిస్థితులవల్ల అతనికి ఎదురు
తిరుగుతూనే అతని అధీనంలో వుంటుంది.
పాపం ! సోడాలమ్ముకునే హీరో ఐస్
పార్లర్ పెట్టడం, మట్టి బొమ్మలుచేసి,
పావలాకు బేడకు అమ్ముకునే పేద కళా
కారునికి, ఆ మట్టిబొమ్మలకు అమెరికా,
రష్యావాళ్ళు (ఆ దేశాల వాళ్ళిద్దరికీ కూడా
పాపం ఇండియాను ఎల్లా ఆదుకోవాలా
అనే తాపత్రయం కదా!) ఆర్డర్లు ఇచ్చేయ
టం, దానితో ఆ కళాకారుడు, ఇండియా
ప్రభుత్వంచే కూడాగుర్తింపబడి రాష్ట్రపతి
చేత, స్వరాష్ట్ర గవర్నర్ల చేత బ్రహ్మాం

శంగా సన్మానింపబడటం! (మనవాళ్ళు రచ్చగెలిస్తే కదా, ఇంట గుర్తింపు రావటం! ఉద్యోగం సంపాదించ గలిగినవాడే కొడుకు!తన పెళ్ళి తనే స్వయంగా చేసుకో గలిగే అమ్మాయే కూతురు! ఈ రత్న గర్భదేశంలో!) పాపం! వాళ్ళు నిజంగా ఈ నవలలు చదవటానికి అవకాశం వుండదు కానీ చదవగలిగితే, ఎన్నెన్ని ఆశలు మేస్తూ జీవితం ఎంత ఉత్సాహంగా గడిపేవారో! ఇంకా కొంతమంది హీరోలు ఆదర్శాలు, ఆశయాలు వల్లిస్తూవుంటారు. అయితే ఆ ఆదర్శాలు ఆశయాల శిఖరాల నధిరోహించటానికి వాళ్ళుచేసేకాంక్రీట్ వర్క్ ఏమిటి అన్నదానికి నవలల్లో సమాధానం కనుపించదు. ఒక సమస్యను తీసుకుని, ఆ సమస్య స్వరూపాన్ని విభిన్న దృక్పథాలతో పరిశీలించి, ఆ సమస్యను పాఠకులకు విశదీకరించి ఆ సమస్య పాఠకులలో ఎవరికయినా వస్తే దానిని ఎల్లా పరిష్కారం చేసుకోవాలీ అన్న ప్రశ్నకు జవాబు దొరకదు ఆశల శిఖరాలు అధిరోహించే వేళకు పాత్రలు కప్పదాటు వేస్తాయి. అయితే ఈ ఆశయాల వలయంలో గింగిరాలు తిరిగే పాత్రలు, ఊహల పల్లకీ ఎక్కి ఊరేగే పాత్రలకన్నా కొంచెం మన మనస్సులకు అందుబాటులో నే వుంటాయి. మరీఅందమయిన డబ్బున్న, దిక్కుమొక్కులేని యువకులూ, ఆత్మాభిమానం, వ్యక్తిత్వం, గాడిదగుడ్డూవున్న హీరోయిన్లు (ఆత్మాభిమానం వ్యక్తిత్వం అనగా, తన వెంటపడ్డ బంధుహీనయువకుడ్ని వీలయినన్నిసార్లు దులపరించుకోవటం ఛీత్కరించుకోవటమా?, మళ్ళీ ఆ పిల్లకు బోలెడంతమందికుటుంబీకులు. తనమీద ఆధారపడి వుండటం చుట్టూ పలటీలు కొట్టకుండా కొంచెం మామూలు స్వభావంతో వుంటాయి. ఇందులోని పాత్రలు ఇంకా కొన్ని సాంఘిక నవలల్లో ఒకరకమయిన ధోరణి కనబడుతుంది. పతితులు, బాధితులూ బాధాసర్పదష్టులూ పాఠకుల్ని బాధాసర్పదష్టుల్ని చేస్తారు. కార్మికులు యజమానులు, ఆ యజమానులకు ఫాక్టరీ యాజమాన్యం చూసుకోవటం, వాట్ల లావాదేవీలు పరిశీలించడం ఏమీ వుండదు. కారుల్లో బారుల వెంబడి తిరగడం, కార్మికులని వుట్టికుట్టినేతిరుతూ తన్నుతూ కొట్టుతూ వుండటం, కార్మికుల భార్యలలో వాళ్ళు ప్రేమించి పెళ్ళి చేసుకోబోయే భార్యనే పనిగట్టుకుని పెళ్ళికాబోయే మొదటిరోజున మానభంగం చేయటం, పాఠకుల వళ్ళు జలదరించి, గుండెకి కుంచెడు కన్నీళ్ళు కార్చాలి మరి! లోకంలో ఇంక ఆడవాళ్ళే లేనట్టుగా, ఆ కష్టాల కార్మికుడి పేద యవ్వనవతి అయిన భార్యనే కోరుకోవటమేమిటి? హాయిగా డన్‌లప్ బెడ్స్ మీద, ఎసి రూముల్లోనూ సాగించవలసిన శృంగారకాండ, ఫ్యాక్టరీ వెనకాతల గోడవున్స్‌లోనూ, లేకపోతే కార్మికులు అన్నాలు తినే షెడ్లలోనూ, ఇష్టంలేని యువతి గింజుకోవడంలో ఏమి ఆనందం పొందుతారో! ఆ నవలా విలన్లు! ఇంక ఆ ప్రేమికురాలు విషాదంతో, మలిన శరీరాన్ని ప్రేమికునికి అర్పించలేక ఉరేసుకోవటం ! ఒక క్షణం తన తప్పులేకుండా జరిగినదానికి ఆడది ఊరేసుకుని చావాలనే ప్రబోధం, నీతి

నియమాలు మన స్త్రీ జాతిని ఎంత ఉన్నతమైన స్థానంలో కూర్చోబెట్టు తున్నాయి? రావణాసురుడే లేకపోతే, సీతామాత లోకపావనీ. పాతివ్రత్య నిరూపణ జరిగేదెలాగు? అల్లాగే ఫ్యాక్టరీల, పెద్ద పెద్ద కంపెనీల యజమానులు క్రూరులూ, నీచులూ అయి వుండాలి. అందులో పనిచేసేవాళ్ళు ముఖ్యంగా ఆడవాళ్ళు, సీతలూ, సావిత్రులూ, సుమతులూ అయివుండాలి. ఈ కారణంగా, కార్మికుల సమ్మెలు, పోలీసుల కాల్పులూ జరుగుతాయి. అది వాస్తవికత ఈ నవలల్లో నిండా వంకాయకూరలో ఉల్లికారం కూరినట్లు వుంటుంది. ప్రహ్లాదుని భక్తి కారణంగా హిరణ్యకశిపుని రాజ్యము, ప్రాణమూ కోల్పోయినట్లు ఫ్యాక్టరీల కంపెనీల యజమానులు ఛీప్‌గా ప్రవర్తిస్తే మొత్తం ఫ్యాక్టరీల మూలస్తంభాలనే కదిలించేస్తారు జనం, అన్నది పూల దండలో దారం పాఠకుల మనస్సుకి స్ఫురిస్తూనే వుంటుంది. ఒక యజమాని, కార్మికుల మధ్యవుండే సంబంధం ఎంత వరకు: వాళ్ళకు జీతభత్యాల ఏర్పాటు - ఆ మేరకు వాళ్ళు పనిచేస్తున్నారా లేదా అనే పరిశీలన. అంతేకాని వాళ్ళవాళ్ళ విలాసాలు వీళ్ళవల్ల పొందగలమను కోవటం అవివేకము. డబ్బుపెట్టి అంచె లంచెల ఆనందం కొనుక్కోవటం ఎంతో సులభం ఈదేశంలో. అల్లాంటిది వాళ్ళ అంతస్థు మరిచిపోయి వీళ్ళ కార్మికుల కర్షకుల స్త్రీలనే చెరచటం, పనిగట్టుకుని గొడవలను సృష్టించ బూనుకోవటమే అవుతుంది.

ధనికులందరూ దుర్జనులు అయివుండా లని రూలేం లేదు. ధనం అనేది ఒక్క తరంలో లక్షలకు లక్షలు కూడబెట్టగలగ టం అసాధ్యం. నాలుగయిదు తరాలు జాగ్రత్తగా పిల్లికి బిచ్చం పెట్టకుండా కూడబెట్టగలిగితే అన్ని తరాలవాళ్ళూ ధనం చేరవేయటమే లక్ష్యంగా పరిశ్ర మిస్తే కొన్ని లక్షల విలువ అయిన ఆస్తి చేకూరుతుంది. నాలుగు తరాల సమర్థు లయిన యాజమాన్యంక్రింద పెంచబడిన ఆస్తి ఒక్క తరంలో అవినీతి అసమర్థత వున్న వ్యక్తి అధీనంలోకి వచ్చేసరికి ఎన్నోయేళ్ళు పెరిగి పెరిగి మహావృక్ష మయిన చెట్టు తుఫాను తాకిడికి వేళ్ళతో సహా పెకలించుకు పడిపోయినట్లు అయి పోతుంది ఛిన్నాభిన్నంగా అల్లాంటి వ్యక్తి మళ్ళీ నాలుగుతరాల నాటి తాతలు ఎక్కడ ప్రయాణం మొదలుపెట్టారో ఆ అఖరి మెట్టుమీదకే వస్తారు.

బీదరికంలో ఉన్నవాళ్ళంతా నీతి మంతులు, కష్టాల కావిడిని కావిలించుకుని కూర్చునే వున్నారు, అనుకోవటం కూడా అంత సమంజసం కాదు. తాపీ మేస్త్రి క్రింద పనిచేసే కూలీ అమ్మాయినే తీసుకోండి "తాజ్‌మహల్ నిర్మాణానికి రాళ్ళెత్తిన కూలీలెవ్వరు?" అని కవు లందరూ అజ్ఞాత కూలీలకు అభివాదం చెప్పుకున్నారు. కాని ఆ కూలీ అమ్మాయి ఎలా పనిచేస్తుంది? అది చూసేరా! తట్టలో అయిదు ఇటుకలుకన్నా ఎక్కువ వేయదు. సినీ హీరోయిన్‌లా పిరుదులు ఊగించుకుంటూ (ఇటువెంపు అయితే చుట్టకూడా వుంటుంది నోటిలో) ఒక్కొక్క అడుగే మందగమనలా

వేస్తూ ఇటుకల తట్ట మోస్తుంది. తొమ్మిది నుంచి పన్నెండు లోపున నాలుగయిదు తట్టలకన్నా ఎక్కువ మోయరు. మళ్ళీ భోజన విరామం. రెండుగంటల నుంచి సాయంత్రం వరకు అట్లాగే వయ్యారి హంస నడకలతో పనిచేస్తారు. ఆరో అయిదో రూపాయల కూలి సంపాదిస్తారు. వాళ్ళ ఘర్మజలానికి నర్మ జలానికి ఖరీదుకట్టే షరాబులు లేరని మనం బోలెడు సానుభూతి చూపెడతాం. కాలము పనివిలువ శ్రామికులకీ యజమానులకీ సమంగా తెలుస్తోందా! వాళ్ళు ధనికులు కనుక వాళ్ళకు కామము ధనదాహమూ ఖచ్చితంగా ఉండాలా! సినిమాలలో నవలల్లో కూడా భవనాలు, అందులో వుండే వాళ్ళంతా కామ క్రోధ మోహాడంబరాలకు దాసులు! ఇదే ఒకే మూసలో పోసి వున్న పాత్రలు! కాలక్షేపం నవలల్లో శృంగారం ముఖ్యమయినా అతి వాస్తవికత ముఖ్యమయినా వీటి చుట్టూ తిరుగుతాయి. ఇందులో అంటే ఈ కాలక్షేపం నవలల్లో మనం చదివి ఆలోచించాల్సిందేమీ ఉండదు. ఒక్క మేలు మాత్రం ఈ నవలలు చేసిపెట్టాయి అదేమిటంటే, అసంఖ్యాకమయిన పాఠకులను పెంచాయి. ఏదో ఒక నవల చదవాలి. రైళ్ళల్లో బస్సుల్లో ఊరికే కూర్చోకుండా ఏదో ఒక పుస్తకం కొని చదువుదామన్న తృష్ణని పెంచాయి. ఫ్యాషన్ కోసమో, నిజంగా చదవాలన్న ఉత్సాహమో కాని నవలలకుమటు నేడు చాలా గిరాకీ పెరిగింది. బాగున్నా బాగులేకపోయినా, ఏదో రెండుమూడు వందల పేజీలు నవల వ్రాయగలిగితే ఇటు రచయితా, అటు పబ్లిషర్ కూడా బెనిఫిట్ అవుతున్నారు. అందువల్లనే కథానిక ప్రక్రియ కన్నా నవలా ప్రక్రియ ఎక్కువ ప్రచారమవుతోంది. టన్నులకొద్దీ నవలలు ఈనాడు మనకు వున్నాయి. ఇంకా ఇంకా వస్తున్నాయి కూడా! ఇంతకు పఠనాసక్తిని పెంచిన నవలలు కాలక్షేప పరిధిని ఎప్పుడు దాటుతాయో మరి!

> మంచి గతమున కొంచెమే అయినను
> మందగించక ముందు అడుగు
> వేయటమే,

పూని ఏదయిన ఒక మేలు దారి, పాఠకులకు చూపించాలి. కలంబలంతో సాంఘిక చైతన్యం మనం కోరుకున్న విధానం ఏ కొంచెం ఏ మూల కలిగినట్లు స్ఫురించినా, ఆ కలం పట్టిన చెయ్యి కృతకృత్యమైనట్లేకదా!

□

---

"మీస అంతా మంగళప్రదంగా పూజించే మాంగల్యం నాకు ఉరిత్రాడయింది ప్రతి నిమిషం నాకు నరకాన్ని చూపించింది. దాన్ని తెంచిపారేశాను. నేను చేసింది తప్పా?"

—"ఉరిత్రాడు" నవలలో వాసిరెడ్డి సీతాదేవి

---

# నవలా సాహిత్యం - రచయిత్రులు

ఇటీవలి కాలంలో రచయిత్రులు బాగా ప్రచారంలోకి వచ్చారన్నది ఎవరూ కాదనలేని సత్యం. ఇందుకు ప్రధాన కారణం సమాజంలో వచ్చిన మార్పు. పాఠకులు లేకుండా రచయితలుండరు. విద్యావంతులయిన స్త్రీల సంఖ్య నానాటికీ అధికం కావటం, యీనాటికీ ఉద్యోగాలు చేసే స్త్రీల సంఖ్య తక్కువ కావటం, యీ కారణాలవల్ల సమాజంలో స్త్రీ పాఠకుల సంఖ్య పెరిగిపోయింది. అందుకేరచయిత్రుల రచనలకు ఆదరమూ పెరిగింది.

చాలామంది విమర్శకులు కనీసం చదవనయినా చదవకుండా, రచయిత్రుల రచనలను తేలికగా తీసిపారేస్తున్నారు. ఇది న్యాయం కాదు. కళాత్మక ప్రతిభ లేకుండా ఎవరూ రాణించలేరనేది ఎవరూ కాదనలేని సత్యం. స్త్రీలలో ఎక్కువ మంది కుటుంబ జీవిత సమస్యలను ఆధారంగా తీసుకుని వ్రాస్తున్న మాట నిజమే। కానీ, ఇది సాహిత్యానికి న్యూనతాపాదకమా ?

సమాజంలో పాశ్చాత్య సంస్కృతి ప్రభావం వల్ల ఉప్పెనలా అనేక మార్పు లొచ్చాయి సంఘంలో- అయితే బాహిర స్వరూపంలో వచ్చినంత త్వరగా ఈ మార్పు ఆంతరంగిక ప్రవృత్తులలో రాలేదు. ఈ కారణాన వచ్చే ఒడిదుడుకులు అటు కుటుంబంలోనూ, ఇటు సంఘజీవితం లోనూ, - స్త్రీ మాత్రమే ఎదుర్కో వలసి వస్తోంది. స్త్రీలు మాత్రమే అర్థం చేసుకోగలిగిన ఈవిచిత్రమైనసంఘర్షణ, రచయిత్రులు మాత్రమే సమర్థంగా చిత్రించ గలుగుతున్నారు. ఆ రచనలు అశేష పాఠకులను ఆకట్టుకొంటున్నాయి.

రచయిత్రులు కుటుంబ జీవిత సమస్యలను మాత్రమే చిత్రించటంలేదు. ఈనాటి స్త్రీ ఉద్యోగినిగా- సంఘసేవికగా -రాజకీయవేత్త్రిగా- బహుముఖమైన జీవితాన్ని దర్శించగలుగుతోంది. ఆ పరిజ్ఞానం రచయిత్రుల రచనల్లోనూ కనిపిస్తోంది.

"There is a pleasure from learning simple truth, and there is a Pleasure from learning the truth is not that simple" అంటాడు Booth, Rhetoric of fictionలో - సాధారణ

డా॥ సి. ఆనందారామం

సత్యాన్ని తెలుసుకోవటంలోనూ ఆనందముంది. సత్యం, సాధారణ నిర్వచనాలకు అందదని తెలుసుకోవటంలోనూ ఆనందం ఉంది. ఈ రెంటిమధ్య రచయిత్రి తానేం చెప్పదలచుకొందో నిర్ణయించుకోవాలి. సత్యం సాధారణ నిర్వచనాలకందదని చెప్పే ఇతివృత్తాలను నిర్వహించటానికి అసాధారణ ప్రజ్ఞ కావాలి. రచయిత్రులలో చాలా మంది సాధారణ సత్యాన్ని ప్రతిపాదించటంతోనే తృప్తి పడుతున్నారు. సూటిగా చెప్పటంలో హాయి ఉంటుంది. విషయం తెల్లమవుతుంది. కానీ, కళా మతల్లి కాంతులు కనిపించవు. సుఖదుఃఖ సమ్మిశ్రితమైన జీవిత సంఘర్షణలో నుంచి ప్రభవించి, ఒకవైపు సాఫీగా సక్రమంగా—మరోవైపు బాధామయంగా, అపసవ్యంగా ఉండే ఇతివృత్తాలకంటే మరే వీ మానవతను చక్కగా ప్రతిఫలింప చెయ్యలేవు. ఈ రకమైన మానవతా వాదాన్ని కళాత్మకంగా ప్రతిభావంతంగా — చిత్రించిన రచయిత్రులున్నారు. ఈ రకమైన ఇతివృత్తాలలో సార్వజనీనత ఎక్కువ.

రచయిత్రుల రచనలలో వాస్తవిక దృక్పథంలేదని కొందరి విమర్శ. వాస్తవిక దృక్పథం అంటే ఏమిటి? "Art is translation" అన్నారు. బాహ్యజగత్తును కళాజగత్తుగా అనువదించుకొంటున్నప్పుడు, ఆ స్వరూపం మారిపోక తప్పదు— నీతిబోధ అంటే నీతిసూత్రాలు వల్లించటమూకాదు— రాజకీయ చైతన్యమంటే, వార్తా పత్రికలలో వార్తలు వినిపించటమూకాదు. రచయిత వ్యాఖ్యానం లేకుండా, వాస్తవికత పాఠకుల హృదయాలను రంజింప చేయలేదు. కాలాన్నిబట్టి విలువలు మారుతుంటాయి. స్త్రీ 1860 లో కాలేజికి వెళ్ళటమూ, 1960 లో వెళ్ళటమూ ఒకటికాదు. దుర్మార్గాన్ని దుర్మార్గంగా సన్మార్గాన్ని సన్మార్గంగా చెప్పటానికి రచయిత వ్యాఖ్యానంఅవసరం లేదు. ఇవన్నీ సమాజమూ పాఠకులూ సహజంగా భావించేవి. కానీ, దుర్మార్గంలో సహృదయాన్ని - పైకి మంచిగా తోచే సన్మార్గంలో కుత్సితనూ చూపాలంటే మాత్రం వ్యాఖ్యానం అవసరం_

జీవితంలో లాగే సాహిత్యంలోనూ కొన్ని విశ్వాసాలేర్పరచుకొని, ఆ విశ్వాసాల కనుగుణమైన సాహిత్యమే ఉత్తమమని నిర్ధారించే విమర్శకులున్నారు. విశ్వాసాలను అంగీకరించలేక పోయినా, కళా ప్రతిభను కాదనలేము కదా!

మేధావంతమైన రచనలు చేసిన రచయిత్రులు కొద్ది మంది మాత్రమే! జీవితపులోతులను తరచి చూచి అన్ని మతాలకూ అతీతమైన తాత్వికత ప్రతిపాదించగలిగిన ఈ ఇతివృత్తాలు సాధారణ పాఠకుల నంతగా ఆకట్టుకోలేవు ఎందుకంటే, ఈ రకమైన రచనలు సునిశిత ఆలోచనకు కాని అందవు

ఏ కళకైనా రెండు విభాగాలు తప్పవు. ఒకటి: సర్వసామాన్య ప్రజానీకాన్ని ఆకర్షించే కళ_రెండు: ఆ కళలో ప్రవేశం ఉన్నవారిని మాత్రమే ఆకర్షించే ప్రావీణ్యం ప్రదర్శించే కళ. ప్రసాద మాధుర్యాలు ప్రధానంగా ఉన్న కళ ఏదయినా, అందరినీ ఆకర్షిస్తుంది. ఈ ప్రసాద మాధుర్యాలు సాధించగలిగిన

రచయిత్రులు సహితం కొద్దిమంది ఉన్నారు. కాల్పనిక ప్రణయగాథ ఇతివృత్తంగా తీసుకొన్నంత మాత్రాన దానిలో మాధుర్యం ఉన్నట్లు కొందర పొరపాటు పడుతున్నారు. పొరపాటు-అనుకరించబోయిన కొందరి అసమర్థత బట్టబయలు కావటమే, ఈ మాధుర్యగుణం ప్రతిభా సంపాద్యమనటానికి నిదర్శనం.

అసాధారణ రాజకీయ చైతన్యం ప్రదర్శించిన రచయిత్రులు అతి కొద్దిమంది. సర్వ సాధారణంగా రచయిత్రులు గృహిణులయి వుంటారు. అలాంటివారిలో కుటుంబంలో వ్యక్తులు సహితం ఏ రాజకీయోద్యమాలలోనో పాల్గొనే వారయితే తప్ప, రాజకీయ చైతన్యం అలవడటం అరుదు. ఈ రకమైన రచనలు స్వపక్ష ప్రతిపక్షాలలో, అనుకూల, ప్రతికూల సంచలనం రేకెత్తించి, తద్వారా, ప్రచారం పొందగలుగుతాయి. అయితే, రాజకీయ చైతన్యం పేరుతో, బోలు స్లోగనతో, పేజీలు నింపుతున్న రచనలు లేకపోలేదు. కాని, చిత్తశుద్ధితో చేసిన రచనలు సమాజానికెంతో తోడ్పడతాయి.

కొందరు రచయిత్రుల రచనల్లో, జీవితం, వాస్తవికత, మాటల్లో మాత్రం ఉంటాయి. వాటికి సంబంధించిన వ్యాఖ్యానం నవలా శిల్పంలో కనపడదు.

రచయిత్రుల రచనలలో కల్పన రెండు రకాలుగా కనిపిస్తుంది. దైనందిన జీవిత సంఘర్షణను ఎదుర్కోవటంకాక దానినుండి తప్పించుకుని పారిపోయే కల్పన కొందరి రచనలలో,- దీనివలన సమాజానికి ఏ ఉపయోగము లేదు- దైనందిన జీవిత సంఘర్షణను ఎదుర్కొంటూనే, మానవాళికి నిజంగా ఏది వాంఛనీయమో దానిని సూచించటం - ఇది వాస్తవం కాకపోవచ్చు- కానీ పఠితలలో ఆశాభావాన్ని నింపుతుంది. వాస్తవ పరిస్థితితోపాటు ధ్యేయాన్ని ముందుంచుతుంది. ఈ రకమైన కల్పన చేపట్టిన రచయిత్రులు పాఠకులలో సమకాలీన పరిస్థితుల పట్ల ఆలోచన రేకెత్తించగలరు.

రచయిత్రుల రచనలలో ఇతివృత్తాన్ని బట్టి కొందరు నవలల మంచి చెడ్డలు బేరీజు వేయటానికి సాహసిస్తున్నారు. ఇది పొరపాటు.

A....a bad novel is ultimately seems to fail not because of its method, but owing to a fatal inferiority in the authors make-up." అంటాడు David Loge:

నిర్మాణతలో నైపుణ్యాన్నిబట్టి నవల న్యూనతాధిక్యతలుంటాయి కాని, తీసుకున్న ఇతివృత్తాన్నిబట్టికాదు. ఎన్నుకొన్న విధానాన్నిబట్టి కూడా కాదు.

ఇక నవలా రచనలోకాని, కథా కథనంలో కాని, వినూత్న ప్రయోగాలు చేసినవారు అతి కొద్దిమంది - మనో వైజ్ఞానిక నవలలూ, చైతన్య స్రవంతి

విధానంలో సాగిన నవలలూ రచయిత్రులవీ వచ్చాయి. చైతన్య స్రవంతి విధానం అంత సమర్థంగా నిర్వహింపబడినట్లు తోచదు.

రచయిత్రుల రచనలను సామూహికంగా "వంటింటి రచనలు" అనడం జరుగుతోంది. ఆ విమర్శక మహానుభావులు ఏ ఉద్దేశంతో అన్నారో కాని, నేను మాత్రం ప్రశంసగానే తీసుకుంటున్నాను. వంట మాత్రం మాటలా? సరి అయిన పదార్థాలు ఎన్నుకోవాలి. ఏదేది ఎంతెంత వెయ్యాలో సరిచూసుకోవాలి. ఆ తరువాత సరి అయిన పాకాన పడాలి. అప్పుడు షడ్రసోపేతమైన విందు లభిస్తుంది. అలాగే చక్కని ఇతివృత్తాన్ని ఎన్నుకొని, ఏ విషయం ఎంతవరకు వివరించాలో తెలుసుకొని, రచన పాకాన పడినపుడే, పాఠకులకు రసవత్తరమైన నవల లభిస్తుంది. అదీ, ఇదీ, రచయిత్రులే సాధిస్తున్నారు, మరి!

రచయిత్రులలో చాలా మంది చెత్త నవలలు వ్రాస్తున్నారనే విమర్శ ఉంది. ఈ విమర్శ రచయిత్రులకే కాదు. రచయితలకూ చెందుతుంది. తెలుగుకే కాదు. అన్ని భాషలకూ వర్తిస్తుంది. ఆలిచిప్పలన్నింటిలోనూ ఆణిముత్యాలు దొరకవు కదా!

□

---

ఒక నవలలోని పాత్రలు ఫోటోగ్రాఫుల సంపుటి కావు; లేక ఒక వ్యక్తికి సంబంధించిన ప్రశ్న పరంపరల ఫైలూ కాదు. రచయిత ఊహాచిత్రాలు ఆ వ్యక్తులైనా, వారు వాస్తవిక వ్యక్తులే. ఎందుచేతనంటే జీవితాన్ని లోతుగా చూచి అన్వయించే నైపుణ్యంగల రచయిత ఆ పాత్రలకు జీవం పోస్తాడు.

—ఇల్యా ఎహ్రెన్ బర్గ్

కేవలం పాండిత్యం వల్లనే ఉత్తమ రచనలు రావు. రచయిత నేటి సమాజంలోకి చొచ్చుకుపోయి చూస్తేనేగాని కృతకృత్యుడు కాలేడు.

—సుంకర సత్యనారాయణ

---

# తెలుగు నవలలపై దాక్షిణాత్య సాహిత్యాల ప్రభావం

శ్రీకంఠమూర్తి

తెలుగు సాహిత్య చరిత్రలో ఇది 'నవలా శకం'. ఒక్క తెలుగులోనే ఏమిటి – ఉత్తరాది, దాక్షిణాత్య సాహిత్యాల్లో కూడా 'నవలలే' రాజ్యమేలుతున్నాయి. నేడు నవలా ప్రక్రియకున్న ఆదరణ మరే సాహిత్య ప్రక్రియకీ లేదంటే అతిశయోక్తి కాదు. పాఠకులు, పత్రికలవారు, ప్రచురణ కర్తలు చివరికి చిత్ర నిర్మాతలు కూడా నవలలకు బ్రహ్మరథం పడుతున్నారు.

ముప్ఫయి అయిదేళ్ళక్రితం కొవ్వలి, జంపన నవలలు తెలుగు పాఠకులను ఉర్రూతలూగించాయి. ఆ తరువాత శరత్ నవలలు పాఠకులచేత కంటతడి పెట్టించాయి. ఈ శరత్ నవలలు తెలుగు సాహిత్యానికి ఎంతో మేలు చేశాయని చెప్పవచ్చు. శరత్ నవలల పుణ్యమా అని అప్పటివరకూ పుస్తకాల షాపుల్లో దుమ్ముపట్టిన పుస్తకాలన్నీ దుమ్ము దులుపుకున్నాయంటే అతిశయోక్తికాదు. అప్పటిదాకా పుస్తకాన్ని డబ్బుపెట్టి కొనని తెలుగు పాఠకుడు – శరత్ నవలల మూలంగా – పుస్తకాలను కొని చదివే అలవాటును అలవర్చుకున్నాడు. ఇది నిజంగా గొప్ప విషయమే. శరత్ నవలలను తెలుగు పాఠకులు ఇంతగా ఆదరించడానికి కారణం – వాటిల్లో అంతర్లీనంగా ఉన్న మానవతా దృక్పథం. అంతేకాదు, వాటిలో ప్రతిబింబించిన జన జీవనం మన తెలుగువారి జీవనానికి దగ్గరగా ఉండటం కూడా మరో కారణం. శరత్ నవలల్లో కనిపించే ఇతివృత్తం, పాత్రలు అప్పటితరం తెలుగువారి సామాజిక జీవితానికి, స్థితిగతులకీ కొంతవరకు అద్దం పడతాయి. బహుశా ఇదే కారణం కావచ్చు – మన తెలుగువారు ఆ నవలలను ఆదరించడానికి. ఒక భాషలో ఉండే నవలలు ఇంకో భాషలోకి అనువదించబడి అత్యధిక సంఖ్యలో పాఠకులను ఆకర్షించడం భారతీయ సాహిత్య చరిత్రలోనే అరుదు. ఈ ప్రకారం శరత్ బెంగాలీ నవలలు తెలుగు పాఠకులకు బాగా చేరువయ్యాయి. శరత్ నవలల ప్రభావానికి లోనయి చాలామంది రచయితలు ఆ రకం నవలలనే రచించడం మొదలుపెట్టారు. వారిలో ముఖ్యమైన

వారు కొమ్మూరి వేణుగోపాలరావు.

అదేమి కారణమో కానీ తెలుగు నవలలపై బెంగాలీ నవలల ప్రభావం పడినంతగా – తెలుగువారికి అతి చేరువగా నున్న – దాక్షిణాత్య భాషల నవలల ప్రభావం పడలేదు. నిజానికి ఇతర భాషలకన్నా దాక్షిణాత్య భాషల నవలల ప్రభావం మన తెలుగు నవలలపై పడి వుండాల్సింది. ఎందుకంటే మన తెలుగు దేశానికి దాక్షిణాత్య రాష్ట్రాలతో ఉన్న సంస్కృతీ బాంధవ్యంకానీ, రాజకీయ వ్యవహారాలు కానీ, వాణిజ్య వర్తకాలు కానీ, సులభమైన రాకపోకలు కానీ మరే యితర రాష్ట్రాలతోనూ లేవు. ముఖ్యంగా తెలుగు ప్రజల ఆచార వ్యవహారాలకీ, దాక్షిణాత్య ప్రజల ఆచార వ్యవహారాలకీ ఆట్టే తేడా లేకపోవడం మనం గమనించాలి. దాక్షిణాత్య భాషల ప్రజల్లో తెలుగువారికీ, కన్నడం వారికీ మధ్య నున్న సంబంధాలు మరీ సన్నిహితం. అలాంటప్పుడు ఒక భాషా సాహిత్య ప్రభావం ఇంకో భాషా సాహిత్యంమీద పడి తీరాలి. దాక్షిణాత్య సాహిత్యాల ప్రభావం తెలుగు సాహిత్యంపై కానీ, తెలుగు సాహిత్య ప్రభావం దాక్షిణాత్య సాహిత్యాలపై గానీ పడితీరాలి. కానీ అలా జరగటంలేదు. దీనికి కారణం సుస్పష్టం. దాక్షిణాత్య ప్రజల్లో ఎంతగా సమాన ధర్మం ఉన్నా వారి మధ్య భాషలు అడ్డుగోడలుగా నిలిచిపోయాయి. ఈ అడ్డుగోడలను పెకలించి వేయడానికి ఒక భాషవారు ఇంకో భాషను పరిచయం చేసుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది. ఒక భాషవారు ఇంకో భాషను నేర్చుకుంటే సహజంగా మరో భాషా సాహిత్యం అధ్యయనం చేయడానికీ, తెలుసుకోవడానికీ వీలుకలుగుతుంది. తద్వారా ఒక భాషా సాహిత్యంలో ఉన్న ప్రత్యేకతల ప్రభావం మరో భాషా సాహిత్యంమీద పడడానికి అవకాశం ఏర్పడుతుంది.

ఈనాడు దాక్షిణాత్య ప్రజలు ఒకచోట కలిసేవారు మాట్లాడుకునేది ఇంగ్లీషు లోనే. అంటే మనం ఇంగ్లీషుమీద చూపుతున్న వ్యామోహం మన పొరుగు దాక్షిణాత్య భాషలమీద చూపడంలేదు. దీనివల్ల దాక్షిణాత్య భాషల సాహిత్యాల్లో ఉండే సొబగులను కానీ వస్తున్న మార్పులను కానీ మనం తెలుసుకో లేకుండా పోతున్నాం.

తెలుగు నవలలపై దాక్షిణాత్య భాషల నవలల ప్రభావం పడకపోవడానికి ఇంకో కారణం కూడా ఉంది. దాక్షిణాత్య భాషల నవలలు తెలుగులోకి అనువదించే కృషి అంతగా జరగలేదు. దీనివల్ల ఆ నవలల్లో వస్తున్న మార్పులు గానీ, పోకడలుగానీ తెలుసుకోడానికి వీలులేకుండా పోతున్నది. ఇదిముఖ్యంగా గమనించవలసిన విషయం. ముందే పేర్కొన్నట్టు తెలుగు నవలలపై శరత్ నవలల ప్రభావం పడినట్టు దాక్షిణాత్య నవలల ప్రభావం అంతగా పడలేదు. అయితే తెలుగు నవలలపై తమిళ నవలల ప్రభావం కొద్దిగానైనా పడిందన డానికి కొంత ఆధారం లేకపోలేదు. ఈ విషయాన్ని తరువాత ప్రస్తావిస్తాను.

శరత్ నవలల తరువాత అత్యధిక సంఖ్యలో తెలుగు పాఠకులచేత చది

వించినది డిటెక్టివ్ నవలలు. శరత్ నవలలకన్నా అత్యధిక సంఖ్యలో అమ్ముడుపోయినవి ఈడిటెక్టివ్ నవలలే. ఇది ఇంగ్లీష్ డిటెక్టివ్ నవలల ప్రభావం అని వేరే చెప్పనక్కరలేదు ఈ డిటెక్టివ్ సాహిత్యానికి తెలుగు సాహిత్యంలో ఒక స్థానం కల్పించడానికి కృషిచేసిన వారిలో ముఖ్యులు శ్రీ ఆరుద్ర, శ్రీ కొమ్మూరి సాంబశివరావు, శ్రీ టెంపో రావు. ఈ నవలలు అందంగా ముద్రించబడి మంచి గెటప్‌తో షోకేసుల్లో ఆంగ్ల నవలల పక్కన విరాజిల్లాయంటే అతిశయోక్తి కాదు. ఇవి యువజనులను బాగా ఆకర్షించాయనే చెప్పాలి. కాలేజీ యువతీ యువకులు కూడా వీటిని కొని తమ పుస్తకాల మధ్యన పెట్టుకుని కాలేజీకి వెళ్ళేవారు ఈ ప్రకారం శరత్ నవలలు, డిటెక్టివ్ నవలలు తెలుగు పాఠకుడిచేత- పుస్తకాలను కొని చదివే అలవాటును పెంపొందించి తెలుగు సాహిత్యానికి గొప్ప సేవ చేశాయి.

ఆ తరువాత వచ్చినవి సెక్సు నవలలు. ప్రజల బలహీనతలు కనిపెట్టి కాష్ చేసుకోవడానికి అవతరించిన బూతు సాహిత్యం ఇది. వీటిలో అన్నీ బూతు వర్ణనలే. వీటిని కుర్రకారు కొని తమజేబుల్లో భద్రంగా దాచుకుని చాటుగా చదువుకునేవారు. ఈ సాహిత్యాన్ని ప్రభుత్వం నిషేధించకపోయినట్లయితే వీటి దుష్ప్రభావం కుర్రకారు మీద అధికంగా పడేది.

ఇలా నాలుగు దశలను తెలుగు సాహిత్యం చవి చూసింది. ఈ నాలుగు దశల సాహిత్యమంతా- బూతు సాహిత్యాన్ని మినహాయించి-మంచిదని చెప్పడానికి వీల్లేదు; బొత్తిగా చెత్త అని చెప్పడానికి కూడా వీల్లేదు. దీనికి సరైన బెరామీటర్ ఒకటే- ఉత్తమ సాహిత్యం అనేది ఉంటే అది నాలుగు కాలాలపాటు నిలుస్తుంది. లేకపోతే కాలప్రవాహంలో అది కొట్టుకుపోతుంది.

ఇప్పుడు తెలుగు నవలకి అయిదో దశ పట్టింది. అదే స్త్రీల నవలలు. అంటే స్త్రీలే ఎక్కువగా రాస్తున్న నవల లన్న మాట! ఇప్పుడు ఈ నవలలకున్న గిరాకీ మరే నవలలకీ లేదు. స్త్రీలు రచించిన నవలల ఆధారంగా తీస్తున్న సినిమాల సంఖ్య కూడా బాగానే ఉంది. ఇది మంచి పరిణామమో, చెడు పరిణామమో కాలమే నిర్ణయించాలి. అయితే ఇది కూడా ఎక్కువకాలం నిలువదు. దాంతో ఈ అయిదో దశ పూర్తయి ఆరవ దశ ప్రారంభం కావచ్చు.

నేడు తెలుగు సాహిత్యంలో 75 శాతం చోటును నవల, 15 శాతం కథానిక ఆక్రమించుకున్నాయి కవిత, నాటిక, వ్యాసం వంటి మిగతా సాహిత్య ప్రక్రియలు 10 శాతంలోనే ఉంటున్నాయి. ఈ నవలలను వారపత్రికలు, ఆదివారం అనుబంధాలు, మాసపత్రికలు పెంచి పోషిస్తున్నాయి. ఈ నవలలను చదువుతున్న పాఠకుల్లో అధికసంఖ్యాకులు మధ్యతరగతి కుటుంబాల్లోని స్త్రీలు. ఈ నవలలను రాస్తున్న రచయిత, రచయిత్రులు కూడా మధ్యతరగతివారే. కాబట్టి దీన్ని 'మధ్యతరగతి నవలలు' అని పేర్కొనవచ్చు. ఈ మధ్యతరగతి సాహిత్యం పొరుగు భాష అయిన తమిళ

సాహిత్య ప్రభావమేమో ననిపిస్తుంది, దాని ప్రభావమే మన తెలుగునవలల్లో ముఖ్యంగా స్త్రీలు రాస్తున్న నవలల్లో కనిపిస్తున్నది. దాక్షిణాత్య సాహిత్య ప్రభావం తెలుగు నవలలపై ఏ కొంచెం అయినా పడిందంటే ఈ మధ్యతరగతి తమిళ సాహిత్య ప్రభావమే ననవచ్చు. ఈ సాహిత్యం అటు ఉన్నతవర్గానికి చెందినవారి జీవితాన్ని కానీ, ఇటు అట్టడుగు వర్గాలవారి జీవితాలనూ, సమస్యలనూ కానీ పటించుకోదు. తమిళ పత్రికలలో సీరియల్స్‌గా ప్రచురింపబడుతున్న నవలలు మధ్యతరగతి జీవితానికి ప్రతిబింబాలు మాత్రమే. చైతన్యానికి ప్రతీకగా ఉండవలసిన సాహిత్యం ఇంకా మధ్యతరగతి మన స్తత్వంనుంచి బయట పడకపోవడం శోచనీయం. ప్రజలు కూడా ఈ రకం సాహిత్యాన్నే బాగా ఆదరిస్తున్నారు.మధ్యతరగతి జీవితాల్లో సామాన్యంగా ఉండే ఈతి బాధలను మరిచిపోవడానికి పాఠకులు మత్తుమందులాంటి ఈ సాహిత్యానికి అలవాటు పడిపోయారేమో ననిపిస్తుంది. ఈ రకం సాహిత్యం ప్రభావం మన తెలుగు నవలలపై పడడానికి కారణం—ఇదివరకు మద్రాసు నుండి వెలువడి ఇప్పుడు మరో చోటికి మార్చిన తెలుగు వారపత్రికలేనని చెప్పవచ్చు. మద్రాసులో వెలువడుతున్న అనేక తమిళ పత్రికలను ఎప్పటికప్పుడు గమనిస్తూ — తెలుగు పత్రికలు వాటి మార్గాన్నే అనుసరించాయి. మధ్యతరగతి సాహిత్యం మూలంగానే పత్రికల సర్క్యులేషన్ పెరుగుతుందని తమిళ పత్రికలవారు ఎప్పుడైతే గ్రహించారో— అలాంటి సాహిత్యాన్ని రచించేవారికి ఎక్కువ సొమ్ము ముట్టజెప్పడం ప్రారంభించారు. వాటిలో నవలల పోటీ ఒకటి. ఈనాడు తమిళ పత్రికలు నవలల పోటీ విషయంలో అన్ని భాషల పత్రికలనూ మించిపోయాయి. అవి ప్రకటించే బహుమతి మొత్తాలు వేల సంఖ్యలో ఉంటాయి. అవి ప్రకటించే ప్రథమ బహుమతి మొత్తం 25,000 రూపాయలంటే ఎవరికైనా ఆశ్చర్యం కలుగుతుంది. ఆ పత్రికలు నవలల పోటీల్లో పోటీలుపడి బహుమతి మొత్తం పెరిగిపోవడానికి అవే కారణం కావడం విచిత్రం. అంటే ఒక పత్రిక ప్రథమ బహుమతిని 5,000 రూపాయలు అని ప్రకటిస్తే వెంటనే ఇంకో పత్రిక దానికి పోటీగా 6 000 రూపాయలు ప్రకటించేస్తుంది.ఈ ప్రకారం అవి ప్రథమ బహుమతీ మొత్తాన్ని 25,000 రూపాయల వరకూ పెంచుకున్నాయి. ఈ బహుమతులు గెల్చుకుని తమిళరచయిత(త్రి)లు స్వంతబంగళాలు కూడా కట్టించుకున్నారని విన్నప్పుడు మరింత ఆశ్చర్యపోవలసి వస్తుంది. ఈనాడు తమిళ పత్రికల సర్క్యులేషన్ ఇతర భాషా పత్రికల సంఖ్యకంటే అత్యధికంగా ఉంది. "కుముదం" అనే తమిళ వారపత్రిక సర్క్యులేషన్ 5 లక్షలకు పైగా ఉందట. ఇంత సర్క్యులేషన్ హిందీ పత్రికలకు కూడా లేదు. అంటే పత్రికలను కొని చదివేవారిలో అందరికన్నా తమిళపాఠకులే అత్యధికసంఖ్యలో ఉన్నారన్న మాట!

మధ్యతరగతి సాహిత్యాన్ని అందించే తమిళ పత్రికల ప్రభావం మద్రాసు నుంచి వెలువడిన (నిన్న మొన్నటి దాకా) తెలుగు పత్రికలపై పడితే ఆ ప్రభావం రాష్ట్రంలో ఉన్న మిగతా పత్రికలపై పడడానికి ఎక్కువ కాలం పట్టలేదు. దాంతో అన్ని పత్రికలూ మధ్యతరగతి సాహిత్య ప్రచారానికే ఎక్కువ దోహదం చేశాయి, చేస్తున్నాయి. సహజంగా మధ్యతరగతి పాఠకులే వాటిని ఆదరిస్తున్నారు.

ఇప్పుడు పత్రికలు నిర్వహిస్తున్న నవలల పోటీ కథానికల పోటీలు కూడా తమిళ పత్రికల ప్రభావమే. ఈ పోటీలను మొదట మద్రాసులో వెలువడిన తెలుగు పత్రికలే ప్రారంభించాయన్నది ఇక్కడ గమనించాలి. అయితే తమిళపత్రికల వలె బహుమతి మొత్తాలను పెంచుకోలేదు. ఆదిలో రెండు ప్రముఖ వారపత్రికలు బహుమతి మొత్తాల విషయంలో పోటీ పడి చివరికి అందులో ఒక వారపత్రిక ఓడిపోక తప్పలేదు. ఇప్పుడు అలాంటి పోటీలులేవు. ఎవరి స్తోమతను (పత్రిక స్తోమత) బట్టి వారు బహుమతి మొత్తాలను పోటీల్లో పాల్గొనే రచయితలకు అందజేస్తున్నారు.

తమిళ సాహిత్యమంతా పూర్తిగా "మధ్యతరగతి సాహిత్యం" అని చెప్పడానికి కూడా వీల్లేదు. ఈ రకం సాహిత్యాన్ని పెంచి పోషిస్తున్నది పత్రికలు మాత్రమే. పుస్తక రూపంలో ప్రచురింపబడుతున్న నవలల్లో మధ్యతరగతి జీవిత చిత్రణ ఉన్నా — అభ్యుదయ భావాలతో ఆలోచింపచేసేవి కూడా ఉన్నాయి. ఈ నవలలను ఆదరించేవారు కూడా ఎక్కువ సంఖ్యలోనే ఉన్నారు. ఇలాంటి నవలలను రాసిన వారిలో (రాస్తున్న) ముఖ్యులు అఖిలన్, కి.వా. జగన్నాథన్, అశోకమిత్రన్, జయకాంతన్, చాని మొదలైనవారు. పత్రికల్లో ప్రచురింపబడే మధ్యతరగతి సాహిత్యానికి భిన్నంగా- వస్తు వైవిధ్యంలోనూ,కథను చెప్పే విధానంలోనూ కొత్తదనాన్ని సంతరించుకుని ఈ సాహిత్యం అభివృద్ధి చెందుతోంది.

ఇలా తమిళ నవలల ప్రభావంతో తెలుగు పత్రికలలో ఎక్కువ ప్రచారం పొందుతున్న మధ్యతరగతి సాహిత్యానికి ఇంతగా ఆదరణ లభించడానికి కారణం- అది పాఠకులను ఊహాలోకంలో విహరింపచేసే సాహిత్యం కావడమే. ఈ సాహిత్యంలో అభూత కల్పనలు ఎక్కువ. అవాస్తవిక సంఘటనలు అనేకం. ఇందులోని పాత్రలు గాలిలో తేలిపోతుంటాయి. నేలమీద నడవవు. అయితే ఈ రకం సాహిత్యంలో మధ్యతరగతి ప్రేమలు పెళ్ళిళ్ళు, కట్నాల సమస్యలు, ఆర్థిక సమస్యలు, ఉద్యోగ పరిస్థితులు, కష్టాలు, త్యాగాలు మొదలైనవి ఎక్కువగా వర్ణింపబడడంవల్ల స్త్రీలు ఎక్కువ సానుభూతితో వీటిని చదువుతున్నారు.

నవలల పోటీల విషయంలో కన్నడ పత్రికలు ఇతర పత్రికలకు మార్గదర్శకంగా ఉన్నాయి. అవి నిర్వహించే పోటీల్లో ప్రథమ బహుమతికి అర్హమైన నవల ఏదీ రాకపోతే ఆ బహుమతిని రద్దుచేస్తారు. ప్రథమ బహుమతి పొంద

వలసిన నవల స్థాయి ఏమిటో నవలలను పరిశీలించే జడ్జీలకు తెలుసు. అలాగే ప్రథమ బహుమతికీ, రెండవ బహుమతికీ అర్హమైన నవలలువచ్చి మూడవ బహుమతికి అర్హమైన నవల రాకపోతే ఆ బహుమతిని కూడా రద్దుచేస్తారు. అంటే ఏఏ బహుమతికి ఏఏ అర్హత, స్థాయీ ఉండాలో వాళ్ళు ముందే నిర్ణయించుకొని ఉంటారన్నమాట!

మన తెలుగు నవలల పోటీల విధానం దీనికి భిన్నంగా ఉంది. పోటీకి వచ్చిన నవలల్లో ప్రథమ, ద్వితీయ, తృతీయ బహుమతులకు నవలలను ఎన్నికచేసేస్తారు. కొన్ని సందర్భాలలో ప్రథమ బహుమతి పొందిన నవలకన్నా ద్వితీయ బహుమతి పొందిన నవల శ్రేష్టంగా ఉండటం జరుగుతూవుంటుంది. దీనికి కారణం— నవలలను పరిశీలించే జడ్జీల అసమర్థత. పత్రికలవారు నియమించే జడ్జీలలో కొంతమందికి అసలు నవలల గురించి ఏమీ తెలిసుండదు. పోటీకి వచ్చిన నవలల్లో ఉత్తమమైన వాటిని— ప్రథమ, ద్వితీయ, తృతీయ బహుమతులవారీగా— ఎన్నిక చేసేపాటి సాహిత్య పరిజ్ఞానం వారికి ఉండదు. ఇక నవలల స్థాయి పడిపోయిందంటే పడిపోదూ మరి ?

మన తెలుగు సాహిత్యంలో ఇంకో పరిణామాన్ని కూడా గమనించవలసి వుంటుంది. ప్రాచీన కావ్యాలను అధ్యయనం స్తూ విమర్శా గ్రంథాలు, పరిశోధన గ్రంథాలు రచించేవారు మధ్యతరగతిలోనే ఉన్నా—'మధ్యతరగతి సాహిత్యానికి' దూరంగా ఉంటున్నారు. అలాగే అట్టడుగు వర్గాల శ్రేయస్సుకై అనవరతం ఆవేదన చెందుతూ—వారిని తమ న్యాయమైన కోరికల సాధనకు ఆయత్త పరచడానికి తమ కలాలను అంకితం చేసిన అభ్యుదయ, విప్లవ రచయితలు కూడా మధ్యతరగతివారే.

మన పొరుగు భాషలైన కన్నడ, మలయాళ సాహిత్యాల్లో కొత్తకొత్త పోకడలు కనిపిస్తున్నాయి. అక్కడి రచయితలు నవలా ప్రక్రియలో అనేక రకాల ప్రయోగాలు చేస్తున్నారు. కథ చెప్పే విధానంలో కొత్తకొత్త టెక్నిక్‌లను ప్రవేశపెడుతున్నారు. వాటిని తెలుసుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది. కాని తెలుసుకోవడం ఎలా ? ఆ నవలలను ఎక్కువ సంఖ్యలో తెలుగులోకి అనువదిస్తే కానీ అది సాధ్యపడదు. అయితే వాటిని ఎవరు అనువదిస్తారు? ఒకవేళ అనువదించినా వాటిని ప్రచురించే ప్రచురణకర్తలేరి? ఇదే ఇప్పుడు ప్రధానమైన సమస్య. పత్రికలైతే అనువాద సాహిత్యమంటేనే అదేవో అంటరానివన్నట్టు దూరంగా ఉంచుతున్నాయి. ఇలాంటి పరిస్థితిలో పొరుగు భాషల్లోని ఉత్తమమైన నవలలను చదివే అవకాశం తెలుగు పాఠకులకు ఎలా కలుగుతుంది? ఇక తెలుగు నవలలపై వాటి ప్రభావం పడడానికి అవకాశం ఎక్కడుంటుంది ?

(ఇది సమగ్రమైన వ్యాసం కాదు. తెలుగు నవలలపై దాక్షిణాత్య నవలల ప్రభావం గురించి అలవోకగా చేసిన అవలోకనం ఇది.)

☐

# తెలుగు నవల-ఉత్తర భారత భాషల ప్రభావం

డా॥ భీమసేన్ 'నిర్మల్'

ఆంగ్ల భాషా పదమయిన 'నావెల్'ను మొదట్లో వచన ప్రబంధం అన్నా తరవాత మనం అదే పదాన్ని తెలుగు భాషా ప్రకృతికి అనుగుణంగా 'నవల' అని తీర్చి దిద్దుకున్నాము. 'నవల' అనే మాటలో నిత్యనూతనత్వమూ, లాలిత్యమూ రెండూ తొణికిసలాడుతున్నవి. ఈ రచనా ప్రక్రియను ఇతర భారతీయ భాషలలో కాదంబరి అనీ, ఉపన్యాస్ అని అంటారు. కాని ఆధునిక నవలా తత్త్వాన్ని స్పష్టం చేసే సామర్థ్యం 'నవల'కున్నంతగా ఇంకేమాటకూ లేదంటే అతిశయోక్తి కాదేమో! అయితే ఈనవలా రచనా ప్రక్రియబీజప్రాయంగా పాశ్చాత్య సాహిత్యానికి సంబంధించినదే అయినా, భారతదేశ పరిస్థితుల కనుగుణంగా తన రూపు తీర్చిదిద్దుకున్నది, వికాసోన్ముఖమయి ప్రగతి పథంలో పయనం సాగిస్తున్నది. ఇతర భాషలలోని నవలలను అనువదించుకొని (ఏ భాషలోనయినా ప్రారంభదశలో ఇది తప్పదు), తెలుగు నవల స్వీయమయిన ప్రతిభా వ్యుత్పత్తులతో, భారతీయ నవలా సాహిత్యంలో తనదంటూ ఒక స్థానాన్ని ఏర్పరచుకుంటున్నది.

ప్రారంభంలో పాశ్చాత్య భాషల నవలలూ, పాశ్చాత్య ప్రభావాన్ని ముందుగా జీర్ణం చేసుకున్న బెంగాలీ నవలలూ మనం అనువదించుకున్నాము. ఒక రాజశేఖర చరిత్ర అనండి, పాంచకడీదేవ్ నవలలు అనండి, ఇతర భాషల నవలల అనువాదాలు, మన భాషలో పుంఖానుపుంఖాలుగా నవలలు వ్రాయబడడానికి ఎంతగానో దోహదం చేశాయి. శరత్ నవలలు, ప్రేంచంద్ నవలలు సాంఘిక, గ్రామీణ జీవితాన్ని చిత్రించే నవలలు వ్రాయడానికి ప్రేరణ కలిగించాయి. ఒకచోట ప్రేంచందు 'తను చిత్రించే జీవితాన్ని రచయిత అనుభవించి ఉన్నట్లయితే, అతడి రచన పాఠకుణ్ని అత్యధికంగా ప్రభావితం చేస్తుంది' అని అన్నాడు. మరి శరత్తు, ప్రేంచంద్ అటువంటిమహా రచయితలు. అలాంటి రచయితలు మనకు కొఱవడడంతో శరత్‌లా, ప్రేంచంద్‌లా దేశవ్యాప్తంగా ప్రసిద్ధికెక్కినవారు మనకు

లేరు. నారాయణరావు, అల్పజీవి, చివరకు మిగిలేది మొదలయిన నవలలు హిందీ లోకి అనువదించబడ్డా, ఆయా భాషా సాహిత్యాలమీద వాటి ప్రభావం అంతగా కనబడదు. దీనికి ఇంకో కారణం కూడా చెప్పవచ్చు. తెలుగువాడు సొంత డబ్బా కొట్టుకోడంలో (తన డబ్బా అనండి, తన భాషా సాహిత్యాల డబ్బా అనండి) చాలా వెనకబడి ఉన్నాడు. అందుచేత తెలుగులో ఉన్న ఉత్తమ సాహిత్యం గురించి ఇతరు లకు అంతగా తెలియదు.

అనువదించుకోవడానికి హిందీ, మరాఠీ, బెంగాలీ, గుజరాతీ మొదలయిన భాషల నవలలను అనువదించుకున్నా (ఒక్కొక్కప్పుడు పేరు చెప్పి, చాలా సార్లు పేర్లు చెప్పక), తెలుగు నవల ఏ ఇతర భాషా నవలకు అనుసరణా- అను కరణా కాదని ఘంటాపథంగా చెప్ప వచ్చు. తెలుగు నవల తెలుగువాడి జాతీయ లక్షణాలకు ప్రతిబింబం. కనుక మరాఠీ, బెంగాలీ, హిందీ, ఒరియా మొద లయిన ఉత్తర భారత భాషల ప్రభావం తెలుగు నవలమీద లేదనే చెప్పవచ్చు.

తులనాత్మకంగా పరిశీలించవలసి వస్తే ఉత్తరభారతభాషలలో వ్రాయబడిన వ్రాయ బడుతున్న నవలలో నగర జీవితంలోని సమస్యలకు లోనయి కొట్టుమిట్టాడుతున్న స్త్రీ-పురుషుల జీవితాలను చిత్రించినపుడు, గ్రామీణ జీవితంలోని పాత్రలను చిత్రించినపుడు, ఆయా పాత్రలచిత్రణలో మౌలికమయిన మనో విశ్లేషణాత్మక మయిన పద్ధతిని అవలంబించడం జరుగు తున్నది. అందుచేత ఒక నవలా రచయిత(త్రి) చిత్రించిన పాత్రలు ఒకే మూసలో పోసిన వాటివలె కాక, తమ వ్యక్తిగత వైశిష్ట్యానినిలబెట్టుకొన్ని పాఠ కులను ఆకట్టుకుంటున్నాయి. సమస్యల చిత్రణలోకూడా అంతే. కల్పనాలోకంలో సమస్యలను సృష్టించి, వాటికి అటువంటి పరిష్కార మార్గాలనే సూచించక, యథార్థ జీవితంలో నేటి భారతీయుడు ఎదు ర్కొంటున్న సమస్యలనే చిత్రించి, రచయిత వాటికి పరిష్కార మార్గాలు సూచించడు. అలా పాఠకుడి ఆలోచనా శక్తిని ఉత్తేజితం చేస్తాడు.

ఆయా భాషలలో వ్యాపార(commercial) నవలలూ వ్రాయబడుతునే ఉన్నాయి. కాని వాటి జీవిత కాలం రైల్వే ప్రయాణానికి మాత్రమే పరిమిత మయి నది. ప్రబుద్ధ పాఠకుడు వాటి జోలికి పోడు. ఈ దృక్పథంతో ఆలోచిస్తే మన నవలా రచయితలు ఇంకా కృషి చేసి, జీవితపు లోతులను తరచిచూసి, కల్పనకంటె సత్యమే సుందరంగా ఉంటుందనే వాస్తవికతను గుర్తించి, పాఠకులనుజోకొట్టేరచనలుకాక, వారిలో ఆలోచనా శక్తిని ప్రేరేపించే రచనలు చేయగలరని ఆశిద్దాం. (అలాంటి నవలలు బొత్తిగా లేవనను. కాని ఉన్నవాటిని వ్రేళ్ళమీదనే లెక్కించవచ్చు.)

*

# ఈ దశాబ్ది తెలుగు నవల

డా॥ ఎ. రమాపతిరావు

(మంజుశ్రీ)

వెనక్కు తిరిగిచూస్తే ఒకందుకు సంతోషం కలుగుతుంది.

నూట ఎనిమిది సంవత్సరాల తెలుగు నవల చరిత్రచూస్తే, మొలకెత్తిన ఆరు సంవత్సరాల వరకూ మారాకే తొడగ లేదు. ఇప్పుడేమో మహావృక్షం. శాఖోప శాఖలు.

తెలుగు నవల సమాజ పరిణామాన్ని దృష్టిలో పెట్టుకొనే పుట్టింది.

సమాజ వికాసంకోసమే ప్రబోధిస్తూ సాగింది. పుట్టిన నాటినుంచీ సమాజ సాహిత్య ప్రక్రియగానే ప్రీతి పాత్రమైంది పాఠకులకు. సమాజంలోని మార్పులు, ప్రభావాలు, మధనలూ ప్రతిబింబిస్తూనే వచ్చింది. అయితే ఆశ్చర్యం కలిగించే ఘట్టాలు లేకపోలేదు.

అర్థంకాని సమస్యలూ ఎదురుకాక పోలేదు—చారిత్రక విశ్లేషణలో.

సామాజిక నవలగా పుట్టింది పాతిక సంవత్సరాలు గడిచేసరికి చారిత్రక నవలగా ఎందుకు పరిణమించింది? శిల్పం దృష్ట్యా గాని, వస్తువుదృష్ట్యాగాని, సహజమైన వికాసం దృష్ట్యాగాని ఇది వెనకడుగు కాదా.

తెలుగులో మొట్టమొదటి నవల శ్రీ రంగరాజ చరిత్రం, రెండోది రాజశేఖర చరిత్రం. పేరులోనే ఇవి చరిత్రలు; కాని సాంఘిక నవలలు. అంటే నాటి సాంఘిక సమస్యలను దృష్టిలో వుంచుకొని వాటివల్ల ప్రభావితమై పుట్టినవి. ఈ రెండింటి తర్వాత వచ్చిన సత్యవతీ చరిత్రం కూడా సాంఘిక నవలే. రాజశేఖర చరిత్ర తర్వాత సరి అయిదేళ్ళకు పుట్టిందీనవల. సరిపదేళ్ళదాకా తెలుగులో నవలలు వచ్చినట్లు లేదు. కిందటి శతాబ్ది చివరి దశాబ్దంలో చింతామణి అనే సాహిత్య పత్రిక నిర్వహించిన పోటీల ధర్మమా అని నవలా రచన వికాసం పొందింది. రచయితలకూ పాఠకులకూ కూడా ఆకర్షకమైంది. ధర్మవతీ విలాసం సంజీవరాయ చరిత్రం, రామచంద్ర విజయం, వివేక విజయం ఇలావుండేవిపేర్లు. ఇప్పటివరకూ సాంఘికేతివృత్తమే సాగింది.

మరి చిలకమర్తి రంగంలో ప్రవేశించిం తర్వాత తాత తాతల నాటి కథల కోసం తవ్వడం మొదలైంది. ఆనాటి సామాజిక పరిణామాలను విశ్లేషిస్తే ఇది వింత కాదు. బ్రాహ్మ సమాజం, ఆర్యసమాజం ప్రభలు సన్నగిల్లి దివ్యజ్ఞాన సమాజం ఒక్క వెలుగు వెలుగుతున్న రోజులొచ్చాయి. అప్పటికి కిందటి శతాబ్దం

ముగిసింది. కొత్త శతాబ్దంలో సాహిత్యంలో లౌకికదృష్టి ప్రబలుతూవచ్చింది. ఈ శతాబ్ది మొదటి దశాబ్దిలో స్వాతంత్ర్యోద్యమం ప్రారంభమైంది. రెండో దశాబ్ది ప్రారంభంలోకాని సామాజిక నవల పుట్టలేదు. స్థూలంగా మొదటి పాతిక సంవత్సరాలు సాంఘిక నవల. తర్వాత పాతిక సంవత్సరాలు చారిత్రక నవల. మాలపల్లి వచ్చింది. ఇది తెలుగులో మొట్టమొదటి సామాజిక నవల. నవ భారత ఇతిహాసాన్ని ప్రతిబింబిస్తున్న సమగ్ర నవల సాంఘిక నవలకూ, సామాజిక నవలకూ భేదమేమిటన్న ప్రశ్న రావచ్చు. సాంఘిక నవలలో వ్యక్తి కేంద్రం. సామాజిక నవలలో సమాజం కేంద్రం. వ్యక్తీ, సమాజమూ పరస్పర ప్రభావశీలాలే కాదనలేం. కాని కులాచారాలు, కుటుంబ సమస్యలు, వ్యక్తుల పరస్పర ఆకర్షణ వికర్షణలు సాంఘిక నవలకు వస్తువు. అంటే ముడి వస్తువు. సామాజిక నవల అట్లాకాదు. సమాజం మీద సమకాలిక ఆర్థిక రాజకీయ సాంస్కృతిక వ్యవస్థల ప్రభావాన్ని సామాజిక నవల ప్రతిబింబిస్తుంది.

మాలపల్లి 1922 లో వచ్చింది. మరి పదేళ్ళకు చలం మైదానం, విశ్వనాథ వేయి పడగలు వచ్చాయి. ఈ పరిణామం ఏమిటి? తెలుగు నవలకు బలుపా! వాపా! ఈ లోపున ఒక ప్రపంచ యుద్ధం ముగిసింది. ఇంకో యుద్ధం రాబోతున్నది. పాశ్చాత్య దేశాలలో మానవ నాగరికత శిధిలమై పోయింది. ఈ పరిణామం అక్కడి సాహిత్యాన్ని, కళలను ప్రభావితం చేసింది. సమాజంలోని హింసా ప్రవృత్తిని, దౌర్జన్యాన్ని, క్రౌర్యాన్ని నాశనం చెయ్యాలి. ఎదురు తిరగాలి. ప్రశ్నించాలి. పడిపోతామని తెలిసినా లొంగిపోకూడదు. సజీవ రచన అంటే నెలకొని ఉన్న, అన్యాయంగా అధికారం చెలాయిస్తున్న వ్యవస్థకు వినాశకంగా అది కంఠం వినిపించాలి. ప్రయోజనాన్ని కోల్పోయిన భావాలను నాశనంచెయ్యాలి. ఇదీ తిరుగుబాటు చలంలో ఈ తిరుగుబాటు ధోరణి కన్పిస్తుందంటారు చలంలోని భావోల్బణను ఆయన గొప్ప శైలి అని మెచ్చుకుంటారు పంధొమ్మిదివందల పదినుంచి ఇరవై వరకు వచ్చిన నవలలను, చలం వికటం చేశాడు. తెలుగు నవల అని పరిహాసరచనచేశాడు ఇంచుమించుగా ఈ పదేళ్ళు చారిత్రక నవలలే వచ్చాయని చెప్పాలి. ఎందుకంటే విజ్ఞాన చంద్రికామండలి తెలుగు నవలల పోటీ నిర్వహించి నవల అంటే చారిత్రక నవలే అని ప్రకటించే సాహసం చేసింది. ఈ దశలో విజ్ఞాన చంద్రికా మండలి బహూమానం పొందిన ఒక నవలను గురజాడ అప్పారావు తీవ్రంగా విమర్శించాడు. చలం ఇంకా స్త ముందుకు వచ్చి వేళాకోళం చేశాడు. చారిత్రక నవల అనగానే నవరస భరితంగా ఉండాలనే తలంపుతో నేమో మరి పరిమాణం కాస్త పెద్దదిగా వుంటూనే వచ్చింది.

మాలపల్లి నుంచి చివరకు మిగిలేది మధ్యకాలంలో నవలా రచనలో ప్రధానమైన ధోరణి ఇది అని నిర్ధారణగా చెప్పలేము. అడవి బాపిరాజు సాంఘిక నవలలూ, చారిత్రక నవలలూ రాశాడు. విశ్వనాథ అన్నిరకాల నవలలూ రాశాడు.

చారిత్రకాలూ, సాంఘికాలూ, అతిమానుషాలూ, అద్భుతాలూ, మనో విశ్లేషాత్మకాలూ. రెండో ప్రపంచయుద్ధం ముగియడమూ, ఆ తర్వాత ఐదు సంవత్సరాలకు మనకు స్వాతంత్ర్యం రావడమూ, సమాజ పరిణామాలూ, తెలుగు నవలకి కొత్త రూపురేఖలు తెచ్చాయి.

స్వాతంత్ర్యానంతరం తెలుగు నవలలో ఇతివృత్త వైవిధ్యం ఎక్కువైంది. వైయక్తికమైన సమస్యలు, రాజకీయ సిద్ధాంత వాహకాలూ అయిన ఇతివృత్తాలూ, మనో విశ్లేషణాత్మకాలూ, శిల్ప సంబంధమైన ప్రయోగాలూ నవలా రచనలో చోటుచేసుకోవడం మొదలైంది. చివరకు మిగిలేది, కీలుబొమ్మలు, అసమర్థుని జీవయాత్ర, అల్పజీవివంటి నవలల్లో క్రమానుసారంగా ఈ నవ్యధోరణులు వ్యక్తమవుతూ వచ్చాయి. సాంఘికోద్యమాలు సాహిత్యంపైన ప్రభావం చూపాయి. మాలపల్లి నవల వచ్చిన తర్వాత పాతిక సంవత్సరాలలో స్వాతంత్ర్యోద్యమం తెలుగు నవలని, తక్కిన సాహిత్య ప్రక్రియలన్నిటిని ప్రభావితం చేసినట్లే ప్రభావితం చేసింది. నవలా రచనలో కూడా కొత్తపోకడలువచ్చాయి. ఉదాహరణకు బాపిరాజు నవలల్లో సాంఘిక, చారిత్రక నవలల్లో సమన్వయ శిల్పం కనపడుతుంది. తెన్నేటి సూరి చంఘిజ్ ఖాన్ నవలలో చారిత్రక, సామాజిక నవలా శిల్ప సమన్వయం కనపడుతుంది. నోరి నరసింహశాస్త్రిగారివంటి పండితుడు చారిత్రక నవలలు మాత్రమే రాయడానికి తెలుగు వారిలో ఈ శతాబ్ది పూర్వార్థంలో మొదటి దశకంలోనే మొదలై అంతకంతకూ బలపడుతూ వచ్చిన స్వరాష్ట్ర సంపాదన వాంఛ ప్రేరకమై వుండవచ్చు. తెలుగువాళ్ళ భాషా సంస్కృతుల, సాహిత్య ప్రాభవాలను ఈ తరంవారికి స్ఫూర్తి కలిగించే కోరికతో చారిత్రక నవలలు వెలువడటమూ వాటికి పాఠకుల ఆదరణ లభించడమూ జరిగింది.

ఈ శతాబ్ది ఉత్తరార్ధ ప్రవేశంతో తెలుగు నవల కుటుంబ సమస్యలపట్ల ఆకర్షితం కావడం విశేషం. 'శారద' రాసిన మంచీ – చెడూ, అపస్వరాలూ ఇందుకు ఉదాహరణలు బలివాడ కాంతారావు, రంధి సోమరాజు అవసరాల రామకృష్ణారావు, కొమ్మూరి వేణుగోపాలరావు మొదలైన రచయితలు, కుటుంబ సమస్యలను ఇతివృత్తంగా తీసుకొని మంచి నవలలు రాశారు.

ఇంచుమించు పందొమ్మిదివందల అరవైలనుంచీ నవలా రచనలో మహిళలు ముందంజ వెయ్యడం, తెలుగు నవలా చరిత్రలో ఒక విలక్షణ విషయం. ఇంచుమించుగా గడిచిన యీ రెండు దశాబ్దాలూ ఆధునిక తెలుగు సాహిత్యంలో నవలాయుగమనే చెప్పాలి అని కొందరు చమత్కరించడం కూడా కద్దు.

స్థూలంగా నాలుగు పాతికల తెలుగు నవలా చరిత్రలో ప్రధాన ధోరణులివి. ఇప్పుడు అధిక సంఖ్యలో మహిళలు సాంసారికేతి వృత్తానికి ప్రాధాన్యాన్నిస్తూ రచనలు చేస్తున్నారు.

ఇక నవలా రూపం గురించి. రూపం అంటే ఇతివృత్త నిర్వహణలో బాహిరమైన శిల్పం అన్నమాట. ఆకృతి. ఒక

శిల్పాన్ని చెక్కాలనుకుంటే లేదా ఒక చిత్రాన్ని చిత్రించాలనుకొంటే ముందుగా నిర్ధరించుకోవలసిన కొలతల సమాహారం రూపం. అదే ఆకృతి, అదే పరిమాణం. ఎంచుకొనే ఇతివృత్తాన్నిబట్టి ఈ పరిధిని సామాన్యంగా రచయిత నిర్ణయించుకుంటాడు.

'కుడ్యచిత్ర రచనవంటిది నవలా రచన. బహుశా మన ఆంధ్రుల ప్రతిభ మినియేచర్ పెయింటింగ్‌లో కనబడుతుందనుకుంటాను' అంటాడు శ్రీశ్రీ. తెలుగులో సంతృప్తికరమైన కవిత్వం వచ్చినట్లు, కథలు వచ్చినట్లు నవలలింకా రాలేదని నాదో చిరకాలపు ఫిర్యాదు వుంది' అనికూడా రాచకొండను అపరిచయం చేస్తూ (రాజు - మహిషి) అభిప్రాయపడ్డాడు శ్రీశ్రీ.

నవలలో సన్నివేశ నిర్వహణమూ, పాత్రోన్మీలనమూ, సంభాషణలూ, ఆద్యంతాలు, ఆంతర శిల్పానికి సంబంధించిన విషయాలు. ఇక బాహిర శిల్పం పరిధికి సంబంధించిన కొలతలు. కథాకథన పద్ధతి అన్నమాట. నవలా రచనకు సంబంధించిన కథాకథనం స్వగతంగా నిర్వహిస్తున్నాడా, దినచర్యా రూపంగానా, సంవాదాత్మకంగానా, లేఖారూపంలో నిర్వహిస్తున్నాడా, ఉత్తమ పురుషలో తానూ పాత్రలలో ఒక పాత్ర అయి కథ చెపుతున్నాడా లేక ఫ్లాష్‌బాక్ పద్ధతిలో కథను మనముందుకు తీసుకొని వస్తున్నాడా అనేవన్నీ నవలా రూపానికి సంబంధించిన విషయాలు. ఏంచెపుతున్నాడన్నది ఆంతర విషయమైతే ఎట్లా చెపుతున్నాడనేది రూపవిషయం. తెలుగు నవలరూపం విషయంలో ఈ నూరేళ్ళలోనూ వేళ్ళమీద లెక్కపెట్టదగిన ప్రయోగాలు మాత్రమే జరిగాయి. ఎట్లా రాసినా, ఏం రాసినా వాస్తవికతకు చేరువగా వుండాలిగాని దూరంగా వుండకూడదని తొలిరోజులనుంచీ మన గొప్ప నవలా రచయితల అభిప్రాయం. సుమారు తొంభై సంవత్సరాల నాడు మొట్టమొదటిసారిగా నవలా రచనలో పోటీలు నిర్వహించిన చింతామణి పత్రిక ఈ విషయాన్నే నొక్కిచెప్పింది..... 'కథ కేవల కల్పితమే యైనను స్వభావ విరుద్ధముగా నుండక నిజముగా జరుగుచున్న చరిత్రమువలెనుండి....' అన్న నిబంధన వాక్యంవల్ల నేల విడిచి ఊహా విహారాలలో రచయిత తేలిపోగూడదని స్పష్టపడుతున్నది.

సుమారు ఏభై సంవత్సరాల వరకూ రచయిత తన పాత్రల కదలికల వెంట వుంటూ వుండేవాడు భౌతికంగా. ఆత్మీయంగా ఎప్పుడూ వుంటాడు. ఆ తాదాత్మ్యం లేకపోతే మంచి రచనను చేయనేలేడు. అయితే ఎక్కడికక్కడ తాను ప్రత్యక్షం కాకూడదు. ఇంచుమించు ఈ శతాబ్ది రెండు దశాబ్దాలు గడిచినదాకా నవలా రచనలో రచయిత ప్రత్యక్ష సాక్షాత్కారం అనివార్యంగానే సాగుతూ వచ్చింది. విశ్వనాథ ఏకవీరలో కూడా ఇలాటి ఒక హెచ్చరిక వుంది. 'పాఠక మహాశయా ఈ ముసుగుమనిషి మన పద్మనాభమేసుమీ' అని అపరాధ పరిశోధక నవలలు చదువుతున్నప్పుడు పాఠకుడెక్కడ భయపడిపోతాడో అన్నట్లూ, ఉత్కంఠను భరించలేక

ఏమైపోతాడో అన్నట్లూ రచయిత వచ్చి వీపు నిమురుతాడు. తొలిరోజుల చారిత్రక నవలలనిండా పర్వత శ్రేణుల, నదీ నదాల, ప్రకృతి పరిసరాల వర్ణనలు అనివార్యంగా కనబడతాయి. మానవ మన సత్వంలోని వైచిత్రిపట్లగాని, తాము ఎంచుకొన్న ఇతివృత్తానికి సంబంధించిన పాత్రోన్మీలనంగాని గొప్ప రచయిత ఎవ్వరూ విస్మరించడు. లోకవృత్తాన్ని గురించి, సమకాలీన సామాజిక వ్యవస్థను గురించీ రచయిత వ్యాఖ్యానం చేయవచ్చు. కాని తానే వచ్చి ప్రత్యక్షంగా వ్యాఖ్యానానికి పూనుకోకూడదు. అమీర్ డొక్కలో తన్నాడు రాజేశ్వరిని, కడుపుతో వుందన్న కోపంతో – మైదానంలో సన్నివేశమిది. చలమంటాడు. రాజేశ్వరికి కోపం రాలేదు. ఆ కాలును ముద్దుపెట్టుకోవా లనిపించింది అని. చలం వ్యాఖ్యానం ఎందుకిక్కడ !? ఆ కాలును పట్టుకొని రాజేశ్వరి ముద్దుపెట్టుకుంటే సరిపోయేది. ఇది శిల్పంలోగాని, రచనా సంవిధానంలోగాని లోపమని కాదు ఇక్కడ ప్రస్తావించటం, రచయిత భావ తీవ్రత, భావోద్వేగం పాత్రలతో తాదాత్మ్యం చెందినా, తోలుబొమ్మలాటలో దారాలు తన చేతిలో వుంచుకొని కదలికలను తాను నియంత్రించినట్లు, రచయిత తన పాత్రలను తన చెప్పుచేతల్లో పెట్టుకున్నట్లు కనిపించకూడదు. అవి రచయిత చెప్పుచేతల్లో తప్పకుండా వుంటాయి. వుండవలసిందేకూడాను అయితే రచనా సంవిధానంలో కొత్త కొత్త దోరణులు ప్రవేశించే వరకూ ఇతివృత్త విన్యాసంలో నలిగిన దారినే నడవడం తప్పదు.

ఈ దశాబ్ది ఇంకా రెండు సంవత్సరాలకు ప్రారంభమవుతుందనగా తెలుగు నవల రూపురేఖల్లో ఒక విలక్షణమైన మార్పు వచ్చిందనే చెప్పాలి. ఇందుకు ఒకటికన్నా ఎక్కువే కారణాలుండవచ్చు. అలవోక పరిమాణంలో అంటే చేతుల్లో పట్టుకొని ఎక్కడికైనా వెళ్ళగలిగేట్లు కాస్త పెద్ద జేబైతే అందులోనూ ఇమిడేట్లు, అధికసంఖ్యలో నవలా రచనను ప్రోత్సహించే ప్రణాళికను ఒక సుప్రసిద్ధ ప్రచురణ సంస్థ చేపట్టడం, తెలుగు నవల రూపురేఖల్లో మార్పు రావడానికి కారణమైందని నిస్సందేహంగా చెప్పవచ్చు. ఇక సామాజిక పరిస్థితులూ, జీవితంలో వేగం, అలజడి, సంఘర్షణ, ఇవికూడా నవల పరిమాణాన్ని హద్దుల్లో వుంచాయి. ఇప్పటి రోజుల్లో సామాన్య పాఠకుడెవరైనా మాలపల్లి, వేయిపడగలు, చంఘిజ్ ఖాన్ వంటి పెద్ద నవలలను చదవడానికి ఆసక్తి కనపరచడం కష్టం. బాగా చదివించే మంచి శైలితో ఒక పూటలోనో, కనీసం ఒక రోజులోనో. ఆ నవల చదవడం ముగియాలని కోరుకుంటాడు. ఎమెస్కో పాకెట్ బుక్స్ పరంపర ప్రారంభించటానికి వేసుకున్న ప్రణాళికలో అవి ఒకే పరిమాణంలోనూ, ఒకే వెలతోనూ, సాధ్యమైనంతవరకు ప్రచురించాలని ప్రచురణ కర్తలు నిర్ణయించడం జరిగింది. ఈ నిర్ణయం సముచితమేకాక అవసరం కూడాను. ఆ ప్రమాణంలో సుమారు మూడు వందల పేజీలకు మించకుండాను, వెల రెండురూపాయలు దాటకుండాను చూడాలని ప్రచురణకర్తలు పథకం

నిర్ణయించుకున్నారు. మొట్ట మొదటి రోజుల్లో నెలకు నాలుగు నవలలు తప్పకుండా ప్రచురిస్తూ వచ్చారు. మొదటి ఐదారు నెలలదాకా, నెల విడుదల లన్నీ నవలలే కావడం గమనార్హం. ఆ తరువాత కొద్ది సంఖ్యలో కథాసంకల నాలు, నాటికలు, నాటకాలుకూడా వెలువడ్డా, ఈ ప్రణాళిక ప్రధానంగా నవలా ప్రచురణకే వుద్దేశించడం జరిగింది. అందువల్ల ఈ దశాబ్ది నవలల్లో ప్రత్యక్షంగానో పరోక్షంగానో ఎ సోర్స్ పాకెట్ బుక్స్ పరిమాణ ప్రభావం వుండకపోదు అనుకుంటాను. అయితే వారపత్రికలలో సీరియల్‌గా వెలువడిన రచనలు పరిమాణంలో పెదవిగానే వుంటూ వచ్చాయి. ఉదాహరణకు ఎన్. ఆర్. నంది నైమిశారణ్యం, వడ్డెర చండీదాసు హిమజ్వాల మొదలైనవి. ప్రతివారం ఆసక్తిని పెంచుతూ సాగే రచనకు రూపం, అంటే పరిమాణం ఏ పరిధిలో వుండాలి, ఎట్లా వుండాలి అన్నది ప్రశ్నకాదు

నైమిశారణ్యం ఈ దశాబ్దికి చెందిన నవల కాదుకదా అంటారేమో! 1969లో ఇది పుస్తక రూపాన మొదటిసారి ముద్రణ పొందింది. అందువల్ల ఈ దశాబ్ది పూర్వరంగం పరిస్థితులను కూడా స్థూలంగా, సూచనప్రాయంగా తెలుసుకోవడం ఈ దశాబ్ది రూపురేఖల మార్పుల అవగాహనకు బాగా తోడ్పడుతుంది. తెలుగు దేశంలో అత్యంత ప్రాచుర్యమైన అమ్మకాలు గల రచయిత్రి శ్రీమతి యద్దనపూడి సులోచనారాణి నవలలకు రూపంఅంటే వస్తుపరిమాణంఏమీబాధకం కాదులాఉంది! రెండుసంపుటాలు,మూడు సంపుటాలుగా కూడా ఆమె రచనలు ప్రియపాఠకులు చదువుతున్నారు. కదిలేదీ కదిలించేదీ కవిత్వానికి కావాలను కుంటే చదివేదీ చదివించేదీ కావాలోయ్ నవలా ప్రాచుర్యానికి అంటున్నారు శ్రీమతి సులోచనారాణి నవలలు జీవనతరంగాలు మీనా, పార్థు, ఇటీవలే వచ్చిన గిరిజా కల్యాణంకూడా, ఎ సోర్స్ సిరీస్‌లో వచ్చిన ఆరాధన వలెనే ఆరాధ్యాలైనాయి చదువరులకు లేక పాఠక పాఠకీ, మణులకు. అందువల్ల వార, మాస పక్ష పత్రికలు ఆమె పట్ల పక్షపాతం వహించడం ఎంతమాత్రమూ అన్యాయం కాదు. అమ్మాలోయ్, అమ్మించాలోయ్ అనికదా వాళ్ళ పరమార్థం. వేమనసూక్తి వాళ్ళకు బాగా తెలుసు. పత్రికాధిపతులకున్నా, సదరు సంపాదక మహాశయులకున్నా. 'పసిడిగలవాని' .... ఇత్యాది లోకధర్మం తెలీకపోతే వాళ్ళు పత్రికలు నడపటానికి పనికిరారు. మొదలు చెడిన బేరమా. అలా తియ్యనీరు నవలలకి పాఠక చేపలను ఎక్కించటం నేరమా?!

ఈ దశాబ్ది నవలకి సంబంధించి రూప చర్చలో ఇంకో విలక్షణత ఏమంటే మినీ కథలాగే మినీ నవల ఆవిర్భావం కూడా. మాసిక నవలలు ఇప్పటి ఫాషన్‌లా వుంది. ప్రతి మాసపత్రికా ఒక చిన్న నవలను పూర్తి నవల పేర ఇస్తూనేవుంది. మిత్రులు శ్రీ మహీధరరామ్మోహనరావు గారు వీటినే కాబోలు కంగారు నవల లన్నది. మా బాగా అన్నారు. కంగారుని చూడండి మర్కటాన్ని తన కిశోరం కనుకోవడంకన్నా ఇంచక్కా పొట్ట సంచిలోనే పెట్టుకుంటుంది కంగారు తన బిడ్డని. ఈ పూర్తి నవలలు కూడా బాగా ఆకర్షకంగానే వుంటున్నట్లున్నది. ఒక సుప్రసిద్ధ దినపత్రిక సంస్థవారు ప్రతి

నెలా ఒక చిన్న నవలను ప్రత్యేకంగా ప్రచురిస్తూనే వున్నారు. విపులాచపృధ్వీ కదా! ఎవరి ప్రయత్నాలు వారివి. ఎవరి మార్గాలు వారివి. ప్రయోగ చాతుర్యం ముఖ్యం అమ్మకాలకు.

అయితే ఒక చిత్రమైన విషయం వుంది. చైతన్య స్రవంతి, అస్తిత్వ వాదం, మనోవిశ్లేషణం, ప్రతీకాత్మక ప్రయోగాలు, అధివాస్తవిక వాదం వంటి ప్రయోగాల పట్ల వస్తుశిల్ప నిర్వహణ పట్ల రచయితలకు ఆసక్తి కలుగుతున్నా, నవ్యత పట్ల మోజున్నా కలుగుతున్నా ఈ దశాబ్దిలో కూడా చారిత్రక నవలలు వెలువడటం గమనించాల్సిన విషయం. బ్రహ్మాండమైన అమ్మకపు ఆకర్షణలతో వెలువడే పంచరంగులు అనాలా లేక హరివిల్లువలె సప్తవర్ణ సంశోభితమైన అనాలా — ఒక మాసపత్రికా రాజంలో రుద్రమదేవి, ఆర్యచాణక్యుడు, బసవేశ్వరుడు వంటి చారిత్రక నవలలు కూడా వెలువడ్డాయి. చారిత్రక నవలలు వెలువడ కూడదని కాదు తప్పకుండా చారిత్రక దృష్టి వుండాల్సిందే. అయితే సంతోషించాల్సిన విషయం ఏమంటే గోనగన్నారెడ్డి, హిమబిందు, అడవి శాంతిశ్రీ వంటి బాపిరాజు నవలల మాదిరిగానూ, మల్లారెడ్డి, ధూర్జటి వంటి నోరివారి నవలల మాదిరిగా కాకుండానూ, ఈ దశాబ్దిలో వచ్చిన చారిత్రక నవలలు కొంత కృశించి వుండటమే పత్రికలలో కూడా పేరు ప్రతిష్టలున్న రచయితలు పెద్ద రచనలు సీరియల్‌గా ప్రచురిస్తే చదువుతూనే వున్నారు. రాజు—మహిషి—ప్రేమ—మనిషి —అనే అసంపూర్ణమైన పెద్ద నవల ఈ కోవకి చెందింది ఒక మాసపత్రికలో ఇది సీరియల్‌గా బహుకాలం వెలువడ్డా 197 లో పుస్తక రూపాన వచ్చింది. విషయమూ, విన్యాసమూ రచనాకూడా కొత్త తరహాలో నడిచింది ఈ నవలా విర్భావం. ఆధునిక సాహిత్యంలో ఇదొక క్లాసిక్ అంటున్నారు శ్రీ శ్రీ. ఇలాంటి నవలలను చదివినప్పుడు, ఇవి చదివించినప్పుడూ, నవలా రూపం ఈ యీ లక్షణం సమన్వితంగా వుండాలని చెప్పటంలోనూ, నిబంధించడంలోనూ అనేకమైన చిక్కులు ఎదురవుతాయి. ధనికొండ హనుమంతరావు రాసిన గుడ్డివాడు అనే నవల ఇరవైనాలుగు గంటల కాలిక వ్యవధిలో తన ఇతివృత్త శరీరాన్ని సాక్షాత్కరింప చేస్తుందని గుర్తు. ఇది పెద్ద నవలే. అయినా చదివిస్తుంది. ఫ్లాష్‌బాక్ పద్ధతిలో నడిచిన నవల. అలాగే గంగినేని వెంకటేశ్వర్రావు నవల పాము— నిచ్చెన చదునుగా కథాకథన పద్ధతిలో సాగదు. లేఖా రూపంలోవుంది. అయినా చదివిస్తుంది. ఉప్పల లక్ష్మణరావు రచన అతడు—ఆమె, దినచర్యా లేఖనం లేదా దినచర్యా ప్రకటన రూపంలో వుంది. అయినా రోచకంగా చదివిస్తుంది. తెలుగులో ఈ వందేళ్ళలోనూ వచ్చిన గొప్పవైన పది నవలల్లోనూ నిస్సందేహంగా వొకటి ఇది —చంఘిజ్‌ఖాన్ సామాజిక చారిత్రక నవల. సమకాలీన సామాజిక సంఘర్షణాత్మక చరిత్రకు పాతకాలపు చారిత్రక పరిణామాల ఆకృతిలో వ్యాఖ్యానించటం. పూర్తిగా వైదేశిక వాతావరణమూ, ఇతివృత్త రంగస్థల ప్రకృతి వర్ణనలూ సాఫీగా చదువుకొని పోవడంలో కొంత చిక్కు కలిగించినా, ఆ పేర్లు గుర్తుంచు

కోవడంకూడా కష్టమే అయినా, చంఘిజ్ ఖాన్ గొప్ప నవల. అతడు-ఆమె, చంఘిజ్ ఖాన్, ఈ దశాబ్దిలో వచ్చిన నవలలు కాకపోయినా, ఈ దశాబ్దిలో అవి మలిముద్రణలు పొందాయి. అతడు-ఆమె నవలలో మూడోభాగం ఈ దశాబ్దిలోనే వెలువడింది కూడాను. కాబట్టి ప్రతిభావంతుడైన, శిల్ప రహస్యం తెలిసిన రచయిత పూనుకుంటే నవల రూపం ఇదమిత్థంగా మాత్రమే గొప్పగా నిర్వహించగలడు అనేమీ లేదు. పరిమాణం విషయంలో కూడా కచ్చితమైన పట్టింపు లేదు. మహీధర నవలలు చిన్నవీ పెద్దవీ కూడా వున్నాయి. ఆయన నవలలన్నీ కథాకథనాత్మకాలే కాని, నాటకీయాలు, సంవాదాత్మకాలూ, ప్రాయోగికాలూ కావు. అయినా ఆలోచనా ప్రేరకాలైన నవలలు చదివే పాఠకులు ఆ నవలలను ఆదరిస్తూనే వున్నారు.

తుమ్మల పల్లి రామలింగేశ్వరరావు అనే రచయిత నవలా రచయితగా ఎక్కువ ప్రసిద్ధుడుకాడేమో. మామూలు పత్రికాపాఠకులకు ఆయన పరిచితుడు కాడు. ఆయన ఈ దశాబ్దంలో పది నవలలదాకా రాశాడు. ఏడెనిమిది అచ్చైనాయికూడా. ధర్మ నిర్ణయం అనే నవల 1970 లో వచ్చింది. ఇది వొక విలక్షణమైన నవల. రెండు మూడు తరాల క్రితం తెలుగుదేశంలో ప్రచురంగా వుండే సాంఘిక స్థితిగతులను గూర్చి చెపుతున్నది. అయితే ఆ సాంఘిక వాతావరణం ముఖ్యంగా అగ్రవర్ణాలవారి విశ్వాసాలకు, సంప్రదాయాలకు సంబంధించినది.

ఈ దశాబ్ది నవలలలోనే చెప్పుకోదగిన ఇంకొక నవల జీవనయాత్ర. రచయిత గోగినేని రాధాకృష్ణమూర్తి. జి. ఆర్. కృష్ణ పేరుతో ఈ నవల ప్రచురితమైంది. జీన్‌పాల్ సార్త్రే ప్రవచించిన అస్తిత్వవాదం నా నవలకు ప్రేరకం అంటాడీయన. స్వీయ జీవితానుభవాలను, అనుభూతులను, అక్షర రూపంలో ఆవిష్కరించా నంటాడీయన. అయితే ఇలాటి రచనలలోనూ సృజనాత్మకత పాలు వుండక తప్పదనుకోండి. సమకాలీన రాజకీయాల వ్యక్తులు ఇందులో పాత్రులు కావడం ఒక విశేషం.

చీకటిరోజులు అనే నవల అంపశయ్య రచయితగా ప్రసిద్ధుడైన నవీన్ రాసింది. ఇటీవలి ఎమర్జన్సీ ఘాతుకాలను చిత్రించేది. ఉత్తమ పురుషలో సాగుతుంది. అభిరుచిగల పాఠకులు మంచి నవల అన్నారు.

తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు రాసిన చారిత్రక నవలలు తిక్కన సోమయాజి, తాళ్ళపాక అన్నమాచార్యులు, పోతనామాత్యుడు మొదలైనవి. వీటి నాయన ఐతిహాసిక నవలలన్నాడు. రచనలో సాఫీగా సాగే కథాకథనాత్మక పద్ధతినేఆయన అనుసరించారు.

నాకు తెలిసినంతవరకు ఈ దశాబ్దిలో తెలుగు నవల రూపశిల్పానికి సంబంధించి విలక్షణ ప్రయోగాలు ఏవీ జరగలేదు. ఇతివృత్తంలోగాని, రచనా శిల్పంలోగాని కొట్టవచ్చినట్లు కనపడే ప్రయత్నం జరిగినట్లు కాని, పాఠకులను ఆకర్షించినట్లు కానీ కన్పడదు. మంచి నవల అంటే మనుషులనుగూర్చి రాసిందీ, తన దైన ఒక దృక్పథమంటూ ప్రతిబింబించేదీ అని ఒక విమర్శకుడన్నాడు. దీనితో ఏకీభవించనివారెవరైనా ఉంటారా? ఉండరనే అనుకొంటాను. □

# వాణిజ్య నవల – పత్రికలు, ప్రచురణ సంస్థలు

అచ్చయి అమ్మకానికి మార్కెట్‌లోకి వచ్చిన ప్రతి నవలా వ్యాపారానికి ఉద్దేశించినదే. పెట్టుబడి అమ్మకాలు, లాభాలు మొదలయిన వ్యాపార లక్షణాలన్నీ దానికి వుంటాయి. ప్రతి నవలకీ ఇది తప్పనప్పుడు ప్రత్యేకంగా "వాణిజ్య నవల" అనడంలో అర్థమేమిటని అనిపించవచ్చు. అచ్చయి అమ్మకానికి వచ్చినంతమాత్రంచేత అది వాణిజ్య నవలా కాదు, అచ్చువేసి అమ్మకానికి పెట్టకుండా ఉచితంగా పంచేసినంత మాత్రంచేత అది వాణిజ్యనవల కాకుండానూ పోదు. అది ఆ నవల లక్షణానికి సంబంధించినది దానిలోని వస్తువుకూ, లక్ష్యానికీ, ప్రకటించే విధానానికీ, ప్రదర్శించే తీరుకూ సంబంధించినది. అది ఉద్దేశించబడిన వారినిబట్టి, అందులోని వాస్తవికతను బట్టి, అది రచయిత నేర్పునుబట్టి, అతని సామాజిక అవగాహననుబట్టి ఒక నవల వాణిజ్య నవల కావడమో, కాకపోవడమో జరుగుతుంది.

వాణిజ్య నవల కేవలం వ్యాపారానికి ఉద్దేశించినది. వ్యాపారం అన్నతర్వాత లాభార్జనే ప్రధానంగా వుంటుంది. అమ్మకాల గిరాకీమీద యిది ఆధారపడక తప్పదు. గిరాకీ ఉండాలంటే పాఠకులకేం కావాలో అవి యివ్వాలి. పాఠకుల స్థాయిని బట్టి, వాళ్ళ యిష్టాయిష్టాలనుబట్టి ఈ నవలల స్థాయి ఆధారపడివుంటుంది. ఇలాంటి చోట్ల సాధారణంగా పాఠకులూ, ఈ తరహా రచయితలూ ఒకే కోవకు చెందినవారై వుంటారు. అందువల్ల వాణిజ్య నవలకి ప్రమాణంపాఠకులని చెప్పొచ్చు. నీ మిత్రులు ఎవరో చెబితే నీ గురించి చెప్తాను అన్నది ఒక సూక్తి. నీ పాఠకులు ఎవరో చెబితే నీ గురించి చెప్పగలననేదిరచయితకు అన్వయించిచెప్పుకోవలసిన సూక్తి.

వాణిజ్య నవలకి పాఠకులెవరో తెలుసుకుంటే దీని స్థాయీ, రచయిత స్థాయీ తెలిసిపోతుంది. తద్వారా నేటి తెలుగు సాహిత్యంలో దానికిగల స్థానం తెలుసుకోవచ్చు. అప్పుడు మన సాహిత్యం ఏ స్థితిలో వుందో అర్థంచేసుకోవడం కష్టం కాదు.

ఇటీవలి కాలంలో పాఠకుల సంఖ్య బాగా పెరిగింది అందుకు కారణాలు చాలా వున్నాయి. అక్షరాస్యత పెరగడం అందులో ఒకటి. చదువుకున్న నిరుద్యోగుల సంఖ్య ఎక్కువ కావడం మరొకటి రంగురంగుల ఆకర్షణీయమైన పద్ధతుల్లో పత్రికలు రావడం యింకోటి. పత్రికల్లూ,

శీలా వీర్రాజు

ప్రచురణ సంస్థలూ ఆధునిక ప్రచార మార్గాలను వినియోగించుకొని పాఠకులను ఆకర్షించడం, గ్రంథాలయ సౌకర్యాలు విస్తరించడం, పెద్దపెద్ద నగరాల్లోనూ పట్టణాలోనూ పత్రికల్నీ, పుస్తకాల్నీ అద్దెకిచ్చే దుకాణాలు తలెత్తడం, ఇంచుమించు ప్రతి వూళ్ళోనూ స్థానికంగావున్న చిన్నాపెద్దా రచయితలు సమితుల్నీ, సంఘాల్నీ స్థాపించుకుని తరచు సభలూ సమావేశాలూ జరిపిస్తూవుండడం – యీ కారణాలన్నిటివల్లా పాఠకుల సంఖ్య ఇటీవలి కాలంలో బాగా ఎక్కువయింది.

తెలుగు పాఠకులు ఎక్కువగా మధ్య తరగతికి చెందినవారు. అందులోనూ చిన్నచిన్న ఉద్యోగాలు చేసేవారూ, కళాశాల, విశ్వవిద్యాలయ విద్యార్థులూ, అధ్యాపకులూ మహిళలే ప్రధానంగా తెలుగు పాఠకులుగా ఏర్పడుతున్నారు. మేధావి వర్గానికి చెందినవారు బహు తక్కువ. వారికి వున్న కొద్దిపాటి తీరికలో ఇంగ్లీషు పుస్తకాల్ని తిరగేయడానికే సరిపోతుంది. తెలుగు పుస్తకాల్ని చదవడానికి ఇష్టపడే డాక్టర్లు, ఇంజనీర్లు, శాస్త్రవేత్తలు, లాయర్లువంటి మేధావి వర్గాలవారుగాని ఉన్నతోద్యోగులు, పెద్ద పెద్ద వ్యాపారస్తులు, పారిశ్రామికవేత్తల వంటివారు గాని చాలా తక్కువగా వుంటారు.

కష్టపడి పనిచేసే శ్రామికవర్గాల వారిలో చదువు వచ్చినవారికి పుస్తకాలు చదివే తీరిక బహుతక్కువ. కుటుంబ వ్యవహారాలు స్వయంగా చూసుకోవలసి రావడంవల్లా, తాము పనిచేసే పారిశ్రామిక విభాగాల్లో గ్రంథ పఠనానికి తగిన అవకాశాలు అంతగా కల్పించబడకపోవడం వల్లా వీరిలో పాఠకులు తక్కువ సంఖ్యలోనే వుంటారు. అందువల్ల తెలుగు సాహిత్యానికి ప్రధాన పాఠకులు మధ్యతరగతి వారేనని చెప్పాలి. సాహిత్య స్వరూపాన్ని నిర్ణయించేది వీరే. వీరికి ఇతర సాహిత్య ప్రక్రియలకన్న కథలు, నవలలంటేనే యిష్టం. ఈ రెంటిలో కూడా నవలలపైనే మోజెక్కువ. వీరి వల్లనే ఈనాడింతగా నవల ప్రాచుర్యం పొందింది.

నవలకున్న ప్రచారాన్ని పురస్కరించుకొని వ్యాపారమార్గంలోకి మళ్ళించడానికి తొలి రోజుల నుంచే ప్రయత్నాలు ప్రారంభమైనా పెద్ద ఎత్తున మాత్రం పాతికేళ్ళనుంచేజరుగుతున్నాయి కొవ్వాలి. జంపన నవలలు పుంఖానుపుంఖంగా వెలువడి విశేషంగా జనాన్ని ఆకర్షించి, వ్యవహారిక భాషా రచనకు ప్రచారాన్నిచ్చి కొత్తరకం పాఠకుల్ని సృష్టించుకున్నప్పటికీ అవి వాణిజ్య నవలలుగా మాత్రమే మిగిలిపోయాయి. వ్యవహారిక భాషాభివృద్ధిగాని, సామాజిక న్యాయంకోసం పోరాటంగాని వాటి లక్ష్యం కాదు పాఠకుల్ని కేవలం ఆనందింప జేయడానికే అవి ఉద్దేశించబడ్డాయి. ఒక విధంగా వాణిజ్య నవలలకు వరవడి వాటితోనే జరిగిందని చెప్పొచ్చు. అప్పటిలోనే విరివిగా వచ్చిన అభూత అపరాధ పరిశోధక నవలలు కూడా ఇందుకు దోహదం చేశాయి. ఆ ధోరణి అప్పటినుంచీ కొనసాగుతూ వస్తున్నప్పటికీ ఇటీవలి కాలంలో పత్రికలూ, ప్రచురణ సంస్థలూ మరీ ఎక్కువ కావడంవల్ల వాణిజ్య నవలల సంఖ్యకూడామరింతఎక్కువయ్యింది.

ఇటువంటి నవలలకు ప్రధాన కేంద్రాలు పత్రికలు, ప్రచురణ సంస్థలే.

అన్ని వ్యాపారాలలాగే సాహిత్య వ్యాపారం కూడా ఇటీవలి కాలంలో ఎక్కువయ్యింది శాస్త్ర విజ్ఞాన వికాసం వల్ల కొత్త కొత్త వస్తువులు ఉత్పత్తి అవుతున్నాయి. కొత్త కొత్త పరికరాలకు రోజురోజుకు రూపకల్పన జరుగుతోంది. సాంప్రదాయకమైన వ్యాపార వస్తువులకు తోడు పారిశ్రామిక యుగంవల్ల సరికొత్త ఆధునిక పరికరాల ఉత్పత్తి, వ్యాపారాలు విస్తరిస్తున్నాయి. కొత్తవారు వ్యాపార రంగంలో ప్రవేశిస్తున్నారు. ముఖ్యంగా యువకులు యువ పారిశ్రామికవేత్తలుగా వస్తున్నారు. దీనితోపోటీఎక్కువయ్యింది. కొత్త కొత్త ఉత్పత్తి రంగాలవైపు దృష్టి సారించవలసి వచ్చింది. అలా దృష్టి సారించినప్పుడు వారికి కనిపించిన రంగమే సాహిత్యరంగం. అంతవరకు ఇది బహు కొద్దిమందికి సంబంధించినదిగా వుంటూ, సాంప్రదాయక వ్యాపార ధోరణిలోనేసాగుతూవచ్చింది. ఇప్పుడిది. అనేక ఆధునిక వ్యాపారాల మాదిరిగానే పెద్దఎత్తున ఒక క్రమపద్ధతిలో సాగుతోంది. ఒకవిధంగా ఇది వ్యవస్థీకృత వ్యాపారరంగంగా అభివృద్ధి చెందిందనే చెప్పాలి. ఉత్పత్తి, పంపిణీ పద్ధతిలోగాని; అమ్మకాలు, లాభాల విషయంలోగాని ప్రచారం, ఆకర్షణల పద్ధతిలోగాని; దోపిడీ, పెట్టుబడిదారీ విధానాల్లోగాని ఇది ఏ వ్యాపార రంగానికీ తీసిపోని విధంగా తయారయ్యింది.

అందువల్ల యీ వ్యాపార రంగాన్ని ఎన్నుకున్నవారికి సాహిత్యంమీద గౌరవ భావం ఉండకపోయినా ఫరవాలేదు ఆసక్తి వుంటే చాలు. సాహిత్యానికి ఒకసాంఘిక, ప్రయోజనం వుందని తెలియాల్సిన పని లేదు, జనాకర్షకంగా వుండాలని తెలిస్తే చాలు. రచయిత శ్రమశక్తిని దోచుకోవడం అన్యాయంగా భావించనక్కరలేదు, వాళ్ళకు పేరుప్రతిష్టలు ఆర్జించిపెడుతున్నామని గర్విస్తే చాలు. ఇవన్నీ ఇక్కడ ప్రస్తావించడంలో ఉద్దేశం సాహిత్యం ఒక వ్యాపార కళగా అభివృద్ధిచెందిందని తెలియ చెప్పడానికే. ఈ వ్యాపారంలో లాభించేది తయారుచేసిన కళాకారుడు కాదు, దాన్ని వినియోగదారుడి దగ్గరకు చేర్చే మధ్య దళారీ అయిన ప్రచురణకర్త. ఆయన పత్రికాధిపతి అయినా కావచ్చు, పుస్తక ప్రచురణకర్త అయినా కావచ్చు, సినీ నిర్మాతయినా కావచ్చు. అతనే సాహిత్య వ్యాపారానికి ప్రధాన కేంద్రం. అతనిఅభిరుచిమీద, అవగాహన మీద; అతని దక్షతమీద, విజ్ఞతమీద, అతని మంచితనంమీద, సానుభూతిమీద యీనాటి సాహిత్యోత్పత్తి – ముఖ్యంగా నవలోత్పత్తి– ఆధారపడివుంది. వాణిజ్య నవలని గురించి చర్చించేటప్పుడు రచయిత, పాఠకులతోపాటు వీరందరి కార్యకలాపాల్ని గురించి కూడా చర్చించవలసి ఉంటుంది.

ఒకప్పుడు పత్రికల్ని సాహితీపరులు ప్రారంభించేవారు.లేదా సాహిత్య వికాసం కోసం కృషిచేసే సంస్థలు ప్రారంభించేవి. సాహితీపరులు ప్రారంభించినా, సాహితీ సంస్థలు ప్రారంభించినా వారిద్దరి లక్ష్యమూ ఒక్కటే – ఉత్తమ సాహిత్యాన్ని ప్రజలకు అందించాలని, ఆర్థి

కంగా నష్టపోతున్నా కొనసాగించగల నీతిలోవుండే సంస్థలూ, సాహితీపరులూ లేరు. అయినా ప్రారంభించేవారు. నష్ట పోతూనే నడిపేవారు. సాహిత్యపు విలువల్ని దిగజార్చకుండా, ప్రారంభించినప్పటి లక్ష్యంతో కడకంటా నిలిచి, తప్పనిసరి పరిస్థితుల్లో పత్రిక ప్రచురణను ఆపివేసేవారేగాని పత్రిక ప్రారంభించిన లక్ష్యాన్ని దెబ్బతీసేవారు కారు. శారద, అభ్యుదయ, కిన్నెర, కృష్ణా పత్రిక, తెలుగు స్వతంత్ర, సాహితివంటి పత్రికల చరిత్రలను తిరగేస్తే ఆ విషయం స్పష్టపడుతుంది. ఒక్క భారతి మాత్రమే ఆర్థికంగా దెబ్బతింటున్నా, వ్యవస్థాపకుల కోరికను మన్నించడం కోసం నష్టం వస్తున్నా అలానే నడుపుకొస్తున్నారు.

ఇటువంటి వాటికి రచయితల పత్రికలనే ముద్ర పడిపోయింది. వీటిలోని రచనలు కేవలంకాలక్షేపానికి పనికొచ్చేవి కావు.ఆలోచింపచేసే రచనలు. మెదడుకు పదును పెట్టే రచనలు. మార్గాన్ని నిర్దేశించే రచనలు. అది కథయినా, కవితైనా,వ్యాసమైనా, నవలైనా దాని ధోరణేవేరు అప్పుడేకాదు యిప్పటికీ కూడా అటువంటి పత్రికలు లేకపోలేదు. రచయితలు స్వయంగా ప్రారంభించి నిర్వహించే పత్రికల్ని వేటిని తీసుకున్నా వాటిలో వ్యాపార సరళిలేని ఒక ప్రత్యేక ధోరణి కనిపించి తీరుతుంది. వేకువ, సృజన, ప్రగతి, స్పందన, నూతన, అభ్యుదయ, ప్రజాసాహితి వంటివి అలాటివి. అయితే వెనకటి సాహిత్య పత్రికలకీ యీ సాహిత్య పత్రికలకీ మౌలికంగా ఒక తేడా వున్నప్పటికీ యివి రెండూ కూడా వాణిజ్య రచనల వాసనకైనా తావివ్వని పత్రికలు.

వీటన్నిటినిబట్టి యిప్పటి పత్రికల్ని స్థూలంగా రెండు వర్గాలుగా విడదీయవచ్చు – రచయితలు స్వయంగా నడిపేవి, రచయితలు కానివారు నడిపేవి అని. రచయితలు కావివారంటే వ్యాపారస్తులని. వ్యాపారం చేయడం తప్పేంకాదు. లాభదృష్టి వుండడం నేరమూ కాదు. అయితే వచ్చే లాభాల పంపిణీ మాత్రం సక్రమంగా జరగాలి. వినియోగదారుడికి అదొక భారం కాకూడదు. ఉత్పత్తి చేసినవానికీ, చేయించిన వానికీ మధ్య లాభాల పంపిణీ సరైన పద్ధతిలో న్యాయంగా జరగాలి. అలా జరుగుతున్నదో లేదో చూదాం.

పత్రికద్వారా సాహిత్య వ్యాపారం చేసే వ్యక్తికి సాహిత్యం అంటే యిష్టం వుంటుందికాని దానిమీద సానుభూతి ఉండదు. దానితో డబ్బు సంపాదించుకోవడమేగాని దాని బాగోగులు అక్కర లేదు. అణా పైసల్లో ప్రతిదీ ఆలోచించడంవల్ల సాహిత్యం వీరి చేతుల్లో కేవలం ఒక వినియోగదారుడి వస్తువుగా మారిపోయింది దానిలో కల్తీలూ, నాసిరకాన్ని మంచిరకంగాచేసే ప్రచారాలూ మొదలైనవన్నీ వచ్చిచేరాయి. లాభాలు ప్రధానాంశం గనుక సర్క్యులేషన్‌ని పెంచే మార్గాల్ని ఆలోచించడం మొదలెట్టారు. అందుకోసం ఓ కవిత, కొన్ని కథలు, మరికొన్ని వ్యాసాలు,ఓ సీరియల్ నవల – యిలా అందించారు. వీటిని పాఠకులు సంతోషంగా స్వీకరించారు.

పత్రికా నిర్వాహకులైన సాహితీ వ్యాపారస్తులు దీనితో సంతృప్తి పడలేదు. సర్క్యులేషన్‌ని యింకా పెంచాలని, పాఠకుల్ని యింకా ఎక్కువమందిని ఆకర్షించాలని పాఠకుల సర్వేలు జరిపారు. వాళ్ళ అభిరుచులేమిటో తెలుసుకున్నారు. విద్యావకాశాలు విస్తరించడంవల్ల కొత్తగా ఏర్పడిన పాఠకుల్ని పరిగణనలోకి తీసుకున్నారు. నిరుద్యోగుల సంఖ్య పెరగడంవల్ల వాళ్ళు కాలక్షేపానికి సాహిత్యాన్ని వాడుకోవచ్చని గుర్తించారు. చదువుకున్న స్త్రీల కాలక్షేపానికి వామన గుంటలు, గచ్చకాయలు, చింతపిక్కలు, అష్టాచెమ్మవంటి వాటి స్థానంలో సాహిత్యాన్ని ప్రవేశపెట్టొచ్చని తెలుసుకున్నారు. ఇవన్నీ బేరీజు వేసుకుని యీ కొత్త పాఠకుల్నికూడా సంతృప్తిపరిచే విధంగా పత్రికల్ని రూపొందించుకున్నారు.

దాని ప్రభావమే కవిత్వం, వ్యాసం పత్రికల్లోంచి కనుమరుగైపోయి, కథలు కుంచించుకుపోయి సీరియల్ నవలలు ఎక్కువ కావడమూ, ప్రత్యేకంగా అనుబంధ నవలలు పుట్టుక రావడమూనూ. పాఠకుల్ని ఆనందింప జేయడానికే గాని ఆలోచింప చేయడానికి ప్రయత్నించని, కేవలం కాలక్షేపానికేగాని కర్తవ్యబోధకు పనికిరాని, వట్టి సంఖ్యా బలానికేగాని సాహిత్య పుష్టికి అవకాశంలేని పత్రిక వ్యాపార సరళి పత్రికలూ, వాటి పిల్ల నవలలూ తెలుగు సాహితీ రంగాన్ని ఆక్రమించుకుని పాఠకుల మనసుల్ని కలుషితం చేయడమే కాకుండా సమర్థులైన అనేకమంది రచయితల్ని ఎందుకూ పనికిరాకుండా చేస్తున్నాయి. అల్పసంతోషులైన రచయితల కీర్తికాంక్షని, వాళ్ళ ఆర్థిక పరిస్థితిని ఆసరా చేసుకుని మామూలు పాఠకుల స్థాయికి వాళ్ళని దించి వాళ్ళకి అన్యాయమే చేశాయి.

ఇటువంటి పత్రికలే వాణిజ్య నవలలకు ప్రధాన వేదికలుగా వుంటున్నాయి. అనుబంధ నవలల్ని అందించే చిట్కా బాగా పనిచేసింది. మూడు రూపాయలకే కథలు, కార్టూన్లు, సీరియల్ నవలవున్న పత్రికతోపాటు ఓ చిన్న నవలకూడా రావడంతో పాఠకులు విపరీతంగా ఎగబడ్డారు. బజార్లో ఒక నవల కొంటే అయిదారు రూపాయలకు తక్కువ రావడం లేదు. సినిమాకుపోతే మూడు నాలుగు రూపాయలైనా ఒక్కొక్కనికి ఖర్చవుతుంది. పత్రిక కొంటే ఇంట్లో వాళ్ళకీ యిరుగుపొరుగు వాళ్ళకీ సినిమా అంత కాలక్షేపం దొరుకుతుంది. చాలా వరకు సినిమాల్లోలాగే యీ నవలల్లోని యితివృత్తాలూ వుంటున్నాయి. లెక్కలన్నీ వేసుకుని చూశారు. ఇదే బావుందనుకున్నారు. వాళ్ళ అమాయకత్వాన్ని ఉపయోగించుకుని పత్రికాధిపతులు బాగా డబ్బు చేసుకుంటున్నారు.

పాఠకుల అమాయకత్వాన్నే కాదు- రచయితల అమాయకత్వాన్ని కూడా వీళ్ళు బాగా డబ్బు చేసుకుంటున్నారు. తాను పాఠకులకన్న చాలా తెలివైనవాడినని భావించే రచయిత పత్రికాధిపతి చేతిలో తేలిగ్గా మోసపోతున్నాడు.

సాధారణంగా ఒక రూపాయి ఖరీదు పెట్టిన పుస్తకాన్ని వెయ్యి కాపీలు ప్రచురించినప్పుడు ఆ రచయితకు పదిశాతం చొప్పున ప్రచురణకర్త వందరూపాయలు

యివ్వడం రివాజు. అనుబంధ నవల అందించే పత్రికాధిపతి పాతిక వేలకు పైగా అచ్చువేసికూడా ఆ రచయితకు అయిదొందల రూపాయల్ని కూడా యివ్వడం లేదు. న్యాయంగా అయితే రెండు వేల అయిదొందల రూపాయలకు పైగా అతనికి రావలసివుంది. ఇంతనమ్మకంగా తను మోసపోతున్న సంగతిని రచయిత ఆలోచించడంలేదు. అన్ని వ్యాపారాల్లో వున్నట్టుగానే యిక్కడకూడా ఉత్పత్తి చేసే వ్యక్తి దోచుకోబడుతున్నాడు. ఇటువంటి పత్రికలద్వారా వినియోగదారుడైన పాఠకుడి అమాయకత్వాన్ని లాభసాటిగా వాడుకోడానికీ, ఉత్పత్తిదారుడైన రచయిత శ్రమ శక్తిని దోచుకోడానికీ పెట్టుబడిదారునికి, కళ ఎలా ఉపయోగపడుతోందో తెలియజెప్పడానికే యీ వివరాలన్నీ.

ఇటువంటి పెట్టుబడిదారుని చేతిలోని పత్రికల్లో కళా విలువలూ, సామాజిక విలువలూ వుంటాయనుకోవడం భ్రమ. ఈనాడు సీరియల్స్ రూపంలోనూ, అనుబంధాల రూపంలోనూ కుప్పతిప్పలుగా వస్తోన్న నవలలని పరిశీలిస్తే యీ సంగతి బోధపడుతుంది.

చాలా వరకు యివి మధ్యతరగతి ఆశల నవలలు. ఆడవారు రాసినా, మగవారు రాసినా వంటింటి చుట్టూనో, పడకటింటి చుట్టూనో తిరిగే నవలలు. ప్రధానంగా ప్రేమ నవలలు. ప్రేమ గురించి రాయడం తప్పుకాదు. కాని ప్రేమొక్కటే కనిపించి, మిగతా దేశకాల పరిస్థితులు కనబడకపోతే అది పెద్ద లోపమే. ఈ తరహా రచనల్లో పాత్రలే కనిపిస్తాయిగాని వాటి చుట్టూవున్న పరిస్థితులు, వాటి ప్రభావం, ఆ పాత్రలు నివసించే సమాజంవంటివేవీకనిపించవు. రెండు బొమ్మల్ని కత్తిరించి తెల్లకాగితం మీద అంటించినట్టు వుంటుంది. అవి నేలమీదున్నాయో, గాలిలో తేలుతున్నాయో తెలీదు. తెలుగు సినిమాల్లో రోడ్లమీదా, పబ్లిక్ స్థలాల్లోనూ డ్యూయెట్లుపాడుకునే నాయకీ నాయకులు చుట్టూవున్న జనాన్నిగురించి, తాము వున్న స్థలాన్ని గురించీ స్పృహలేకుండా ఎలా ప్రవర్తిస్తుంటారో యీ పాత్రలూ అలానే ప్రవర్తిస్తుంటాయి. అది ఎంత అసహజమో, అసందర్భమో; అదెంత అర్థరహితమో, అబద్ధమో యిదీ అంతే.

నవలల్నిండా నాటకీయత, మాటిమాటికీ మెలికలు యీ రకం నవలల్లో సర్వసాధారణం ఇష్టంవచ్చినట్టు పాత్రలు కలుసుకోవడం, విడిపోవడం, మళ్ళీ సరిగ్గా అవసరం వచ్చినప్పుడు కలుసుకోవడం-యిలా ఒక పద్ధతీ వరసా లేకుండా వంకరటింకరలుగా కథ సాగిపోతుంది. వీటినిండా కోఇన్సిడెన్స్‌లు, అవాస్తవిక సంఘటనలు కోకొల్లలు.

ఉదాహరణకు ఎప్పుడూ పంచకళ్యాణి గుర్రంమీద పల్లెటూళ్ళో తిరిగే యువకుడుంటాడు. ఓ రోజు ఊరవతల పుంతవెంట వెళ్తోంటే అకస్మాత్తుగా నలుగురు రౌడీలు మీదపడతారు వారితో ముష్టియుద్ధం చేసి నలుగుర్నీ చిత్తుగా ఓడించి, వాళ్ళు పలాయనమంత్రం పఠించాక తాపీగా ఒంటి దుమ్ము దులుపుకుంటుంటే వెనకనించి ఎవరో పిస్టల్ వీపుకి ఆనించి హేండ్సప్ అంటారు.

అతన్ని దూరంగావున్న కారుదగ్గరకి అలా చేతులెత్తించి తీసుకెళ్ళారు. ఆ యువకుడు కారు లోకి ఎక్కబోతూ పక్కకి తప్పుకుని వెనకున్న వ్యక్తి చేతులోని పిస్తోలును ఒక్క తన్నుతన్ని, అది కిందపడిపోతే దాన్ని అందుకుని ఎదుటి వ్యక్తికి గురిచూసి కాలుస్తాడు. అందులోంచి గుండుబదులు రంగునీళ్ళు అవతలి వ్యక్తిమీద పడ్తాయి. అప్పుడే ఆ అవతలి వ్యక్తినిచూస్తాడు. ఆ అవతలి వ్యక్తి అతను ప్రేమించిన అమ్మాయి! కోఇన్సిడెన్స్‌లూ,అవాస్తవికతలూ కలగాపులగం చేసి అల్లిన యిటువంటి నవలలు కుప్పతిప్పలుగా వస్తున్నాయి. వాటన్నిటినీ యిక్కడ పేరు పేరునా చెప్పడం అనవసరం. 'తెలుగు నవలల్లో అవాస్తవిక సంఘటనలు' అనే అంశం మీద ఏ విశ్వవిద్యాలయం వారైనా ఒప్పుకుంటే డాక్టరేట్ థీసిస్ పొందడానికి ఎవరైనా ఆ పని చేయొచ్చు.

సరైన చారిత్రక అవగాహన, భౌగోళిక పరిజ్ఞానం, సమాజ స్పృహ, శాస్త్రీయ దృక్పథం లేకపోతే చచ్చిపోయిన అమ్మాయిలు మళ్ళీపుట్టి పాత ముసలి మొగుళ్ళను వెతుక్కుంటూ వస్తారు. భద్రాచలం అడవుల్లో సింహాలు తిరుగుతాయి, కాకినాడలో బీచ్‌లు కనిపిస్తాయి, రిస్ట్ వాచీల్లో టేప్ రికార్డర్లుంటాయి, అబ్బాయిలూ అమ్మాయిలూ ప్రేమల్నే ఫోంచేసి జీవిస్తుంటారు. పేదాళ్ళ ఆడాళ్ళు కడుపు మంటని చల్లార్చుకోడానికి మానాన్ని కూడా యిచ్చేస్తారు, డబ్బున్న వాళ్ళ అబ్బాయిలు ఎప్పుడూ పడవకారుల్లోనే తిరుగుతుంటారు, విమానాల్లోనే ఎగురుతుంటారు. అందంగా వున్నవాళ్ళే హీరోలూ, నాజూగ్గా వున్నవాళ్ళే హీరోయిన్లూ అవుతారు.

అందుకే సామాన్య పాఠకులు యిటువంటి వాణిజ్య నవలలకోసం ఎగబడుతుంటారు. ఇందుకే పత్రికాధిపతులు యిటువంటి వాణిజ్య నవలల్ని ప్రచురించడానికి ఆరాటపడుతుంటారు. మన పత్రికాధిపతులు తమకు ఒక సాంఘిక బాధ్యత వున్నదనీ, ప్రజల్ని యిలా నల్లమందు నవలల్తో నిద్రపుచ్చడం తప్పనీ గుర్తించకపోవడానికి కారణాలు రెండు కనిపిస్తున్నాయి. ఒకటి-వారు ప్రధానంగా వ్యాపారస్తులు కావడం. మరోటి-వారు మేధావి వర్గానికిచెందినవారుకాకపోవడం.

తెలుగు వాణిజ్య పత్రికల్ని పరిశీలిస్తే ఒక విషయం స్పష్టంగా కనబడుతుంది. ఈ పత్రికలకు అధిపతులువేరు, సంపాదకులువేరు. పేరుఒకరిది, పని మరొకరిది. సంపాదకత్వ బాధ్యతల్ని స్వీకరించే వారిపై అడుగడుగునా, పేజీ పేజీనా యీ అధిపతుల ప్రభావం కొద్దోగొప్పో వుండడంవల్ల సంపాదకులకు సాధారణంగా స్వతంత్రంగా వ్యవహరించడానికి వీలుండదు. అయినప్పటికీ సంపాదకుడు సమర్ధుడైతే పెట్టుబడి పెట్టినవాని ఉద్దేశాలను గౌరవిస్తూనే అప్పుడప్పుడు వాణిజ్యేతర నవలల్ని పాఠకుడికి అందిస్తుంటాడు .ఇది పూర్తిగా సంపాదకుడి వ్యక్తిగత అభిరుచుల మీదా, అతని సామర్థ్యం మీదా ఆధారపడివుంటుంది. తెలుగులో అప్పుడప్పుడు సీరియల్ నవలల రూపంలోనూ, అనుబంధ నవలలరూపంలోనూ

మంచినవలలు వస్తున్నాయంటే అందుకు పూర్తిగా యీ సంపాదకులదే బాధ్యత. చదువు, బారిష్టరు పార్వతీశం కడపటి భాగం, అతడూ-ఆమె మూడో భాగం, జనపథం, హిమజ్వాల, హేంగ్‌మిక్విక్, గోపులొస్తున్నాయి జాగ్రత్త, నైమిశారణ్యం, చీకటిరోజు, పుత్లీ, బాకీ బతుకులు మొదలైన నవలలు ఆ విధంగా వచ్చినవే.

వాణిజ్య నవలలకు పత్రికలు పుట్టినిళ్ళయితే ప్రచురణ సంస్థలు మెట్టినిళ్ళు. వాటి సంతానం తామరతంపరగా పెరగడం కూడా యిక్కడే. వాణిజ్య నవలల్ని దేశంమీదకి వెదజల్లడంలో పత్రికల్తో యివి పోటీపడుతుంటాయి. పత్రికల్లో అచ్చయ్యే సామాన్య పాఠకుల స్థాయి కూడా లేని నవలలకు యిక్కడ మోక్షం దొరుకుతుంది. అచ్చయితే చాలని తృప్తి పడే రచయితలకు చాలాసార్లు యివి ఆశ్రయం యిస్తుంటాయి. వీటికికూడా వ్యాపార పత్రికల్లాగే కవిత్వం అన్నా, విమర్శఅన్నా గిట్టవు. కథల పుస్తకాలన్నా గిటవు. నవలలే కావాలి. వీరిది మరీ వ్యాపార ధోరణి. సాహిత్య సేవకో, సామాజిక చైతన్యాన్ని ఉద్దేశిస్తూనో, రాజకీయ అవగాహనని పెంపొందించడానికో ప్రారంభించే ప్రచురణ సంస్థల్ని వేళ్ళమీదలెక్కెట్టవచ్చు వీటిలో నవలల్ని ప్రచురించే విశాలాంధ్ర ప్రచురణాలయం వంటి సంస్థలు ఒకటీ రెండు మాత్రమే కనిపించినా వాణిజ్య నవలలకూ వాటికీ ఆమడదూరం. వాణిజ్య నవలల్ని ప్రచురించే ప్రచురణ సంస్థలు ఒక్కొక్కప్పుడు మంచి నవలల్ని కూడా ప్రచురిస్తున్నప్పటికీ అవి బహు తక్కువ. రేకల కొద్దీ వచ్చే వాణిజ్య నవలల్లో యిటువంటివి ఏ మూలో ఒదిగిపోయి పరిశీలనగా చూస్తేకాని కనిపించవు. అయితే ఒక విషయం యిక్కడ గుర్తించాల్సివుంది. తెలుగులో గొప్పనవలలుగా పరిగణించబడుతున్నవన్నీ చాలావరకు యిలా మహా ప్రవాహంలో కొట్టుకొచ్చినవే. అందుకు ఆ ప్రచురణ కర్తల ప్రత్యేక శ్రద్ధాసక్తులు కాక ఆయా రచయితల కీర్తి ప్రతిష్ఠలే కారణం అనక తప్పదు.

మొత్తం మీద వాణిజ్య నవలల సంఖ్యాభివృద్ధికి పత్రికలు ఎంతగా దోహదం చేస్తున్నాయో ప్రచురణ సంస్థలూ అంతగా దోహదం చేస్తున్నాయి. ఇతర విషయాలలో కూడా యివి పత్రికలకేం తీసిపోలేదు.

వాణిజ్య నవలలు సామాన్య పాఠకుల మీద ఎలాంటి ప్రభావాన్ని చూపుతున్నాయో విజ్ఞులైనవారు ఆలోచించడం అవసరం. క్రమక్రమంగా యివి యీనాటి తెలుగు సినిమా స్థాయికి చేరుకుంటున్నాయి. ఈ రచయితల ఆదర్శం కూడా అదే. ఇటువంటి పరిస్థితుల్లో యీనాటి తెలుగు సినిమా ఏమిటి సాధిస్తున్నదో వాణిజ్య నవలా అదే సాధించగలదు. బుద్ధిజీవి అయిన మనిషికి కావలసినది కేవలం కాలక్షేపమే కాదు. అదే అని భావించే పత్రికాధిపతులు, ప్రచురణ కర్తలు, ముఖ్యంగా రచయితలు వుంటే వారి అభిప్రాయం తప్పని తెలియజెప్పవలసిన బాధ్యత విజ్ఞులైన ప్రతి ఒక్కరి మీదా వుంది. □

# నవల - భాష

## డా॥ నాయని కృష్ణకుమారి

భావప్రకటనకు వాహిక భాష. సంఘ జీవి అయిన మనుష్యుడికి భావ ప్రకటన అతి ముఖ్యలక్షణాలలో ప్రథమమైనదిగా భాసించింది. నలుగురికీ తన ఆలోచనల్ని పంచడానికీ, తన వ్యక్తిత్వాన్ని స్థాపించుకోడానికీ, అందరిమధ్యా తన కనుకూల వాతావరణాన్ని సృష్టించుకోవడానికీ, మనుష్యుడు తప్పనిసరిగా భాషను ఆశ్రయించవలసి వచ్చింది. పలురకాలయిన పూసల్ని ఒక పద్ధతిలో చేర్చగలిగిన దారంలాగా, మనుషుల్ని భాష ఒక నిర్ణీత విధానానికి బద్ధుల్ని చేసింది. ఆ రకంగా భాషకూ, మనుష్యుడికీ మధ్య ఏర్పడిన బంధం అవిచ్ఛిన్నమైనదీ, దృఢమైనదిన్నీ.

ఏ అంశమైనా లోకంలో ఆవిష్కరింపబడగానే, దాని పుట్టుకతోపాటు దాని పెరుగుదలకు సంబంధించిన తీరుతెన్నులు ప్రవర్తితాలవుతుండడం కనిపిస్తుంది. అనగా, ప్రతి విషయానికీ స్వభావతః దాని ఉత్పత్తిని గురించిన అల్ప సమాచారమే కాక, పరిణమించే కాలంలో, అది వికసించే పద్ధతి ఒక శాస్త్రంవలె రూపు దాల్చడం జరుగుతుంది. భాష విషయంలో కూడా అలాగే జరిగింది.

భాష మొదట కేవలం భావ ప్రకటనకు మాత్రమే ఉద్దేశింపబడిన విషయమైనా, తరువాత తరువాత భాషా పరిణామంమీద శాస్త్రాలు ఉద్భవించాయి. అనగా భాషకు అన్ని అంశాలకుమల్లే శాస్త్ర ముఖమొకటి ఏర్పడ్డది; వ్యాకరణం, శిక్ష, నిరుక్తం, ఛందం, అలంకారం, కల్పం, వంటి శాస్త్రాలెన్నో భాషకు సంబంధించినవే. ఇవన్నీ కలిసికట్టుగానూ, విడిగానూ కూడా, భాషను ఎట్లా వాడుకుంటే అది శ్రుతిపేయంగానూ, మనోహరంగానూ ఉంటుందో, తెల్లంచేస్తాయి. భాషకు సంబంధించిన స్థూల లక్షణాలివి.

సాహిత్యంలో ఒక ప్రక్రియగా అవతరించిన నవలకూ భాషకూ ఉండవలసిన సంబంధం ఎటువంటిది?– నవల సాధించే ప్రయోజనానికీ, అందులో మనం వాడే భాషకూ ఉండవలసిన సంబంధం ఏమిటి? అన్న ప్రశ్నలు అల్పమైన ప్రశ్నలు కావు.

సాహిత్య ప్రక్రియల్లో ఆధునిక కాలాన, నవలకున్న వైశిష్ట్యం, ఒక విధంగా ఆలోచిస్తే మరే ప్రక్రియకూ లేదనే చెప్పాలి. నవలకోసం మనం ఆయత్తం చేసుకునే భూమిక పెద్దది. జీవితాలకు జీవితాలే దానిమీద ఇరుకిరుగ్గా కాకుండా, స్పష్టంగా, చిత్రింప బడడానికి వీలుంది. అయితే, అక్కడ చిత్రింపబడిన ఈ జీవితాలన్నీ అలమారుల్లో బొమ్మల్లాగా కొలువు తీరడానికి కాదు. అవి లోకంలో మనుష్యుల కవసరమైన

విషయాలను చేపట్టి, వాళ్ళను తట్టి లేప డానికి; వాళ్ళను మార్చడానికీ, సంఘ జీవనంలో మార్పును ఆహ్వానించ డానికిన్నీ! విశ్వశ్రేయః కావ్యం అన్న నుడి ప్రాచీన సాహిత్యానికి ఎట్లా నప్పిందో, ఆధునిక నవలకూ అట్లాగే నప్పితీరాలి. కవిత్వంలో సౌందర్య దృష్టి, ఆస్వాదనా, ఎంత ముఖ్యమో నవలలో, లోక ప్రయోజన చింతనా, ముందుచూపూ, అంత ముఖ్యం. ఏవి కవిత్వానికి ముఖ్య లక్షణాలో అవి నవలా రచనకు అనుషంగికాలు. నవల ఎవరు వ్రాసినా, లోక ప్రయోజన కారిత్వం అందులో ప్రధానంగా భాసించాలి. అదే నవలకు సర్వ ప్రథమమైన ధ్యేయం.

మన సాహిత్యంలో, కేవలం ఊహా పారమ్యానికి అంకితం చేసిన నవల లున్నాయి. పలాయన వాద సారాంశాన్ని ఉగ్గుపట్టినట్లుగా పఠితలకు పట్టిన నవలలూ ఉన్నాయి. జీవితాన్ని సరిగా అర్థం చేసుకోకుండా ఏవి సమస్యలో, ఏవి కావో సరియైన నిర్ణయ దృష్టి లేకుండా, పాత కుళ్ళి అపమార్గాలు పట్టించిన నవలలూ ఉన్నాయి. వాటిని నేను నవలలుగా గ్రహించను. జీవితాన్ని చదివే నేర్పును ముందుముందుగా తానై రచయిత కరగతం చేసుకుని ఆపైన దాన్ని నలుగురికీ పంచడానికీ వ్యాఖ్యానాలు చెప్పడానికీ, పరిష్కార మార్గాలు సూచించడానికీ, ప్రయత్నిస్తేనే, ఆ ప్రయత్నం నవలా శబ్ద వాచ్యం కాగలదు. ఈ ప్రక్రియ చాలా విలువైన ప్రక్రియ. ఇటువంటి దాన్ని శక్తిమంతమైన భావ వాహికగా వాడు కోవడంలో ఎంతో మెలకువ చూపించాలిగాని దాన్ని దుర్వినియోగం చేసుకోకూడదు – ఈ రకమైన నవలకు సంబంధించి భాషకు, రచయిత ఇవ్వ వలసిన ప్రాధాన్యం ఎటువంటిది?

(1) ఇక్కడి భాష, కావ్య భాషకు మల్లే అలంకార మహితంగానూ, బిందు రుచితోనూ, అనుప్రాసాదులతోనూ ఉండవచ్చునా?

(2) పదకోశాల సహాయంతో అర్థం చేసుకోదగ్గ గురువైన పదాల వాడుక కలిగి పాండితీ స్ఫోరకంగా ఒక నవల ఉండడం అవసరమా?

(3) నవలా వస్తువూ, ప్రయోజనమూ, ఎలావున్నా భాష మాత్రం హృదయంగమంగా ఉంది అని పఠిత ఒక నవల విషయంలో తృప్తిపడితే ఆ నవల ధ్యేయం నెరవేరినట్లేనా?

ఇవి నవలా రచయితలు తమకు తాము వేసుకోవలసినతప్పనిసరి ప్రశ్నలు.

నవల పండితుడైన పఠితకోసం మాత్రమే ఉద్దేశింపబడ్డది కాదని స్పష్టమైన తర్వాత, నవలకు సంబంధించిన భాష అలంకారికంగా ఉండడం అనే లక్షణాన్ని మనం నిరసించవలసి వస్తుంది. సామాన్యుడికి సంబంధించిన ఈ ప్రక్రియలో, చిత్రితం కావలసిన జీవనాంశాలూ, సమస్యలూ, పరిష్కారాలూ అన్నీ అతణ్ని చేరుకోవలసినవే అందువల్ల అవి అతనికి అర్థమయ్యే భాషలో ఉండడం తప్పనిసరి!

ఏభాష అయినా వక్తనుండి శ్రోతకు అప్రయత్నంగా, అలక్ష్యంగా ప్రయాణించి భావ నివేదనం చేయగలిగినప్పుడే

ఆ భాషను వాడడంలో గల ఉద్దేశం చక్కగా నెరవేరినట్లు. మనం నిత్యమూ వ్యవహరించే భాషలో ఎదుటి వ్యక్తికి అర్థంకాని మాటలుకాని, దూరాన్వయం కానీ, పద్యరచనా పద్ధతి గాని ఉండదు. అదే పద్ధతి నవలా భాషకు కూడా వర్తించవలసి వుంటుంది. నవల చదివే వ్యక్తికి భాషను అర్థం చేసుకోవడంలో శ్రమ ఉండకూడదు. అతడు విషయం మీద వ్యగ్రదృష్టి కలవాడై ఉండాలి. నవలలోని భాష తనకు ప్రచార సాధనాల వలన ముందే పరిచితమై, వాడుకలో ఉన్న వ్యవహార భాషవలె సరళంగా సాగుతున్నంతకాలం, అతనికి నవలలోని భాష విషయం పట్టించుకొనే అవసరమే రాదు. అక్కడ భాష నవలా రచనలో ఒక విడరాని భాగంగా కలిసిపోయి పరితకు తన అస్తిత్వాన్ని గూర్చిన చింత నకు తావివ్వదు.

అట్లాకాక రచయిత నవలలో తాను వర్ణించే సన్నివేశాలకు గానీ, చేసే పాత్ర చిత్రణకుగానీ ప్రత్యేకమైన భాష వాడా లనే నిర్ణయానికి వచ్చినట్లయితే, అప్పుడు పరిత ఆ విషయం గుర్తించ కుండా ఉండడం అసాధ్య మవుతుంది. ఆ భాష పరిత వ్యవహార స్థాయిని మించి ఉంటే అతడు పదకోశాల వెనక పరు గులు తీయవలసి వస్తుంది. లేదా తాను పరిశీలించవలసిన ఇతివృత్త ప్రాధా న్యాన్నీ, ప్రయోజనాన్నీ అవతలకు నెట్టి భాషా పరిశీలనకు ప్రాధాన్యం ఇవ్వవలసి ఉంటుంది. అనగా నవలా నిర్మాణంలో అప్రధాన స్థాయిలో ఉన్న భాష ముఖ్యాంగమై మిగిలిన ముఖ్యాంశాలన్నీ అప్రధానాలుగా తేలిపోవలసి వస్తుంది.

అయితే నవలలో భాషకు ఏమాత్రమూ ప్రాధాన్యం లేదా అనే ప్రశ్న ఒకటి మనం వేసుకోవలసి వస్తుంది- రచయిత ఉద్దేశించిన భావాన్ని, అసందిగ్ధంగా ఒక నవలలోని భాష, పరితకు అందించగలిగి ఉండాలి. ఇది నవలా భాష విషయంలో అందరూ గ్రహించవలసిన ముఖ్య విషయం.

భావ పౌష్కల్యంఉండి,ఇతివృత్తాన్నీ నవలా ప్రయోజనాన్నీ చక్కగా సమన్వ యించుకోగలిగి కూడా, వాటిని వెల్లడించ డానికి వాహిక అయిన భాష విషయంలో అసమర్థులుగా కనిపించే రచయితలు మనకు లేకపోలేదు. ఇటువంటి రచనల విషయంలో పరిత కొంత ఇబ్బంది పాలుకాక తప్పదు. మనసులో ఒక భావాన్ని మలుచుకుని దాన్ని స్పష్టం చెయ్యలేని అసంబద్ధ పదాలు వాడడం, మనస్సులో నుండి భావ పరంపర ఎడ తెగకుండా ఆవిష్కరింప బడుతుండగా, దాన్ని వెల్లడించేవాక్యంకూడా అనంతంగా పెరిగి చివరకు అయోమయంగా ముగిసి పోవడం___ఇటువంటివన్నీ ఆ రచనల్లో కనిపిస్తాయి. కొందరికి భాషమీద అధి కారం లేకపోయినా, అర్థంకాని మోజు ఉండడంవల్ల,వాక్యాలు ఎగుడుదిగుడులై పరితను చికాకుపాలు చేయడం జరుగు తుంటుంది. నవలల్లోని భాష విషయంలో ఇటువంటి లోపాలు లేకుండా చూచుకోవ డం రచయితకు చాలా అవసరం. నవ లల్లో భాషకుండవలసిన ప్రాధాన్యం అంతవరకే.

అయితే, భాషకు ప్రాధాన్యమిచ్చి రచయితలు నవలలు తీర్చి దిద్దడం కూడా మన సాహిత్యంలో కనిపిస్తుంది. భాషను, ఒక ప్రయోగ దృష్టితో, కొందరు రచయితలు చేపట్టి నవలలు వ్రాయడం జరుగుతున్నది. రకరకాల ఇజాలకూ, రూప వైవిధ్యాలకూ ఉదాహరణ ప్రాయంగా నవలలు తయారైనట్లే, రకరకాలమాండలికాలకు కూడా కొన్ని నవలలు ఉదాహరణ ప్రాయంగా నిలుస్తున్నాయి. సిద్ధహస్తులైన రచయితలు, భాషా ప్రాధాన్యం కలిగిస్తూ తీర్చిదిద్దిన ఈ నవలల్లో పరిత దృష్టి ప్రధానంగా భాష మీదికి వ్యాపింపక తప్పదు. తరువాతనే నవలేతి వృత్తాన్ని గురించి ఆలోచిస్తుంది. అయితే ఇటువంటి నవలలు పరిమిత పరితల్ని మాత్రమే అకట్టుకోగలవు. మిగిలిన వాళ్ళకు అక్కడ వాడబడిన భాష పెద్ద అవరోధమై నవలా ప్రయోజనాన్నే దెబ్బతీసే విధంగా తయారు కాగలదు. మాండలికాలు నవలల్లో ప్రధానాంశంగా పరిణమించినప్పుడు, ఆ నవలలు ఆయా ప్రాంత ప్రజలకు మాత్రమే ఆమోద కారకాలవుతాయనడంలో సందేహంలేదు. అందువల్ల నవల కుండవలసిన ముఖ్య లక్షణమైన సార్వజనీనత అందులో లోపిస్తుంది.

అయితే ఇటువంటి నవలలు భాషాభిమానులకు, పరిశీలకులకు ఆమెతలాంటివి. భాషా విషయ వైవిధ్యాన్ని, నీరసశాస్త్రం లాగా చెప్పకుండా, సృజనాత్మకంగా చెప్పడమనేది భాషా పరిశోధకులకు ఒక వరం లభించినట్లే.

కాబట్టి ఒక వాహికగా నవలల్లో ప్రముఖ స్థానాన్ని వహించే భాష,

1. జన వ్యావహారానికి దగ్గరగా, ప్రచారసాధనాల వలన చదవనేర్చినవారికందరికీ అలవాటైన పద్ధతిలో సాగాలి. సరళంగా,సులభగ్రాహ్యంగా పువ్వులలో కలిసి మెలిసి ఉండే తావిలాగా వేరుచేయడానికి వీలులేని విధంగా ఆ భాష తీర్చిదిద్దబడాలి.

2. సౌందర్య చింతనతో అంతులేని నగిషీలు చెక్కడం నవల ధ్యేయానికే నష్టం కలిగిస్తుంది.

3. భాష పూర్తిగా బాగుండక పోతే, భావప్రకటన కుంటుపడి, ఎగుడుదిగుడుతనంతో వికారంగా ఉండడం సంభవిస్తుంది.

ఏ నవలా కర్త అయినా భాష విషయంలో పై సూచనల్ని ఆకళింపు చేసుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది. □

---

నవలలో నీకిష్టమయిన దానిని ఏదయినా వుంచవచ్చును. ఒకే విషయాన్ని అందులో చూడాలని ఎందుకనుకుంటావు ?–ఎప్పుడూ కోడికూరేనా ?

—డి.హెచ్. లారెన్స్

---

# నవల – తాత్విక సంఘర్షణ

పద్య ప్రబంధాల జాతకం మనకు సరిగా తెలీదు. వచన ప్రబంధానికి మాత్రం తెలుగు సరస్వతి చాలా ప్రసవ వేదన పడింది. రాజరికం ప్రౌఢనిర్భర వయః పరిపాకంలో ఉన్ననాడు కారుశిల్పి అయినా, కవితాశిల్పి అయినా తన మహత్కళా కౌశలాన్నీ రాజాంకితం అనేవాడు. స్త్రీ రత్నంతో సహా సకల రత్న రాసులూ రాజార్పణంఅయేవి. ఏకారణం వలనైనా రాజుమీద మోజులేని వారు దైవాంకితం దైవార్పణం చేసేవారు. ఆ రోజుల్లో ఉదాత్త భౌతిక చేతన కళా సంపదకు కోట అగడ్తలూ దేవాలయ ప్రాకారాలూ చెలియలి కట్టలుగావుండేవి. కోటకళలు రాజ పరివారానికి మాత్రమే ఆస్వాదనీయాలు. గుడికళలు పండుగల్లో పట్నవాసులందరికీ అందుబాటులో ఉండేవి. జానపదులు నిత్యోపయోగ శీలమైన కళలనూ,కవితలనూ, తమ నైపుణీ మేరకు తామే సమకూర్చుకొనేవారు. వాటికి కర్తలూ భోక్తలూ కూడా వారే. ప్రాచీన రాజుల్ని వర్ణించినా పురాణ రాజ పురుషుల్ని చిత్రించినా రాజ కావ్యాల్లో కృతి భర్తల జీవితమే ప్రతిబింబించేది. రాజ నీతి, రాజభక్తి, రాజశృంగారం,పౌరుషం, ఈవి, ఠీవి ఆ కావ్యాల్లో అందంగా చిత్రితమయేది. జానపద కావ్యాల్లో కథ ఏదయినా జనపదుల నీతి, గాథలు, బాధలు, కలకల నవ్వులు, కన్నీటి సెలయేళ్ళు ప్రతిబింబించేవి.

రాజకావ్యాలనూ జానపద కావ్యాలనూ కూడా ఒకరు గానం చేస్తే వంద మంది విని ఆహా అని ఆనందించేవారు. కమ్మని కంఠం, గాయన నైపుణ్యం గల వారికే అగ్రపీఠం వేసేవారు. ఆంధ్ర కవితా పితామహ బిరుదాంకితుడయిన అల్లసాని పెద్దన్నను మనం మహాకవుల కోవలో చేరుస్తాం. కాని ఆయనంతటి మహా గాయకుడు భారత దేశంలోనే మరొకడు లేడని బుడతకీచు సర్దారులు

రాంభట్ల

తాసుకున్నట్లున్నారు. ప్రపంచ సంస్కృతి చరిత్రను రచించిన విల్ డ్యూరాంట్ ఆ విషయాన్నే రాశాడు. అలాంటి ఆ రాజరిక వ్యవస్థ ప్రాయం ఇంకా గ్రైవాలక ముందే యుద్ధ తంత్ర, అర్థ తంత్ర అభివృద్ధి వల్ల నగరాలు పెరిగాయి. వర్తకులు, రాయసాలు, సైనిక సరదారుల్లాంటి చదువుకున్న నాగరికుల సంఖ్య బాగా పెరిగింది. వీరికి అటు రాజులు మెచ్చే బహుళాలంకార సౌందర్యం కాని, ఇటు జానపదులు మెచ్చే నిసర్గ సౌందర్యంకాని నచ్చలేదు. అలాగే వీరు మెచ్చే నీతి వేరు. వీరికున్న రాజకీయ దృష్టి వేరు. అలవాట్లు కూడా వేరు. అందువల్ల ఈ కొత్త చూపులకు అనగల కొత్త సాహిత్యం అవసరం అయింది. రాజకావ్య జానపదకావ్యాల్లాంటి శ్రవ్య కావ్యాలు వీరికి అవసరం లేదు. ఎవరికి వారే చదువుకోగల పఠన కావ్యాలు వీరికి కావాలి ఒక కావ్యాన్ని ఎవరయినా రచిస్తే దాని ప్రతికలు తీయగల కూలి రాయసాలుకూడా సమాజంలో బాగా పెరిగారు. అందువల్ల వినిమయ ప్రబంధాల అవతరణకు కావలసిన వాతావరణం ఏర్పడింది. ఈ కొత్త ప్రబంధాల్లో అటు రాజ వృత్తమూ, ఇటు జానపద వృత్తమూ కాక మధ్యమ వర్గీయుల మనసులను అలరించగల వృత్తాలుండాలి. కృష్ణరాయల కాలం నాటికే వినిమయ కాల్పనిక గద్య ప్రబంధాలు అవతరించి వుండాలి. లేకపోతే అల్లసాని పెద్దన "కేవల కల్పనా కథలు కృత్రిమ రత్నము లాద్య సత్కథల్ వావిరి పుట్టు రత్నములు" అని తారతమ్యం ఎంచవలసిన పని వుండదు. పెద్దన కాలం నాటి కాల్పనిక కథలు రాజులకు రాజాశ్రితులకు నచ్చేవికావు. అందువల్లే పెద్దన్న కల్పనా కథలను ఈసడించగలిగాడు. అయితే చక్కని జీవద్వచనంతో ఆ రోజుల్లోనే తయారయిన స్థానాపతి విశ్వనాథ నాయని రాయ వాచకం పెద్దన లాంటివారి ఈసడించిన కావ్యాల కోవకే చేరుతుంది. ఇది ఆద్యసత్కథ కాదు. కేవల కల్పనా కథ అంతకన్నా కాదు. అది సాక్షాత్తు శ్రీ కృష్ణదేవరాయల జీవితకథ అందువల్లన దాన్ని ఏమనడానికీ వీల్లేదు. బహుశా ఆ కారణం వల్లనే అది మన దాకా వచ్చి వుంటుంది ఎందరు ఈసడించినా "మెచ్చనంటా వీవునన్ను, మెచ్చకుంటే యేమిపాయెను, కొయ్యబొమ్మల మెచ్చుకండ్లకు కోమలుల సౌరెక్కునా?" అని వెక్కిరిస్తూ కాల్పనిక వచన ప్రబంధాలు వస్తూనే వచ్చాయి. వాటికి ఆదరణ కూడా పెరుగుతూనే వచ్చింది. పురాణ కథ అయినా కాల్పనిక లక్షణాలు పుష్కలంగా వున్న జైమినీ భారతం లోని చంద్రహాస చరితాన్ని సముఖం వేంకట కృష్ణప్ప నాయుడు వచన ప్రబంధంగా అనువదించాడు.

పెద్దన మాటను బట్టి చూస్తే కేవల కల్పనా కథలకూ ఆద్యసత్కథలకూ ఆ రోజుల్లో తీవ్ర వైరుధ్యం వుండేదని నిస్సంశయంగా చెప్పవచ్చును. ఉభయ పక్షాల వారికీ ఘర్షణ కూడా సాగేదని ఊహించవచ్చును. యూరపులో కూడా ఇలాగే నగరాలూ నాగరికులూ పెరిగిన తరవాత ఆద్యసత్కథలకూ కేవలకల్పనా కథలకూ ఘర్షణ సాగింది. ఆ రోజుల్లో పుట్టిన కేవల కల్పనా కథలను వారు

ప్రాచీనాలంకారికులు కావ్య శరీరంగా పేర్కొన్నరసం, శబ్దార్థాలంకారాలు, చమత్కారాలు అన్నీ కావ్య శరీర లక్షణాలు. ఆధునిక పద్ధతుల్లో చెప్పుకోవాలంటే కవి ఎంచుకున్న ప్రక్రియకు ఆంతర నిర్మాణం – అంటే మన శరీరంలో అస్థిపంజరం, కండరాలు, స్నాయువుల్లాంటి కావ్యాంతర నిర్మాణం, కథా ప్రణాళిక, ఆలంకారిక భాష, ఉక్తి వైచిత్రి ప్లాటు, శిల్పం, ఇవన్నీ కావ్య శరీరం కిందికి వస్తాయి. కావ్యాత్మలో ప్రధానాంశాలు ఇతివృత్త భావాలు లోక వృత్తంలో కళాత్మకంగా దర్శించగల సకల విధ వాస్తవాలు, జీవిత వాస్తవంలోని వైరుధ్యాలు, ఆ వైరుధ్యాల సంఘర్షణ, ఇవన్నీ కావ్యాత్మకు చెందుతాయి. అంటే ఒక్క సుందరత తప్ప వాస్తవికత, తాత్వికతలు కావ్యాత్మ అంశాలు. ఈ మూడు గుణాలద్వారా మూడు ప్రయోజనాలనూ చక్కగా సాధించగల సమగ్ర కావ్యం నవల. రాయల కాలంలో నన్నూరేండ్ల కిందట తలెత్తిన మధ్యమ వర్గం ఇప్పుడు తామర తంపరగా విస్తరించింది. వారితోపాటే నవలా ప్రక్రియకూడా పెంపొందింది, దానితోపాటు ఆనాటి తాత్విక ఘర్షణ కూడా పదునెక్కింది – అందువల్ల ఇప్పటి తాత్విక సంఘర్షణ స్వరూపాన్ని తెలుసుకొనడానికి ముందు నేటి మధ్యమ వర్గపరిస్థితిని గురించి తెలుసుకొనడం అవసరం.

మధ్యతరగతి వారిలో వారి జీవన విధానాన్నిబట్టి సామాజిక సంస్కారాన్ని బట్టి మూడు రకాలవారు కనిపిస్తారు. ఒకరు తమకన్న పైనున్న వర్గాలవారి స్థాయిని చేరుకోవాలనుకుంటారు ఆ వర్గ స్వర్గానికి ఎగరాలమన్న ఆశ కనిపించినప్పుడు ఆ స్వర్గానికి తీయని రూప కల్పన చేసుకుంటారు. అయితే ఇలాంటి అవకాశం అరుదుగా వస్తుంది. అయినా వారు కాల్పనిక జగత్తును సృష్టించుకొన డానికి ఏ అభ్యంతరమూ ఉండదు ఇలా కాక జీవిత వాస్తవికత ఈ కలలను కరిగించినప్పుడు ఆ వర్గంమీద కోపం పెంచుకుంటారు. కాని కిందివర్గం మీద వారికి సానుభూతి సద్భావాలుండవు. పైవర్గంమీద ఆవాలేశం చావదు తమకు మారుగా కిందివర్గం పైవర్గంమీద తిరుగుబాటు చేయనందుకూ అందులో జాప్యం జరుగుతున్నందుకూ ఉగ్రులవుతారు. తమ ఆశ కతనుంచి ప్రాయిడు మతాను సారం షండతాక్లేశం అనుభవిస్తారు. దాన్నించి ప్రదర్శనభావం ఉద్భవిస్తుంది. అక్కడినుంచి న్యూనతా ఆధిక్యతా క్లేశాలు అవతరిస్తాయి. వాటినుంచి పర హింసారిరంస, ఆత్మహింసా పిపాస అంకురిస్తాయి. వీటినుంచే అనుభూతి వాదం,అస్తిత్వవాదం, చైతన్య స్రవంతి వాదం లాంటి అనేక వాదాలు పుడతాయి. కొనకి వీరు నిప్పులు చెరిగే విప్లవ భాషనూ అలంకారాలను వాడ్డానికి అలవాటుపడి కావ్యశరీరమే సర్వస్వం అనే తాత్వికతను ఆకళించుకుంటారు. వీరి శరీరం విప్లవం, ఆత్మమాత్రం బూర్జువా వీరి రచనల్లో సౌందర్యం శిల్పం, ఉక్తివైచిత్రి కనిపిస్తుంది. కాని వాస్తవికత మృగ్యం తాత్విక తక్షీణ తాత్వికత. తెలిసో తెలియకో వీరు

"రొమాన్స్" అని పిలిచేవారు. అది ఇప్పటి నవలకు తొలిపేరు. తరవాత అదే అర్థానిచ్చే ఫిక్షన్ అన్నమాట ఇప్పుడు వాడకంలో వుంది. రష్యన్ భాషలో నేటికీ నవలను "రోమాం" అంటారు కల్పన, ఆద్యసత్కథ అనే మాటలు తాత్విక పరిభాష కాదు. అందు కని ఆ రెండు ప్రక్రియలకూ జరిగిన ఘర్షణను తాత్వికఘర్షణ అనడానికికూడా వీలేదు. కాని ఒకటి అనాదరణకు పాల్ప డడం, రెండవది అవతరించి ఆదరణను పుంజుకొనడం యాదృచ్ఛికంగా జరిగిన పరిణామం మాత్రంకాదు. ఈ అభివృద్ధి ద్వంద్వ భౌతిక వాదతత్వంలోని పరస్పర విరుద్ధాంశాల సంఘర్షణ సమైక్యన్యాయం ప్రకారమే జరిగింది ఆద్యసత్కథా పద్య ప్రబంధాలకూ కేవల కాల్పనిక వచన ప్రబంధాలకూ రాసిలోనే కాక గుణంలో కూడా తేడా వుంది. అందు వల్ల ఈ గౌణ పరిణామం "రాసి గుణ పరిణామ విపరిణామ న్యాయం" వల్లనే జరిగింది.

అందువల్ల తాత్విక ఘర్షణ ప్రత్యక్షంగా కాకపోయినా అంతర్లీనంగా నాటినుంచీ నేటివరకూ సాగుతూనేవుంది. కావ్యలక్షణాలనుగురించీ ప్రయోజనాలను గురించీ ఆలంకారికులు చాలా చర్చిం చారు. ఆ చర్చలు ఆనాటి పరిసితులకు అనువుగా వుండవచ్చు. కాని నేడు అవి యధాతధంగా పనికిరావు. ఇప్పటి కావ్య విజ్ఞానాన్నిబట్టి కావ్యానికి మూడు ప్రయోజనా లున్నాయి. మూడు లక్షణా లున్నాయి. కావ్యం ముందు సౌందర్యం ద్వారా పరితల హృదయాలకు హత్తు కోవాలి. లోక వృత్తాన్ని తెల్పిడిచేయాలి. నిర్దిష్ట సౌందర్య నైతిక రాజకీయ నిర్ణయాలు చేయగల శక్తిని ప్రసాదించాలి. ఇదీ కావ్య ప్రయోజనం. ఇందుకు సుందరత, వాస్తవికత, తాత్వికత అనే కావ్యగుణాలు ఉపకరిస్తాయి. ఆది ఆలం కారికులకు సౌందర్యం మాత్రమే తెలుసు. మిగతా రెండు గుణాల సంగతి ఊహా మాత్రంగానే తప్ప స్పష్టంగా తెలియదు. అందువల్ల రసాలంకారాది కావ్య లక్షణాలను ప్రతిపాదించినవారు అవి కావ్య శరీరం అన్నారు. ఆ తర్వాత గుణ ధ్వని వాదులు కావ్యాత్మను ఊహించారు. మొత్తంమీద భారతీయాలంకారికులు ఈ రెండు మాటలనూ మనకు ప్రసాదించారు. ఆధునిక దార్శనికులు వీటికే ఫార్మ్ - కంటెంట్ అని పేరు పెటారు. వాటినే రూపం - విషయం అనికూడా అంటారు. ఈ కొత్త అర్థంలో మనం కావ్య శరీర ఆత్మ పదాలనే వాడుకుందాం. శరీర ఆత్మలు సౌందర్య దర్శన అభివర్గాలు కనక వీటికికూడా తత్వశాస్త్ర మౌలిక ప్రశ్న వర్తిసుంది. ఆ ప్రశ్నకు వచ్చే జవాబునుబట్టి కవి తాత్విక దృష్టి ఏదో తెలుసుంది. కావ్య శరీర ఆత్మల్లో ఏది అగ్రిమం? ఏది అనగ్రిమం? ఏది నేయం? ఏది అనుయాయి? ఈ ప్రశ్నకు శరీరం అని జవాబిచ్చేవారు శరీరవాదులు- రూప వాదులు, ఫార్మలిస్టులు. ఆత్మ అని జవాబిచ్చేవారు కావ్యాత్మవాదులు. విషయ వాదులు - రూపవాదులు ఒక్క రూపాన్నే కావ్యం అంటారు కాని విషయవాదులు రూప విషయ సమన్వయం చేస్తారు. శరీరాత్మల సమన్వయం సాధిస్తారు.

ఉన్నత వర్గానికి సాహిత్యంద్వారా ఊడిగం చేస్తారు. మాటలు మండే లావా. మనసంతా జావ జావ. వీరికి మనిషికన్నా మాకు నయం. మచ్చలేని మేక నయం. కంయ్యిమనే కుక్క నయం బక్క కొంకి నక్క నయం, దున్న నయం. మన్ను నయం అంతేకాని "నరజన్మము దుర్లభమురా" అన్న జానపద తాత్వికుల మాత్ర ఎరుకకూడా వీరికి ఉండదు.

రెండోవారు పైకి ఎక్కలేక కిందికి దిగలేక త్రిశంకు స్వర్గంలో వుంటారు. పైవారిని ద్వేషిస్తారు. దూషిస్తారు. కిందివారిని ఏవగించుకుంటారు తమకన్న వారి ఆర్థిక జీవనమే మెరుగని తెలిసి కుమిలిపోతారు అయితే ఇలాంటి వారిలో కేవల శరీరవాదులు తక్కువ. అందువల్ల కుటుంబ నవలలూ, కాలక్షేపం నవలలూ పుంఖానుపుంఖాలుగా తయారుచేస్తారు. నేటి నవలా రచయితల్లోనూ పాఠకుల లోనూ వీరి సంఖ్యే బహుళం – వీరు డిమాక్రేట్లు. తెలుసుకుందామన్న కాంక్ష వుంది. తాత్విక సంఘర్షణ వచ్చినప్పుడు శరీర వాదులను మెచ్చుకుంటారు కాని ఒప్పుకోరు.

మూడవవారు తమ బతుకు ఎప్పటికే శ్రమజీవులతోనే ముడి పడి వుందని గ్రహిస్తారు వారిని అభిమానించి అర్థం చేసుకొనడానికి యత్నిస్తారు. కార్మికవర్గ వృత్తాన్ని తమ కావ్యాత్మగా స్వీకరించా లనుకుంటారు. తదనుగుణమైన కావ్య శరీర నిర్మాణంకోసం మధనపడతారు. అయితే ఈ విషయంలో అందరికీ అవగాహన సరిగా వుండదు. ద్వంద్వ భౌతికవాదతత్వాన్ని భౌతికవాద సౌందర్య మీమాంసనీ అధ్యయనంచేసి సకలలోక వృత్తాన్ని ఆకళించుకున్న కొద్దీ వీరి అవగాహన పదునుతేరుతుంది. వీరు శరీరాత్మ సమన్వయ వాదులు. అభ్యుదయ రచయితలు.

మొదటిరకం రూపవాదులు ఎంతటి అందెవేసిన శిల్పులైనా వారిని అభ్యుదయ రచయితలు తిరస్కరిస్తారు. నేటి తాత్విక సంగ్రామంలో అభ్యుదయ రచయితలకు వారే ప్రధాన ప్రత్యర్థులు. రెండోరకంవారు డిమాక్రేట్లు. వీరు మిత్రులు. వీరితో గల వైరుధ్యం మిత్ర వైరుధ్యం – ఈ దశాబ్దంలో తెలుగునాట రూపవాదా లనేకం తల ఎత్తాయి. ఇవి కళ పేరుతో క్రమంగా కళా విధ్వంసానికి దారితీస్తాయి. విప్లవం పేరుతో విప్లవ విద్రోహానికి తోవ వేస్తాయి. అదృష్ట వశాత్తూ అభ్యుదయ రచయితల సంఘం పునర్నిర్మాణం ఈ రూపవాదమీంద సాగించే సమరాగ్నిలోంచే ఉద్భవించింది. నిజమైన అభ్యుదయ నవల సామాజిక సాగర మధనంలోంచి ఉద్భవించిన జలధికన్య. తాత్విక సమరాగ్నికుండం లోంచి ఆవిర్భవించిన యాజ్ఞసేని. రూపవాదులు అనేక తత్వాలవారున్నారు. తత్వ సాంకర్యాలవారు కూడా ఉన్నారు అందువల్ల అభ్యుదయ వాదులు కావ్య శరీర – కావ్యాత్మ అభిపర్గాన్ని ఆకళించుకుని, శరీర వాద తత్వాల ఆటుపోటు ఆనవాళ్ళు తెలుసుకొని వారితో నిరంతర అవిశ్రాంత తాత్విక సమరం సాగించ వలసి వుంది.

□

# తెలుగులో హాస్య నవలలు

ఈ ప్రసంగ వ్యాసాన్ని వండడంలో నాకు ఎదురైన ఒక ఇబ్బందిని ముందుగా మనవి చేసుకుంటాను. కేవలం గత దశాబ్దంలోని తెలుగు హాస్య నవలలను గురించే మాట్లాడాలంటే హాస్యనవలలని చెప్పుకోదగినవి, చెప్పుకోదగిన హాస్య నవలలు ఈ శతాబ్దంలో ఇప్పటిదాకా పట్టుమని పాతికైనా వచ్చాయో లేదో అనుమానం. వాటిలో గత దశాబ్దకాలంలో వచ్చినవి ఏడెనిమిది ఉంటాయేమో. అందుచేత తెలుగులో తొలి నవల పుట్టినప్పటినుంచి ఇప్పటిదాకా వచ్చిన హాస్య నవలలను గురించి ప్రస్తావించదలుచుకున్నాను. అయితే, ఈ వ్యాసం సర్వ సమగ్రం కాదనికూడా మనవి చేస్తున్నాను. నా దృష్టిలోకి రాని గొప్ప రచనలు, రచయితలు ఉండవచ్చు. లేదా కొన్ని రచనలు ఇప్పటికిప్పుడు నాకు జ్ఞాపకం లేకపోవచ్చు.

తెలుగులో మొట్టమొదటి నవల రచించిన కందుకూరి వీరేశలింగం

నండూరి పార్థసారథి

పంతులుగారే తొలి హాస్యనవల కూడా రచించారు. ఆయన రచించిన "సత్యరాజా పూర్వదేశ యాత్రలు" తెలుగులో మొదటి హాస్య, వ్యంగ్య నవల అని చెప్పవచ్చు. జొనాథన్ స్విఫ్ట్ రచించిన "గలివర్ ట్రావెల్స్' చదివిన తర్వాత ఆ ఉత్తేజంతో రాసినప్పటికీ 'సత్య రాజా....'లో ఇంగ్లీషు వాసన ఎక్కడా కనపడదు. అచ్చమైన తెలుగు రచనలాగే ఉంటుంది అది. అప్పటికింకా తెలుగు సాహిత్యంలో వ్యావహారిక భాషా వాదం ప్రబలకపోవడం వల్ల పంతులు గారు గ్రాంథిక శైలిలోనే రచించినప్ప టికీ ఈ తరంవారిని కూడా ఒక్క ఊపులో ఈ చివరినుంచి ఆ చివరిదాకా చదివించగల శక్తి ఆయన శైలికి ఉంది. నవల ఒక సాహితీ ప్రక్రియగా తెలుగులో పరిణతి చెందని ఆ కాలంలో కూడా ఆయన ఎక్కడా విసుగనిపించ కుండా, అంత మంచి టెంపోతో కథని నడిపించగలిగారంటే ఆశ్చర్యంగా ఉంటుంది 'సత్య రాజా....'లో విశుద్ధ హాస్యం ఏమీ లేదనే చెప్పాలి. అందులో ఉన్నదంతా వ్యంగ్యం నుంచి వచ్చిన హాస్యం.

తెలుగు వచన సాహిత్యంలో హాస్య రచనకు అంకురారోపణ చేసినవారు కందుకూరివారే. ఆయన ఎన్నో నాటకాలు, ప్రహసనాలు, కథలు, నవలలు, వ్యాసాలు రాశారు. అన్నింటి లోనూ ఏదో రూపంలో ఎంతో కొంత మోతాదులో హాస్యం కనిపిస్తుంది. ఆయన స్వతస్సిద్ధంగా హాస్యరచనా చతురుడు కనుక ఆయన స్వీయ

చరిత్రలో కూడా ఛెణుకులు, చమత్కారాలు కనిపిస్తాయి హాస్య రచనలకోసం ఆయన తన 'వివేకవర్ధిని' పత్రికకు అనుబంధంగా 'హాస్యసంజీవని' అనే ఒక పత్రికను ప్రత్యేకంగా నిర్వహించారు కూడా ఆ విధంగా తెలుగులో మొదటి హాస్య పత్రికను ప్రారంభించిన ప్రత్యేకత కూడా ఆయనే దక్కించుకున్నారు ఆ తర్వాత పూర్తి హాస్య పత్రికలను కొందరు నిర్వహించారు కాని, అవన్నీ మఖలో పుట్టి పుబ్బలో మాడిపోయిన బాపతే.

శబ్దాశ్రయ హాస్యం, పాత్రల స్వభావాలలో సహజంగా కనిపించే హాస్యం, సన్నివేశాలనుంచి ఉత్పన్నమయేహాస్యం వ్యంగ్యం, అధిక్షేపణ, వ్యాజ స్తుతి, వ్యాజ నింద, అవహేళన, వికృతీకరణ (కారికేచర్), విశుద్ధ హాస్యం- ఇవన్నీ పంతులుగారి రచనల్లో కనిపిస్తాయి శతాబ్దాలుగా మన సమాజంలో పాతుకు పోయిన దురాచారాలను, మౌఢ్యాన్ని నిర్మూలించడమే తన ధ్యేయంగా పెట్టుకుని, అందుకోసమే తన జీవితాన్ని అంకితం చేశాడు ఆయన. ఆ లక్ష్యాన్ని సాధించడానికే ఆయన కలాన్ని శక్తివంతమైన ఆయుధంగా ఉపయోగించుకున్నారు. హాస్యాన్ని వ్యంగ్యాన్నికూడా అందుకు సాధనాలుగానే ఆయన ఉపయోగించుకున్నారు. తన వాదాన్ని సామాన్య ప్రజలకు తేలికగా అవగతపరచేందుకు, తాను చెప్పదలచింది వారి మనస్సులకు హత్తుకునే విధంగా చెప్పడం కోసం ఆయన హాస్యాన్ని ఆశ్రయించారు. కేవలం హాస్యాన్ని హాస్యం కోసమే ఆయన ఎక్కడా ప్రయోగించలేదు. సంఘసంస్కరణోద్యమంలో తన ప్రత్యర్థుల వాదాలను ఖండించడానికి ఆయన చాలా ఘాటైన వ్యంగ్యాన్ని ప్రయోగించారు

'సత్యరాజా...' లో మొదటి భాగమైన "ఆడుమళయాళం"లో ఆయన మన సమాజంలోని మగపెత్తనాన్ని, ఆడవారి బానిసత్వాన్ని అన్యాపదేశంగా తూర్పారబట్టారు. కథానాయకుడు సత్యరాజాచార్యులు ఆడ మళయాళ దేశాన్ని సందర్శించి అక్కడి విశేషాలన్నీ వర్ణిస్తారు. మన సమాజంలో ఆడవాళ్ళ పరిస్థితి ఎలా ఉందో ఆడమళయాళంలో మగవాళ్ళ పరిస్థితి సరిగ్గా అలాగే ఉంటుంది. ఆ దేశంలో మగవాళ్ళు గడపదాటి బైటికి రాకూడదు. చదువుకోకూడదు పత్నీవ్రత ధర్మాలను పాటించాలి. భార్యతోడిదే ప్రపంచంగా భావిస్తూ, రాత్రింబవళ్ళు భార్యను సేవించుకుంటూ ఉండాలి. వంటచేయాలి, వడ్డించాలి. భార్య తిన్నతర్వాత ఆమె ఎంగిలి మెతుకులు తినాలి ఆమె మరణిస్తే ఆమెతో సహగమనం చేయాలి. అలాచేస్తే అతడికి మోక్షం వస్తుందని ఆ దేశపు ధర్మశాస్త్రాలు ఘోషిస్తాయి. రాజకీయ పెత్తనం అంతా ఆడవాళ్ళదే. చదువుకొనేదీ, ఉద్యోగాలు చేసేదివాళ్ళే. ఆడవాళ్ళు వ్యభిచారం చేసినా తప్పులేదు. ఎన్ని పెళ్ళిళ్ళు చేసుకున్నా తప్పులేదు. మగవాడు మాత్రం మళ్ళీ పెళ్ళిచేసుకోకూడదు భార్య మరణించిన తర్వాత భర్తకు ముక్కు కోసేస్తారు. స్త్రీలను సంతోషపెట్టడానికి వారి సమాజంలో

కొందరు భోగపురుషులుంటారు. వారు చక్కగా అలంకరించుకుని స్త్రీలను ఆకర్షిస్తూ ఉంటారు ఆ దేశంలో పురుషులకు సిగ్గే సింగారం. "సత్య రాజా"లో ద్వితీయ భాగం "లంకాద్వీపం". ఆ ద్వీపం రాక్షస భూమి. అయితే అక్కడి రాక్షసులు నరమాంస భక్షకులు కారు. వారు తాటి చెట్టంత ఎత్తు ఉంటారు. వారి చేతుల్లో చిక్కిన "సత్య రాజా" అక్కడ చూసిన విశేషాలను వర్ణిస్తాడు. వారికి జ్యోతిషశాస్త్రంలో విపరీతమైన నమ్మకం. ఆ శాస్త్రాన్నిబట్టే సమాజమంతా నడుచుకుంటుంది. న్యాయస్థానాలు సాక్ష్యాధారాలనుబట్టిగాక జ్యోతిశ్శాస్త్రానుసారంగా నేరాలను నిర్ధారణచేసి, అమాయకులను శిక్షిస్తూ ఉంటారు ఈ ద్వితీయ భాగంలో పంతులుగారు జ్యోతిషశాస్త్ర విశ్వాసాన్ని తీవ్రంగా దుయ్యబట్టారు. ఈ పుస్తకంలో పంతులుగారు తన వ్యంగ్యంతో సమాజాన్ని ఛెళ్ళుఛెళ్ళున కొరడాతో చరిచారు. ఆయన రచనలో గంభీరత, హుందాతనం ఉన్నాయి చౌకబారుతనం వెతికి చూసినా కనిపించదు

"సత్యరాజా పూర్వదేశ యాత్రలు" 1891 లో వెలువడింది. అప్పటినుంచి ఇప్పటిదాకా– 90 ఏళ్ళలో–సంఘసంస్కరణ కోసం వ్యంగ్యాన్ని, హాస్యాన్ని అంత శక్తిమంతంగా ఉపయోగించుకున్న రచయిత పురాకరులేరు. చలంగారు కూడా కలాన్ని సంఘసంస్కరణకే అంకితం చేశారు. ఆయన రచనల్లోనూ కొరడా దెబ్బలున్నాయి. కాని–వ్యంగ్యం లేదు. చలంగారు ముక్కుమీద గుద్దినట్లుగా చెబుతారు. అప్పటినుంచి ఇప్పటిదాకా సమాజపు దుమ్ముదులిపే రచనలు తెలుగులో చాలానేవచ్చాయి కాని, వాటిలో ఉపన్యాసాలు, నినాదాలు, వాదోపవాదాలే ఎక్కువగా కనిపిస్తాయి. హాస్యాన్ని, వ్యంగ్యాన్ని మేళవించి ఆసక్తికరంగా చదివించగల, సాహిత్య గౌరవంగల రచనలు చాలా తక్కువ. హాస్యాన్ని, వ్యంగ్యాన్ని నవలల్లో పొదిగిన రచయితలు మరీ అరుదు.

తెలుగు వచన సాహిత్యంలో వివిధ ప్రక్రియలకు ఒరవడి దిద్దిన మార్గదర్శకులు చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారు, పానుగంటి లక్ష్మీనరసింరావుగారు, గురజాడ అప్పారావుగారు కూడా వీరేశలింగం పంతులుగారి సమకాలికులే వారు కూడా సమాజంలోని మూఢవిశ్వాసాలను రూపుమాపడానికి, బాల్యవివాహాలు, కన్యాశుల్కం వంటి దురాచారాలను నిర్మూలించడానికి కలం పట్టినవారే వారు కూడా తమ రచనల ద్వారా ప్రజల దృక్పథంలో మార్పు తీసుకువచ్చినవారే. వారిలో పానుగంటి, గురజాడ నవల జోలికి పోలేదు పానుగంటివారు "సాక్షి" వ్యాసాలతో తెలుగులో వ్యంగ్య వైభవ వ్యాసాలకు ఒరవడి పెట్టారు గురజాడ "కన్యాశుల్కం" లో ప్రప్రథమంగా వ్యావహారిక భాషను ప్రయోగించి తెలుగు సాహిత్యాన్ని ఒక మలుపు తిప్పారు "కన్యాశుల్కం" లో వ్యంగ్యాన్ని, విశుద్ధ హాస్యాన్ని అద్భుతంగా మేళవించారు. గురజాడ రచనల్లో కొరడా దెబ్బలుండవు. ఆయన వ్యంగ్యం

నాజూకుగా, కందుకూరి వ్యంగ్యం కంటే సాఫిస్టికేటెడ్‌గా ఉంటుంది. గురజాడవంటి గొప్ప రచయిత హాస్య నవల ఎందుకు రాయలేదా అనిపిస్తుంది. పానుగంటివారు గ్రాంధిక శైలిలో రాసినా "సాక్షి" వ్యాసాలను, "కంఠాభరణం" నాటకాన్ని గొప్పగా రాశారు. ఆయన కూడా ఎందుకో నవల జోలికి పోలేదు.

చిలకమర్తి వారు మాత్రం నాటకాలు, ప్రహసనాలతోపాటు నవలలు కూడా రాశారు ఆయన రాసిన 'గణపతి' హాస్య నవల. అది తొలి హాస్య నవలల్లో చెప్పుకోదగినది. అందులో వ్యంగ్యం ఏమీలేదు- వట్టి హాస్యమే. కథానాయకుడు గణపతి అమాయకుడు, పట్టిబుర్ర, అనాకారి వాడు. అతడి వెర్రిమొర్రి పనులను, ఆనాటి చాదస్తపు బ్రాహ్మణ కుటుంబాలలోని ఆచార వ్యవహారాలను అపహాస్యం చేస్తూ ఆ నవల రాశారు. బ్రాహ్మణార్థాలు చేసేవారు నీళ్ళకావిళ్ళు మోసేవారు, సంభావనలు పుచ్చుకొనేవారు, వంట బ్రాహ్మణులు, శవాలు మోసేవారు ఈ నవలలో కనిపిస్తారు. ఇందులోని పాత్రలు, సన్నివేశాలు వాస్తవికమైనవి. కాని, హాస్యంలో నాజూకుతనం తక్కువే కొంత మొరటుతనం, వెకిలితనం కనిపిస్తుంది అయినా ఆనాటి బ్రాహ్మణ సమాజానికి అద్దం పట్టిన హాస్యనవలగా "గణపతి"కి ప్రాముఖ్యం ఉన్నది. చిలకమర్తివారు గణపతి పాత్ర తరహాలోనే ఒక స్త్రీ పాత్రను ప్రధానంగా పెట్టుకొని 'దుందుభి' అని మరో హాస్య నవల రాశారట. అందులో హాస్యం మరీ చప్పగా, పేలవంగా ఉంటుందని చెబుతారు.

మొక్కపాటి నరసింహశాస్త్రిగారి "బారిష్టర్ పార్వతీశం" ఇప్పటి దాకా వచ్చిన విశుద్ధ హాస్యనవలలన్నింటిలోకి శ్రేష్ఠమైనది. ఆ నవల 1924 ప్రాంతంలో వెలువడింది యాభై ఏళ్ళు గడిచినా ఆ నవల పాతబడలేదు. ఆ నవలను ఆనాటి పాఠకులు ఎంత ఆసక్తితో చదివారో ఇప్పటి పాఠకులూ అంత ఆసక్తిలో చదువుతున్నారు. పార్వతీశం పాత్ర అజరామరమైన పాత్ర కోనసీమలోని మొగలితుర్రు గ్రామంలో పుట్టి పెరిగిన అమాయక బ్రాహ్మణ యువకుడు పార్వతీశం బారిష్టర్ చదువుకోసం లండన్‌కు ప్రయాణం కట్టడం, నాగరిక పద్ధతులు తెలియక అడుగడుగునా నవ్వుల పాలు కావడం ఆనవలలోని ఇతివృత్తం. ఇందులో ప్రతి సన్నివేశం హాస్యస్ఫోరకంగా ఉంటుంది. తాను చాలా తెలివిగలవాడిననే ఆత్మ విశ్వాసంతో పార్వతీశం చేసే పనులన్నీ హాస్యాస్పదంగా ఉంటాయి మొక్కపాటివారు పార్వతీశం పాత్రను అతి సహజంగా తీర్చిదిద్దారు. పార్వతీశం చేష్టలేవీ ఎబ్బెట్టుగా ఉండవు ఏ సన్నివేశం కృత్రిమంగా ఉండదు చార్లీ చాప్లిన్ హాస్యపాత్ర పోషణలో కనిపించే ఒక రకమైన ఉదాత్తత పార్వతీశం పాత్ర చిత్రణలో కనిపిస్తుంది. చాప్లిన్‌లాగానే పార్వతీశం కూడా మనకు పరమాప్తుడుగా కనిపిస్తాడు. తెలుగు హాస్య నవలల్లో ఇంత గొప్ప పాత్ర మరొకటి లేదని చెప్పవచ్చు. తన ఊరుదాటి నాగరక

ప్రపంచంలో ఎన్నడూ అడుగుపెట్టని పార్వతీశం బంతిపువ్వు రంగుకొత్త ట్రంకు పెట్టెలో కప్పుకపోసి, నాలుక గీసుకునే తాటాకు ముక్కలు వగైరా సామాగ్రి పెట్టుకుని బయలుదేరి రైల్లోనూ, తర్వాత మద్రాసునగరంలోనూ, ఆ తర్వాత ఓడలోనూ పొందిన అనుభవాలు, ఏవస్తువు ఎలా ఉపయోగించాలో, ఎక్కడ ఏ విధంగా ప్రవర్తించాలో తెలియక అతడు పడిన ఇబ్బందులు మనందరం ఎప్పుడో ఒకప్పుడు ఏదో ఒక సందర్భంలో చవిచూచే ఉంటాము అందుకే ఎంత నవ్వుకున్నా పార్వతీశాన్ని సానుభూతితో అభిమానిస్తాము.

ఈ నవల రాసిన తర్వాత దాదాపు యాభై సంవత్సరాలకు మొక్కపాటివారు 'బారిష్టర్ పార్వతీశం' రెండు మూడు భాగాలను రాశారు. కాని, ఇవి మొదటి భాగమంత రసవత్తరంగా లేవు రచన పేలవంగా ఉంది 'బారిష్టర్‌గారి బారాఖానీ' అనే శీర్షికలో మొక్కపాటి వారు కొంతకాలం ఒక ఫీచర్ కూడా రాశారు కాని, అదీ అంతంత మాత్రంగానే ఉంది 'పార్వతీశం' మొదటి భాగం కాగానే వెంటనే రెండో భాగం ప్రారంభించి ఉంటే రచన గొప్పగా ఉండి ఉండేది. మొక్కపాటివారు కొన్ని నాటకాలు కూడా రాశారు కాని, హాస్య రచయితగా ఆయనకు శాశ్వతమైన కీర్తి తెచ్చినది 'బారిష్టర్ పార్వతీశం' మొదటి భాగం ఒక్కటే

మొక్కపాటి నరసింహశాస్త్రి గారి తర్వాత హాస్య రచయితలని చెప్పదగిన వారు – భమిడిపాటి కామేశ్వరరావుగారు, మునిమాణిక్యం నరసింహారావు గారు దాసు వామనరావుగారు, రావూరు సత్యనారాయణగారు, ముళ్ళపూడి వెంకటరమణగారు, భమిడిపాటి రాధాకృష్ణగారు, డి వి నరసరాజుగారు, భమిడిపాటి రామగోపాలంగారు, భానుమతిగారు, రావి కొండలరావుగారు – ఎవరి శైలిలో వారు ఎన్నో హాస్య రచన లందించారు. కాని, వీరందరూ కథల్లో, నాటకాలలో, నాటికలలో, వ్యాసాలలో తమ ప్రతిభను ప్రదర్శించారేగాని నవల జోలికి పోలేదు. హాస్యబ్రహ్మగా పేరు పొందిన భమిడిపాటి కామేశ్వరరావుగారు శాబ్దిక చమత్కారాలతో ఒక తమాషా శైలిని సంతరించుకున్నారు ఆయన నాటకాలలోని సంభాషణలలో వెటకారం ఎక్కువగా ధ్వనిస్తుంది ఏదో ఒక వ్యవస్థను, ఒక రంగాన్ని, ఒక వర్గాన్ని, ఆచార సంప్రదాయాలను వ్యంగ్యంగా దుయ్యబట్టడం కాకుండా, ప్రతిరోజూ మనకు తారసపడే మనుషులలోని స్వార్థం, అసూయ, పినాసితనం, కీర్తికండూతి వగైరా అల్పత్వాలను ఆయన అపహాస్యం చేశారు అయితే ఆయన పాత్రలన్నీ ఎప్పుడూ ఒకే ధోరణిలో – గడసరిగా, వెటకారంగా, హేళనగా – మాట్లాడుతున్నట్లు కనిపిస్తాయి. అయినా ఆయనది మంచి చేవగల హాస్యం. ఆయన తన నాటకాలలో మాదిరి పాత్రలతోనే, అటువంటి సంభాషణలతోనే హాస్య నవలలు రాసి ఉండాల్సింది. రాయకపోవడం ఆయన సాహిత్య జీవితానికీ, తెలుగు హాస్య సాహిత్యానికీ ఒక లోపమేనని చెప్పాలి.

బారిష్టర్ పార్వతీశంలాగా పాఠకుల మనస్సుల్లో చిరకాలం నిలిచిపోయే కాంతం పాత్రను ఎంతో అందంగా, నాజూకుగా తీర్చిదిద్దిన మునిమాణిక్యం గారు కూడా అన్నీ కథలే రాశారు. నవలను చేపట్టలేదు. భార్యాభర్తలమధ్య అన్యోన్యానురాగం ఒకరినొకరు సానుభూతితో అర్థం చేసుకునే సహనం, హాస్య ప్రియత్వం, మాటకారి తనం – ఇవన్నీ ఉంటే గృహమే కదా స్వర్గసీమ అనిపించే విధంగా, కాంతం పాత్రనే ప్రధానంగా తీసుకుని, మధ్య తరగతి కుటుంబంలోని ఆపేక్షలను, అపోహలను, ప్రణయ కలహాలను, వేళాకోళాలను, వెక్కిరింతలను పొందుపరుస్తూ ఆయన కూడా ఒక చిన్న నవల రాసి ఉండవచ్చు రాసిఉంటే ప్రతి తరంలో సవరింపబడుతూ కానుకగా ఇవ్వదగిన మంచి నవల అయిఉండేది.

'కాలక్షేపం' కబుర్లు చెప్పిన దాసు వామనరావుగారు 'అషామాషీ' కబుర్లు చెప్పిన రావూరు సత్యనారాయణగారు కూడా నవలను స్పృశించలేదు.

1950 తర్వాత హాస్యరచయితల్లో అగ్రగణ్యులు ముళ్ళపూడి వెంకటరమణ గారు. మొక్కపాటి వారి పార్వతీశం లాగా, మునిమాణిక్యం వారి కాంతం లాగా రమణగారి బుడుగు, అప్పారావు ఎప్పటికీ మరచిపోలేని పాత్రలు. 'బుడుగు', విక్రమార్కుడి మార్కు సింహాసనం, 'ఋణానందలహరి', రాజకీయ బేతాళ పంచవింశతిక' కాక, మరి నాలుగైదు కథా సంపుటాలు ఆయనవి వెలువడినాయి ఆయన రచనల్లో 'ఇద్దరమ్మాయిలూ, ముగ్గురబ్బాయిలూ' ఒక్కటే కొంతవరకు నవలా లక్షణాలు కలిగినది. దానిని నవల అనడం కంటే పెద్దకథ అనడం సమంజసమేమో. రమణ గారి రచనలన్నింటి లాగానే ఇది కూడా చదువుతున్నంత సేపూ హుషారు కలిగిస్తుంది మళ్ళీమళ్ళీ చదివింపజేస్తుంది. ఇందులోని పాత్రలు, సంభాషణలు మళ్ళీ మళ్ళీ జ్ఞాపకంవచ్చి నవ్విస్తాయి. 'విక్రమార్కుడిమార్కు సింహాసనం' 'రాజకీయ బేతాళ పంచవింశతిక' వ్యంగ్య రచనలు. మిగిలినవన్నీ శుద్ధ హాస్యరచనలే భమిడిపాటి కామేశ్వరరావుగారి ప్రభావం రమణగారిమీద స్పష్టంగా కనిపిస్తుంది. కాని, భమిడిపాటి శైలికంటే రమణగారి శైలి నాజూకుగా, పఠనీయంగా ఉంటుంది. ఒక్కమాటలో చెప్పాలంటే ఆయనది 'రమణీయ' శైలి తెలుగు హాస్య రచయితలలో ఆయనకున్నంతమంది అభిమాన పాఠకులు, ఆయన కున్నంతమంది ఏకలవ్య శిష్యులు మరెవరికీ లేరు 1964 నుంచి ఆయన పూర్తిగా సినిమా రంగానికే అంకితమై పోయినప్పటికీ, అంతకుముందు ఆయన రాసిన పుస్తకాలే పునర్ముద్రణ పొందుతూ ఇప్పటికీ పాఠకులను అలరిస్తున్నాయి. ఈ తరం హాస్య రచయితలను సైతం ప్రభావితం చేస్తున్నాయి. అంత మంచి రచయిత ఒక దశలో మంచి తెర నవలలు కూడా రాశారు కాని, పూర్తి హాస్య నవల రాయక పోవడం దురదృష్టం

అత్తగారి కథల్లో అచ్చ తెలుగు హాస్యాన్ని అందించిన భానుమతీ రామకృష్ణగారు, నిరాడంబరమయిన మధ్య తరగతి సంసార పక్షపు హాస్యాన్ని అం

డించిన భమిడిపాటి రామగోపాలం గారు కూడా నవలలు రాయలేదు. కాగా, హాస్య రచయితలుగా ముద్రపడనివారు కొందరు కొన్ని మంచి హాస్య నవలలు వ్రాశారు. విశ్వనాథ సత్యనారాయణగారి "విష్ణుశర్మ ఇంగ్లీషు చదువు" "హాహాహూహూ", రావూరి భరద్వాజగారి "కరిమింగిన వెలగపండు" రంగనాయకమ్మగారి "ఆండాళమ్మ గారు" "స్వీట్ హోం" పాలగుమ్మి పద్మరాజు గారి "బతికిన కాలేజి" "రెండవ అశోకుని మూణ్ణాళ్ళ పాలన" ఇందుకు ఉదాహరణగా చెప్పుకోవచ్చు.

"కరిమింగిన వెలగపండు" మొదటి నుంచి చివరి దాకా ఎడతెరిపి లేకుండా నవ్వించే ఫుల్ సైజ్ హాస్య నవల. కష్టమంతా మగవాడిదేననీ, ఆడజన్మలోనే సుఖం వుందనీ భర్త అనుకుంటాడు. పొద్దస్తమానం ఇంట్లో చాకిరీ చేసే ఆడజన్మకి ఏ సుఖమూ లేదనీ, సుఖమంతా మగ మహారాజుదేననీ భార్య అనుకుంటుంది. ఒకరిని చూసి ఒకరు ఈర్ష్యపడతారు. ఆడదిగా పుడితే ఎంత బావుండేదని భర్త, మగ జన్మ ఎత్తితే ఎంత బావుండేదని భార్య నిట్టూరుస్తారు. ఒక రాత్రి వారు నిద్రపోతూవుండగా పార్వతీ పరమేశ్వరులు భర్త రూపాన్ని భార్యకి, భార్య రూపాన్ని భర్తకి బదలాయిస్తారు. తెల్లారి నిద్రలేచిన తర్వాత భార్యాభర్తలు ఈ మార్పును తెలుసుకుంటారు. ఇద్దరూ సంతోషిస్తారు. అక్కడి నుంచి అంతా తారుమారు వ్యవహారం. దేహాలు మారినా పాత అలవాట్లు మారక భర్త రూపంలో వున్న భార్య ఆడంగిగా ప్రవర్తించడం, భార్య రూపంలో ఉన్న భర్త మగరాయుడిలా ప్రవర్తించడం, వారి చేష్టలు అందరికీ విడ్డూరంగా కనిపించడం. దీనినంతటినీ రచయిత వాస్తవికంగా, అశ్లీలానికి తావివ్వకుండా, కడుపుబ్బ నవ్వించేటట్లుగా రచించారు. భార్య భర్త రూపంలో ఆఫీసుకి వెళ్ళి ఉద్యోగం చేసి మగజన్మలో ఎంత తలనొప్పివుందో తెలుసుకుంటుంది. భర్త భార్య రూపంలో ఇంటిచాకిరి చేసి ఆడజన్మలో ఎంత చికాకు వుందో తెలుసుకుంటాడు. ఇద్దరూ ఒకరినొకరు సానుభూతితో అర్థం చేసుకొని, పశ్చాత్తాపపడి, మళ్ళీ తమకు అసలు రూపాలు రావాలని కోరుకుంటారు. వారు నిద్రిస్తూ వుండగా పార్వతీ పరమేశ్వరులు వారికి వారి అసలు రూపాలను ప్రసాదిస్తారు. పార్వతీ పరమేశ్వరులు వచ్చి రూపాలు మార్చడం ఒక్కటే ఇందులో ఫాంటసీ ఎలిమెంట్. ఇది తప్ప ఇంకెక్కడా కృత్రిమత్వం, అవాస్తవికత కనిపించవు.

కడచిన వంద సంవత్సరాలలో తెలుగులో కొన్ని వేల నవలలు వెలువడినాయి. వాటిలో నూటికి రెండు మూడయినా హాస్యనవలలు లేవు. ఈ సంగతి దృష్టిలో పెట్టుకుని తెలుగులో హాస్య నవలా రచనను ప్రోత్సహించే ఉద్దేశముతో "ఆంధ్ర జ్యోతి" సచిత్ర వార పత్రిక వారు 1972 దీపావళికి ప్రత్యేకముగా హాస్య నవలల పోటీని నిర్వహించారు. అయినా, వారు ఆశించినన్ని మంచి నవలలు వచ్చినట్లులేదు. మూడు నవలలు మాత్రమే వారు ఎంపిక చేశారు. నేను రాసిన "కార్టూనాఖ్యానం" నవలకీ, "ప్రశాంత" రాసిన "ఉత్తరాయణం"

నవలకీ ప్రథమ బహుమతిని సమానంగా పంచి ఇచ్చారు ఎర్రంశెట్టి శాయిగారి నవలకు కన్సొలేషన్ బహుమతిని ఇచ్చారు. (ఆ నవల పేరు జ్ఞాపకంలేదు) కాలేజీ అమ్మాయిలూ, అబ్బాయిల మధ్య స్నేహాలూ, ప్రేమలూ "ఉత్తరాయణం" నవలకు ఇతివృత్తం. మొత్తం నవలంతా ఉత్తరాలతో నడిచింది. ఇది పుస్తక రూపంలో వచ్చినట్లు లేదు.

తెలివి తక్కువ దద్దమ్మ, సోమరిపోతు, అప్రయోజకుడు అనిపించుకున్న పద్దయ్య అనే గిరసబారిన యువకుడు చివరికి తనంతట తానే ప్రయోజకుడు కావడం "కార్ఖానాఖ్యానం"లో ఇతివృత్తం. చదువు మానేసి, పొలం పనులు చేసుకోడానికి ఒళ్ళొంగక, గొడ్లని కాసుకోడానికి నామోషీపడి పొద్దస్తమానం వడ్రంగి కార్ఖానాలో కూర్చుని చీట్లపేక, పులిజూదం ఆడుకునే సోమరిపోతులందరూ పద్దయ్యకు మిత్రులు. ఇందులో సంభాషణలన్నీ కృష్ణాజిల్లా గ్రామ్య భాషలో నడుస్తాయి. ఇందులో విశుద్ధ హాస్యమే తప్ప వ్యంగ్యంలేదు ఈ నవల 1973లో సీరియల్‌గా ప్రచురితమై 1974లో పుస్తక రూపంలో వచ్చింది.

నేను రాసిన మరో పుస్తకం "సాహిత్య హింసావలోకనం" 1973 సంవత్సరంలో పుస్తక రూపంలో వచ్చింది గ్రంథచౌర్య దురాచారాన్ని తూర్పార బట్టడానికి, రచయితలలోని ధన దాహాన్ని, కీర్తి కండూతిని, హిపోక్రసీని చీల్చి చెండాడడానికి ఉద్దేశించిన రచన యిది. హాస్యం వ్యంగ్యం ఇందులో చాలా ఘాటుగా వుంటాయి. నేను ఈ పుస్తకాన్ని 1963లోనే రాశాను. కొన్ని ప్రముఖ పత్రికలు దీనిని ప్రచురణకు తిరస్కరించగా, 1965లో "జయశ్రీ" మాసపత్రిక వారు దీనిని సీరియల్‌గా ప్రచురించారు 1973లో దాన్ని మొత్తం తిరగరాసి, మూడు అధ్యాయాలు కొత్తగా చేర్చి పుస్తకరూపంలో తెచ్చాను తెలుగులో ఈ రకం రచన ఇదొక్కటే అనుకుంటాను. నవలకు వుండాల్సిన లక్షణాలన్నీ దీనికి వుండక పోవచ్చుగాని, ఇందులో కూడా కొంత కథ నడిచింది కాబట్టి, కొన్ని సన్నివేశాలు, పాత్రలు వున్నాయి కాబట్టి మొత్తం మీద దీనిని నవలగానే పరిగణించవచ్చునని అనుకుంటాను

1970 దశకంలో వెలువడిన మరి కొన్ని హాస్య నవలలు– పురాణం సుబ్రహ్మణ్యశర్మగారి 'ఇల్లు కట్టిచూడు', మంథా వెంకట రమణారావుగారి 'ఉద్యోగపర్వం', మునిమాణిక్యంగారి 'గాడిదల తిరుగుబాటు' రావికొండలరావు గారు 'సుకుమార్' అనే కలం పేరుతో రాసిన 'అర్జంట్ ప్రొడక్షన్స్‌వారి అన్నీ అడ్డంకులే', కొమ్మూరి వేణుగోపాలరావు గారి 'ఈ దేశంలో ఒక భాగమిది', పాలగుమ్మివారి 'రెండవ అశోకుని మూణ్ణాళ్ళ పాలన'.

రాచకొండ విశ్వనాథశాస్త్రిగారి నవలలను హాస్యనవలలు అనడానికి వీలులేదు కాని, ఆయన నవలలన్నింటిలోనూ సహజమైన హాస్యం కనిపిస్తుంది. ముఖ్యంగా 'రత్తాలు-రాంబాబు'లో పోలీసు కానిస్టేబుల్ పాత్రద్వారా ఆయన గొప్ప హాస్యాన్ని అందించారు. కానిస్టేబుల్ సంభాషణల్లో వెటకారం తారస్థాయిలో ధ్వనిస్తుంది.

సమర్థులయిన హాస్య రచయితలు ఎందరో ఉండగా తెలుగులో హాస్య నవలలు ఇంత తక్కువగా వెలువడడానికి కారణం ఏమిటో మనం ఆలోచించాలి.

హాస్యం కథల్లోనూ, నాటకాల్లోనూ, నాటికలలోనూ, వ్యాసాలలోనూ తప్ప నవలల్లో రాణించదని మనవాళ్ళు భావించారా? రెండుమూడు వందల పేజీల విస్తృతిగల రచనలో మొదటినుంచి చివరిదాకా ఎక్కడా బిగువు చెడకుండా హాస్యరసాన్ని పోషించడం కష్టమనే ఉద్దేశంతో నవల జోలికి పోలేదా? నవలకు అవసరమైనంత విస్తృతిగల ఇతివృత్తాన్ని కల్పన చేయలేక వదిలేశారా? అసలు ఈ కారణాలు ఏవీ కాకుండా నవల ఒక ప్రక్రియగా హాస్య రచయితలను ఆకర్షించలేకపోయిందా? భానుమతి రామకృష్ణగారు, కొద్దిగా రంగనాయకమ్మగారుతప్ప మిగతా రచయిత్రులు హాస్యం జోలికి పోలేదెందుకని? స్వభావతః హాస్యరచన చేయగల శక్తి రచయిత్రులకు లేదా? హాస్యం పట్ల వారికి ఆసక్తి లేదా? కష్టాలు కన్నీళ్ళు కలబోసిన శోకరస ప్రధాన నవలలకున్నంత గిరాకీ హాస్యనవలలకు ఉండదనే ఉద్దేశంతో వాటికి దూరంగా ఉంటున్నారా? ఈ ప్రశ్నావళిని రచయితలకు, రచయిత్రులకు అందజేసి, వారి సమాధానాలను అధ్యయనం చేయడం అవసరం.

సాధారణ నవలలకంటే హాస్యనవలలు రాయడం చాలాకష్టమనే విషయంఅందరూ ఒప్పుకు తీరవలసిన విషయం. ఒక చిన్న కథను తీసుకుని సాగదీస్తే అది నవల అనిపించుకోదు. పైగా బోరుకొడుతుంది. కథకంటే నవల కాన్వాస్ పెద్దది. ఆ కాన్వాస్‌కు తగినంత పెద్ద ఇతివృత్తాన్ని భావన చేయడమే కష్టం. సరే ఇతివృత్తాన్ని సమకూర్చుకున్నా ఎక్కడికక్కడ హాస్యాన్ని ఇంజెక్టు చేస్తూ ఆద్యంతం ఆసక్తికరంగా కథను నడపడం కష్టం. ప్రతి పేజీలో, ప్రతి సన్నివేశంలో జోకును పేల్చగలగాలి. పేల్చలేకపోతే అది పేలని టపాకాయిలా నవ్వుల పాలైపోతుంది. హాస్యనవల కావడానికిబదులు హాస్యాస్పద నవలఅవుతుంది. మామూలు రచనలకంటే హాస్య వ్యంగ్య రచనలు చేయడానికి భాషపై అధికారం ఎక్కువగా అవసరం. రాయి విసరాలంటే-వేళాకోళంగా చిన్న గులకరాయి విసరాలా? ఓ మోస్తరుగా దెబ్బ తగిలేటట్టు ఇటుకరాయి విసరాలా. బుర్ర పెంకు లేచిపోయేటట్టు కంకరరాయి, విసరాలా అనే విచక్షణ అవసరం. అలా విచక్షణ లేకుండా విసిరితే అది పిచ్చివాడి చేతి రాయి అవుతుంది. రాయికి బరువు ఉన్నట్లే పదానికి పదునుంటుంది. ఏ పదానికి ఎంత పదునుంటుందో తెలుసుకొని, ఎక్కడ ఎంత పదునైన పదాన్ని ప్రయోగించాలో విచక్షించుకుని, తదనుగుణంగా పదాస్త్ర ప్రయోగం చేయాలి. భాషపై అధికారంగల రచయిత తన వాక్యాలని కదం తొక్కించగలడు. మామూలు రచయితలకంటే హాస్యరచయితలకి ఔచిత్యం, మోతాదు బాగా తెలిసివుండాలి. నిగ్రహం అవసరం. మానసిక పరిణతి అవసరం. సంస్కారం, అభిరుచి అవసరం. ఈ లక్షణాలు చాలాఅపురూపమైనవి కనుకనే, హాస్యనవలల్లో శ్రేష్ఠమైనవి అపురూపంగా వస్తుంటాయి. చాలా హాస్యనవలలు చప్పగా నీరుగారిపోతూ ఉంటాయి.. హాస్యనవలలు మరీ కొద్దిగా రావడానికి ఈ సాధక బాధకాలు ఒక ముఖ్యకారణమని నేను అనుకుంటున్నాను. ఈ సదస్సులో దీన్నిగురించి క్షుణ్ణంగా చర్చ జరగాలని నేను కోరుకుంటున్నాను. □

# హిందీలో వెలువడ్డ కొన్ని తెలుగు రచనలు

ఆంధ్రదేశంలో హిందీ భాషాధ్యయానికి 1921లో బీజారోపణ జరిగింది. హిందీ భాషా, సాహిత్యాలపట్ల ఆసక్తిని, అభిరుచిని రేకెత్తించిన ప్రముఖ వ్యక్తుల్లో డాక్టర్ మోటూరి సత్యనారాయణ గారొకరు. ఈయన 1927 నుంచి దక్షిణ భారత హిందీ ప్రచార సభకు కార్యదర్శిగా వుంటూ దక్షిణాదిలో హిందీ భాషా, సాహిత్యాలవ్యాప్తికి ఎంతగానో తోడ్పడ్డారు. 'హిందీ ప్రచార్ సమాచార్' 'దక్షిణభారత' వంటి హిందీ పత్రికలకు సంపాదకుడుగా వుంటూ తెలుగు సంస్కృతి, భాషా సాహిత్యాలను గురించి అనేక వ్యాసాలు, గ్రంథాలు హిందీలో రాసి హిందీ వాళ్ళకు అందించిన ఖ్యాతికూడా ఈయనకే దక్కుతుంది.

ఆ తరువాత పేర్కొనదగిన ఆంధ్ర హిందీ రచయితల జాబితాలోకి డాక్టర్ ఏ. రమేశ్‌చౌదరి, ప్రొఫెసర్ జి.సుందర రెడ్డి, డాక్టర్ కర్ణ రాజశేషగిరిరావు. చలసాని సుబ్బారావు, వారణాసి రామమూర్తి రేణు, డాక్టర్ ఇలపావులూరి పాండురంగారావు, డాక్టర్ ఎమ్. టి. నరసింహాచారి, డాక్టర్ చావలి సూర్యనారాయణమూర్తి, వేమూరి అంజనేయశర్మ, డాక్టర్ భీమసేన్‌నిర్మల్, బాలశౌరిరెడ్డి, వేమూరిధా కృష్ణమూర్తి, డాక్టర్ పి. ఆదేశ్వరరావు, ఆలూరి బైరాగి చౌదరి, దోనేపూడి రాజారావు, అయాచితుల హనుమచ్ఛాస్త్రి, దండమూడి వెంకటకృష్ణారావు, ఎమ్. రంగయ్య, బి. సాయిలు మొదలైనవారిని పేర్కొనవచ్చు.

వీరిలోచాలామందితెలుగుసంస్కృతి, సాహిత్యాలను గురించి హిందీలో గ్రంధాలు రచించి పేరు ప్రఖ్యాతులు గడించి, ప్రభుత్వ బహుమతుల్ని అందుకున్నారు. కొందరు మౌలిక రచనలుచేసి ఔత్తరాహుల ప్రశంశలను అందుకుంటే, మరికొందరు అనువాదాలు చేసి అపారమైన ఖ్యాతిని ఆర్జించారు.

అనువాదల విషయానికొస్తే ఆధునిక తెలుగు సాహిత్యంలో కథ, నవల, నాటిక— ఈ మూడు ప్రక్రియలలో కొంత కృషి జరిగిందని చెప్పవచ్చు. హిందీలో వచ్చిన ప్రధమ తెలుగు కథా సంకలనం 1939లో వెలువడింది.' గల్ప సంసారమాల' అనే పరంపరలో ఏడవదిగా ఈ సంకలనాన్ని ప్రేమ్ చంద్ కుమారుడైన శ్రీపత్‌రాయ్ బెనారస్

దండమూడి మహీధర్

నుంచి వెలువరించాడు. ఈ సంకలనాన్ని ఎడిట్ చేసింది. శ్రీ ప్రజానందన్ శర్మ, ఈయన తెలుగు దేశంలో కొన్ని సంవత్సరాలు గడిపి, తెలుగు నుడికారాన్ని అర్థం చేసుకొని ఈ సంకలనంలోని ఆరు కథల్ని ఆయనే స్వయంగా అనువాదం చేశాడు. ఇది ఈ సంకలనం విశేషం. తక్కిన కథల్ని శ్రీ యలమంచిలి వెంకటేశ్వర రావు, శ్రీ వేమూరి ఆంజనేయశర్మ అనువదించారు. ఆనాడు మన తెలుగు కథకు ఇది నూటికి నూరుపాళ్ళు ప్రాతినిధ్యం వహించేదిగా వుందని నిస్సందేహంగా చెప్పవచ్చు.

ఈ కథా సంకలనంలోని కథా రచయితల పేర్లు: విశ్వనాథ, బొమ్మ బాపిరాజు, అడవి బాపిరాజు, మునిమాణిక్యం, మల్లాది రామకృష్ణశాస్త్రి, కరుణకుమార్, వెంపటి నాగభూషణం, ముద్దు కృష్ణ, చలం, పి. కె. రాఘవశాస్త్రి.

ఈ కథల అనువాదం ఎంతో బావుంది ఇంతమంచి అనువాదం ఈమధ్యకాలంలో నేషనల్ బుక్ ట్రస్ట్ వెలువరించిన 'తెలుగు కహానియాఁ' అనే కథల సంకలన అనువాదాన్ని తప్పించి మరొకటి రాలేదని చెప్పవచ్చు.

అనువాద కార్యక్రమాన్ని ఒక పద్ధతి ప్రకారం అమలుజరుపుతూ అనేక అనువాద గ్రంథాలను ప్రచురించిన ఖ్యాతి ఒక్క నేషనల్ బుక్ ట్రస్ట్ కే దక్కుతుంది. అనేక తెలుగు గ్రంథాలను నేషనల్ బుక్ ట్రస్ట్ ఇప్పటికే హిందీలోకి అనువదింప జేయించింది. ఇలా ప్రత్యేకంగా ఎన్నికచేసి హిందీలో అనువదింప జేసే గ్రంథాలన్నీ ప్రముఖ భారతీయ భాషలన్నింటిలోకి అనువాదమవుతున్నాయి. ఇలా అనువాదమైన గ్రంథాలలో ప్రముఖంగా చెప్పుకో తగినది— శ్రీ పురాణం సుబ్రహ్మణ్యశర్మ, శ్రీ వాకాటి పాండురంగారావు ఎడిట్ చేసిన 'తెలుగు కహానియాఁ'.

ఈనాటి మన తెలుగు కథా సాహిత్యానికి నూటికి నూరుపాళ్ళు ప్రాతినిధ్యం వహించే ఈ 'తెలుగు కహానియాఁ' లో 27 కథలున్నాయి. ఈ కథలను ఉభయ భాషల్లో అసమాన ప్రజ్ఞ ప్రాభవాలు కలిగిన డాక్టర్ ఇలపావులూరి పాండురంగారావు ఎంతో ప్రతిభావంతంగా హిందీలోకి అనువదించారు

ఈ సంకలనం మన తెలుగు కథ భారతదేశంలోని ఏ భాషా కథ సాహిత్యానికి తీసిపోదని రుజువు చేసింది.

ఈ సంకలనంలో చేర్చబడ్డ కొంతమంది కథకుల పేర్లు: గోపీచంద్, కుటుంబరావు, పద్మరాజు, చలం, బుచ్చిబాబు, తిలక్, పెద్దిభొట్ల, అవసరాల, కొమ్మూరి వేణుగోపాలరావు, ముళ్ళపూడి, మధురాంతకం, వీరాజీ, ఇస్మాయిల్, బీనాదేవి, బలివాడ, కాళీపట్నం, చాగంటి సోమయాజులు, ఆదివిష్ణు, నార్ల చిరంజీవి, బొమ్మిరెడ్డిపల్లి సూర్యారావు, శ్రీపతి, ఆచంట శారదాదేవి, అబ్బూరి ఛాయాదేవి, తురగా జానకీ రాణి, మాలతీ చందూర్.

హిందీ పత్రికలు, విమర్శకులు ఈ కథా సంకలనాన్ని ఎంతగానో ప్రశంసించారు. ఇటువంటి సంకలనాన్ని హిందీలో వెలువరించినందుకు నేషనల్ బుక్ ట్రస్ట్ ను ఎంతయినా అభినందించాలి.

ఇలాంటి కథా సంకలనాలు మరి కొన్ని హిందీలో రావలసిన అవసరం చాలా వుంది.

అయితే ఈ మధ్యకాలంలో మరి కొన్ని తెలుగు కథలు హిందీలోకి రావడం జరిగినా, అవి ఒక పద్ధతి ప్రకారం జరిగినట్లు కన్పించలేదు. కొన్ని సందర్భాల్లో ఏదో చేతికి తగిలిన కథలను అనువాదం చేసినట్లు కన్పిస్తుందికూడాను. కొందరు సరికొత్త రచయితల పేర్లను వీటిలో చేర్చి తెలుగు కథా సాహిత్యానికి ప్రాతినిధ్యం వహించే వారని చెప్పడం కొంచెం హాస్యాస్పదంగా కూడా అనిపిస్తుంది.

రాష్ట్ర భాషా ప్రచార సమితి, వార్ధా ప్రచురించిన 'తెలుగుకీ ఉత్కృష్ట కహానియాఁ' ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురించిన 'తెలుగుకీ బీస్ కహానియాఁ' హింద్ పాకెట్ బుక్స్ ప్రచురించిన 'తెలుగు కీ శ్రేష్ఠ కహానియాఁ' హిందీ ప్రచారసభ ఢిల్లీ శాఖ ప్రచురించిన 'తెలుగుకీ ప్రతినిధి కహానియాఁ' అనే సంకలనాలలో తెలుగు కథాసాహిత్యానికి ప్రాతినిధ్యం వహించే కథలను ఎన్నుకోవడం జరగలేదు. వీటిలో శ్రీ నార్ల వెంకటేశ్వరరావు, శ్రీ ఆరుద్ర, శ్రీ ఏ. ఆర్. కృష్ణ, శ్రీ కేతినేడి నరసింహారావు, శ్రీ రాజగోపాల్ మొదలైన వారిని ప్రఖ్యాత కథా రచయితలుగా హిందీ వారికి పరిచయం చేయడం హాస్యాస్పదంగా కన్పిస్తున్నది ఇక అనువాదంకూడా అంతంత మాత్రంగానే వుంది.

వీటి అనువాదకర్త శ్రీ బాలశౌరిరెడ్డి. శ్రీయుతులురాచకొండ విశ్వనాథశాస్త్రి బీనాదేవి, ముళ్ళపూడి,పురాణం, వాకాటి, తిలక్, మంజుశ్రీ, వాసిరెడ్డి సీతాదేవి, తురగా జానకీరాణి, ఇచ్ఛాపురపు జగన్నాథరావు, తాళ్ళూరి నాగేశ్వరరావు, సత్యం శంకరమంచి, గొల్లపూడి మారుతీరావు, నవీన్, చలసాని ప్రసాదరావు, ఇస్మాయిల్, హితశ్రీ, నార్ల చిరంజీవి – మొదలైన వారి కథలతో 'ఆజ్ కి తెలుగు కహానియాఁ' అనే పేరున మరొక కథల సంకలనం హిందీలో రాబోతున్నది. దీని అనువాదకర్త ఈ పంక్తుల రచయితే। 'యూకలిప్టస్ కీ ఊంచీడాలోఁకే బీచ్ ఆధాచాంద్' అనే పేరుతో మరొక కథా సంకలనంకూడాఅచ్చులోవుంది. ఇందులో రచయిత తెలుగులో రాసిన 7కథల్ని తానే హిందీలోకిఅనువదించుకోవడం జరిగింది. దీని కర్త కూడా ఈ పంక్తుల రచయితే।

ఇకపోతే నవలల విషయం:

ఇటీవల హిందీలో అనువాదమైన తెలుగు నవలలలో ముఖ్యంగా పేర్కొనదగినవి, శ్రీమతి ముప్పాళ్ళ రంగనాయకమ్మ 'పేక మేడలు' శ్రీ కొమ్మూరి వేణుగోపాలరావు 'హౌస్‌సర్జన్' శ్రీ బలివాడ కాంతారావు 'ఇదే నరకం ఇదే స్వర్గం'

'పేక మేడలు' 'తాష్‌కీ మహల్' అనే పేరుతోను, 'ఇదే స్వర్గం ఇదే నరకం' నవలను 'గిరా అనయన్ బినుపానీ' అనే పేరుతో శ్రీ ఇలపావులూరి పాండురంగారావుగారు అనువదించారు.

'హౌస్‌సర్జన్' నవలను శ్రీ వేమూరి ఆంజనేయశర్మగారు అనువదించారు.

ఈ అనువాదాలు ఎంతో అద్భుతంగా వున్నాయి. హిందీ భాషలోని నుడి కారాన్ని, భాషా సంప్రదాయాన్ని కూలంకషంగా అవగాహన చేసుకొని అనువాదం చేయడం జరిగింది.

అయితే సాహిత్య అకాడమీ చేయించిన అనువాదాల విషయంలో ఇలా చెప్పడానికి వీల్లేదు. మన ప్రాచీన సంస్కృతి, పురాతన సంప్రదాయాలు గొప్పవని చాటే నవలలను మాత్రమే ఎందుకొని అనువదింప చేయడానికి పూనుకున్నారు. అందుకే హిందీలో వెలువడిన 'రుద్రమదేవి' 'నారాయణ భట్టు' 'నారాయణరావు' అంతగా ప్రసిద్ధి కెక్కలేదు. పై పెచ్చు 'రుద్రమదేవి' నవలను అసంపూర్ణంగా అనువదించడం జరిగింది. ద్వితీయ ముద్రణలో మిగిలిపోయిన చివరి పేజీలు శోధించడం జరుగుతుందని అకాడమీ కార్యదర్శి కథనం!

అయితే అకాడమీ ప్రచురించిన 'నారాయణరావు'ను హిందీలో చదువుతూంటే ఎంతో హాయిగా అనిపిస్తుంది దీనికి కారణం: శ్రీ ఆరిగపూడి రమేశ్‌చౌదరి హిందీలో చేయి తిరిగిన రచయిత కావడమేనని చెప్పాలి.

'రుద్రమదేవి'ని అనువాదం చేసిన శ్రీ బాలశౌరిరెడ్డిగారే శ్రీ రాచకొండ విశ్వనాథశాస్త్రి 'అల్పజీవి'ని హిందీలోకి అనువదించారు. ఈ అనువాదంకూడా అంతంత మాత్రంగానే వుంది!

1935లో తెలుగులో ప్రచురించబడిన 'వేయి పడగలు' నవలను 'సహస్రఫణ్' అనే పేరుతో శ్రీ పి. వి. నరసింహారావు గారు హిందీలోకి అనువదించారు. దీనిని భారతీయ జ్ఞానపీఠ్ ప్రచురించింది. అనువాదం బావుంది.

కుమారి వాసిరెడ్డి సీతాదేవి గారి 'సమత' నవలను సాహిత్య అకాడమీ హిందీలో అనువదింపజేసి ప్రచురించాలని సంకల్పించుకొని అకస్మాత్తుగా ఆ ప్రయత్నాన్ని విరమించుకోవడం జరిగింది. కారణం తెలీదు. అయితే ఈ పంక్తుల రచయిత 'సమత' అనువాదాన్ని పూర్తిచేశాడు. త్వరలో అలహాబాదునుంచి వెలువడ బోతున్నది కూడాను. ప్రచురణకు సిద్ధంగా వున్న మరొక నవల శ్రీ దాశరధి రంగాచార్య రచించిన 'చిల్లరదేవుళ్ళు' దీన్ని అనువదించిన వారు: డాక్టర్ భీమ్‌సేన్ నిర్మల్!

శ్రీ వ్రజానందన్‌శర్మ విశ్వనాథ కవిరాజు రచించిన 'దొంగాటకం' ముద్దుకృష్ణ రచించిన 'అనార్కలి' 'అశోకవనం' మొదలైన తెలుగు నాటికలను హిందీలోకి అనువదించి పుస్తక రూపంలో వెలువరించారు. శ్రీ యేలమంచిలి వెంకటేశ్వరరావు; శ్రీ వేమూరి ఆంజనేయశర్మ ఎన్నో తెలుగు నాటికల్ని హిందీలోకి అనువదించారు. ఆత్రేయ 'ఈనాడు' నాటకాన్ని శ్రీ ఆంజనేయశర్మ హిందీలోకి అనువదించగా దాన్ని హిందీలో అనేకమార్లు ప్రదర్శించడంకూడా జరిగింది.

నేషనల్ బుక్ ట్రస్ట్ 'తెలుగుఏకాంకి' అనే పేరుతో ఎనిమిది తెలుగు నాటికలను హిందీలోకి అనువదింపజేసి ప్రచురించింది మన తెలుగు దేశంలో నాటికలకు అంత ప్రచారం వున్నట్లు కనిపించదు. ... లేదేమోననిపిస్తుంది. ఏ ఇతరభాషలోనూ

ఇంతటి వైవిధ్యం సంతరించుకున్న ప్రక్రియ మనకు కన్పించదు.

పోతే ఈ పంక్తుల రచయిత అనువాదం చేసిన ఈ 'తెలుగు ఏకాంకి' అనే నాటికల సంపుటిలో కొట్టవచ్చినట్టు కన్పించే విశేషం ఏమిటంటే — యువతరం మన ముందుకు వచ్చి నిలుస్తుంది. ఇందులో శ్రీ అంగర సూర్యారావు రచించిన 'ఒక గంట సంసారం' 'ఏక్ ఘంటేకీ గృహస్థీ' అనే పేరుతోను, శ్రీ గొల్లపూడి మారుతీరావు కళ్ళు 'ఆంఖేఁ' అనే పేరుతోను శ్రీ ఆదివిష్ణు 'చూపుచూపు నీడలు' 'దేఖ్ దేఖ్ పర్ ఛాయియాన్' అని, శ్రీ గణేశ్‌పాత్రో 'పావలా' 'చవన్నీ' అని శ్రీ సుంకర సత్యనారాయణ 'పిచ్చివాడు' 'పగలా' అని శ్రీ ఎన్. ఆర్. నంది పుణ్యస్థలి 'పుణ్యస్థల్' అని, శ్రీ అత్తిలి కృష్ణారావు 'యుగసంధి' 'యుగసంధ్య' అనే పేరుతోను, అనువాదమైనాయి.

మన రేడియో నాటిక ఎలా వుంటుందో ఇతర ప్రాంతీయులకు పరిచయం చేసే ఉద్దేశంతో శ్రీ గోరా శాస్త్రి రచించిన 'శ్రావణ సుందరి'ని ఇందులో చేర్చడం జరిగింది.

ఈ నాటికల సంకలనం 'తెలుగు ఏకాంకి'కి ఇటీవలే కేంద్రప్రభుత్వ బహుమతి లభించింది.

ఇక రేడియోద్వారా అఖిల నాటక కార్యక్రమాలలో శ్రీ బుచ్చిబాబు రాసిన 'ఆత్మవంచన' శ్రీ సి. నారాయణరెడ్డి 'రామప్ప' శ్రీ రావూరు వెంకట సత్యనారాయణరావు రచించిన 'నెలవంక' మొదలైన నాటకాలెన్నో హిందీ, తదితర భాషల్లోకి అనువాదమై ప్రసారమయ్యాయి.

ఇలా ఆధునిక తెలుగుసాహిత్యంలోని ముఖ్య శాఖలైన — కథ, నవల, నాటిక— ఈ మూడూ హిందీలోకి అనువాదమై అనేకుల ప్రశంసలను అందుకున్నాయి. □

---

ప్రజా సాహిత్యం అంటే ప్రజలను గుర్తించేది. వారికి ఋంచినిచేది, వారికి అవసరమయ్యేది—అర్థమయ్యేది కూడా. వర్గ స్వభావాన్ని తెలుసుకోకుండా చేసే రచనలు అర్థమయినప్పటికీ కూడా ప్రజా సాహిత్యం కానేరవు. సాహిత్యానికి, రాజకీయాంకి వుండే సంబంధాన్ని తెలుసుకోలేకపోతే రచయిత శక్తి సమాజానికి ఉపయోగపడకుండా తోమిన చెంబుల్లాంటి కళాఖండాలను సృష్టిస్తూ పోతుంది.

—పురాణం సుబ్రమణ్యశర్మ

---

# అకాడెమీ బహుమతులు

## వసంతరావు దేశ్‌పాండే

సమాజానికి ఉపయోగకరమైన ఉత్తమ రచనల్ని గుర్తించి, ప్రోత్సహించి, సాహిత్యాభివృద్ధికి దోహదం చేసే పవిత్ర కర్తవ్యం సాహిత్య అకాడమీ సంస్థది. అకాడమీ నిన్న మొన్నటిదాకా ఈ గురుతర బాధ్యతని సక్రమంగానే నెరవేరుస్తూ వొచ్చింది. అయితే, యిటీవల — ముఖ్యంగా గత దశాబ్ద కాలంగా అకాడమీ అవార్డులిచ్చిన కొన్ని పుస్తకాలను పరిశీలిస్తే — అది దారి తప్పుతూందేమో ననిపిస్తున్నది.

అకాడమీ నిర్వాహకుల విజ్ఞతనూ — విషయజ్ఞతనూ శంకించాల్సిన అవసరం లేదుగానీ, అది నవలల్ని ఎంపిక చేసుకోవడంలో అనుసరిస్తూన్న విధానంలోని నిర్దుష్టతను మాత్రం శంకించక తప్పదు.

ఈ నా ఆరోపణలోని ఔచిత్యాన్ని పరిశీలించేందుకు, గతంలో అకాడమీ బహుమతి పొందిన చివరి పది నవలల్నీ, వాటిలోని గుణ—దోషాల్నీ; ఉత్తమ సాహిత్యంగా నిలువడానికి వాటికి గల యోగ్యతా యోగ్యతల్నీ క్లుప్తంగా పరిశీలిద్దాం.

ఈ నవలలు 1967—68 నుండి 1979—80 సంవత్సరాల మధ్యకాలంలో వరుసగా సాహిత్య అకాడెమీ బహుమతులు పొందినవి. వాటి కర్తలందరూ లబ్ద ప్రతిష్ఠులే.

నవల : "**తార**"

రచయిత: *శ్రీ కొడవగంటి కుటుంబరావు*

ఈ నవలకు 1967—68వ సంవత్సరపు ఉత్తమ నవల అవార్డు యిచ్చింది అకాడమీ. ఈ విషయంలో నేను చెప్పాల్సిందేమీ లేకపోయినా, చెప్పాల్సిన బాధ్యతని తీసుకున్నాను గనుక, నేనుగా ఏమీ చెప్పకుండా, తన నవలకు అవార్డువచ్చిన సందర్భంగా రచయిత చెప్పుకొన్న వాక్యాల్లో కొన్నింటిని ఇక్కడ పొందుపరుస్తాను.

"నాన్న! ఎవడురా నీకు నాన్న? నేను నీకు నాన్ననూ కాను; నువ్వు నా కొడుకువీ కావు"— అని తండ్రిచేత ఇంటి నుండి తరిమివేయబడిన హీరో చిట్టచివరకు తండ్రికి కీర్తి తెచ్చినట్టుగా, ఈ నవల నన్ను ఆంధ్రప్రదేశ సాహిత్య ఎకాడమీవారి ఆదరణకు పాత్రుణ్ణి చేసి, నన్ను తెలుగు నవలాకారుల లిస్టులోంచి తీసేసే హక్కు ఎవరికీ లేకుండా చేసింది.... ఇంతకంటే బాగా రాశాననుకున్న నవలలు ఏవీ ఈ పని చేయలేకపోయాయి."

"సాహిత్య అకాడమీవారి బహూకృతి పొందుతున్నందుకు నన్ను అభినం

దిస్తూ ఉత్తరాలు రాసిన (ఉజ్జాయింపుగా) 32 మందిలో ఒక్కరుకూడా "తార"ను చదివి ఉండలేదనే రాశారు. అందులో 30 మందికి నేను అటువంటి నవల రాసినట్టుకూడా తెలీదుట! మరెవరో రాసిన నవలకు పొరపాటున బహుమతి నాకు లభిస్తున్నదేమోనని సంశయిస్తున్నవారు కూడా లేకపోలేదు"

"దీనిని బట్టి; ఎంత మారుమూల చీకటి కోణాలలో నక్కినా, "ప్రతిభ"ను వెలికితీసే "సత్తా" ఆంధ్రప్రదేశసాహిత్య ఎకాడమీవారికి ఉన్నదని గట్టిగా రుజువవుతున్నది! అంతా "వాడి లీల!" (చూడుడు:– "తార" రెండవ ముద్రణకు రచయిత "ప్రస్తావన")

బహుమతి గ్రహీత స్వయంగా రాసుకున్న ఈ వాక్యాలు చాలు, సాహిత్య అకాడమీవారి "సత్తా"ని ప్రకటించేందుకు ఇక నేను చెప్పేందు కేం మిగిలివుంది గనుక?"

నవల : "కొల్లాయి గట్టితే నేమి?"
రచయిత: శ్రీమహీధర రామ
మోహనరావు.

దీనికి 1968–69లో అవార్డొచ్చింది.

స్వాతంత్ర్యోద్యమ కాలంవంటి యుగసంధి కాలంలో ఆనాటి వివిధ వర్గాల ప్రజల జీవన విధానాలనూ, సాంఘిక, రాజకీయ, ఆర్థిక పరిస్థితులనూ, స్వాతంత్ర్యోద్యమం ఆయాపరిస్థితుల మీదచూపిన ప్రభావాన్నీ, సమర్థవంతంగా చిత్రించిన చారిత్రక నవల.

ఇందులో రచయిత ముఖ్యంగా చెప్ప దలచుకున్నది–ఫ్యూడల్– బూర్జువాభావాల మధ్య చారిత్రక సంఘటనలు సృష్టించే ఘర్షణ: తత్కాల పరిస్థితులపైనే గాక, భావి చరిత్రపైనా ఆ ఘర్షణల ప్రభావం:

ఫ్యూడల్ వ్యవస్థకు బ్రాహ్మణ అగ్రహారం (కథా స్థలం) "ముంగండ" ప్రతినిధి. బూర్జువా భావాలకు, యువకుడూ, విద్యావంతుడూ, సమాజ స్థితిగతులపట్ల అవగాహన వున్నవాడూ – అయిన రామనాధం ప్రతినిధి.

జైలుకు వెళ్ళివచ్చిన రామనాధాన్ని ప్రాయశ్చిత్తం చేసుకోలేదని తలిదండ్రులు యింట్లోకి రానివ్వకపోవడమూ, అతను ముట్టుకున్న బిందె–చేదా మైలపడతాయని కంసాలి వీరయ్యా,పడవసరంగూ అభ్యంతర పెట్టడమూ కరడుగట్టిన మూఢాచారాలకు ఉదాహరణ. మొదట శుభ్రతకూ.... క్రమంగా పరమపద ప్రాప్తికీ మూలాలుగా పుట్టిపెరిగిన ఆచారాలు ఎంతగా వెర్రితలలు వేశాయో శివకామయ్య తల్లి ప్రవర్తన ద్వారా సూచిస్తారు రచయిత. ఆమె ఆచారపరాయణత్వం "పరమపద ప్రాప్తి" అనే పరమార్థాన్ని కూడా దాటిపోయింది. "పరలోకం అంటూ ఉందోలేదో! ఎవరు చూడొచ్చారు? దాన్ని నమ్ముకుని అనాచారపు బ్రతుకు గడపమంటావా?" అంటుందామె. మరి ఆ ఆచారాలకు పరమార్థం ఏమిటో!

రచయిత మరో లక్ష్యం, వ్యక్తుల ప్రవర్తనల్లోని అంతర్వైరుధ్యాల్ని విపులీకరించడం.

గాంధీగారి ప్రబోధాల మీద ఎంతో విశ్వాసంగల అబ్బాయి నాయుడు, రామనాధం కాలేజీ వదలి ఖద్దరు కట్టడాన్ని అభినందిస్తూనే, కూతుర్ని మాత్రం

కాలేజీకి పంపాలని తాపత్రయ పడతాడు. అట్లే, కాంగ్రెస్ సమావేశాల పేరిట ఆస్తినంతా తగలేసుకున్న విశ్వనాథం కూడా, తన కొడుకు మాత్రం కాలేజీ వొదిలి రావొద్దనుకుంటాడు.

రామనాథం మరో సహాధ్యాయి మంగ రాజు. అతడి తండ్రి సూపరింటెండింగ్ ఇంజనీరు. రామనాథంతో పాటుగా కాలేజీ వొదిలి ఖద్దరు కట్టుకుని వచ్చిన కొడుకును మర్నాడే లాక్కెళ్ళి కాలేజీలో చేర్పించిన యింజనీరుగారు, గాంధీగారి ప్రయాణానికి గాను ప్రభుత్వానికీ— చూసేవాళ్ళకూ అర్థం కాకుండా సౌకర్యాల్ని కల్పిస్తాడు. వీళ్ళందరూ ఒకవేపు వ్యక్తి ప్రయోజనాన్ని సామాజిక ప్రయోజనం నుండి విడదీసి తమ పబ్బం గడుపుకొంటూనే, మరోవేపు సామాజిక ప్రయోజనానికి పాటుబడేవాళ్ళు.

మరోరకం అంతర్వైరుధ్య ప్రవర్తన రామనాథం పెంపుడు తండ్రి విశ్వనాథం, యింకా కొందరు ముంగండ బ్రాహ్మణోత్తములది జైలుకు వెళ్ళి వచ్చిన కారణంగా రామనాథాన్ని వెలివేసిన యీ పండితులు, కాశీనాథుని నాగేశ్వర రావుగారు రాగానే వార్ని తమ యిళ్ళ కాహ్వానిస్తారు. పూమాలలు వేసి హారతులిస్తారు. నాగేశ్వరరావుగారితోపాటు రామనాథాన్ని సరసన కూర్చుండబెట్టుకొని పంక్తి భోజనం చేస్తారు. గాంధీనీ— ఆయన ఉద్యమాన్నీ నిరసించే శంకర శాస్త్రి, గీతా శ్లోకాన్ని తాటాకు మీద రాసి భక్తిగా గాంధీగారికి సమర్పించి "ఒక్కొక్క జాతకం...." అంటూ అదృశ్య శక్తికి నమస్కరిస్తాడు.

గాంధీగారి సిద్ధాంతాల్ని వ్యతిరేకించే సుబ్బావధాన్లు; గాంధీ నిధిలో తన వొంతు పావలా కూడా చేర్చాలని ఎన్నో తంటాలు పడతాడు. నవలలో ఈ ద్వంద్వ ప్రవృత్తి అసహజంగా తోచదు. ఆ ప్రవర్తన వెనుక హేతువుకందని కారణమేదో తోస్తూనే వుంటుంది పాఠకుడికి.

అయితే, రామనాథం పాత్ర మాత్రం ఎంతకూ కాలేజీ కుర్రాడి స్థాయిని మించి ఎదిగినట్లు స్ఫురించదు పాఠకుడికి. ఎంతసేపూ అతనొక అర్భకుడిగానే కనిపిస్తాడు. అతడిని తనదైన వో ప్రత్యేక వ్యక్తిత్వం మీద స్థిరంగా వుండనివ్వక, సంఘటనల గాలి వాలులో కొట్టుకుపోయేలా చిత్రించడమే ఇందు క్కారణం కావొచ్చు.

మొత్తం మీద పుస్తకం తెరిచింది మొదలు, పాఠకుణ్ణి ఏకబిగిన చివరంటా లాక్కుపోయే శక్తి ఈ నవలకు వుంది. శైలిలో పటుత్వమూ, శిల్పంలో సంక్షిప్తతా, వస్తువులో సహజత్వమూ— ముఖ్యంగా అవసరానికి సరిపడ్డంత నిడివి మాత్రమే ఉన్న ప్రకరణాలూ ఇందుక్కారణాలు.

ఈ నవలకు అవార్డునిచ్చి, అకాడమీ తనకు తానే సన్మానం చేసుకొందనవచ్చు.

నవల : "మైనా"

రచయిత : శ్రీ శీలా వీర్రాజు

1969-70 సంవత్సరంలో ఉత్తమ నవలగా అకాడమీ ఎంపిక చేసిన నవల యిది.

సాయిబాబా అనబడే వొక దిగువ మధ్యతరగతికి చెందిన వ్యక్తి జీవితాన్ని యించుమించుగా ఆద్యంతమూ చిత్రించిన నవల. అతడి నిత్యజీవితంలోని కార్యక్రమాలు మొదలు, అలవాట్లు, హాబీలు, ఆధిక్యతలూ – బలహీనతలూ – విజయాలూ – ఇవన్నీ ఆ జీవిత గమనం మీద చూపిన ప్రభావాలూ, సమగ్రంగా, సమర్థవంతంగా, అతి సహజంగా చిత్రించబడ్డాయి. సభ్య ప్రపంచం, అసభ్యాలుగా భావించే విషయాలు కూడా – ఆ సభ్య ప్రపంచమే ఆమోదించేట్లుగా చెప్పగలగడం ఈ నవలలో రచయిత చూపించిన ప్రత్యేకత.

అంతేగాక, యితివృత్తాన్ని ఎన్నుకోవడంలోనూ, శిల్పంలోనూ, శైలిలోనూ నూతనత్వం నిండి వున్నది. "తెలుగులో నీరసమైన బ్రతుకులే తప్ప, ప్రపంచ వ్యాప్తమైన యితివృత్తంగల జీవితాలే లేవు" – అనే వారికి సాయిబాబా జీవితం వొక సమాధానం" అన్న రచయిత మాట ఒప్పుకుని తీరాల్సిందే. అతి సామాన్యమైన ఒక వ్యక్తి జీవితాన్ని ఇతివృత్తంగా స్వీకరించి అతని అవస్థల్నీ, అనుభవాల్నీ, అనుభూతుల్నీ, సహజంగా – కథకు అవసరమైన మేరకు, అవసరమైన శైలిలో చిత్రించి పాఠకుణ్ణి ఒప్పించగలగడం నిజంగా వో యజ్ఞమే. అందులో వీర్రాజుగారు కృతకృత్యులయ్యారనే చెప్పవచ్చు.

అయితే అక్కడక్కడా అతి దీర్ఘమైన వాక్యాలూ, అన్వయ కారిన్యతా పాఠకుడిని కొంచెం యిబ్బంది పెడతాయి. ఒకోచోట చిత్రకళా పరిభాషగూడా దాన్ని గూర్చి తెలియని పాఠకుల్ని అవస్థ పెడుతోంది.

మొత్తంమీద ఆద్యంతమూ నూతనత్వం కనిపించే ఈ నవలకు అవార్డు నివ్వడంలో అకాడమీ ప్రదర్శించిన విజ్ఞతని అభినందించవలసిందే.

నవల : "చిల్లర దేవుళ్ళు"

రచయిత: *శ్రీ దాశరథి రంగాచార్య*

1970–71 లో అవార్డు పొందిన రచన యిది.

నిజాం పరిపాలనాకాలం (1940ల లో తెలంగాణా ప్రాంతంలో నెలకొని వుండిన సాంఘిక పరిస్థితుల్ని విడమర్చి చెప్పే నవల. ఆ కాలంలో ప్రజల తలరాతలకు కర్తృత్వం వహిస్తూండిన దొరలు; అధికారులే యిందులోని చిల్లర దేవుళ్ళు. తమ అధికార ప్రాభవాన్ని నిలబెట్టుకొనే తపనలో వారి కుతంత్రాలు; నిస్సహాయులైన నిరుపేదల పట్లా, స్త్రీల పట్లా, వారి అమానుష ప్రవర్తన, మత విద్వేష శక్తుల విజృంభణ, సామాన్యుల జీవనం మీద వాటి ప్రభావము; అప్పటి న్యాయస్థానాల తీరు తెన్నులు, ఆంధ్రోద్యమము; మొదలైన విషయాలు సమగ్రంగా చిత్రించబడ్డాయి.

ఎన్నుకొన్న యితివృత్తమూ, ఉపయోగించిన భాషా సంఘటనల వ్యక్తీకరణలో క్లుప్తతా, పాత్రల గుణాగుణాల చిత్రీకరణలో సంయమనమూ, ప్రశంసనీయం.

నాటి పరిస్థితులకు అన్ని కోణాల నుండి దర్పణం పట్టిన యీ నవల,

"మాలపల్లి". "కొల్లాయి గట్టితేనేమి ?" వంటి అత్యుత్తమ నవలల శ్రేణిలో చేర్చదగినది. ముఖ్యంగా, ఖిలాఫత్, ఆంధ్రోద్యమము, స్వాతంత్ర్యోద్యమము వంటి ఉద్యమాల్ని, పోరాటాల్ని వస్తువులుగా గలిగిన నవలలు మనకు చాలా స్వల్పంగా వున్నాయి. చారిత్రక సంఘటనలకు సాక్షీభూతంగా నిలువదగిన యిలాంటి నవలలు ఇంకా విశేషంగా రావలసివుంది. ఇలాంటి నవలలకు అవార్డుల నివ్వడంలో అకాడమీ ఎంతో ఉచితంగా వ్యవహరించింది.

నవల . "సంసార వృక్షం"
రచన : శ్రీ ఆర్.యస్. సుదర్శనం

1976-77 లో అకాడమీ అవార్డు లభించిన నవల ఇది.

"జగం మిధ్య-పలాయనం మిధ్య" అని ముందటి అట్టమీదా – "హేతువాదంలో పూర్వ సంస్కారాలు ఛేదించి, సమదర్శిత్వం అలవర్చుకోవడానికి, ఒక మేధోప జీవి చేసిన సాధనను, చిత్రిస్తూ ఆధునిక భావాలకూ, మన సంస్కృతిలోని మూలతత్వాలకూ యీ నవల వంతెన నిర్మించ బూనిం"దని వెనుక అట్టమీదా వ్రాసి వుంది. అంతేగాక, "ఒక వ్యక్తి జీవితం, అతని మనస్సు యొక్క ప్రతిబింబమే" అని కూడా వ్రాసివుంది. ఇది ఎంతవరకు నిజమో ___ ఆ సంగతి వివరించడలో రచయిత ఎంతవరకు సఫలురయ్యారో ___ తెలుసుకోవాలంటే నవంబర్-78 అభ్యుదయలో శ్రీ వల్లంపాటి వెంకట సుబ్బయ్యగారి వ్యాసం చూడండి.

నేను చెప్పగలిగిందల్లా, "యిలాంటి నవల, సుదర్శనంగారి వంటి లబ్ధ ప్రతిష్ఠులుగాక, అనామకుడెవరైనా వ్రాసివుంటే, ఖర్చులు ఎదురిచ్చినా అచ్చువేసేందుకు ఏ పబ్లిషరూ సిద్ధపడేవాడు కాద"ని మాత్రమే.

నవల: 'సమత' (71-72)
రచయిత: వాసిరెడ్డి సీతాదేవి

సమతలోని నాయిక అరుంధతి అపురూప సౌందర్యవతి. ఆ అందంతోనే ఆమె విప్లవకారుడు రాజారావు మనసు చెదరగొట్టి అతడిలోని నీతిని చంపి స్వార్థపరుడిగా,పిరికివాడుగామారుస్తుంది. విప్లవకారుడయిన రాజారావు వ్యక్తిత్వం అతడి ఆదర్శాలు, వీరత్వంతో అరుంధతి ముగ్ధురాలౌతుంది. ఇద్దరు ఒకరిపై ఒకరికి గల ప్రేమ, ఆకర్షణ, లైంగికాసక్తి కారణంగా వారివారి ధర్మాలను త్యజించి ఒకటవుతారు. భర్తను, బిడ్డను వదిలి రాజారావును చేరిన అరుంధతి అతడి ఉంపుడుకత్తెగా వెలుగుతుంది. రాజారావు విప్లవానికి నీళ్ళు వదిలి అధికార పార్టీలో చేరి డబ్బు-హోదా,పేరు-ప్రతిష్టలతో వెలుగుతుంటాడు.

ఇల్లు, భర్త-బిడ్డలు వదిలి తాను ఏం పొందింది, ఎంత సుఖపడింది తెలుసుకుంటుంది అరుంధతి. కాని అప్పటికి చాలా ఏండ్లు గడిచిపోతాయి. లేచిపోయిన దాని బిడ్డగా ముద్రపడి అరుంధతి బిడ్డ మాధవి పెళ్ళికాకుండా (ప్రేమలో మోసగించబడి) బిడ్డకు తల్లై ఆత్మహత్య చేసుకుంటుంది. అంతటా ఓడిపోయిన అరుంధతి శేష జీవితం తన మనమరాలు

'సమత'తో గడపాలనుకుని గుంటూరు ఆసుపత్రికి వెళ్ళి అక్కడ ఆ సుపత్రి సిబ్బందికి, పోలీసులకు జరుగుతున్న ఘర్షణలో పాల్గొని దిక్కులేని చావు చస్తుంది.

కాపురాన్ని, ఇంటిని వదిలిన స్త్రీకి సమాజం యిచ్చే గౌరవం ఎటువంటిదో చెప్తుంది ఈ నవల. 'సమత' పేరులోనే ఉండిపోయింది. ఎలా సాధించాలో చెప్ప గలిగితే బాగుండేది.

రచయిత్రి వ్రాసిన అడవి మల్లె, తిరస్కృతి యింతకన్నా బాగుంటాయి.

నవల : నల్లరేగడి (73-74)
రచన : పాలగుమ్మి పద్మరాజు

పల్లీయుల రాగద్వేషాలకు రూప కల్పన నల్లరేగడి. ఇద్దరు భూస్వాములు ఒక పల్లెలో సఖ్యంగా ఉండలేరని, వారి స్వాభిమానాలు, అహంకారాలు ఊరిని రెండుగా చీలుస్తాయని, వారి మధ్య గల తగాదాలు, రక్తపాతానికి, హత్యలకు ఎలా దారితీస్తాయో చెప్పే నవల ఇది.

నవల మామూలుగా ఉంది. నవలలో పల్లెటూరి వాతావరణం, తెలుగుతనం చక్కగా పోషింపబడ్డాయి. కాని రచయిత సినిమా లోకంలో ఉండడంతో అక్కడక్కడ సినిమా వాసన కొడుతుంది. ఈ నవలే ఆ మధ్య (మా ఊరి కథ) సినిమాగా కూడ వచ్చినట్లుంది.

నవల : పుణ్యభూమి (72-73)
రచన : బలివాడ కాంతారావు.

నవల దొరకనందున పరిశీలన చేయ డానికి వీలులేకపోయింది.

నవల : "ఊబిలో దున్న"
రచయిత : శ్రీ వినుకొండ నాగరాజు

1976-77 సం॥లో ఈ నవల కవార్డు వచ్చింది. రచయిత దాన్ని తిరస్కరించారు. ఓ దున్నపోతు మొలబంటి ఊబిలో దిగబడిపోయిం దెలాగో. రాఘవయ్య చూస్తాడు దాన్ని. బి. ఏ ప్యాసై ఉద్యోగార్థం పడరానిపాట్లు పడి, జ్ఞానోదయం పొందిన వాడై జనోద్ధరణకు కంకణం కట్టుకుని, సహకార వ్యవసాయం ప్రారంభించి, పలుకుబడితోపాటు పంచాయితీ సమితి ప్రెసిడెంటు గిరీని కూడా సంపాదించిన వాడు రాఘవయ్య. ప్రాక్టికల్ మనిషిగూడా. "చచ్చి చెడి, చాయంగల విన్నపాలై"-ప్రొద్దుగూకులూ తంటాలు పడి, చివరికెలాగైతేనేం, వూబిలోంచి బయటకు లాగుతాడు దున్నపోతును. ఇదీ కథ.

"గూఢార్థ స్ఫురణల సాంకేతిక నవల" అని వ్రాసుకున్నారు అట్టమీద. దున్నపోతు సామాన్య ప్రజానీకానికీ, ఊబి ప్రస్తుత వ్యవస్థకూ, దాన్ని పైకి లాగిన రాఘవయ్య ప్రయత్నం దేశీయుల కర్తవ్యానికీ ప్రతీకలు. అయితే ఈ మాట రాఘవయ్య స్వగతం రూపంలో పలుసార్లు వాచ్యమయింది గనుక, ఆ గూఢార్థం గాలికే ఎగిరిపోయింది. ఇక "చైతన్య స్రవంతి"ని అనుకరించడానికి చేసిన విఫలయత్నమో — లేక సహకార వ్యవసాయ పదతో—యీ రెంటిలో ఏది సాంకేతికమో కూడా వాచ్యం చేసే సరిపోయేది రచయిత.

"ఇది ప్రేమ కథకా"దన్నారు రచయిత. నిజమే. కానీ, "ఈ నవలను

నేను మరింత ప్రయోజనం కోసం వ్రాశానని విమర్శకులు అనకా మానరూ-నేను చొప్పకోకా తప్పదు" అనడంలో, నిజాయితీ-ఆత్మవిశ్వాసాలకన్నా అతిశయమూ స్వోత్కర్షల పాళే అధికంగా వుంది. "ముందు మాట" చదవడంతో సరిపెట్టుకుని సమీక్షలు వ్రాసే యే కొందరో తప్ప, నవలని ఆ మూలాగ్రం చదివిన వారెవ్వరూ యీ వాక్యాల్ని నిజాలని నమ్మరు. ఇక కథని నడిపించిన తీరు లోనూ సంఘటనలోనూ పొరపాట్లు చాలానే వున్నాయి. అవన్నీ స్థలాభావ కారణంగా యిక్కడ వ్రాయడం సాధ్యం కాదు గనుక, మరో ప్రత్యేక వ్యాసంలో చర్చిద్దాం.

ఇక రాఘవులు పాత్రనూ, అతడి వ్యక్తిత్వాన్నీ మలవడానికి రచయిత పడ్డ శ్రమ అభినందనీయమే.

నవల : "కీర్తి కిరీటాలు" (77-78 అవార్డు)
రచయిత్రి : శ్రీమతి యద్దనపూడి సులోచనారాణి

దీన్ని గూర్చి చెప్పేందుకేం లేకపోయినా- చెప్పాలి గనుక తప్పదు. ఇదో అసలు సిసలయిన చచ్చు తెలుగు సినిమా కథ. సినిమాక్కావలసిన సమస్త హంగులూ యిందులో సమృద్ధిగా వున్నాయి. కానీ, ఇవి ఎవరి కీర్తికి ఎలాంటి కిరీటాలో ఆ వివరాలు మాత్రం లేవు.

అసలు రచయిత్రి దీన్ని సినిమా కోసమే ప్రత్యేకంగా రాశారు. అందుకే శ్రీ అక్కినేనికి అంకితం గూడా ఇచ్చి వేయగా- ఉద్దేశ్యాన్ని అర్థం చేసుకున్న అక్కినేని, అర్జంటుగా దాన్ని సినిమాగా తీసున్నానని డిక్లేర్ చేసేశారు. ఈ తతంగమంతా తెలిసిన అకాడమీ వారు, అందులో ఏదో మహత్యం వుండే వుంటుందని అపార్థం చేసుకున్న వారై- నవలకో అవార్డుని కిరీటంగా పెట్టేసి తమ వొంతు కర్తవ్యాన్ని పూర్తి చేసుకున్నారు. (ఈ నవలను గూర్చిన విపుల చర్చకు సెప్టెంబరు 79 నెల అభ్యుదయలో నా వ్యాసం చూడవచ్చు.)

1977-78లోనే అవార్డు పొందిన మరో నవల : "ఏది పాపం?"
రచయిత : శ్రీ చివుకుల పురుషోత్తం

సదరు తెలుగు సీరియల్ నవలా పాఠకులు, ఓటర్లూ ఒక్కలాంటి వాళ్ళే. 1976 సం॥ ఆంధ్రప్రభలో ధారావాహికంగా ప్రచురింప బడిన ఈ నవల పాఠకులను విశేషంగా ఆకర్షించినట్లు తెలుస్తుంది. "ఏది పాపం" ద్వారా చివుకుల వారు ఇటు పాఠకుల ఆదరణ అటు ప్రభుత్వాదరణ (అకాడమీ) పొందారు. ఏక కాలంలో ఇటు ఇంతమంది పాఠకులను, అటు అకాడమీని మెప్పించ గలిగిన నవలను చదివి చూస్తే సగటు నవలే అనిపిస్తుంది.

ఇందులో నాయకుడు నారాయణ ఎనిమిదేళ్ళ వయసులో తొమ్మిది రోజులలో తల్లిని, చెల్లెని, తమ్ముడ్ని పోగొట్టుకుంటాడు. తల్లి ద్వారా ఉపదేశింపబడిన "బాలా-త్రిపుర సుందరి" స్తోత్రంతో నారాయణ ఆధ్యాత్మిక జీవితం గడుపుతాడు. తొలి ప్రేమను చవి చూపిన సుజాత, శారీరక సుఖాన్నిచ్చిన వనజ,

దాంపత్య జీవనాన్ని పంచియిచ్చిన జూలీ అందరు అతని జీవితంలో మజిలీలు మాత్రమే. ఎవరూ అతడ్ని శాశ్వత సంసారబంధాలలో బంధించలేరు. అతడికి కూడా జీవితం యెడ పెద్దగా ఆసక్తి వున్నట్లు కనిపించదు.

జీవితం చివర్లో యిక ఆరునెలలకన్నా ఎక్కువ బ్రతకనని తెలుసుకొని ఆధ్యాత్మిక మార్గంలో సాధన చేస్తూ మంత్ర సిద్ధి పొంది బ్రహ్మానంద స్వామిగా మారతాడు. సాధనలో రెండవ మెట్టును పొంది దేహాన్ని వదిలి సమాధిలోనికి వెళ్ళి- భౌతిక దేహాన్ని త్యజిస్తాడు.

నాయకుడు ముప్పైఎనిమిది కత్తి పోట్లకు గురి అయికూడా బ్రతకడం- లాంటి సంఘటనలు పాఠకులను, అకాడమీని ఆకర్షించి వుంటాయి. లేకపోతే ఏం చూసి యిచ్చారు అవార్డును? అని మనం ప్రశ్నించుకోవాలి ఎనిమిదేళ్ళ వయసు నుంచి నాయకుడికి ఆధ్యాత్మిక వస్త్రం తొడిగి నవలను నడిపించి పాఠకుల మెప్పును, ప్రభుత్వ మన్ననలను పొందిన చిపుకుల వారు నిజంగా అభినందనీయులు.

బాబాలను, మంత్రాలను, స్తోత్రాలను ముఖ్యంగా కుప్పించిఅకాడమీని మెప్పించ వచ్చని లోగడ సుదర్శనంగారు, తరువాత చిపుకుల వారు నిరూపించారు.

నవల : "తుఫాన్"

రచయిత్రి : శ్రీమతి సి. ఆనందా రామం

1974 నుండి 78 సంవత్సరాల మధ్య కాలంలో వెలువడిన నవలల్లో ఉత్తమమయిందిగా- 1979లో అవార్డు పొందిన నవల యిది.

సంఘంలోని క్రింది రెండు తరగతులకు చెందిన యిద్దరాడ పిల్లల బాల్య-వైవాహిక జీవితాలలోని అవకతవకలను సమానాంతరంగా విశ్లేషిస్తూ సాగి సాగి ఇక ఏం చేయాలో తోచని స్థితిలో వో తుఫాన్ని సృష్టించి, వాళ్ళనందులో ముంచేసి చేతులుదులుపుకుంది రచయిత్రి. కొత్త ప్రయోగం చేస్తున్నానంటూ, కథని "మబ్బులు"- "చినుకులు"-"గాలివాన"- "తుఫాను" అంటూ కథని నాలుగు భాగాలుగా విభజించుకొని, మొదటి మూడు భాగాల్ని కొంతవరకు బాగానే నడిపించుకు వచ్చినా- చివరకు తాను చెప్పిన కొత్తదనమేదో తేల్చకుండానే కథని తుఫాన్లో ముంచేసింది.

కాలక్షేపానికి చదువుకునేందుకయితే నవల బాగానే వుందనక తప్పదు గానీ, కథా చిత్రణంలోనూ, విషయ విపులీకరణంలోనూ చాలా లోపాలున్నాయి. విస్తరణా భయం కారణంగా వాటన్నింటినీ ఇక్కడ పేర్కొనడం సాధ్యం కాదు గానీ, వివరంగా తెలుసుకునేందుకు 26-1-80 "ఆంధ్రభూమి" దిన పత్రికలో శ్రీ సురభి మనోహరరావుగారి వ్యాసం చూడవచ్చు.

ఈ నవలకు అవార్డు నివ్వడంలో అకాడమీ వారి విజ్ఞతను శంకించాల్సి వొస్తుందనక తప్పదు.

ఈ దశాబ్దంలో వచ్చిన అకాడమీ నవలలను పరిశీలించాక బహుమతికి ఏది అర్హమయినది, ఏదికాదు చెప్పడం చాలా

సులువు. కారణం నవల సాయి అలా వుండడమే.

మొత్తం బహుమతి పొందిన నవలలు చదివాక అభిప్రాయాలు ఇలా ఏర్పడతాయి.

కొ. కు గారి 'తార' లో ఏం చూసి బహుమతి ఇచ్చారు. అసలు అకాడమీ వారు 'తార' చదివారా అని అనుమానం కలుగుతుంది మనకు. 'తార' కు కాకుండా కుటుంబరావుగారి 'చదువు' కు యిచ్చి ఉంటే బాగుండేది. కుటుంబరావు చక్కటి కథకుడు. ఆ విషయమై ఎవరికీ ఏ పేచీ లేదు కాని ఆయన వ్రాసిన 'తార' ఏ విధంగాను బహుమతి పొందదగినది కాదు.

బహుమతికి అనర్హములై అర్హములై కూచున్న నవలలు మరినాలుగు ఉన్నాయి. 1. సంసార వృక్షం 2. ఏది పాపం, 3. కీర్తి కిరీటాలు, 4. తుఫాన్.

కుటుంబరావుకు ఈ యదలచినట్లే యద్దనపూడికి అవార్డు నీయాలనిపించి ఉంటుంది. దేనికి ఈయ్యాలి. చదవడం, పరిశీలించడం ఉట్టి దండగ అనుకొని అప్పుడే సీరియల్‌గా ముగిసి నవలా రూపంలో మార్కెట్‌లో కనిపించిన 'కీర్తి కిరీటాల'కు యిచ్చి తమ పనిఅయిందనిపించారు. యద్దనపూడికి ఈయాలనుకుంటే ఆమె వ్రాసిన 'ఆరాధన' కు యిచ్చి ఉంటే బాగుండేది.

ఇక 'తుఫాన్' సంగతి. ఏ డాబూ లేకుండా రచయిత్రి ముందు మాటను తొలగించి ఉంటే ఈ నవల మామూలుగా నయినా మిగిలేది. ముందు మాటకు నవలకు పొంతన లేదు. బహుశా అకాడమీ వారు 'ముందుమాట' చదివి బోల్తా పడి ఉంటారు. ముందుమాటలు చూసి అవార్డు లీయడం అకాడమీకి ఈ మధ్య అలవాటయింది. కాదంటే చూడుడు: ఊబిలో దున్న, కీర్తి కిరీటాలు, తుఫాన్ లకుఆయా రచయి(త్రు)తలు వ్రాసుకున్న ముందుమాటలు.

నల్లరేగడి, ఊబిలో దున్న, సమత మామూలుగా ఉన్నాయి. అనర్హములు అని అనలేము.

ఇక పూర్తిగా బహుమతికి అర్హములు శ్రీ మహీధర రామ్మోహనరావుగారి 'కొల్లాయిగట్టితేనేమి', శ్రీ శీలావీర్రాజు గారి 'మైనా', శ్రీ దాశరథి రంగాచార్య గారి 'చిల్లరదేవుళ్ళు'

ఏది ఏమయినా అకాడమీ వరుసగా అనర్హములైన నాలుగు నవలలకు అవార్డులిచ్చి అపకీర్తి పాలయింది. మంచి నవలలు ఎన్నో వస్తున్నతరుణంలోఅకాడమీఇతర ఒత్తిళ్లకు లొంగి పనిచేస్తుందని, నవలలను చదవడంలో బద్ధకిస్తుందని స్పష్టంగా తెలుస్తుంది. ఇలాగే అకాడమీ తన నడకను సాగిస్తే బుద్ధున్న ఏ రచయిత తన నవలకు అకాడమీ అవార్డు రావాలని కోరుకోడు. అకాడమీ రికమెండేషన్ సంస్థగా, జేబు సంస్థగా కాకుండా ఇక ముందయినా 'సాహిత్య సంస్థ' గా నడుస్తుందని ఆశిద్దాం. □

# చారిత్రక నవలా వికాసంలో ఈ దశాబ్దం నవలలు

పుల్లాభొట్ల వెంకటేశ్వర్లు,
ఎం. ఏ.,

'చారిత్రక నవల' అనే పేరు వినటంతోటే అది రెండు విరుద్ధ విషయాల కలయిక అని మనకు అవగతమౌతుంది. 'చరిత' అంటే గతించిన సంగతి. సూక్ష్మంగా వివరించి చెప్పాలంటే 'గతించిపోయిన కాలపు సత్యం' అన్నమాట. ఇక 'నవల' అంటే కల్పితం. ఈ రెంటికి ముడిపెట్టి వ్రాయటం చారిత్రక నవల. అంతమాత్రం చేత జరిగిపోయినసత్యంతోదీనికిఅంతగాసంబంధం ఉండనక్కర లేదు. అలాగని కేవలం ఊహాలోకంలో విహరించటానికి ఇక్కడ ఆస్కారం లేదు. చారిత్రక విషయాన్ని కథల్లో కొంతవరకు ప్రతిబింబింపజేస్తూ హృదయానికి నచ్చే విధంగా సహజ సుందరంగా తీర్చి దిద్దితే పాఠకుడు ఉల్లాసంగా, ఉత్సాహంగా, చారిత్రక నవలను పఠించి అందలి సత్యాన్ని గ్రహించుతూ. దాని చుట్టూ అల్లిన మధురిమను ఆస్వాదించి, ఆనందిస్తాడు. అలాగాక, కేవలం 'చరిత్ర'ను తెలుసుకోవాలనే జిజ్ఞాసగలవారికి చారిత్రక గ్రంథాలు వేరే కోకొల్లలుగా పడివుండనే వున్నాయి. వాటి ద్వారా కావలసినంత చరిత్రను తెలిసికొనవచ్చు- లేదా సాంఘిక, ఆర్థిక, రాజకీయ, సామాజిక పరమైన విషయాలను తెలుసుకోవాలంటే అలాంటి నవలలు ఎన్నో ఉన్నాయి గనుక చదవవచ్చు- దీనిని బట్టి చారిత్రక నవలలు ఎలా ఉండాలో, వాటి ప్రాముఖ్యత ఏమిటో విశదమౌతుంది.

గనుక గతించిపోయిన పెక్కు సంఘటనలలోనుండి, మనకు నచ్చిన ఒకానొక చారిత్రక సత్యాన్ని తీసికొని దానికి ప్రాణ ప్రతిష్ఠచేసి, విభిన్నమైన కల్పనలతో, వాచవు లూరించే విధంగా, నవలారూపంలో విషయాన్ని సరిక్రొత్త విధంగా తీర్చిదిద్దితే పాఠకుడు ఎంతో ఉత్కంఠతో దాన్ని చదువుతాడు. అందలి చారిత్రక సత్యాన్ని గ్రహిస్తూ మనం చేసిన అద్భుత కల్పనలకు ఆనంద పడుతూ ముందుకు సాగిపోతాడు.

చారిత్రక నవల వ్రాయడం అంటే, ఒకగొప్ప సాముగరిడీ అన్నమాట. చారిత్రక విషయ సేకరణలోగాని, దాని చుట్టూ మనం అల్లే అల్లికలోగాని లోపం

కనపడదంటే మన శక్తి సామర్థ్యాల్ని పఠిత ఇట్టే పసిగట్టేసాడు. కనుక చారిత్రక నవలా రచన అంటే "కత్తి మీది సాము" అన్నమాట. ఈ సాము చెయ్యటంలో రచయిత ఎంత నేర్పరి అయితే విజయం అంత సిద్ధిస్తుంది. లేకుంటే అట్టే పట్టుబడిపోయి, నగుబాట్ల పాలౌతాడు. కనక చారిత్రక నవలలు వ్రాయటం చాల కష్టం. వ్రాసి అందర్నీ మెప్పించటం అంతకన్నా కష్టం— చివరగా చెప్పేదేమిటంటే మనం నవలగా మలచదలచుకొన్న చారిత్రక సత్యాన్ని మనం బాగా ఎరిగివుండాలి. ఆ కాలపు ఆచార వ్యవహారాలు, స్థితిగతులు, వేష భాషలు, సంస్కృతీ సభ్యతలు నాగరికతా వైభవాలు కళారీతులు అన్నీ రచయితకు కరతలామలకం అయి వుండాలి. ఇకదాని చుట్టూ రచయిత కల్పించే కల్పన, పాత్రపోషణ, సంభాషణా రీతులు, ఎంతో సహజసుందరంగా ఉండాలి దానికి ఎంతో నేర్పు, ఓర్పు అవసరం— పాఠకుడికి ఇది ఒక విధమైన సత్యంతో నిండిన భ్రమవలె గోచరింప జేయాలి. అప్పుడే ఇందులో విజయం సిద్ధిస్తుంది. కీర్తి లభిస్తుంది. లేకపోతే అది తీర్థానికి తీర్థం ప్రసాదానికి ప్రసాదంగానే వుండిపోతుంది. ఆ రెంటికి పొంతన కుదరదు. కాబట్టి రచయిత చరిత్ర ఎంత తీసికోవాలో, కల్పన ఎంత అవసరమో, గ్రహించి కార్యోన్ముఖుడు కావాలి. ఈ రెంటికి పరస్పర సమన్వయం ఎంత కుదిరితే చారిత్రక నవల అంత విజయవంతమౌతుంది.

పై వివరణను దృష్టిలో వుంచుకొని చారిత్రక నవలను ఈ విధంగా నిర్వచించవచ్చు— "జరిగిపోయిన ఒకానొక చారిత్రక సంఘటననుగాని లేదా చారిత్రక వ్యక్తులనుగాని ఆధారంగా తీసికొని దానిని ఆత్మగా చేసి దానిచుట్టూ పెక్కు అద్భుత సంఘటనలను, విచిత్ర సన్నివేశాలను కల్పించి కథాకథన దక్షతతో నిర్వహించిన" రచనే చారిత్రక నవల.

ఈ చారిత్రక నవలను రెండు విధాలుగా విభజించవచ్చు. (1) ఏదేని దేశ చరిత్రనుగాని లేదా అందలి ఒకానొక సంఘటననుగాని గ్రహించి వ్రాయు నవలలు (2) చరిత్రలో తెరమరుగున పడిపోయిన ప్రముఖ వ్యక్తులనుగాని, వారి వీరోచిత కృత్యాలనుగాని సాహస గాథలనుగాని, తీసికొని, విస్మృతి పాలైన ఆయా విషయాలను గ్రహించి అవ్యక్తుల చుట్టూకథను మలచినట్లయితే అవివీరోచిత జీవితాత్మక నవలలుగా వ్యవహరింపబడతాయి.

ఈ రెండు రకాలైన చారిత్రకనవలలు ప్రజలలో జాతీయ భావాల్ని, దేశభక్తిని వీరరసాన్ని పెంపొందింప జేయటానికి, యెంతో ఉపకరిస్తాయి. ఈ విధమైన నవలల పఠనంవల్ల ప్రజలకు తమ జాతి యొక్క దేశం యొక్క పూర్వవీరుల చరిత్రను, వారు ప్రదర్శించిన ఘనకార్యాలను సాధించిన మహత్తర విజయాలను తెలిసికొని ఉత్సాహంతో ముందుకు పోవటానికి వీలౌతుంది.

చరిత్ర అంటే పెక్కు సంఘటనల "కలగా పులగం" కనుక దాని పఠనకు ఎంతో ఓపిక అవసరం. దానిని అర్థం

చేసుకోవటం గూడ అంత సులభంగాదు. నీరసంగాను, అసత్యసంగాను ఉన్న చరిత్రను పఠించటంకన్నా, అదే విషయాన్ని చక్కని, చిక్కనిసన్నివేశాలతో నవలా రూపంలో వివరించి వ్రాస్తే హాయిగా చదువుకోవచ్చు. ఎంతో విజ్ఞానాన్ని పొందవచ్చు.

తెరమరుగున పడివున్న ముళ్ళపొదల వంటి ఎన్నో నిగూఢాలైన చారిత్రక సత్యాలను నవలారూపంలో తెలిపితే పాఠకులు ఉత్సాహంగా చదవగలరనే సత్యాన్ని పాశ్చాత్య రచయితలు గ్రహించి ఎన్నో గొప్ప చారిత్రక నవలలు వ్రాసి కీర్తి ప్రతిష్ఠల నార్జించారు.

లియోటాల్‌స్టాయ్ "యుద్ధం-శాంతి" అనే ప్రపంచ ప్రఖ్యాతమైన చారిత్రక నవలను వ్రాసి నెపోలియన్ సలిపిన దండయాత్రలను యెంతో హృద్యంగమంగా వివరించాడు.

ప్రసిద్ధ చిత్రకారుడైన "వాన్‌గ్రోగ్" జీవిత చరిత్రను 'లస్ట్ ఫర్ లైఫ్' అనే నవల వల్ల మనం తెలిసికోవచ్చు.

అలాగే 'మోషే' వ్రాసిన చారిత్రక నవలలన్నీ యధార్థ చరిత్రను వివరించే ఉత్తమ కళాఖండాలే.

మన భారతీయులలో, పాశ్చాత్యుల వలె సరియైన చారిత్రక నవలలుగాని, జీవితాత్మక నవలలుగాని వ్రాయటానికి తగిన చారిత్ర కాధారాలు లేవని ఒక విధమైన అపోహ ఉంది. అయితే శ్రీ కె. యం. మున్షీ వ్రాసిన "భగవాన్ పరశురాముడు", మరియు శ్రీ రాహుల్ సాంకృత్యాయన్ వ్రాసిన "సింహ సేనాపతి" నవలలు చదివితే పరిస్థితి వారికే తెలుస్తుంది.

మన పౌరాణిక నవలలు సైతం మన చారిత్రక నవలలకు సన్నిహితంగావుండే మరో రూపమే. వీటిలో పురాణ సంబంధమైన ఇతివృత్తాన్ని గ్రహించి, నవీనస్తూ పున్న చరిత్రకు అవి యెంతవరకు దోహదం చేస్తాయో వివరిస్తూ గతకాలపు సామాజిక విలువలను మన కన్నులకు కట్టించడమే వీటి ప్రయోజనం. శ్రీ విలక మూర్తి వారి సౌందర్య తిలక, శ్రీ విశ్వనాథ వారి పురాణాంతరత నవలలు ఇందుకు ఉదాహరణాలుగా గ్రహించవచ్చు.

ఇక మన భారతీయ చారిత్రక నవలలను తీసుకుందాం - ఇతర సాహిత్య ప్రక్రియల వలెనే, భారతీయ చారిత్రక నవలలుగూడ పాశ్చాత్య భాషా సాహచర్యంతోనే ముందుకు సాగేయి. సర్ వాలర్ స్కాట్, ఛార్లెస్ డికెన్సు, అలెగ్జాండర్ డ్యూమాస్, విక్టరు హ్యూగో, గోలియో, లియోటాల్‌స్టాయ్ వంటి విశ్వవిఖ్యాత రచయితల చారిత్రకనవలలు పఠించిన తరువాతే మన భారతీయ రచయితలు నంద, మౌర్య, గుప్త, రాజపుత్ర, బానిస ఖిల్జీ మొగల్ మహారాష్ట్రవంశీయుల చరిత్రలను, వారి సాహస ప్రతాప గాథలను ఇతి వృత్తాలుచేసి నవలలు వ్రాయటం ప్రారంభించారు.

అదే విధంగా మన తెలుగు, నవలా రచయితలు శాతవాహనులు, ఇక్ష్వాకులు, ఆనందగోత్రులు, సాలంకాయనులు, కాదంబులు, పల్లవులు, చోళులు చాళుక్యులు, కాకతీయులు, పద్మనాయకులు, రెడ్డిరాజులు, విజయనగరాధీశులు, తంజా

వూరు, మధుర, రామనాథపురం రాజ్యాలనేలిన నాయక రాజులు, కాళింగులు, బహమనీ సుల్తానులు, కుతుబుషాహి వంశీయులు మున్నగువారి చరిత్రలను, వారి వీరోచిత కృత్యాలను నవలలుగా మలిచి తెలుగు ప్రజలకందించి మన చారిత్రక ఔన్నత్యాన్ని వివరించసాగేరు.

మనదేశంలో వైదిక, జైన, బౌద్ధ, చార్వాక, మహమ్మదీయ, క్రైస్తవమత, సంస్కృతులతోపాటు; మహావీర, బుద్ధ సిద్ధ నాగార్జున, శంకర, రామానుజ, మధ్వాచార్యాది మహాప్రవకల ప్రభావం; అశోక, చంద్రగుప్త, శ్రీముఖ, శాతకర్ణి, రాజరాజ నరేంద్ర, కాకతీయ గణపతిదేవ, ప్రతాపరుద్ర, రాణాప్రతాపసింహ, శివాజి, శ్రీకృష్ణదేవరాయ, రఘునాధరాయల వంటి మహా ప్రభువుల ధర్మపాలన; రాణీరుద్రమదేవి, ఝాన్సీలక్ష్మీబాయివంటి వీరనారీమణుల సాహసకృత్యాలు; రాణీ సంయుక్త, విమలాదేవి, అహల్యాబాయి వంటి పతివ్రతామ తల్లుల మహాత్మ్యం; జిజీబాయి, ఐతాంబవంటి వీరమాతల త్యాగశీలత; చానమ్మ, మాంచాలవంటి వీరపత్నుల ఆదర్శ ధర్మ తత్పరత; చాణక్య, యుగంధర, తిమ్మరుసు, ఖడ్గ తిక్కనవంటి మహా మంత్రుల రాజనీతి దురంధరత; తానాజీ గోన గన్నారెడ్డి, బ్రహ్మయరుద్రులవంటి మహావీరుల ప్రభుభక్తి పరాయణత; నన్నయ, తిక్కన, ఎర్రన, శ్రీనాధ, ధూర్జటివంటి మహాకవుల మధురవాగ్ఝరి; రామకృష్ణ పరమహంస, వివేకానంద, మహాత్మాగాంధివంటి లోకోత్తరపురుషుల దేశభక్తి భారతావనిని పునీతం చేశాయి.

పైన వివరించిన ఎన్నో విషయాలను ఇతివృత్తాలుగాచేసి నవలలు ఎన్నో వెలువడ్డాయి. ఇతర భారతీయ భాషలలోనుండి మన భాషలోకి అనువదింపబడ్డ కొన్ని ప్రముఖ నవలలను పేర్కొని ఆ పిమ్మట తెలుగువారి స్వతంత్ర చారిత్రక నవలలను గురించి ముచ్చటిస్తాను.

వంగభాషలో శ్రీ ధీరేంద్రనాధ్‌పాల్ వ్రాసిన Mysteries of the Moughal court అనే నవలను శ్రీ మొసలిగంటి తిర్మలరావు 'మొగలాయి దర్బార్' అనే పేరుతో నాలుగు భాగాలుగా తెనిగించాడు. ఈ నవలలో మొగలాయి ప్రభువుల నిరంకుశ విధానం, భోగలాలసత స్వార్థపరత్వం, అంతఃకలహాలు కొట్టవచ్చినట్లు కనుపిస్తాయి. అంతేగాక రచయిత నిష్పక్షపాతంగా రసపుత్రుల గుణదోషాలను యెంతో చక్కగా వివరించాడు.

బహు భాషావేత్త మహా పండితుడు అయినశ్రీరాహుల్‌సాంకృత్యాయన్‌రాసిన జయయౌధేయ నవలను శ్రీ ఆలూరి భుజంగరావు తెనిగించాడు. క్రీ.శ 350–400 సంవత్సరాల మధ్యన భారతీయ రాజకీయ, సామాజిక, స్థితిగతులను చక్కగా వివరించాడు. ఈయన వ్రాసిన 'దివోదాసు' అనే మరొక నవలను గూడ శ్రీ భుజంగరావే ఆంధ్రీకరించాడు. దీనిలో క్రీ.పూ 1220–1195 సంవత్సరాలనాటి వేదకాలపు ఆచార వ్యవహారాలను యెంతో మనోహరంగా చిత్రించాడు. శ్రీ రాహుల్‌జీ మరోనవల 'సింహ

'సేనాపతి'. ఇది క్రీ.పూ ఐదవ శతాబ్దికి సంబంధించింది.

శ్రీ హెచ్. సి. ఘటోపాధ్యాయ వంగ నవలను 'ఉజ్జయినీ పతనం' అనే పేరుతో శ్రీ విజయ ఆంధ్రీకరించాడు. ఇది క్రీ. శ. ఆరవ శతాబ్దికి సంబంధించింది. అయినా దీనిలోని కథనేటి పరిస్థితులకు అన్నివిధాలా పోలివుంది. అందరూ చదవదగిన మంచి నవల.

వంగ నవలా చక్రవర్తి అయిన శ్రీ బంకించంద్రుడు వ్రాసిన చారిత్రక నవలలన్నీ ఎందరెందరిచేతనో ఆంధ్రానువాదాలుపొందేయి. 'కపాల కుండల' 'సీతారామరాయలు' 'ఆనంద మఠం' ఆ నవలల్లో పేరెన్నికగన్నవి.

ఆంధ్ర చరిత్రలో విజయనగర సామ్రాజ్య చరిత్ర మణిపూస వంటిది. ఈ చరిత్రను కన్నడభాషలో శ్రీ కొరటి శ్రీనివాసరావు 'విద్యానగర చరిత్ర నవలాగుచ్ఛము' అనే నామంతో ఇరువది నవలలలో వివరించాడు. దీనిని శ్రీ శ్రీనివాసపురం సోదరులు ఎంతో రమ్యంగా ఆంధ్రీకరించారు. అదే విధంగా శ్రీ కె. వి. అయ్యరు కన్నడ భాషలో రాసిన నవలను శ్రీ తిరుమల రామచంద్ర 'శాంతల' అనే పేరుతో భాషాంతరీకరణం చేశాడు. కన్నడ రాష్ట్రంలోని బేలూరు, హలెబీడులలోగల దేవాలయాల ప్రాచీన చరిత్రను, అపురూప శిల్పకళా ఖండాలను ఎంతో దేదీప్యమానంగా వర్ణించాడు.

శ్రీ యశపాల్ హిందీలో వ్రాసిన 'దివ్యా' అనే బౌద్ధ యుగంనాటి నవలను శ్రీ పోలు శేషగిరిరావు తేనెలొలికించే మధురమైన భాషలో ఆంధ్రీకరించాడు. వైదిక బౌద్ధమతాలకు మధ్య చెలరేగిన సంఘర్షణలు ఇందులో ప్రతిభాపూర్ణంగా వివరింపబడ్డాయి.

శ్రీ రామరతన్ భట్నాగర్ బుద్ధదేవుని దివ్యసందేశాన్ని అందిస్తూ వ్రాసిన 'అంబపాలి' నవలను శ్రీ కె. రమేష్ వాచవులూరించే తెలుగు భాషలో అనువదించాడు.

ఇక వైదిక సాహిత్యాన్నంతాకరతలామలకం చేసికొన్న శ్రీ కె. యం. మున్షీ గుజరాతి భాషలో వ్రాసిన 'విశ్వరథుడు'నవలను శ్రీ వేమూరి ఆంజనేయ శర్మ ఆంధ్రీకరించాడు. ఇది ఋగ్వేద కాలంనాటి ఆర్యుల ప్రారంభ 'జీవితాన్ని ఆనాటి వారి ఆచార వ్యవహారాలను చిత్రించే చక్కని రచన.

ఇంతవరకు అన్యభాషల నుండితెలుగులోకి పరివర్తన పొందిన చారిత్రక నవలలను గురించి తెలుసుకున్నాం. ఇక మన స్వతంత్రతెలుగు చారిత్రకనవలలను పరిశీలిద్దాం.

తెలుగు వారి స్వతంత్ర చారిత్రక నవలా రచన శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులు యుగంలోనే ప్రారంభమైంది. ఆయన నడిపిన, చింతామణి పత్రిక నవలల పోటీలో బహుమతులు పొందిన నవలల్లో అధికభాగం చారిత్రకాలే. ఈ పోటీలలో అధిక భాగం బహుమతులు గెలుచుకొన్న శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం భారతేతిహాసానికి సంబంధించిన పెక్కు నవలలు వ్రాసి కీర్తిగడించాడు. వానిలో పేర్కొనదగిన ప్రథమశ్రేణి చారిత్రక నవలలు

హేమలత, అహల్యాబాయి, కర్పూర మంజరి. తెలుగు చారిత్రక నవలలకు ఇవి నాటికి, నేటికి ఎనలేని కీర్తిని సంపాదించిపెట్టాయి. అయితే శ్రీ చిలకమర్తి చారిత్రక నవలలు ఇన్ని వ్రాసినా ఆంధ్రేతిహాసానికి సంబంధించిన ఒక్క నవలయినా వ్రాయకపోవటం ఆంధ్రుల దురదృష్టమని చెప్పాలి.

శ్రీ కొమర్రాజు లక్ష్మణరావు పంతులు విజ్ఞాన చంద్రికా గ్రంథమాల పక్షాన నవలా రచనలో శ్రీ కందుకూరివలె పోటీలు నిర్వహించి విజేతలకు బహుమతులు ప్రసాదించారు. ఈ పోటీలలో శ్రీ భోగరాజు నారాయణమూర్తి వ్రాసిన 'విమలాదేవి' 'అల్లాహో అక్బర్' 'చంద్రగుప్తుడు' 'ఆంధ్రరాష్ట్రం' అనే ఉత్తమ శ్రేణి నవలలకు బహుమతులు లభించాయి. ఈ గ్రంథమాల పక్షాన చారిత్రక నవలలు వ్రాసి బహుమతులు పొందిన వారిలో పేర్కొనదగిన ప్రముఖులు వారి రచనలు ఇక్కడ పేర్కొనటం ఎంతయినా సమంజసం. శ్రీ వేలాల సుబ్బారావు 'రాణీ సంయుక్త', శ్రీ కేతవరపు వెంకటశాస్త్రి 'రాయచూరు యుద్ధం' 'ఇచ్ఛనీ కుమారి', శ్రీ దుగ్గిరాల రాఘవచంద్రయ్యచౌదరి 'విజయనగర సామ్రాజ్యం' శ్రీ ఎ. వి. నరసింహం 'పాతాళభైరవి' మున్నగునవి.

శ్రీ వేంకట పార్వతీశ్వర కవులు కేవలం అన్యభాషల నుండి నువాదాలతో, అనుసరణలతో తృప్తిచెందక 'శ్యామల' 'మాతృమందిరం' 'ప్రమదావనం' వంటి స్వతంత్ర చారిత్రక నవలల నెన్నింటినో వ్రాసి ఈ శాఖాసాహిత్యానికి మంచి పుష్టిని చేకూర్చారు. వీరితోపాటు ఆనాడు చారిత్రక నవలలు వ్రాసినవారిలో శ్రీ శివశంకరస్వామి, జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి, శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి పేర్కొనదగిన ప్రముఖులు.

తెలుగు చారిత్రక నవలకు ప్రత్యేక ప్రతిపత్తితోపాటు, స్వర్ణ సంక్రాంతిని ప్రసాదించిన ప్రతిభామూర్తులు శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, శ్రీ అడవి బాపిరాజు, శ్రీ నోరి నరసింహశాస్త్రి ఈ త్రిమూర్తుల చేతిలో తెలుగు చారిత్రక నవల సంపూర్ణత్వాన్ని సంతరించుకొంది.

బహుముఖ ప్రజ్ఞాశాలి అయిన శ్రీ విశ్వనాథ వీరిలో ప్రథమగణ్యుడు తెలుగు చారిత్రక నవల ఈయన చేతిలో చక్కని రూపురేఖలు దిద్దుకొంది.

'ఏకవీర' నవల మన తెలుగుదేశంలో తొలినాడు చెలరేగిన కాల్పనికోద్యమ ప్రభావంతో వెలువడ్డ చారిత్రక నవల. మధుర నేలిన నాయక రాజుల కాలానికి చెందిన కథ ఇది. ఆర్షధర్మానికి, వ్యక్తిగత హృదయ స్పందనకు మధ్య సంఘర్షణ దీనిలో బీజం. ధర్మానికి- ప్రేమకు మధ్య చెలరేగిన సంఘర్షణ ఇందులో పతాకస్థాయి నందుకుంది. వీర భూపతి కుట్టాన్, మీనాక్షి, ఏకవీరల ప్రేమోదంతాలు, విరహవేదనలు, ఇందు చక్కగా వర్ణించబడ్డాయి.

ఇక బద్దన్న సేనాని' నవల వేంగీ చాళుక్యులకు సంబంధించింది. కులోత్తుంగ చోడ దేవుడు దక్షిణాపథంలో మాతామహులవద్ద ఉంటూ తెలుగు నేలను పాలిస్తున్న కాలంలో పశ్చిమ చాళుక్యులు

ఈ భూభాగాన్ని స్వాధీనం చేసుకోగా, అంత్యకులజులు ప్రభుభక్తి పరాయణు లును అయిన బద్దన్న బాదమ్మలు ప్రదర్శించిన దేశభక్తి ధైర్య సాహసాలు నవలకు పట్టుకొమ్మ. నిస్వార్థ బుద్ధితో వారు సాధించిన ఘనవిజయం నవలకు పతాక. శైవ, వీరశైవ మతావేశాలమధ్య జరిగిన సంఘర్షణలు అనర్థాలు వర్ణింప బడ్డాయి

'కడిమిచెట్టు' పల్లవ కాదంబరాజులకు చెందిన చారిత్రక నవల. మయూరుని పాత్ర చిత్రణలో శ్రీ విశ్వనాథ కనబర చిన నేర్పు అనన్య సామాన్యమైంది.

'ధర్మచక్రం' విజయపురి నేలిన ఇక్ష్వాక ప్రభువులకు సంబంధించిన గాధ. ఇది బౌద్ధ సంబంధమైన కథే అయినా శ్రీ విశ్వనాథ హైందవ నాగరికతా వైభ వాలు, సంస్కృతీ సభ్యతలు యెంతో ప్రతిభావంతంగా ఇందులో చొప్పించారు

ఇక ద్వితీయుడైన శ్రీ అడివి బాపిరాజు దృష్టి అంతా కళాత్మకం. ఆయన రచనలన్నీ ఈ దృష్టితో సాగినవే.

'హిమబిందు' ప్రథమాంధ్ర రాజులైన శాతవాహనులకు సంబంధించింది. 'హిమ బిందు' రాజ్ఞీత్వాన్నిగూడ తిరస్కరించి సామాన్య శిల్పి అయిన సువర్ణశ్రీని వివాహమాడటం ఈ నవలలో విశేషం. ఉదాత్తమైన ప్రేమకు అంతసులు అడ్డు గోడలు కావని ప్రపంచంలో దీనికి సాటి మరొకటి ఉండబోదని రచయిత ఇందులో ప్రతిపాదించారు.

'గోనగన్నారెడ్డి' కాకతీయ రుద్రమ దేవి కాలాన్ని చిత్రించే అద్వితీయమైన నవల. మహారాష్ట్రులు కాకతీయ సామ్రా జ్యాన్ని కబళించటానికి యత్నించి నప్పుడు ప్రభుభక్తి పరాయణుడు, మహా సాహసికుడు అయిన గన్నారెడ్డి ధైర్య సాహసాలతో ముందుకు దూసి శత్రువు లను పరాజితుల్ని చేసిన దృశ్యం ఇందులో చక్కగా చిత్రించబడింది.

'అడవి శాంతిశ్రీ' నవల బౌద్ధ వైదిక పరమైన స్పర్థలను కన్నులకు కట్టించాడు రచయిత.

శ్రీ బాపిరాజు తన చారిత్రక నవలల్లో ఆయా కాలాల సాంఘిక పరిస్థితులను ఆచార వ్యవహారాలను అచ్చుగుద్దినట్లు వర్ణించి చూపటం గొప్ప విశేషం.

తృతీయుడైన శ్రీ నోరి నరసింహ శాస్త్రి తమ చారిత్రక నవలల్లో ప్రాచీన చరిత్రకు సంబంధించిన ప్రముఖ రాజులు, రాణులు, వారి మంత్రులు, సామంతులు, దండ నాయకులు మున్నగువారిని గురించి కాక, ఆ యా కాలాలలో వర్ధిల్లిన ప్రముఖ సాహిత్యవేత్తలను, కవులను కేంద్రంగా చేసి, వారి చుట్టూ కథను మలిచి చారిత్రక నవలా రచనలో ఒక కొత్త పుంతను త్రొక్కి ఘన విజయం సాధించాడు.

ఈ విశాల దృష్టితో శ్రీ నోరి ఆంధ్రేతి హాసంలోని చాళుక్య, కాకతీయ, రెడ్డి సామ్రాజ్యాలలో వర్ధిల్లిన ప్రముఖ కవి పుంగవులను ఆలంబనంగా చేసి అల్లిన నవలలే 'నారాయణభట్టు' 'రుద్రమదేవి' 'మల్లారెడ్డి' మొదలైనవి. ఈ నవలా త్రయంలో తెలుగునాట కవిత్ర యంగా విఖ్యాతులై ఆంధ్ర మహా భార తాన్ని రచించిన నన్నయ, తిక్కన,

ఎగ్రనలకు సంబంధించిన సాహిత్య జీవితం వర్ణించబడింది. ఆయా ప్రభువులు సాహిత్య మూర్తులపట్ల ప్రదర్శించిన ప్రేమాదరాలు, విశేష సన్మానాలు ఇందులో చోటుచేసుకున్నాయి.

ఈ శతాబ్దంలో భారతావనిలోను, ఆంధ్రదేశంలోను నడచిన జాతీయోద్యమాలను, సాంఘిక సంస్కరణోద్యమాలను ఆలంబనంగా చేసి శ్రీయుతులు ఉన్నవ లక్ష్మీనారాయణ 'మాలపల్లి' విశ్వనాథ 'వేయిపడగలు' కొడవటిగంటి కుటుంబరావు 'చదువు' వట్టికోట ఆళ్వారుస్వామి 'ప్రజల మనిషి' 'గంగు' మొదలైన నవలలు వ్రాశారు. వీటిని నేడు మనం సాంఘిక నవలల క్రింద తీసుకున్నా ఇవి నడుస్తున్న చరిత్రను వర్ణించినవి గనుక, వీటిని సంఘ చిత్రణ చారిత్రక నవలలుగా పరిగణించటం సమంజసం. ఈ నవలల్లో చిత్ర విచిత్రమైన చారిత్రక సత్యాలెన్నో చోటుచేసుకోవటం గమనార్హం.

ఇక దేశానికి స్వాతంత్ర్యం లభించిన తరువాత, ముఖ్యంగా ఈ దశాబ్దానికి కాస్త ముందూ, వెనుకా వెలువడిన చారిత్రక నవలలను స్థాలీపులాక న్యాయంగాపరామర్శిద్దాం ఎందువల్లనంటే ఏ నవల ఎప్పుడు వెలువడిందో సరిగ్గా చెప్పటం చాలకష్టం. కొన్ని మంచి నవలలు ఈనాటి దిన పత్రికలలో ధారావాహికంగా వెలువడ్డా ఎప్పుడోగాని అవి గ్రంధరూపంలో రావటంలేదు. ఒకవేళ పుస్తక రూపంలో వచ్చినా అవి ఆయా ప్రాంతాల్లోనే మిగిలిపోతున్నాయి. బహు జనాదరణ లభించటానికి చాల సమయం పడుతోంది. కనుక కచ్చితంగా సరియైన కొలత బద్దతో కాలాన్ని కొలిచి నిర్ణయించలేం.

శ్రీ తెన్నేటి సూరి వ్రాసిన 'ఛంఘీజ్ ఖాన్' అనే చారిత్రక నవల ఆంధ్ర పత్రికలో ధారావాహికంగా వెలువడి ఆ పిమ్మట అది గ్రంథ రూపంలో వచ్చింది.

మహా వీరుడైన ఈ ఛంఘీజ్ ఖానును పాశ్చాత్య చరిత్రకారులు తప్పుగా చిత్రించటంచేత అందరూ అతనిని ఒక నరహంతకుడుగా భావించి నిరసించారు. అయితే శ్రీ సూరి యెంతో శ్రమతో పరిశోధనచేసి తెరమరుగున పడిపోయిన సరియైన చరిత్రకు వెలుగును ప్రసాదించాడు. దీనివల్ల 12, 13 శతాబ్దాల ఆసియా ఖండపు చరిత్ర యెంతో తెలుస్తుంది.

ప్రముఖ నాటకకర్త శ్రీ కాళ్ళకూరి నారాయణరావు వ్రాసిన 'ప్రతాపరుద్రమదేవి' నవలవల్ల కాకతీయుల కాలం నాటి చారిత్రక సాంఘిక విషయాలెన్నో అవగతమౌతాయి.

శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులు వ్రాసిన 'కళారాధన' 'మోహనాంగి' రెండూ గొప్ప చరిత్రాత్మక నవలలు. మొదటి నవలవల్ల దక్షిణాపథ శిల్ప చరిత్ర, రెండవదానివల్ల తళ్ళికోట యుద్ధానంతరం విజయనగర సామ్రాజ్య స్థితిగతులు తెలుస్తాయి.

'రామానుజుని ప్రతిజ్ఞ' అనే నవలలో శ్రీ పి. రాజగోపాలనాయుడు, విశిష్టాద్వైత స్థాపనకు పతిత జనోద్ధరణకు శ్రీ రామానుజాచార్యులు పడ్డ శ్రమ వివరింపబడింది.

శ్రీ యన్. రామచంద్ర 'నూర్జహన్' నవలలో జహంగీర్ నూర్జహాన్ల పవిత్ర ప్రేమోదంతాలు చక్కగా వర్ణించాడు.

ఉభయ కవి మిత్రుడు కవి బ్రహ్మ బిరుదాంకితుడు అయిన శ్రీ తిక్కన సోమయాజి చరిత్రనుఎంతో హృద్యంగా శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు 'తిక్కన సోమయాజి' అనే నవలలో వివరించాడు.

'మధురా విజయంఅనే' నామాంతరం గల 'వీరకంపరాయలు' నవలలో శ్రీ వేమూరి ప్రసాదరావు విజయనగర ప్రభువైన కుమార వీరకంపరాయలు తన మిత్రులతో మధురను జయించిన గాథను వివరించాడు. ఈ నవలవల్ల విజయనగర మధుర రాజ్యాలకు సంబంధించిన చరిత్ర మనకు విశదమౌతుంది.

ఆచార్య కె. వి. నరసింహం వ్రాసిన 'కనకాభిషేకం' నవలవల్ల శ్రీనాథ కవిసార్వభౌముడు దేవరాయల సభలో డిండిమభట్టును తన కవితాశక్తితో ఓడించి కంచుఢక్కను పగులకొట్టించి కనకాభిషేకం జరిపించుకున్న విషయం అవగతమౌతుంది.

కుమారి మల్లాది వసుంధర వ్రాసిన 'రామప్పగుడి' 'తంజావూరు పతనం' 'సప్తపర్ణి' నవలలు విద్యార్థులకు పాఠ్యగ్రంథాలుగా నిర్ణయింపబడ్డాయి. ఇవి మధుర, తంజావూరు, ఓరుగల్లుల నేలిన ప్రభువుల కాలాన్ని, ఆ కాలంలో వారు చేసిన ఘనకార్యాలను గుర్తుచేస్తాయి. శ్రీ పాటిబండ్ల మాధవశర్మ 'రాజశిల్పి' నవల కొండవీటి రెడ్డి రాజుల ధర్మ తత్పరతకు ప్రతిబింబం. 'గృహరాజు మేడ' 'భువనవిజయం' నవలలను శ్రీ ధూళిపాళ శ్రీరామమూర్తి వ్రాశాడు. ఈ నవలాద్వయం శ్రీకృష్ణదేవరాయలు రాజ్యపాలన చేసిన స్వర్ణయుగాన్ని గుర్తుచేసే మంచి నవలలు. శ్రీ పిలకా గణపతిశాస్త్రి వ్రాసిన 'మీనాంబిక' నాయకరాజుల కాల పరిస్థితులను వివరించే ఉత్తమ కళాఖండం. శ్రీ శాస్త్రి ఇటీవలి కాలంలో వ్రాసిన 'కాశ్మీరపట్టమహిషి' విశాలనేత్రాలు' రెండూ ఉత్తమ శ్రేణి చారిత్రక నవలలు.

పాత తరానికి చెందిన శ్రీ విశ్వనాథ, శ్రీ నోరి ఇరువురూ ఇటీవల తమ ఇహయాత్ర ముగించేంతవరకు చారిత్రక నవలల నెన్నింటినో వ్రాశారు.

శ్రీ విశ్వనాథ గతంలోవలె కేవలం ఆంధ్రేతిహాసంతో తృప్తి నొందక ఇటీవలి కాలంలో కాశ్మీర నేపాల దేశాలకు సంబంధించిన చరిత్రనంతా తవ్వి తన నవలల్లో గుప్పించాడు. 'మిహిరకులుడు' నవల అట్టివానిలో ఒకటి. ఈతనిచరిత్రను పాశ్చాత్య చరిత్రకారులు పెడదారిని పట్టించి అతడు హూణుడని తెలిపిరి. శ్రీ విశ్వనాథ తన మేధాసంపత్తితో అతనిని కాశ్మీర దేశపు రాజుగా నిరూపించాడు. ఆ మహారాజు పరాక్రమ సంపదను వివరించే నవలే 'మిహిరకులుడు'

'దిండు క్రింద పోకచెక్క' నేపాలు దేశ చరిత్రకు సంబంధించింది ఈ నవలలో ఆయన నేపాలు దేశీయుల ఆచార వ్యవహారాలను, సంప్రదాయాలను వివరించాడు పురాణ వైర గ్రంథమాల పక్షాన 'ధూమరేఖ' 'నందోరాజ భవిష్యతి'

అమృతవల్లి 'పులిముగ్గు' మొదలైన నవలలెన్నో వ్రాసి, చరిత్రను తాను విశ్వసించిన మార్గంలో తీర్చిదిద్దాడు.

ఇక శ్రీ నోరి తనకు ప్రాణప్రదమైన ఆంధ్రేతిహాసాన్ని విడిచిపెట్టక 'కవి సార్వభౌముడు' 'ధూర్జటి' 'కవిద్వయం' మున్నగు ప్రథమశ్రేణి నవలలు వ్రాసి, చారిత్రక నవలాకారుడుగా శాశ్వత యశస్సును సంపాదించుకొన్నాడు.

సరిక్రొత్త రీతిలో చారిత్రక విషయాలు విసుగుజనించకుండా, కథాకథనం కుంటుపడకుండా వుండే రీతిలో 'ఆవాహన' నవల రెండు భాగాలుగా శ్రీ ముదిగొండ శివప్రసాద్ వ్రాశాడు. ఇందులో కాకతీయుల చరిత్రను, ఆ కాలపు స్త్రీ పురుషులను, చారిత్రక స్థలాలను, శిల్ప కళాఖండాలను ఎంతో సహజ రీతిలో తీర్చిదిద్ది, పరితలకు ఆసక్తి గొలిపే విధంగా రచన చేశాడు.

ఈ దశాబ్దంలో చారిత్రక నవలా సాహిత్యం గతంలోవలె కొంత అభివృద్ధిని సాధించినా, ఇంకా యెంతో ప్రగతిని సాధించవలసి ఉంది. మన రచయితలు చరిత్రను కేవలం పాత పద్ధతితో చూచి నవలలు వ్రాయక శాస్త్రీయ దృక్పధంతో, సరియైన అవగాహనతో, ముందుచూపుతో, మానవతా మమతలు ఉట్టిపడే విధంగా చైతన్యవంతమైన చారిత్రక నవలలు ఇంకా ఇంకా విరివిగా వ్రాయాలి. గత చరిత్రనే కొత్త కోణాలనుంచి పరిశీలించి, సరిక్రొత్తరీతిలోచారిత్రకనవలలువ్రాయాలి.

చారిత్రక నవలాపఠనం అంటే పరితకు భయం,విసుగు జనించగూడదు. భాషలో, భావ విశదీకరణలో, కధాకథనంలో, పాత్రోన్మీలనంలో, ఆచార వ్యవహారాలను వేషభాషలను వివరించి చూపటంలో పరితకు ఎంతో ఆసక్తిని కలిగించాలి. అంతేగాక రచయిత మారుతున్న కాలాన్ని, నిత్య నూతనంగా మారుతున్న పరిస్థితులను గ్రహించి, దానిని గత చరిత్రతో సమన్వయం చేస్తూ తులనాత్మక దృష్టితో, మెలకువతో చారిత్రక నవల వ్రాయాలి; ఆ పాత్రో చరిత్రలోనే నవ్యత్వం తొణికిసలాడేట్లు చెయ్యాలి.

చారిత్రక నవలైనా, సాంఘిక నవలైనా, మరేదైనా పరితకు హాయిని గొలిపేదిగా వుండాలి. నందాన్ని ప్రసాదించేదిగా వుండాలి. తన మనో వేదనను, బాహ్యప్రపంచంలో తాను అనుభవిస్తున్న కష్టసుఖాలనుంచితాత్కాలికంగానైనా కొంత విశ్రాంతిని ప్రసాదించేదిగా వుండాలి. అంతేగాని అది అమృతాంజనం కొరకు వెదుక్కొనే విధంగా చేయకూడదు. అలాంటప్పుడే రచయిత కృషిఫలించిపరితకు చిత్తశాంతిలభిస్తుంది.

రచయిత తన రచన వ్యాపారదృష్టితో గాక, తన సర్వశక్తులను తన రచనపై కేంద్రీకరించాలి. అప్పుడే అతని కలం నుండి పదికాలాలపాటు నిలిచే ఉత్తమ కళాఖండం బయటపడుతుంది.

నా యీ పరిశీలనలో కాశ్మీరం నుండి కన్యాకుమారి వరకు, బంగాళాఖాతం నుండి అరేబియా సముద్రం వరకు గల యీ సువిశాల భూభాగంలో, వేద కాలం నుండి నేటివరకు నడిచిన చరిత్రను దృష్టిలో పెట్టుకొని మన నవలా రచయితలు విభిన్న భాషలలో వెలువరించిన చారిత్రక నవలలను గురించి చంద్రునికో నూలుపోగన్నట్టు మీ ముందుంచాను.

# గొలుసు నవల - విశిష్ట ప్రయోగం

శ్రీమతి పరిమళాసోమేశ్వర్

ఒకరికన్నా ఎక్కువమంది రచయితలు ఒక్కొక్కరు ఒక్కొక్క భాగం రాసే బాధ్యతను స్వీకరించి అందరూ కలసి ఒక నవలను పూర్తిచేసే పద్ధతిని గొలుసు నవల అంటున్నారు.

గొలుసు నవల ప్రయోగంతెలుగులో "షణ్ముఖ ప్రియ"అనే నవలతో ఆరంభమైందని చెప్పవచ్చు. ఆరుగురు రచయితలు ఆ నవల ఆరు ముఖాలను తీర్చిదిద్దారు బహుళ సంఖ్యలో తమ అభిమాన రచయితలు రాసింది ఒకే నవలగా చదవగలుతున్నామన్న సంతృప్తి పాఠకులకు కలగడమే ఈ పద్ధతి మొదటి ప్రయోజనం.... ఇది సఫలం కావడం మాత్రం చాలా కష్టతరమైన విషయం.

ఇప్పటివరకూ తెలుగులో అయిదారు ప్రయత్నాలు అందులో కొన్ని చెయ్యి తిరిగిన రచయితల ఉమ్మడి కృషిగా లేదా "రిలే" కృషిగా జరిగినప్పటికీ అధికాధికం సఫలం కాలేదని చాలమంది అభిప్రాయం. ఈ వైఫల్యానికి కారణాలేమిటని పరిశీలిస్తే శైలిలోగాని, కథా కథనంలో ఇతివృత్తంలో,శిల్పంలోగాని ఏకత్వం లేదా యూనిఫార్మిటీని సాధించలేకపోవడమే ముఖ్యకారణంగా కన్పిస్తుంది అందువల్లనే వీటిని "కిచిడీ" నవలలని తేలిగ్గా కొట్టిపారెయ్యడానికి కూడా కొందరికి అవకాశం కలిగింది.

అయితే యూనిఫార్మిటీ లేనితనాన్నిడా ఒక ప్రత్యేక లక్షణంగా పాఠకులు సానుభూతితో స్వీకరించ గలిగితేనే ఈ ప్రయోగం జయప్రదమౌతుంది.

కవిత్వాలుజంటకవులురాయడంప్రసిద్ధి కథలు కూడా అనేక జంటలుగా రచయితలురాసి ఔననిపించుకున్నారు. జంట రచయితలు నవలలు రాయడంకూడా తెలుగులో జరిగింది. ఇద్దరు రచయితలు భార్యాభర్తలుగాని, మిత్రులుగాని ఇతివృత్తాన్ని పాత్రల్ని చర్చించుకుని ఏకాభిప్రాయానికి వచ్చి నవలా రచన చేస్తే అది ఒకరు రాసినట్టే కన్పిస్తున్నది. అదే విధంగా అంతకన్న ఎక్కువ సంఖ్యగల రచయితలుకూడా పరస్పర సహకారంతో ముందుగానే కథనంతటినీ పాత్రలు సన్నివేశాలతో మొదటినుండి ముగింపు వరకూ చర్చించుకుని ఉమ్మడిగా ఆలోచించి - భాగాలుగా విభజించుకుని రాస్తే తప్పక మంచి ఫలితాలు లభించగలవు.

శృతి - తాళం మారకుండా సాగుతే బహుళ రచయితల సృష్టి రాగమాలిక లాగా శోభిస్తుంది. నలుగురి గొంతు. కలిస్తే కోరస్ అవుతుంది.

ఒకవేళ 'బహుళ శృతి' కూడా ఒక సుగుణమై పాశ్చాత్య సంగీతంవలె శ్రావ్యంఅవుతుందనుకుంటేఇబ్బందేలేదు

ఏమైనా భావాలలో ఆదర్శాలలో ఏకత్వంగల రచయితలు ఇదొక సవాలుగా తీసుకుని శ్రద్ధగా కృషిచేసే తెలుగులో కూడా మంచి గొలుసు నవలలు రాయగల వారున్నారని రుజువు చేయవచ్చు. □

# తెలుగు సాంఘిక నవల - రచయిత - పాఠకుడు

ఎల్లోరా

నవలను గురించిఎందరో చెప్పారు. పత్రికలతో నాకు ఉన్న మూడు దశాబ్దాల అనుబంధాన్ని దృష్టిలో పెట్టుకుని నవలలు - పత్రికలు - పాఠకులు అన్న అంశాన్ని ఒకటి రెండు ముక్కల్లో చెప్ప డానికి ప్రయత్నిస్తాను.

సమాజం మారుతూంటుంది. మరి ! సమాజంతోపాటు రచయితా- రచనలూ మారడం అవసరమూ, అగత్యమూ కూడా.

1945 లేదా 1947 ఆ ప్రాంతాల నుంచే నవలలకు ప్రచారం బాగా లభిం చిందని నా అంచనా.

పాఠకులూ పెరిగారు - పత్రికలూ పెరిగాయి.

మాస, వారపత్రికలకు వారం వారం తగినంత మోపు సామాను—— కథలూ, నవలలూ—— అందించాలి.

ఇలాఇలా ప్రతికలు ఎక్కువయినందు వల్ల పాఠకులూ ఎక్కువయారు. పాఠక లోకం ఆదరణతో పత్రికల సర్క్యు లేషన్ పెరిగింది.

అంటే - పెరిగిన సర్క్యులేషన్‌ను నిలుపుకోవాలీ అంటే వారం వారం నవలలూ, కథలూ ద్వారా పాఠకుడిని ఆకట్టుకోవాలి- ఆకర్షించగలగాలి.

వచ్చే సంచికలో ఏవిధంగా కథ మలుపు తిరుగుతుందో అన్న ఉత్సుకత కలిగించడం పత్రికల ఆశయం.

ప్రతి నెలా సుమారుగా ఓ పాతిక నవలలయినా వెలుగులోకి వస్తున్నాయని అనుకొంటాను. ఈ నవలలు ఎక్కువ అనుబంధ నవలలుగానే వెలువడు తూన్నాయి.

సుమారుగా ప్రతి మాసపత్రికా ఒక అనుబంధ నవలను అందిస్తూంది. ఇదీ గాక ప్రచురణ కర్తలద్వారా వస్తూన్న వందలాది నవలలూ ఉన్నాయి.

ప్రధానంగా ఈ దశాబ్దంలో ఇంత పెద్ద ఎత్తున ఇన్ని నవలలు వెలువడ డానికి పాఠకులే కారణం.

మధ్య తరగతివారు చదువుకొనే కాల క్షేపం నవలలు చాలా అవసరం అయాయి.

మధ్యతరగతి కుటుంబాలలోని విష యాలే ప్రధానంగా సాంఘిక నవలలో ప్రధాన కథా వస్తువు అయింది.

ఒకనాడు ఇంటిపెద్దను గౌరవించడం, ఒదినగారి మాటను కాదనడం నేరం, తోటికోడళ్ళ త్యాగాలు- ఇలాటి కథలతో నడిచిన సాంఘిక నవలలో సమాజం, సంఘ సంస్కరణ, కుల మతాతీతసమాజ అవగాహన నవలల్లో చోటుచేసుకుంది.

ఇవే పాఠకులు కోరుతున్నారా? కోరేరా?

అసలు పాఠకులందరూ ఒకే రకం వారా? అని ఆలోచిస్తే కాదనే చెప్పవలసి వస్తుంది.

ఈనాటి పత్రికలకి, నవలలకి ప్రధానంగా పాఠకులు స్త్రీలనే అనుకోవలసి ఉంది.

క్షమిస్తే ఒక్కమాట– వీరందరినీ– కొందరిని మినహాయిస్తే– కేవలం కాల క్షేపం కోసం చదివే పాఠకుల కింద జమ కట్టవచ్చు.

వీరికి నవల బాగోగులతో నిమిత్తం లేదు– పట్టించుకోరు. ఎక్కువమందికి తెలియదు కూడా.

వారం వారం చదువుకుపోడంతో సరి– హాయిగా కథ నడిస్తే– ఆ పాత్రల అనుభూతులు తమ జీవితాలకు దగ్గరగా వుంటే– అబ్బో ఆ నవల ఎంతబాగుందో అనితలచుకొని సంతృప్తిపడటంతో సరి.

మరోరకం పాఠకులూ ఉన్నారు. అచ్చయిన ప్రతి రచనా చదవరు. వీరికి కొన్ని నియమాలు ఉన్నాయి. ఏమిటంటే వీరి దృష్టిలో బాగా రాయగలరు అనుకొన్నవారి రచనలు మాత్రమే చదువుతారు. లేదా ఒకరో యిద్దరో ఈ నవల చాలా బాగుంది అని చెబితే చదివేవారు.

వీరిని మనం నవలనుగురించి తెలిసిన పాఠకులుగా జమకట్టవలసి వుంటుంది.

వీరు కాస్త ఎదిగిన– రచనలంటే ఎరిగిన–పాఠకుల కోవలో లెక్కకట్టడం అవసరం.

వీరికి నవలయొక్క ఇతివృత్తం, శైలి, శిల్పం గురించి తెలిసి వుంటుందనే అనుకోవలసి వుంటుంది.

అయితే ఇక్కడో చిక్కు వుంది. ఈ రకం నవలా పాఠకుడిని పిలిచి నవలలోని మంచిచెడలను వివరించమంటే చెప్పలేకపోనూ వచ్చు.

ఈ విధంగా పాఠకులలోనూ పాఠకులలో రకాలు ఉన్నాయి.

స్త్రీ పాఠకులకు ఎక్కువగా సెంటిమెంటు గల నవలలు నచ్చుతున్నాయి.

సామాజిక వాస్తవికతను ప్రతిబింబించే నవలలు, మానసిక విశ్లేషణ. సంఘర్షణ. మానవ హృదయ రహస్యాలను వెల్లడి చేసే నవలలు మామూలు పాఠకులను ఆకర్షించడంలేదనే అనిపిస్తుంది.

వీరు ఒకే విధమైన టేస్టుకు అలవాటు పడిపోయారు.

నేడు యద్దనపూడి, జొన్నలగడ్డ ఇత్యాదుల రచనలకు అలవాటు పడిపోయారు. వీరు– అంటే ఈ తరహా పాఠకులు గోపీచంద్ "అసమర్థుని జీవయాత్ర", రాచకొండ "అల్పజీవి", కాళీపట్నం "యజ్ఞం", బీనాదేవి "పుణ్యభూమి", శీలా వీర్రాజు "మైనా" లాంటి నవలలను చదవలేరు.

వీరికి ఎంతసేపూ అందంగా వినిపించే కథ, అందంగా కనిపించే జీవితాల కథ కావాలి.

విచిత్రం ఏమిటీ అంటే తమ తమ జీవితాలలో కనిపించని, కనిపించడానికి ఆస్కారంలేని– తమ జాతకాలలో కరువయిన సుఖాలు, కలలు, వాంఛలు నవలలోని పాత్రలు అనుభవిస్తూంటే చదివి మత్తుగా– గమ్మత్తుగా– మైమరచిపోతారు.

పాపం! ఈ రకం పాఠకుల్లో మరీ అర్భకులు ఉన్నారు. కాసంతో, కూసంతో కష్టాలు వచ్చినా భోరున

కన్నీళ్ళు కార్చి ఫీలవడం చూస్తూంటాం.

తాము జీవితాలలో ఎండమావులు అనుకున్న ఆదర్శాలను, అనుభవాలను రచయితలు రంగుల్లో చిత్రించి అందిస్తే హాయిగా ఆస్వాదించగలరు.

అదే సినిమాలోనూ ప్రణయ దృశ్యాలకు ముగ్ధులవగలరు వీరే నిజజీవితంలో ఓ అబ్బాయి ఎదురుపడితే పిడచకట్టుకు పోయి– భయపడిపోతారు.

పాత్రాగతంగా పొందుతూన్న ఆనందాన్ని మనిషి వాస్తవంలో పొందడు. ఇక్కడ అదే జరుగుతుంది– ఈమూలు పాఠకులలో.

అందుచేతనే–పాఠకుల మనస్తత్వాన్ని బాగా అర్థం చేసుకున్న రచయిత (ఈ తరహా రచయిత) పలాయన వాదాన్ని ఇద్దరు భార్యల కథలతో. సెంటిమెంట్సుతో, సందు తిరగని కార్లతో, ఆరడుగుల అందమయిన హీరోలతో కథలు మనకీమధ్య ఎక్కువయిపోయాయి.

ఇటువంటి కథలను చదివి ఆనందించడం అలవాటు చేసుకొన్న పాఠకులకు, ప్రయోజనాత్మక, పరిశీలనాత్మక, సామాజిక స్పృహతో కొత్త తరహా నవల చదవాలంటే బాధే మరి.

అందుకే – పత్రికలవారు ఇటువంటి నవలలను ప్రచురించి పాఠకులను విసిగించే ప్రయత్నం చేయడానికి సాహసించడం లేదేమో అనిపిస్తూంది.

పాఠకులను బాగాఅర్థం చేసుకునే రచయితలు రచనలు వెలువరిస్తూంటే– పాఠకులను అర్థం చేసుకొనే ప్రచురణకర్తలు నవలలు ప్రచురిస్తూన్నారు.

ఈ విషయం ప్రధానంగా పత్రికలు ప్రచురించే సీరియల్ నవలల్లో బాగా కనిపిస్తుంది.

పేర్లూ అవీ ఎందుకుగాని ఈ మధ్యన ఓ పత్రికలో ఓ ప్రముఖ రచయిత్రి నవల 34 నెలల పాటు ధారావాహికంగా వచ్చింది. దానికి తగిన పాఠకులూ ఆ పత్రికనీ, ఆ నవలనీ ఆదరించారు.

తీరా ఆ నవల పుస్తకంగా చదవడం ప్రారంభిస్తే ఓమూడు గంటలుపట్టలేదు.

మరి– ఆ నవలా వాహినిలో మునిగిపోయి ఉబ్బి తబ్బిబ్బయిన పాఠకుని అమాయకత్వం అంటామా? ప్రచురణకర్త తెలివితేటలు అనుకొందామా?

రచయిత్రుల నవలలు సీరియల్‌గా ప్రచురించక పోతే తమ పత్రిక సర్క్యులేషన్ తగ్గిపోతుందేమోనన్న భయం, పేరు పొందిన ప్రఖ్యాత రచయిత్రుల కథలూ, నవలలూ పాఠకులు ఆదరించరనుకోవడం నా దృష్టిలో భ్రమ.

ఆడపేర్లతో రాసే మొగవారూ. వెర్రెత్తించే నవలలు రాసే మహిళా రచయిత్రులూ సర్క్యులేషన్ పెంచుతారంటే నేను నమ్మను.

పేరున్న రచయితలూ, రచయిత్రులు ఈనాడు వ్యాపార దృష్టితో నవలలు రాయడం కూడా జరుగుతూంది.

ఏది ఏమయినా, ప్రచురణకర్త ధ్యేయం సాహిత్య సృష్టి– సాహితీసేవా కాదు. నాలుగు డబ్బులు సంపాదించడం.

రచయితలూ నేటి పాఠకుని బలహీనత ను ఆసరాగా తీసుకుని కథకు ఊహాకల్పనలు, రంగులూ అద్ది డబ్బు సంపాదించడంతో తృప్తిపడుతున్నారు.

క్షమిస్తే — ఒక్కమాట!

బుజాలు తడుముకొనీ లాభం లేదు.విరుచుకునిపడ్డా ఫలితం రాదు.

మంచి నవలలూ మంచి రచయితలూ' రచయిత్రులూ మనలోకొందరు వున్నారు.

కాని వీరి చౌకబారు నవలల మధ్య ఆ మంచి నలిగిపోతూంది. నవలల ఎదగలేక పోతూంది.

ఉత్తమ రచయితలను ప్రోత్సహించి మంచి నవలలువ్రాయించి, వాటిని ప్రచురించి వక్రమార్గంలో, చౌకబారు మత్తులో వున్న సగటు తెలుగు పాఠకుడి అభిరుచిని దిద్దాల్సిన బాధ్యత మన తెలుగు పత్రికల పైన ఎంతయినా వుంది.

అలా జరగాలి!

అందుకు కృషి జరగాలి! కొంత పత్రికల వారు, కాస్తంత ప్రచురణ కర్తలూ ఆలోచించి, సాహసించి – ముందడుగు వేయాలి.

అలా చేయగలిగిన నాడు ఆ పని జరిగిననాడుఉత్తమనవలలురాకేంచేస్తాయి రాయకేంచేస్తారు. ప్రచురించకేంచేస్తారు?

ఆ విషయం మనం ఆలోచించాలి— అందుకు మార్గాలు అన్వేషించాలి.

తెలుగు నవలాకారుల ఆలోచన పెద్దదే – అనుసరిస్తున్న పద్ధతులూ మరి....!!!

---

"Novel is a summary of actual life" —Meridith

నవలా రచయిత ధ్యేయం కథ చెప్పటంగానీ, మనల్ని ఆనంద పరవశుల్ని చెయ్యడంగానీ కానేకాదు. అజ్ఞానంగా దాగివున్న సంఘటనల ప్రాధాన్యతను మనం అర్ధం చేసుకొని ఆలోచించేటట్లు అతను చెయ్యగలగాలి.

—మొపాసా

ఒకే ఒక సంఘటనను చిత్రించేది చిన్నకథ. ఒక జీవిత భాగాన్ని చిత్రించేది నవల. కథకు వాతావరణం పాత్రల మనస్తత్వం, నవలకువాతావరణం సంఘం.

—కొడవటిగంటి కుటుంబరావు

---



యువచిత్రవారి "గోరింటాకు"

నిర్మాత : కె. మురారి　　　　　దర్శకుడు : దాసరి నారాయణరావు

# ఆహ్వాన సంఘం

అధ్యక్షులు :

డా॥ పి. గోర్కి

అధ్యక్షవర్గం :

డా॥ జయచంద్రారెడ్డి

డా॥ అప్పారావు

డా॥ యస్. భాస్కరరావు

డా॥ పి రామనాధం

డా॥ కె. రాధాక్రిష్టారావు

శ్రీ హీరాలాల్ మోరియా

శ్రీ రావెళ్ళ వేంకటరామారావు

శ్రీ కౌముది

శ్రీ సి. హెచ్. రోశయ్య

ప్రధాన కార్యదర్శి :

శ్రీ జాతశ్రీ

కార్యదర్శులు :

శ్రీ యస్. వెంకటేశ్వర్లు

శ్రీ పి. పట్టాభి

కుమారి కె శోభారాణి

కోశాధికారి :

శ్రీ సి. హెచ్ ఎల్లయ్య

ted, Printed & Published by T. Venkataramaiah, 3-6-737/3, Himayatnagar, Hyd-29
Printed at Nagarjuna Printing Works.